తప్పక చదవాల్సిన పుస్తకం

# బీసీలకు రాజకీయ అధికారం

అవగాహన - పార్టీ నిర్మాణం
కార్యక్రమం - ఎన్నికల ప్రణాళిక



- బి.ఎస్. రాములు

భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం - బి.ఎస్. రాములు

సామాజిక తాత్విక విశ్వ విద్యాలయం ప్రచురణ



భారతదేశానికి తిరిగి
పాలకులుగా ఎదగడమే బీసీల లక్ష్యం

ప్రపంచానికి మార్గదర్శిగా
మళ్ళీ దేశాన్ని మలచడమే బీసీల కర్తవ్యం

# భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం

## మొదటి భాగం

- బి.ఎస్. రాములు

భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం
మొదటి భాగం

బి.ఎస్. రాములు

సంపాదకులు :
ప్రొ॥ ఎ. బొబ్బిలి
ప్రొ॥ ఈమని శివనాగిరెడ్డి
కె. జితేంద్ర బాబు

మొదటి ముద్రణ : 2008
పేజీలు : 224

వెల : 80/-

ప్రచురణ
సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం
406, ఉషాకిరణ్ ఆర్కేడ్, ఒ.యు. రోడ్,
హైదరాబాద్ - 500 044

బి.ఎస్.రాములు, సామాజిక తత్వవేత్త,
2-2-186/53/5, రామకృష్ణ నగర్,
బాగ్అంబర్‌పేట్, హైదరాబాద్-500 013.
ఫోన్స్ : 09391036987, 040-65164929

# భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం

## మొదటి భాగం

### మానవసమాజం గడిచివచ్చిన "పాదముద్రలే" చరిత్ర

ముందుమాటలు



## విషయసూచిక

**అనుబంధం : గతం నుండి వర్తమానంలోకి**



**సంపాదకీయం**

# భారతీయ చరిత్రలో నూతన దృక్పథం

చికాగో నుండి స్వామి వివేకానంద భారతదేశ మిత్రునికి రాసిన లేఖలో ఇలా అన్నారు. "ఉత్పత్తిలో పాల్గొని ఉత్పత్తి చేసే శూద్రులను బరువులు మోసే గాడిదలుగా, మానవజాతి విస్తరణార్థం బాధ్యతను వహించిన స్త్రీలను సంతానం కనే పశువులుగా" చిత్రీకరించడం భారతదేశ సంస్కృతికి ఉన్న రెండు గొప్ప చెడు గుణాలు".

దేశాభివృద్ధిలో శూద్ర, అతిశూద్రుల, స్త్రీల పాత్ర చాలా గొప్పది. వీళ్ళు లేకుండా, వీరి కృషి లేకుండా దేశాభివృద్ధి లేదు. అయితే వీరి గురించి చరిత్రలో ఎక్కడా ప్రస్తావన కనిపించదు. శూద్రులను, అతిశూద్రులను, స్త్రీలను అణచివేసిన విజేతల చేతులతో చరిత్ర రచన చేశారు. అది అగ్రకులాల వారు రాసినది. కాబట్టి చరిత్ర రచనలో శూద్ర, అతిశూద్రుల గురించి వారు సృష్టించిన ఉత్పత్తుల గురించి, ఉత్పత్తికి దోహదపడిన శాస్త్ర, సాంకేతికాల గురించి ఎక్కడా ప్రస్తా వించకుండా చరిత్ర రచన చేశారు.

శాస్త్రీయత అని గొంతు చించుకునే వామపక్ష మేధావులు, చరిత్రకారులు రచించిన భారతదేశ చరిత్రలో కూడా శూద్రుల ప్రాధాన్యత కనిపించదు. యస్.ఎ. డాంగే వ్రాసిన "ప్రిమిటివ్ కమ్యూనిజమ్ ఇన్ ఇండియా" అనే గ్రంథంలో ఆర్యుల రాకతో భారతదేశ చరిత్ర రాసాడు. ఆర్యుల రాకకు ముందు ప్రపంచానికే తలమానికమైన సింధూ నాగరికత ఒకటి ఉన్నదని రాయలేక పోయాడు. ఇ.యం.ఎస్. నంబూద్రిపాద్ తన ఆత్మకథ పేరు 'వేదభూమి' అని రాశాడు. బ్రాహ్మణ కమ్యూనిస్టులు బ్రాహ్మణిజాన్ని మార్క్సిజంగా మార్చి ఎలా చెబుతారో ఇలాంటి ఉదాహరణలు కోకొల్లలు. మోసేవాడికి తెలుసు కావడి బరువు అనేది సామెత. వృత్తులు చేస్తూ సంపద సృష్టించే వృత్తి కులాల

చరిత్ర, శూద్రుల చరిత్ర ఆయా వృత్తి కులాల నుండి వచ్చిన వారు రాస్తే సార్థకత ఉంటుంది. సుప్రసిద్ధ సామాజిక తత్వవేత్త బి.ఎస్. రాములుగారు వృత్తి కులాల నుండి వచ్చినవారు.

బి.ఎస్. రాములు గారు గత ముప్పై ఏళ్ళుగా అనేక ఉద్యమాల నిర్మాణంలో క్రియాశీల పాత్ర నిర్వహిస్తూనే రచనను చేపట్టి కథలు, వ్యాసాలు, తత్వశాస్త్ర గ్రంథాలు, సాహిత్య అలంకార శాస్త్రాలు, సోషియాలజీ, వర్తమాన సామాజిక రాజకీయ పరిణామాలు గురించి వందలాది రచనలు వెలువరించారు. తెలంగాణా చరిత్ర ఉద్యమాల గురించి తొమ్మిది పుస్తకాలు ప్రచురించారు. ఈ గ్రంథంతో బి.ఎస్. రాములుగారు మనకు చరిత్ర తత్వశాస్త్రాన్ని రూపొందించి అందించారు.

ఇది శూద్రుల చరిత్ర. శ్రామికుల చరిత్ర. శ్రామిక కులాల చరిత్ర. మట్టిలోంచి మన సంస్కృతిని సృష్టించిన వారి చరిత్ర. బ్రాహ్మణ నిరాకరణ, నిర్గుణ, నిస్వరూప దేవుళ్ళకు ఆకారాన్నిచ్చి, ఆలయాలను నిర్మించిన వారి చరిత్ర. సమాజశాస్త్ర, సాంకేతిక అవసరాలు తీర్చిన వారి చరిత్ర. ప్రజలకు పట్టెడన్నం పెట్టిన వారి చరిత్ర, చరిత్ర గమనాన్ని శ్రమతో మార్చిన వారి చరిత్ర, బహుజనుల చరిత్ర. భారతీయ చరిత్ర నిర్మాణాన్ని బి.యస్. రాములుగారు ఈ గ్రంథంలో నూతన దృష్టితో పరిశీలించారు. భావ వ్యక్తీకరణలో, చరిత్ర నిర్మాణంలో నూతన దృక్పథాన్ని అవలంభించారు. మనం కోల్పోయిన చారిత్రక అంశాలను, వాటి ప్రాధాన్యతలను, గ్రంథాలను, భావజాలాలను, అణిచి వేయబడిన జీవితాలను శూద్రుల దృష్టితో ఇందులో చిత్రించారు.

బి.యస్. రాములుగారు ఇందులో చేసిన సూత్రీకరణలను ఉదాహరణలతో వివరిస్తూ పెద్ద గ్రంథాన్ని రాశారు. దాని మొదటి భాగం మాత్రమే ఇది. ఇందులో సూత్రీకరణలను, దృక్పథాన్ని పరిచయం చేయడానికి ఉద్దేశించిన వ్యాసాలను ఒక్కచోట చేర్చి చరిత్ర వివరాలను తరువాతి భాగాల్లో తీసుకు రావడానికి క్రోడీకరించడం జరిగింది. ఇందులో చరిత్రను సంక్షిప్తంగా పరిచయం చేస్తూ రావడం జరిగింది. ఇది చరిత్రకారులకు పాఠకులకు నూతన దృష్టిని, ఇవ్వడానికి దోహదం చేస్తుంది. శూద్రులను ఉత్పత్తి శక్తులుగా భావించి, చరిత్ర నిర్మాతలుగా గుర్తించి వారి దృష్టికోణంలో పరిశీలించిన చరిత్ర ఇది.

గతంలో వచ్చిన అనేక సిద్ధాంతాలను, భావజాలాలను, చరిత్రను, చరిత్ర



దృక్పథాలను ఖండిస్తూ, పూర్వపక్షం చేస్తు చేసిన ఎన్నో కొత్త సూత్రీకరణలు, ఈ గ్రంథంలో కన్పిస్తాయి. మతతత్వ వాదుల, వామపక్షవాదుల, ప్రజాస్వామిక వాదుల పేరిట నిర్మించే చరిత్రను వారి దృక్పథాన్ని, వాటిలోని అసమగ్రతను, అగ్ర కులతత్వాన్ని స్పష్టం చేస్తుంది ఈ గ్రంథం.

బౌద్ధకాలం భారతీయ విజ్ఞాన శాస్త్రాలు, కళలు, భాషా సాహిత్యాలు, ప్రపంచ మంతా ప్రాచీన కాలంలో విస్తరించాయంటూ బి.యస్. రాములుగారు చేసిన పరిశీలన నూతన దృష్టి కోణాన్ని అందిస్తుంది. శూద్రులు భారతీయ చరిత్ర నిర్మాతలుగా, భారతీయ సమాజ నిర్మాతలుగా చేసిన కృషి గురించి ఎవరికీ భిన్నాభిప్రాయం లేదు. అయితే అది చరిత్ర రచనలో ప్రాధాన్య అంశంగా ముందుకు తీసుకురావడమే బి.ఎస్. రాములుగారు చేసిన ప్రధానమైన చేర్పు. అందరూ అంగీకరించే విషయాన్నే చారిత్రక దశల నుండి వెలికి తీసుకువచ్చి నిరూపించడం వీరి విశిష్టత.

కులాల స్థిరీకరణ, శూద్ర విప్లవంతో ప్రారంభమైందని బి.ఎస్. రాములు గారు నొక్కి చెప్పారు. భారతీయ సమాజ నిర్మాతలైన ఉత్పత్తి శక్తులను, శూద్రులని అనడం వర్ణ సిద్ధాంతంలో భాగమని నిర్ధారించారు. ఆర్థిక దోపిడి పద్ధతుల పరిణామాల గురించి, రాజకీయ సామాజిక పరిణామంలో భాగంగానే భక్తి ఉద్యమాలు సాగాయని అనేక ఉదాహరణలిచ్చారు. తత్వశాస్త్రంలో, తర్క శాస్త్రంలో తలపండిన తత్వవేత్త బి.ఎస్. రాములు గారు చరిత్ర రచనను కూడా తత్వశాస్త్రం అంత సీరియస్‌గా పట్టించుకొని రాశారని ఈ గ్రంథం చదివినవారు అనుకోకుండా ఉండలేరు.

చరిత్రలో నిప్పు, నీరు, తోలు, చక్రం, రాయి, రోలు, కుండ, వంట మానవ జీవితంలో నిర్వహించిన పాత్రను నిర్వచించిన తీరు వీరు ప్రతి విషయాన్ని ఎంత సునిశితంగా పరిశీలిస్తారో జీవితం పునాదిగా చరిత్రను, తత్వశాస్త్రాన్ని, చరిత్ర పరిణామాలను ఎలా పరిశీలిస్తారో ఈ గ్రంథం సాక్ష్య మిస్తుంది. చరిత్రలో గుర్రాల ప్రాధాన్యత, పంది ప్రాధాన్యతతో పాటు దేవదాసీ, జోగినీ, వేశ్యా వ్యవస్థ, కుటుంబ వ్యవస్థ సమాంతరంగా ఎందుకు కొనసాగాయో, ఎలా కొనసాగాయో మనముందుంచారు.

శూద్రులకు విద్యను నిరాకరించిన బ్రాహ్మణీయ మతాలు ఎందుకు నిరాకరించాయో చాలా మంది ఇదివరకే రాశారు. అయితే ఆయా కాలాల్లో ఏది విద్యగా, ఏది కళలుగా, ఏది కులవృత్తులుగా వర్గీకరించారో, బౌద్ధం, శూద్రులతో పాటు అందరికి విద్యను ఎలా అందించిందో బ్రాహ్మణిజం విద్యను ఎందుకు అందించలేక పోయిందో బ్రాహ్మణిజం నూతన సిద్ధాంతాలను ఎందుకు వ్యాప్తి చేయలేకపోయిందో విశ్వవిద్యాలయ విద్యా విధానాన్ని బౌద్ధం అనుసరిస్తే గురుకుల విద్యా విధానాన్ని బ్రాహ్మణిజం అనుసరించి వ్యాప్తి కోల్పోయిన తీరు ఇందులో చూడవచ్చు. విద్యా విధానాల చరిత్ర పరిశీలన ద్వారా మనకు శూద్రులు ఎలాంటి విద్యను పొందారో వెనుకట మత విద్యనే విద్యగా ఎందుకు ప్రచారం చేశారో చక్కగా వివరించారు. శూద్ర వారసత్వంగా ఏది కొనసాగుతూ వస్తున్నదో వివరించిన సింహావలోకనంలోని మహోన్నతమైన శూద్రుల చరిత్రను చదివాక పాఠకులు పొందే ఆనందం, ఆత్మవిశ్వాసం ఎనలేనిది. ఇంతదాకా చరిత్ర చదవడంలో మనం కోల్పోయినదేమిటో ఈ గ్రంథం చదివితే తప్ప తెలియదు.

ఈ గ్రంథం ఒక నూతన దృక్పథాన్ని ఆవిష్కరించింది. ఈ దృక్పథంతో దేశ చరిత్రను ఆలోచించినపుడు చరిత్రకారులు నేర్చుకోవాల్సింది ఎంతో ఉంది. ఈ దృక్పథం నూతన చైతన్యాన్ని ఇవ్వడంతో పాటు నూతన అన్వేషణకు దారి చూపుతుంది. ఎందుకంటే ఇది నిజమైన చరిత్ర. ఎప్పుడైనా నిజమైన చరిత్ర మానవసమాజ పురోగతిని ముందుకు నడిపిస్తుంది. ఇంతకాలానికి నూతన దృక్పథం వచ్చినందుకు సంతోషిస్తూ మిగతా భాగాలు కూడా వెంటనే ప్రచురిస్తారని ఆశిస్తున్నాం. అందుకు మీ సౌజన్య సహకారం అవసరం. ముందు ముందు ఈ దృక్పథంతో ఇంకెన్నో గ్రంథాలు వస్తాయని ఈ గ్రంథం అందుకు ప్రేరణ ఇస్తుందని మా విశ్వాసం. ఏళ్ళ తరబడి విశేష కృషితో చరిత్ర రచనకు ఉపక్రమించి భారతీయ చరిత్ర రచనలో తనదైన శైలిని, దృక్పథాన్ని ప్రవేశపెట్టిన సామాజిక తత్వవేత్త బి.ఎస్. రాములు గారు ఎందరో చరిత్రకారులకు మార్గదర్శకులుగా చరిత్రలో నిలిచిపోతారు. వారికి మా అభినందనలు.

**– ప్రొ॥ ఎ. బొబ్బిలి, ప్రొ॥ ఈమని శివనాగిరెడ్డి, కె. జితేంద్ర బాబు**

***– సంపాదకులు***



**గౌ॥ జస్టిస్ బి.ఎస్.ఎ. స్వామి,**
హైకోర్టు న్యాయమూర్తి రిటైర్డ్
చీఫ్ ఎడిటర్ 'మనపత్రిక'
ప్లాట్ నెం. 41, ఎస్ఆర్‌కె నగర్,
గోల్కొండ చౌరస్తా, హైదరాబాద్– 5000 20
ఫోన్ : 040 27645599, ఫ్యాక్స్ నెం : 27642244

# యువతరం తమ మూలాలు తెలుసుకోవాలి

సామాజిక తత్వవేత్త బి.ఎస్. రాములు గారు కరీంనగర్ జిల్లా జగిత్యాలలో, అతి సామాన్య కుటుంబంలో పుట్టి సమాజంలో పెరుగుతున్న అన్యాయాలకు, అక్రమాలకు స్పందించి పేదల జీవితాల్లో తనకు వీలైనంత వరకు కాంతిరేఖలు విరజిమ్మాలనే ఉద్దేశ్యంతో చేస్తున్న ఉద్యోగాన్ని వదులుకొని సాహిత్య సామాజిక ఉద్యమాలవైపు తన దృష్టిని, పూర్తి కాలాన్ని మళ్ళించి ఈ దేశ చరిత్రను విభిన్న కోణాల నుండి శూద్ర దృక్పథంతో పరిశీలించి సామాజిక తత్వవేత్తగా, చరిత్ర తత్వం తెలిసినవాడిగా, సాహితీ వేత్తగా తనకంటూ స్థానం ఏర్పర్చుకున్నారు.

ఆర్.ఎస్.ఎస్. కార్యకర్తగా పనిచేసిన రాములు గారు కుల వ్యవస్థ ఈ దేశంలోని అన్ని అనర్థాలకు మూల కారణమని గ్రహించి హిందూ మతాన్ని పెంచి పోషిస్తున్న ఆర్.ఎస్.ఎస్.ను విడిచిపెట్టి నక్సలిజంలోనైనా వర్ణ వ్యవస్థ ఉండదని భావించి అందులో కూడా చాలా కాలం పని చేయడం జరిగింది. అక్కడ కూడా కులవ్యవస్థే పరిపాలిస్తున్నదని గ్రహించి బయటపడడం, ఆ తదుపరి బహుజనులకు రాజ్యాధికారమే ఈ సమస్యలకు పరిష్కారం అని నమ్మి ఆ దిశలో ఎన్నో రచనలు చేయడం జరిగింది. వారు ఏ విషయం పరిశీలించినా అందులో బహుజనుల పాత్ర వారికి జరుగుతున్న అన్యాయాల గురించి, జరగాల్సిన సామాజిక న్యాయం గురించి స్పష్టీకరించారు. ఇప్పుడు ప్రచురిస్తున్న "భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం' పుస్తకంలో చరిత్ర మూలాలకు వెళ్ళి హిందుత్వం ఒక మతం కాదని, అది మానవుని జీవన విధానమని అందులో చాతుర్వర్ణ వ్యవస్థ ఏ విధమైన ప్రస్తావన లేదని, కాలాంతరంలో మేధావులనే కొంత మంది వ్యక్తులు సమాజంపై తమ పట్టును బిగించడానికి చాతుర్వర్ణ వ్యవస్థనుసృష్టించి, ఈ దేశంలో తమ శ్రమ శక్తిద్వారా సంపదను సృష్టిస్తున్నవారిని శూద్రులుగా నామకరణం చేసి వారిని విద్యా బుద్ధులకు దూరంగా ఉంచి జంతువులకంటే హీనంగా బతికేట్టు చేశారు. ఈ మానసిక వత్తిడులకు తట్టుకోలేనివారు కొంత మంది ఇస్లాం మతం స్వీకరించగా మరికొంతమంది క్రైస్తవాన్ని ఆశ్రయించారు. ఇంకొంత మంది "బహుజన హితాయ – బహుజన సుఖాయ" అని కొత్త నినాదంతో సృష్టిలోని మానవులంతా సమానమేనని, మనం చూస్తున్న హెచ్చు తగ్గులు మానవ కల్పితాలు కాబట్టి సమైక్య కుటుంబానికి

అడ్డుగోడగా నిలిచిన ఈ నిచ్చెన మెట్ల సమాజానికి కూలదోయాలంటూ గౌతమబుద్ధుడు చెప్పిన మార్గాన్ని నూతన పంథాగా బౌద్ధాన్ని స్వీకరించారు. బీసీలకు, బడుగు, బలహీన వర్గాలకు శతాబ్దాలుగా ఉన్న వర్గ శత్రువు శూద్రులను పరాయీకరించిన సంపదతో విశ్రాంతి వర్గంగా మారి బుద్ధిలోను, ఆర్థికంగాను, బలవంతుడు కావడం వల్ల, వాళ్ళు ఉచ్ఛస్థితిలో ఉండడం వల్ల ఈ మత మార్పిడిలు కూడా సమసమాజ స్థాపనకు ఉపకరించకపోగా హిందూ మతంలో ఉన్న కుల వివక్షత ఏదో ఒక రూపంలో ఆ మతాల్లో ప్రవేశించింది. ఈ దేశం ప్రజాస్వామ్య వ్యవస్థగా అవతరించి 60 సంవత్సరాలు కావొస్తున్నా బహుజనుల జీవన విధానంలో చెప్పుకోదగిన మార్పు లేదు. ఈ వర్గాల నుండి వచ్చిన ధనికులు కూడా వీరి అభివృద్ధికి ఏ విధంగానూ కృషి చేయడం లేదు.

ఈ పరిస్థితులు మారి మనం బతికి బట్ట కట్టాలంటే సమాజ శ్రేయస్సు కొరకు కొంత మంది వ్యక్తులైనా తమ మధ్య ఉన్న చిన్న చిన్న భేదాభిప్రాయాలు విస్మరించి నూతన సమాజాన్ని ఏర్పాటు చేసుకోవాల్సిన అవసరం ఎంతైనా ఉందని అంటూ, ఆశించిన ఫలితాన్ని అందుకోవడానికి కొన్ని ప్రతిపాదనలు కూడా ఈ గ్రంథకర్త చేయడం జరిగింది. చరిత్ర నిర్మాతలు శూద్రులే అని, గ్రామీణ, స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ, నిర్మాతలు శూద్రులే అని ప్రపంచంలో దేశానికి మహోన్నత నైపుణ్యం గల ఉత్పత్తుల ప్రసిద్ధి తెచ్చింది శూద్రులే అని ఈ పుస్తకంలో నిరూపించారు. ఈ పుస్తకం రాయడానికి చరిత్రకు సంబంధించిన వందలాది గ్రంథాలు చదివి ఆకళింపు చేసుకొని తనదైన శైలిలో విశ్లేషించారు. శూద్రుల తాత్విక భూమిక ఆయా చారిత్రక కాలాల్లో ఎలా కొనసాగిందో, హిందూ మతం ఎలా మారుతూ వచ్చిందో కులాల స్థిరీకరణకు శూద్ర విప్లవం ఎలా దారితీసిందో, ఉత్పత్తి శక్తులను శూద్రులని పిలవడం ఒక అణచివేతగా ఎలా కొనసాగించారో అగ్రవర్ణాల దోపిడీ పద్ధతులను, ప్రాచీన విద్యా విధానాలను , శూద్రుల వారసత్వాన్ని ఆయా చారిత్రక దశలో ఎలా కొనసాగిందో వివరించారు. 'మన పత్రిక'లో ధారావాహికంగా ప్రచురించిన ఇందులోని వ్యాసాలపై విశ్లేషణలను మన పత్రికలో వీలైన మేరకు ప్రచురిస్తాము.

ఈనాటి యువత విలువలు లేని విద్య అభ్యసిస్తున్నారు. చరిత్ర మూలాలు తెలుసుకోకుండా పాశ్చాత్య నాగరికత వైపు పరుగులు పెడుతున్నారు. యువతరం ఈ పుస్తకంలోని అంశాలను చదివి తమ మూలాలను తెలుసుకుంటే నూతన సమాజాన్ని ఏర్పాటు చేసే దశలో ప్రయాణించవచ్చు. అందుకు ఈ గ్రంథం నూతన దృష్టిని అందిస్తుంది. ఆధునిక విద్యావంతులందరూ ఈ గ్రంథాన్ని చదవవలసిన అవసరం ఎంతైనా ఉంది.

హైదరాబాద్ 06.01.2008





# శూద్రులే నిజమైన హిందువులు

## ఇది మెజార్టీ హిందూ ప్రజల చరిత్ర

ఇది శూద్రుల చరిత్ర. శూద్రులు హిందూ వర్ణ, కుల వ్యవస్థలో నాలుగోవర్ణం. హిందూ సమాజంలోని మెజార్టీ ప్రజలు శూద్రులు, అతిశూద్రులే. అందువల్ల ఇది మెజారిటీ హిందువుల చరిత్ర. ఇది శూద్ర వర్ణ, కులాల చరిత్ర. ఇది హైందవ సమాజాన్ని కాపాడుతున్న శూద్రుల చరిత్ర.

శూద్రులు లేకపోతే హిందూ సమాజం ఎక్కడిది? శూద్రులే నిజమైన హిందువులు. శూద్రులు లేని హిందూ సమాజాన్ని ఊహించడం సాధ్యమా? పంచములు, అవర్ణులుగా హిందూ సమాజంలో చివరి అంచులో లేదా రేఖ అవతల ఉంటారు. ఆదివాసులు హిందూ సమాజంలో భాగంకాదు, ముస్లింలు, క్రైస్తవులు హిందూ సమాజంలో భాగం కాదు. భారతీయుల్లో 75శాతం జనాభా శూద్రులు అతిశూద్రులే. ఏడు శాతం ఆదివాసులు, 13 శాతం ముస్లింలు, క్రైస్తవులు, బౌద్ధులు, సిక్కులు కాగా ఐదు శాతం లోపే అగ్రవర్ణాలు. ఈ ఐదు శాతం కూడా లేని జనాభాయే అగ్రవర్ణ కుల సిద్ధాంత వేత్తలు. మిగతా వారంతా దాని బాధితులే.

ఆర్య, త్రైవర్ణిక అన్నది ఒక సూత్రీకరణ. ఆర్యులు మూడు వర్ణాలు, బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య. ఈ మూడు వర్ణాలు హిందువుల్లో దోపిడిదారులు, దోపిడి వర్గాలు, పాలకవర్గాలు. శూద్రులు, పంచములు, ఆదివాసులు, పీడితులు, పాలితవర్గాలు. బ్రాహ్మణీయ సిద్ధాంతాలు శూద్రులను పైమూడు వర్ణాల సేవకులు అని స్పష్టంగా చెప్పినప్పటికీ వర్ణ, కుల వాదులు, వామపక్షాలు, కాంగ్రెస్, టీడీపీ, ఆర్ఎస్ఎస్, బీజేపీ పరివారాలు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యులు దోపిడిదారులని ఎందుకు చెప్పడంలేదో స్పష్టం. పార్టీలు ఏవైనా వాళ్ళంతా 'ఆర్య త్రైవర్ణిక'లో చేరిన హిందూ సమాజ దోపిడి వర్గాలు, ఒకే తాను ముక్కలు. క్రైస్తవదేశాల్లో క్రైస్తవులే దోపిడి వర్గాలు, క్రైస్తవులే పీడిత వర్గాలు, హిందూ సమాజంలో హిందువులే దోపిడిదారులు – హిందువులే పీడిత వర్గాలు.

హిందూ వ్యతిరేక శక్తుల చేతుల్లో హిందూయిజం ఆయుధంగా చేరింది. శూద్రులు చాతుర్వర్ణ వ్యవస్థలో ఇవ్వబడిన స్థానం నుండి భారతీయ ప్రజాస్వామ్య వ్యవస్థ ఫలాలు

అందుకోవడానికి సమానత్వం కోరుతున్నారు. శతాబ్దాల అణిచివేత, దోపిడి వల్ల భారతీయ చరిత్ర నిర్మాతలైన శూద్రులు ఈ నాడు వెనకబడిపోయారు, నష్టపోయారు. కష్టపడుతున్నారు. వారికి తాత్విక, చారిత్రక మూలాలు, ఆలోచన అవసరం. 50 శాతంకు పైగా జనాభా గల బీసీలకు చట్ట సభల్లో, న్యాయ, సైనిక శాస్త్ర సాంకేతిక రంగాల్లో, ప్రైవేటు రంగంలో రిజర్వేషన్లను వ్యతిరేకించేవాళ్ళు హిందువులు ఎలా అవుతారు? బీసీలకు రాజకీయ అధికారం, సౌఖ్యవంతమైన జీవన ప్రమాణాలకు చేరుకోకుండా దేశం సుసంపన్న రాజ్యంగా ఎలా మారుతుంది? హిందువుల పేరిట బ్రాహ్మణీయశక్తులు చేస్తున్న కుట్ర ఇది. ఇవన్నీ గతంలో బ్రాహ్మణ వర్ణకుల సిద్ధాంతధారులు చేసిన సిద్ధాంతాలే. ఇవి ప్రజాస్వామ్యంలో సైతం బీసీలను వెనక్కి నెట్టడానికి ఉద్దేశించిన హిందూ వ్యతిరేక చర్యలే. ఆర్.ఎస్.ఎస్. బీజేపీ, బ్రాహ్మణీయ వర్ణ, కుల సిద్ధాంతధారులు, వామపక్ష సిద్ధాంతధారులు పేర్లు ఏవైతేనేం బీసీ వ్యతిరేకులంతా హిందూ వ్యతిరేక శక్తులే.

ఎస్సీలకు 15, ఎస్టీలకు 6 శాతం రిజర్వేషన్లు జనాభా నిష్పత్తిననుసరించి ఇవ్వబడ్డాయి. కనుక 5 శాతంకూడా లేని అగ్రవర్ణాలు 50-70 శాతందాకా అదనంగా అనుభవిస్తున్న దంతా బీసీలకు, ముస్లింలకు చెందాల్సిందే. బీసీలు ఎదగడానికి రాజకీయాలు, చరిత్ర, ఉద్యోగ, విద్య, భావజాల రంగాల్లో కృషి ఏకకాలంలో బహుముఖాలుగా శూద్ర దృక్పథంతో సాగాలి.

ద్విజేంద్రనారాయణ ఝా (డి.ఎన్.ఝా) 'ఏన్సెంట్ ఇండియా' గ్రంథంలో ఈ ఆర్ఎస్ఎస్ హిందూత్వ శక్తుల హిందూ సమాజ వ్యతిరేక కార్యకలాపాలను తేటతెల్లం చేస్తూ విశ్లేషించారు. శూద్రులను హిందూమతంలో భాగంగా చూడకుండా చేయడానికే 'ఆర్య' సిద్ధాంతాన్ని ఎలా పట్టుకొని వేళ్ళాడుతున్నారో తేల్చి చెప్పారు.

చరిత్రను, హిందుత్వను ఆర్ఎస్ఎస్, బీజేపీ, వామపక్షవాదులు ఒక హిప్నాటిజంగా మార్చేస్తున్నారు. సెల్ఫ్ హిప్నాటిజాన్ని చరిత్ర పేరిట, మతం పేరిట ప్రబోధిస్తున్నారు. సంకీర్తన, సరెండర్‌నెస్, భక్తి, తదాత్మ్యం- పేరిట, సాహిత్యం, సంస్కృతి, వారసత్వం, చరిత్ర పేరిట అపోహలకు, సెల్ఫ్ హిప్నాటిజానికి గురిచేస్తున్నారు. శూద్రులు మేల్కొనాలి. హిందూ సమాజంలో సమానత్వం కోసం ఉద్యమించాల్సిన అవసరం ఉంది. చరిత్రలో తమ స్థానాన్ని తిరిగి స్థాపించుకోవాల్సి ఉంది.

భారతీయ చరిత్ర శూద్రులచేత, శూద్రులకొరకు, శూద్రులయొక్క చరిత్రగా రాయడం అవసరం. ఎందుకంటే శూద్రులే ముస్లింలుగా మారారు. శూద్రులే సిక్కు మతం స్థాపించారు. శూద్రులే క్రైస్తవులయ్యారు. మారిన మతంలో పెద్ద కులాల వారే మత నాయకులయ్యారు. పీఠాధిపతులయ్యారు. శూద్రుల చేత, శూద్రుల కొరకు,



శూద్రుల యొక్క చరిత్ర రాసినప్పుడే శూద్రులకు సరియైన వారసత్వం అందుతుంది.

**"భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం"** అనే ఈ పుస్తకం మూడు ఏళ్ళ కృషితో వెలువడుతున్నది. హిందూ మతాన్ని ముఖ్యంగా రాముడు, కృష్ణుడులను వదిలి శూద్రులు తిరిగి బుద్ధుని ఆదర్శంగా స్వీకరిస్తే హిందూ సమాజంలో అగ్రవర్ణ కులవాదుల స్థానం ఎక్కడుంటుందో ఆలోచించుకోవాలి. అంబేద్కర్ బౌద్ధమే హిందూమతంలోని వివక్షతకు పరిష్కారమని సూచించారు. అజ్ఞానానికి అహంకారం, అధికారం తోడై అగ్రవర్ణ దృక్పథం అనేక భావజాలాల సిద్ధాంతాల రూపంలో ఊరేగుతున్నది. అది ఒకవైపు హిందువులంటూనే బీసీలకు రిజర్వేషన్ వ్యతిరేకిస్తుంది. ముస్లింలను, క్రైస్తవులను అణిచివేస్తుంది. విదేశీయులంటుంది. ఈ అగ్రవర్ణ సిద్ధాంత బలం ఎవరో కాదు శూద్రులే. శూద్రుల్లో పరకాయ ప్రవేశం చేసిన అగ్ర వర్ణ బ్రాహ్మణీయ భావజాలాన్ని, సంస్కృతిని వదిలించుకోవాలి.

## ఇది శూద్ర చరిత్ర, శూద్ర తత్వం

ఇది శూద్ర స్కూల్ ఆఫ్ థాట్. అనగా ఇది శూద్ర తత్వశాస్త్రం, శూద్ర తత్వశాస్త్ర చరిత్ర, శూద్ర చరిత్ర తత్వశాస్త్రం. హిందూ సమాజం గురించి మాట్లాడితే శూద్రులను వామపక్ష, ప్రజాస్వామికులేమో ఆర్ఎస్ఎస్ బీజేపీ వాదులని అటు నెట్టి తమ అగ్ర కుల స్వభావానికి ముసుగు వేసుకుంటారు. కాగా ఆర్ఎస్ఎస్ పరివారం శూద్రులను వ్యతిరేకిస్తూ అణిచివేయాలని చూస్తుంది. ముస్లింలు, దళితులు అంతే దూరంగా ఉంటారు. ఇలా నాలుగు పక్షాలూ శూద్రులను అనుమానిస్తాయి. ఎందుకంటే వారిలాగా శూద్రులు ఒక ప్రత్యేక సమాజమని వాళ్ళు గుర్తించడానికి నిరాకరిస్తున్నారు. అందువల్లే వారు శూద్రులను బ్రాహ్మణీయ శక్తుల్లో కలిపి మాట్లాడుతారు. పై నాలిగింటిలో ఇది ఏదీ కాదు. ఇది శూద్రవాదం. ఇది శూద్ర దృక్పథం. శూద్రయిజాన్ని గుర్తించడానికి ఆర్.ఎస్.ఎస్, బ్రాహ్మణీయ శక్తులు, కొందరు అంబేడ్కరైట్లు, వామపక్ష సిద్ధాంతధారులు నిరాకరిస్తున్నారు. వీరు శూద్రుల చరిత్రను, శూద్రుల దృక్పథాన్ని, శూద్రుల తత్వశాస్త్రాన్ని పక్కదారి పట్టిస్తున్నారు. శూద్రుల చరిత్రకు తమ ముసుగులు వేస్తున్నారు.

అనుభవాలు కాలక్రమంలో అనుభూతులుగా, జ్ఞాపకాలుగా మిగులుతాయి. అవి అవగాహనగా మారుతాయి. క్రమంగా అవగాహన భావాలుగా రూపొందుతాయి. భావాలు కొనసాగుతుంటాయి. అందువల్ల భావాల పరిణామాల చరిత్రే చరిత్ర. భావాల సంఘర్షణ అనేది అనుభవాల, అనుభూతుల వైవిధ్యాల మధ్య, వైరుధ్యాల మధ్య సంఘర్షణే. భావాల మూలాల్లోకి వెళ్ళాలంటే చరిత్ర మూలాల్లోకి, ప్రజల అనుభవాల్లోకి వెళ్ళాలి. ప్రజల చరిత్రకు ప్రజలే సజీవ సాక్ష్యాలుగా కొనసాగుతున్న దేశం భారతదేశం. ఇప్పటికీ లక్షలాది ఆదివాసీలు, తెగలు, కోట్లాది శూద్రులు, అతిశూద్రులు వేల యేళ్ళ

నాటి చరిత్రను, సంస్కృతిని తమ భావాల్లో, జీవన విధానాల్లో కొనసాగిస్తున్నారు. అందువల్ల వారి సంస్కృతిని, పెళ్ళిళ్లను, ఉత్పత్తి విధానాన్ని, అలవాట్లను, భావాలను, భాషలను పరిశీలించడం ద్వారా వేల యేళ్ళ చరిత్ర ఎలా గడిచిరావడం జరిగిందో తెలుస్తుంది. సంస్కృతి వేలయేళ్ళ సామాజిక పరిణామాలకు సజీవ సాక్ష్యంగా కొనసాగుతున్నది. దాన్ని డీకోడ్ చేసుకోవడం ద్వారా చరిత్ర పరిణామాలను వెలికితీయడం అవసరం.

ఇది చార్వాకులు, బుద్ధుడు, కబీరు గురురవిదాసు, వేమన, పోతులూరి వీర బ్రహ్మేంద స్వామి, నారాయణగురు, పెరియార్ రామస్వామి, హెగెల్, మార్క్స్, ఫూలే, అంబేడ్కర్‌ల భావాల వెలుగులో రాయబడిన చరిత్ర. ఇది ఆయా చారిత్రక దశల్లో శూద్రులు ప్రత్యేక అస్తిత్వంతో నిర్వహించిన పాత్ర, వారి స్థానం గురించి విపులీకరిస్తుంది. అందువల్ల పై నాలుగింటితో ఇది కలువ వచ్చు. కలువకపోవచ్చు. విభేదించవచ్చు. సంఘర్షించవచ్చు. తటస్థంగా ఉండవచ్చు. సమాజంలో అందరు కలిసి జీవిస్తారు. కనుక ఇవన్నీ సాధ్యమే. **ఇది 'శూద్రుల పాదాల' తో నడిచిన హిందూ సమాజ చరిత్ర పరిశీలనకు పరిమితం.** శూద్రుల చేతులు, పాదాలు లేకపోతే హిందూ సమాజం కుప్పకూలిపోతుంది. నేటికీ గ్రామీణ భారతదేశపు సాంకేతిక అవసరాలు ఎన్నో ఈ కులాల ద్వారానే తీరుతున్నాయి.

శూద్రులు తిరిగి రాజకీయ అధికారంలోకి రావడానికి చరిత్రను, సంస్కృతిని, సిద్ధాంతాలను, హిందూ, వామపక్ష భావజాలాలను, నిర్మాణాలను శూద్ర యిజంతో పరిశీలించడం అవసరం. బృహత్తర గ్రంథాన్ని రీ ఆర్గనైజ్ చేసిన ఈ వ్యాసాలు 'మన పత్రిక' వారపత్రికలో సీరియల్‌గా ప్రచురితమయ్యాయి. ఇతర భాగాల్లో ఉండే అధ్యాయాలు మొదటి భాగంలోకి తీసుకురావల్సి వచ్చింది.

నిజానికి ఇవి చరిత్ర ప్రసంగాలు. వీటికి రాతప్రతి లేదు. ప్రసంగాలుగా చెప్తుంటే తెలుగు డి.టి.పిలో కంపోజ్ చేసిన ప్రసంగ వ్యాసాలు ఇవి. సీరియల్‌గా పత్రికా వ్యాసాలుగా మలచడం వల్ల ప్రతి ప్రసంగ వ్యాసం దేనికది స్వతంత్ర వ్యాసంగా ఉండే విధంగా రూపొందించడం జరిగింది. అందువల్ల ఒకే అంశం అనేక వ్యాసాల్లో దాని ప్రాధాన్యతను బట్టి పలు సందర్భాల్లో పలు కోణాల్లో మళ్ళీ మళ్లీ ప్రస్తావించడం తప్పనిసరి అయింది. వాటి ప్రాధాన్యత అలాంటిది. ఇంకా ఈ కోవలో పలు వ్యాసాలు రాయాల్సిన అవసరం ఉంది. ఉదాహరణకు ఏనుగులు, కుక్కలు, కోళ్ళు, బాతులు, మేకలు, గొర్రెలు, బర్లు, దున్నపోతులు, పాడి, ఆవులు, ఎడ్లు, రథాలు, గాడిదలు, కత్తులు, బల్లాలు, విల్లంబులు, పార, గడ్డపార, సలాక, ఈటె, బల్లెం, నాగలి, కురిపె, చరిత్రలో నిర్వహించిన పాత్రపై ప్రతి అంశంపై విడి వ్యాసాలు అవసరం. అలాగే



కోటలు, వెండి బంగారం, వరి, గోధుమ, జొన్నలు, కొర్రలు, రాగులు, మొక్కలు చరిత్రలో నిర్వహించిన పాత్ర, నదులు, వాగులు, చెరువులు, కాలువలు, అడవులు, దారులు, రహదారులు, నాణాలు, పత్తి, నూలు, బట్టలు, ఉన్ని, తోలు, చేపలు, వానలు, పడవలు, నావలు, చాకలి, మంగలి, కొండలు, గుట్టలు, రాళ్ళు, దేవుళ్ళు, భక్తి, పూజ, యోగ, ధ్యానం, చరిత్రలో నిర్వహించిన పాత్రను ప్రత్యేకంగా తరువాతి గ్రంథాల్లో వెలువరించడం జరుగుతుంది.

అలాగే విద్యా విధానాల చరిత్ర, భారతీయ ఉత్పత్తి విధానాల చరిత్ర, భారతీయ పరిపాలనా విధానాల చరిత్ర, రాజకీయాల్లో భాగంగా మతాల పరిణామాల చరిత్ర మొదలైన గ్రంథాలు కూడా రావాల్సిన అవసరం ఉంది. నేడు ప్రధాన చారిత్రక సంఘటనలు ఎలా నమోదు అవుతున్నాయో గమనించడం అవసరం. అలా వర్తమానం నుండి వెనక్కి క్రమంగా చరిత్రను అధ్యయనం చేస్తూ పోతే చరిత్ర మరో విధంగా ఆసక్తికరంగా కనపడుతుంది. ఉదాహరణకు 2007 నుండి 2006, 2005 ఇలా వెనక్కి వెళుతూ 1947 స్వాతంత్ర్యం 1857 ప్రథమ స్వాతంత్ర్య పోరాటం, ఔరంగజేబు, అక్బర్ ఇలా వెనక్కి వెళుతూ చరిత్రను అధ్యయనం చేస్తే మనం ఎంత ముందున్నామో నాటి చరిత్ర, జీవన ప్రమాణాలు ఎంత వెనకబడి ఉన్నాయో కూడా తెలుస్తుంది. వర్తమానం నుండి గతానికి, గతంనుండి వర్తమానానికి నిరంతర సంభాషణ లాగా రాయడం చరిత్ర రచనలో ఒక పద్ధతి.

ముందే చెప్పినట్టు ఇది 80 శాతం ప్రజల చరిత్ర. ఆర్య సిద్ధాంతం, బ్రాహ్మణీయ, ఆర్.ఎస్.ఎస్.వాద చరిత్ర 10 శాతం చరిత్రనే తెలుపుతుంది. రాజుల చరిత్ర 1,2 శాతం ప్రజల చరిత్రనే తెలుపుతుంది. రాజుల చరిత్ర తేదీలు, నిర్ణయాలు పరిపాలన విధానం పరిశీలించడం అవసరమే. అయితే అదే చరిత్ర కాదు. ప్రజలే చరిత్ర నిర్మాతలు.

అప్పుడు రాజకీయ పార్టీలు మతాల రూపంలో ఉండేవి. అప్పుడు వాటి లాబీలు, వైశ్యులు, వ్యాపారులు, రాజులు, బ్రాహ్మణులు, శూద్రులు, పంచములు, ముస్లింలు రూపంలో ఉండేవి. మతాల మధ్య పోరాటం, శైవ, వైష్ణవ మతాల మధ్య పోరాటం, బౌద్ధ, జైన, బ్రాహ్మణీయ మతాల మధ్య పోరాటం రాజకీయాల మధ్య పోరాటమే. అది సిద్ధాంతాల మధ్య, సంస్కృతి మధ్య, జీవన విధానాల మధ్య, ఆధిపత్యాల మధ్య పోరాటమే. ప్రజలు పార్టీలు మారారు. వైదిక నుండి అవైదిక మతాలైన జైనం, బౌద్ధంలోకి అటు తరువాత ఇస్లాంలోకి, సిక్కు మతంలోకి మారారు. పార్టీ మారుతున్న క్రమంలో భక్తి ఉద్యమాలు వచ్చి వైదికాన్ని విమర్శిస్తూనే శూద్రులను తిరిగి బ్రాహ్మణీయ రాజకీయ లాబీల్లోకి పార్టీల్లోకి మార్చాయి. బ్రాహ్మణీయ శక్తులు ఓటర్లకు ప్రలోభాలు చూపిస్తూ దేవాలయాల్లో వేశ్యా వ్యవస్థను కూడా నెలకొల్పారు. ఇలా బ్రాహ్మణీయ మతాలు ఎప్పటికప్పుడు కొత్త రూపాలు ముందుకు తెచ్చాయి. అంతిమంగా ఇస్లాంకు వ్యతిరేకంగా

పనిచేశాయి. ఇస్లాంలో చేరిన శూద్రులపై కక్ష కట్టాయి. ఇది శూద్ర బౌద్ధ దృష్టి. ఆర్.ఎస్.ఎస్. వామపక్ష సిద్ధాంతధారులది స్టేటెస్‌కో దృష్టి. వారిది అగ్రవర్ణ, బ్రాహ్మణీయ లాబీల దృష్టి.

చరిత్ర ఇంతదాకా ఎంతో రాశారు. దాన్ని ఇందులో మళ్ళీ చెప్పడం దేనికని, చర్విత చర్వణం అవుతుందని భావించి వాళ్ళు ఏది వదిలేశారో ఇందులో దానికి ప్రాధాన్యత ఇవ్వడం జరిగింది. అలా రూపుదిద్దుకున్నదే ఈ పుస్తకం.

ఆర్.ఎస్.ఎస్, బ్రాహ్మణీయ, ఆర్య సిద్ధాంతధారులకు నిజంగానే చిత్త శుద్ధి ఉంటే రాముడు, కృష్ణుడు, భగవద్గీతలతో పాటు బుద్ధుడు, బుద్ధగీత, వజ్రసూచి, చార్వాక, ధర్మకీర్తి, అశ్వఘోషుల సిద్ధాంతాలను, చరిత్రలను ప్రజల్లోకి తీసుకు వెళతారు. బి.సి రిజర్వేషన్‌లను సమర్థిస్తారు.

పాఠకులు వారి సూచనలను, అభ్యంతరాలను నాకు గానీ, 'మన పత్రిక'కు గానీ రాయవలసిందిగా కోరుతున్నాను. తరువాతి భాగాల్లో వాటిని దృష్టిలో ఉంచుకోవడానికి ఉపయోగపడతాయి. ఈ వ్యాసాలను సీరియల్‌గా ప్రచురించిన మనపత్రిక సంపాదకులు జస్టిస్ బి.ఎస్.ఎ. స్వామి, విన్నకోట భాస్కరరావుగారలకు, మనపత్రికలో ప్రతి వ్యాసానికి చక్కని చిత్రాలు వేసిన చిత్రకారుడు సెల్వరాజ్ గారికి, దీనికి సంపాదకత్వం వహించి అనేక అంశాలను గత మూడేళ్ళుగా చర్చిస్తూ మార్పులు చేర్పులు చేస్తూ తుదిరూపం ఇచ్చిన సంపాదకులు కాకతీయ యూనివర్సిటీ చరిత్ర ఆచార్యులు ప్రొ॥ డా॥ ఎ.బొబ్బిలి, హైదరాబాద్...ప్రొ॥ డా॥ ఈమని శివనాగిరెడ్డి, బహుభాషావేత్త కె. జితేంద్ర బాబు గార్లకు, డీటీపీ ప్రతిని ఎప్పటికప్పుడు చూస్తూ అనేక సూచనలు అందించిన దుర్గం రవీందర్ గారికి ప్రత్యేక కృతజ్ఞతలు. ఇందులోని వ్యాసాలను పత్రికల్లో చదివి ఎప్పటికప్పుడు స్పందించిన పాఠకులకు, మిత్రులు డా॥ కత్తి పద్మారావు, ఆచార్య కొలకలూరి ఇనాక్ గారికి ఈ పుస్తకాన్ని చెప్పింది చెప్పినట్టు తప్పులు లేకుండా కంపోజ్ చేయడంతో పాటు చక్కగా పుస్తక రూపంలోకి మలిచిన శారద, పవన్‌కుమార్, ... కృష్ణ, విజయకుమార్, గణేష్ గారలకు కృతజ్ఞతలు. ఈ పుస్తకాన్ని చదివి ఊరుకోవడం కాకుండా శూద్ర చరిత్రపై జిల్లా స్థాయిలో, డివిజన్ స్థాయిలో "శూద్రుల చరిత్ర భారతీయ దృక్పథం"పై పరిచయ సదస్సులు, శిక్షణా తరగతులు నిర్వహించడం అవసరం.

**– బి.ఎస్. రాములు**

సామాజిక తత్వవేత్త
ఫోన్ : 9391036987,
04065164929

01.01.2008
శివంరోడ్, హైదరాబాద్



# శూద్రులు భారతీయ చరిత్ర నిర్మాతలు

***చరిత్ర ఒక సముద్రం. అందులో పడవతో తేలియాడుతూ గమ్యం చేరాలి. దృక్పథమే పడవ. ఆధారాలే తెడ్డు.***

ఇప్పటిదాకా ఎన్నో చరిత్ర గ్రంథాలు వెలువడ్డాయి. ఇది శూద్ర దృక్పథంతో వెలువడుతున్నది. ఇది పాదాల చరిత్ర. శూద్ర దృక్పథం అంటే ఉత్పత్తి దృక్పథం. ఉత్పత్తి దృక్పథమే ప్రగతిని, సమాజాన్ని ముందుకు నడిపిస్తుంది.

సింహాలు తమ చరిత్ర రాసుకునేదాకా వేటగాడు తన విజయాలను వినిపిస్తూనే ఉంటాడు అని ఆఫ్రికన్ సామెత. శూద్రులు, బిసిలు తమ దృక్పథంతో ఇప్పటిదాకా చరిత్రను పరిశీలించలేదు. ఇంతదాకా బ్రాహ్మణులు, హిందూ మతవాదులు, బౌద్ధులు, మార్క్సిస్టులు చరిత్రలు రాసుకున్నారు. అంబేద్కర్ దళిత దృక్పథంతో చరిత్ర రాశారు. ఇది శూద్ర దృక్పథంతో రాస్తున్న చరిత్ర. ఇది చరిత్ర రచనలోని శూద్రుల స్థానాన్ని, ఖాళీని పూరించడం కోసం రాస్తున్న చారిత్రక దృక్పథం.

శూద్రులు సంపద సృష్టించే క్రమంలో వైజ్ఞానికంగా, విజ్ఞాన శాస్త్రాలను ఎంతో అభివృద్ధి పరిచారు. ఆయుర్వేదం, వనమూలికల వైద్యం ఆటవిక జనపదాల దశల నుండి ఒక శాస్త్రంగా శూద్రులు అభివృద్ధి పరిచారు. సంపదను సృష్టించే అప్లయిడ్ సైన్స్ అంతా శూద్రుల చేతుల్లో ఉండేది. ఉత్పత్తి పెరిగే క్రమంలో దాని పంపిణీ, వినియోగం క్రమబద్ధీకరణ చేసే సామాజిక శాస్త్రాలు రూపొందించే పని బౌద్ధం ఉన్నంత కాలం శూద్రులు కూడా చేశారు.

లిపికి అందిన విజ్ఞానం 5శాతమే. లిపికి అందని విజ్ఞానం 95 శాతం ఉంది. ఇప్పటికీ సంస్కృతి, ఆహారపు అలవాట్ల గురించి, ఫ్యాషన్స్ గురించి లిపి బద్ధం కానిదే ఎక్కువ. లిపిబద్ధం కాని 95 శాతం విజ్ఞానాన్ని కళలను, సంస్కృతిని, ఆహారపు అలవాట్లను జీవన విధానాన్ని వెలికి తీయాలి. అందుకు ప్రాచీన అవశేషాలు, పురావస్తు ఆధారాలు, భాష పరిణామ చరిత్ర, సైన్సు పరిణామ చరిత్ర, చరిత్రలను అవగాహనకు

ప్రధాన భూమికగా చేసుకోవాలి. నేటికీ సజీవంగా జీవితంలో సంస్కృతిలో కొనసాగుతున్న వాటి మూలాలను అధ్యయనం చేయడం ద్వారా చరిత్ర రచనల్లోని లోపాలను సరిచేసి ప్రజల జీవిత పరిణామాలను చరిత్ర పరిణామాలను సమగ్రంగా వెలికితీసి చిత్రించడం అవసరం.

శూద్రులు ఉత్పత్తి శక్తులు. వాళ్ళు ఉత్పత్తి సాధనాలు కల్గిన ఉత్పత్తి శక్తులు. అందువల్ల శూద్రులు పునాది అంశం. బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య వర్ణాలు ఉపరితల అంశం. పారిశ్రామిక, కార్మిక వర్గం పునాది అంశం. శూద్రులు చెట్టు మూలం. సమాజం ఆకులు, కొమ్మలు, రెమ్మలు. ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాలు పునాది అంశాలు. రాజకీయాలు, సాహిత్యం, కళలు ఉపరితల అంశాలు. ఉత్పత్తి సాధనాలపై యాజమాన్యం లేని ఉత్పత్తి శక్తులు కార్మికవర్గం. ఉత్పత్తి సాధనాలు కల్గిన ఉత్పత్తి శక్తులు శూద్రవర్ణం. అందువల్ల శూద్రులు భారతీయ చరిత్రలో కార్మికవర్గాని కన్నా బలమైన పాత్రను నిర్వహించారు.

ఉత్పత్తి సాధనాలు కల్గిన వాళ్ళు పునాది ఉపరితల అంశాలను నిర్ణయిస్తారు. నేడు పారిశ్రామిక యజమానులు ఉపరితల అంశాల్ని నిర్ణయిస్తే పారిశ్రామిక పూర్వ సమాజంలో శూద్రులు నిర్ణయించారు. ఉత్పత్తి సాధనాలు ఉత్పత్తి శక్తులు ఉండడం వల్ల శూద్రులు పరిపాలకులుగా, రాజులుగా మారడం సులువైంది. ఇలా చరిత్ర పొడుగునా శూద్రులు, ఆదివాసీలే రాజులయ్యారు. రాజ్యాలు ఏర్పాటు చేశారు.

రాజ్యాలు ఏర్పడ్డంలో ముక్కోణపు సంఘర్షణ జరిగేది. ఉత్పత్తి శక్తులైన శూద్రులు వైశ్య, వర్తక వాణిజ్యాలను, బ్రాహ్మణులను నియంత్రించడం ద్వారా పై చేయి సాధించే వారు. అందువల్ల వీరిని ఈ రెండు వర్ణాలు వ్యతిరేకించేవి. ఓడిన వారి పక్కన చేరి గెలిపించడానికి సహకరించేవారు. కొత్తగా గెలిచిన వారి రెండో తరంలో సయోధ్యతో శాంతియుత సహజీవనంతో బ్రాహ్మణ, వైశ్య వర్ణాలు అంగీకరించేవి. లొంగిపోయేవి. పాత తప్పులను సరిదిద్దుకోవడానికి వాళ్ళు పెద్ద గొంతుకతో రెండో తరంలో రాజులను క్షత్రియులంటూ పొగిడేవారు.

మార్క్స్, ఏంగెల్స్‌లు కార్మికులే అధికారంలోకి రావాలని ఆశించారు. కార్మికులే ఉత్పత్తి శక్తులు కనుక ఉత్పత్తి సాధనాలపై అధికారం, రాజ్య పరిపాలనాధికారం సాధించుకోవాలని సూత్రీకరించారు. ఇండియాలో శతాబ్దాలుగా శూద్రులు, ఆదివాసీలు ఇదే పనిచేస్తూ అధికారంలోకి వచ్చారు. రాజ్యాలు ఏర్పర్చారు. అలా శూద్రులు నిరంతరం అధికారంలోకి రావడానికి వారి చేతుల్లో ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సాధనాలు ఉండడం ఎంతో ఉపయోగపడింది. అందువల్లే ప్రపంచంలో అత్యంత నైపుణ్యం గల



ఉత్పత్తులతో భారతదేశం నుండి వర్తక వాణిజ్యాలు విస్తరించాయి. పేరెన్నిక గన్నాయి.

జనపదాలు రాజ్యాలుగా ఏర్పడ్డప్పుడు రాజ్యం 'ఎన్నికల' ప్రభువుల నుంచి వంశపారంపర్యత చర్చ ముందుకు వచ్చింది. అందులో కూడా ఎవరికి చెందాలి అని చర్చించి పట్టపు రాణి పదవి సృష్టించి వారి తొలి మగ సంతానానికి చెందాలని నిర్ణయించు కున్నారు. అలా రాజవంశాల చరిత్ర ప్రారంభమయ్యింది. జనపదాలు రాజ్యాలుగా రూపుదిద్దుకోడానికి లోహ, ఖనిజాలు, ఇనుము ఉత్పత్తులు వాటి వినియోగం పెరగడం ప్రధాన కారణం.

బౌద్ధులు రాసిన చరిత్ర టిబెట్, చైనాల్లో ఉండిపోయింది. భారతీయ అనువాదాలు రాలేదు. వాటిని తీసుకురావడం ద్వారా శూద్ర చరిత్ర సమగ్రమవుతుంది. అంతదాకా ఇలా అసమగ్రమైన చరిత్రనైనా రాసుకోవడం అవసరం.

శూద్ర దృక్పథంతో జ్యోతిబాపూలే చరిత్ర రచనను క్రీ.శ.1860లో ప్రారంభించారు. ప్రపంచంలో ఆధునిక భారతీయ చరిత్రను చాలా మంది అప్పుడే రాయడం ప్రారంభించారు. పూలే, గులాంగిరి, సేద్యగాడిపై ఛర్నాకోల వంటి గ్రంథాలు వెలువరించారు. డా॥ బి.ఆర్.అంబేద్కర్ 'శూద్రులు ఎవరు', 'అస్పృశ్యులు ఎవరు?', 'హిందూయిజం మూలాలు' అనే గ్రంథాలు రాశారు. ఆర్.ఎస్. శర్మ 'శూద్ర వర్ణం ఎలా పుట్టింది' అనే పరిశీలన చేశారు. 'భారతీయ గ్రామం' ఎన్.సి.దుబే, 'సంస్కృతీకరణ' ఎం.ఎన్.శ్రీనివాసన్ గ్రంథాలు వెలువరించారు. ఆయా కులాలు తమ కులాల చరిత్రను రాసుకునే ప్రయత్నం చేశాయి.

### జరిగేదొక్కటి చరిత్రగా రాసేదొకటి

జరిగేదొక్కటి చరిత్రగా రాసేదొకటి. ఒక ఉదాహరణ ఇస్తాను. మన కళ్ళ ఎదుట జరిగిన ప్రధాన సంఘటనలు చరిత్రగా ఎలా రాయబడుతున్నవో చూద్దాం. మహాత్మాగాంధీ, ఇందిరాగాంధీ, రాజీవ్‌గాంధీ, కెనడి, దయానా హత్యోదంతాలు ఇప్పటికీ మూలకారణాలు వెలికి రాలేదు. ఎవరు వాటిని చేయించారో, ఎందుకు చేయించారో ఇప్పటికీ తేలలేదు. ఇక శతాబ్దాల నాటి చరిత్ర సాక్ష్యాలు సరైనవని నమ్మడం ఎలా సాధ్యం?

మరో ఉదాహరణ: ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కరీంనగర్ జిల్లాలో గల సిరిసిల్ల పట్టణంలో టౌన్‌హాల్ నిర్మించారు. జ్ఞానపీఠ్ అవార్డు గ్రహీత రాజ్యసభ సభ్యులు డా॥సి. నారాయణ రెడ్డి గారిని టౌన్‌హాల్ నిర్మాణం కోసం పార్లమెంట్ సభ్యుల ఫండ్స్ కేటాయించాలని తెలంగాణ తొలితరం కథకులు చిన్ననాటి మిత్రులు అయిన గూడూరి సీతారామ్, యువ రచయిత పత్తిపాక మోహన్ వంటి రచయితల బృందం కోరింది.

మున్సిపల్ కార్యాలయంలో ప్లానింగ్ కోసం ఇంజనీరును, భూమి కెటాయింపు కోసం మున్సిపాల్టీ తీర్మానం చేయాలని కౌన్సిలర్‌ల చుట్టూ ఫైల్ నడపడానికి మున్సిపల్ చైర్‌పర్సన్, మున్సిపల్ కమిషనర్ చుట్టూ నెలల తరబడి తిరిగారు. టౌన్‌హాల్ చక్కగా, అందంగా 40 లక్షల రూపాయలతో నిర్మించబడింది.

ఇప్పుడు అక్కడకు వెళ్ళి టౌన్‌హాలు చరిత్రను పరిశీలిస్తే ఆ టౌన్ హాల్ శంఖుస్థాపన, ప్రారంభోత్సవ శిలాఫలకాల్లో గానీ, చరిత్రలో గానీ కలెక్టర్, మున్సిపల్ రికార్డుల్లో కాని వీరి కృషి ఎక్కడా రికార్డు కనపడదు. వీరు కనీసం వేదిక కూడా ఎక్కలేదు.

కలెక్టర్లు, జిల్లా పరిషత్ ఛైర్మన్, మున్సిపల్ ఛైర్‌పర్సన్ మొదలైనవారు వీటిని శంఖుస్థాపన చేసి నిర్మాణం పూర్తిగావించినట్టుగా చరిత్ర రికార్డు అయింది. అధికార చరిత్ర వేరు. సామాజిక చరిత్ర వేరు. సామాజిక పరిణామాల చరిత్ర వేరు. ప్రజల చరిత్ర అధికారిక రికార్డుల్లో గానీ, శిలా ఫలకాల్లో గానీ దొరకదు. ఇలాంటి రికార్డులకెక్కని శూద్ర ప్రజల చరిత్ర ఇది.

టౌన్‌హాల్ నిర్మాణం కోసం కృషి చేసిన పునాది శక్తులు చరిత్రలో రికార్డు కాలేదు. ఉపరితలంగా కృషి చేసిన వారి చరిత్రగా రికార్డు అయింది. అలాగే ప్రజలు చాలా గుళ్ళు నిర్మించుకున్నారు. పూజలు చేసుకున్నారు. ప్రజాదరణ పెరిగిన తరువాత రాజులు, వర్తకులు వాటికి విరాళాలు ఇచ్చి అభివృద్ధి పరిచారు. పూజారులు వచ్చి చేరారు. మాంసాహార గుళ్ళు బ్రాహ్మణులు చేరి శాఖాహార గుళ్ళుగా మార్చారు. ప్రజలు పునాది అంశం. అధికారులు వర్తక, వాణిజ్యాలు, పాలకులు ఉపరితల అంశం. వీరి చరిత్రే రికార్డు అవుతున్నది.

**ఇది పాదాల చరిత్ర**

హిందూమతం శూద్రులకు శరీరంలోని పాదాల స్థానాన్ని ఇచ్చింది. శరీరమంతా కలిసే ఉంటుంది. శూద్రుల సాంఘిక స్థానం పాదాలు అని అర్థం. పాదాలు పూజ్యనీయమైనవి. శూద్రులు పూజ్యనీయులు. పాదాలు లేని మనిషి పాక్కుంటూ వెళ్ళాల్సిందే. చరిత్ర అంతా పాదాల నడకతోనే నడిచింది. చరిత్ర కెంత ప్రాధాన్యత ఉందో, పాదాలకంత ప్రాధాన్యత ఉంది.

పాదాలు నడకతో పాటు జ్ఞానానికి 'దారి' తీస్తాయి. పాదాల నడక వల్లనే కళ్ళు కొత్తవాటిని చూడగలిగాయి. కొత్త జ్ఞాన నేత్రం విచ్చుకుంది. పాదాలు ఉండడం వల్లనే ఆహార సేకరణ జరిగింది. జంతువులతో పరిగెత్తారు. చెట్లు ఎక్క గలిగారు. పారిపోగలిగారు. మనిషి జీవనయానం అంతా పాదాలతోనే. పాదాలకు నమస్కారం.



శూద్రులకు పాదస్థానం మహోన్నతమైన స్థానం. పాదాల నడక కోసమే ఎంతో శాస్త్ర విజ్ఞానం అభివృద్ధి చెందింది.

తలకు నమస్కరిస్తారు. పాదాలను పూజిస్తారు. పాదాల వల్లనే నడక సాధ్యమైంది. నడకతో లోకాన్ని చుట్టిరావడం జరిగింది. పాదాల వల్లనే సంచార జీవనం చేయగలిగారు. పాదాల వల్లనే వ్యవసాయం చేయగలిగారు. పాదాలు లేకపోతే మానవ చరిత్రే ఇలా ఉండేది కాదు. ఎంగిల్స్ చేతులు మానవ చరిత్రలో నిర్వహించిన పాత్రను రాశారు. ఇది పాదాలు మానవ చరిత్రలో నిర్వహించిన పాత్రను తెలుపుతుంది. చరిత్రంతా మానవులు నడిచిన అడుగుజాడల, 'పాదముద్రల' చరిత్రే.

**పారిశ్రామిక విప్లవానికి ముందు సాగిన పలు విప్లవాలు**

ఆధునిక పారిశ్రామిక విప్లవానికి ముందు ప్రపంచంలో పలు విప్లవాలు జరిగాయి. చక్రం కనిపెట్టడం ఒక విప్లవం. యంత్ర శక్తితో చక్రాన్ని నడపడం ఒక విప్లవం. నిప్పును ఉపయోగించడం, వంట కనుక్కోవడం ఒక విప్లవం. రేడియో ఒక విప్లవం. టీవీ ఒక విప్లవం. స్క్రూ డ్రైవర్ ఒక విప్లవం. కుట్టుమిషన్, సెల్‌ఫోన్, క్యారీబ్యాగ్, ఆన్‌లైన్, ల్యాప్‌టాప్ ఇలా ఎన్నో విప్లవాత్మక సంఘటనలు ఆవిష్కారాలు జరిగాయి.

ఒకటి – వేట, జంతువుల మచ్చిక, నిప్పు వాడకం, ఆహార సేకరణ, తోలు విప్లవం, పాతరాతి యుగం, కొత్తరాతియుగం దాకా.

రెండు – పశువుల పెంపకం, తెగలుగా, తండాలుగా సంచారం, వ్యవసాయం, లోహాల వినియోగ ప్రారంభం, కంచుయుగం. గణతెగలు, జనపదాల నిర్మాణం. రాజన్ వ్యవస్థ.

మూడు – శూద్ర విప్లవం. మొదటి రెండు విప్లవాల నుండి మూడవ విప్లవం ప్రత్యేకంగా ఎదిగింది. నాగరికత మొదటి రెండు విప్లవాలు గణ తెగలను జనపదాలుగా, రాజన్ వ్యవస్థలుగా ఏర్పడడానికి దారితీసాయి.

పశువుల పెంపకం కూడా సంచార జీవనం ప్రధానమైనది. తొలి వ్యవసాయం సంచార పోడువ్యవసాయంగానే సాగింది. క్రమంగా స్థిర వ్యవసాయంతో గ్రామం రూపొందింది. వ్యవసాయంతో గ్రామం కన్నా మించి ఎదగడం సాధ్యం కాదు. ఇప్పటికీ గ్రామాలు వ్యవసాయాలు గ్రామ స్థాయిని మించి ఎదగడం జరగడం లేదు. అది దాని పరిమితి.

శూద్ర విప్లవం నగరాలు – నాగరికతా విప్లవం. ఖనిజలోహ యుగ విప్లవం.

శూద్ర విప్లవం నుండి వర్ణ విభజన, కులాల పుట్టుక, స్థిరీకరణ జరిగే క్రమంలో కొందరిని అస్పృశ్యులుగా వర్గీకరించారు.

దుకాణాలు పెడుతున్నారు. వర్ణ, కుల వ్యవస్థ ప్రకారం కళలు, సంగీతం, సినిమా, టీవీ, నేటి పరిశ్రమలు అన్ని శూద్రకులాల చేతుల్లో వుండాలి. వైద్యం, విమానాలు, రైళ్ళు, బస్సులు, రవాణా సాధనాలు అన్నీ శూద్రుల చేతుల్లోనే వుండాలి. వ్యాపారం వైశ్యుల చేతుల్లో, వ్యవసాయం శూద్రులు, అతి శూద్రుల చేతుల్లో వుండాలి. రాజ్యాధికారం జన్మనా జాయతే శూద్ర ప్రకారం ప్రజల చేతుల్లో వుండాలి. సమాచారం చేరవేయడం చాకలి వాళ్ళ పని. అందువల్ల పత్రికలు చాకలి వాళ్ళ చేతుల్లో వుండాలి. వైద్యం, ముదిరాజ్, తెనుగు కులాల చేతుల్లో సర్జన్ వైద్యం మంగళివారి చేతుల్లో, బట్టల మిల్లులు పద్మశాలీల, చేనేత కులాల చేతుల్లో వుండాలి. ఉక్కు, వెండి, బంగారం, రాగి, ఇత్తడి, అల్యూమీనియం, ఇనుము పరిశ్రమలు, వ్యాపారం విశ్వబ్రాహ్మణుల చేతుల్లో వుండాలి. తోలు ఉత్పత్తుల పరిశ్రమలన్నీ మాదిగల చేతుల్లో వుండాలి. వెదురు, పీచు, ఫైబర్ పరిశ్రమలన్నీ మేదరుల చేతుల్లో ఉండాలి. ఇలా వుండాల్సి వస్తుందని ఇప్పుడు కులం లేదు, కుల వృత్తిలేదు వాటి చర్చ అవసరం లేదు అని వర్ణ, కుల సిద్ధాంతధారులు, బ్రాహ్మణీయ శక్తులు తమ సిద్ధాంతాలను పక్కనపెట్టి పాశ్చాత్య ప్రజాస్వామ్య, సామ్యవాద సిద్ధాంతాలను అరువుతెచ్చుకుని తమ స్వార్థాలకు, ఆధునిక రూపం ఇస్తున్నారు.

పారిశ్రామిక విప్లవం నుండి వర్ణవాదులు లాభాల్ని కైవసం చేసుకున్న క్రమంలో ఈ దేశంలో మొట్టమొదటిసారిగా బహుజనుల గొంతు మూగపోయింది. ఒక యాభయి ఏళ్ళ దాకా మూగవోయింది. ఆ తర్వాత మహాత్మా జ్యోతిబాపూలే అందుకొని రణ నినాదం యిచ్చాడు. ప్రపంచ ఉత్పత్తి రంగంలో మనం 1810 నుండి వెనకబడి పోయాం. 1848 నాటికి జ్యోతిబాపూలే తనదైన సిద్ధాంతంలో రంగం మీదకు వచ్చాడు. అంతాకల్సి యిలా వెనుకబడింది ఓ యాభయి అరవై ఏళ్ళు. పూలే వర్గకుల లింగ దృక్పథంతో ఈ సమాజాన్ని సమూలంగా మార్చాలని సాంస్కృతిక విప్లవాన్ని ప్రతిపాదించాడు. ఈ పదజాలం ఆయన ఉపయోగించకపోయినా ఈ పని చేయాల్సిన అవసరం ఉందని గుర్తించాడాయన. స్త్రీల కోసం ఆయన దేశంలోనే మొదటిసారిగా పాఠశాలను పెట్టాడు. వారికి చదువు ప్రయాణాలు, అందుబాటులో ఉన్నాయి. తీరిక, అదనపు విలువతాలూకు సంపద అందుబాటులో ఉన్నది. దానివల్ల వారు మరింత ధనవంతులై మరింత అగ్రకులాలుగా మారి ఎంత అభివృద్ధి చెందారంటే వారు శూద్రులను పూర్తిగా అణచివేసే స్థాయికి అభివృద్ధి చెందారు.

అంతకన్నా ముందు రాజుకు భూస్వామికి అగ్రకులాలకు శ్రామిక కులాలకు మధ్యన సుఖాల్లో తిండిలో జ్ఞానంలో పెద్ద తేడా ఉండేది కాదు. భూస్వామి అగ్రకుల దొర ఇటీవలి దాకా మక్క, గుట్క తినేవాడంటే శూద్రులకూ వారికీ జీవన ప్రమాణాల్లో ఏపాటి తేడా? పారిశ్రామిక విప్లవం విజయవంతమయ్యాకే ఈ సామాజిక అంతరాలు,



జీవన ప్రమాణాల మధ్య విపరీతమైన తేడాలు ఏర్పడ్డాయి. జాతీయోద్యమం, స్వాతంత్ర్యోద్యమం తరువాత ఈ తేడాలు మరెన్నో రెట్లు పెరిగాయి. శ్రామిక కులాలు చేతివృత్తులు దెబ్బతిని మరింత నీరసించి పోవడం జరిగింది. శూద్రులు ఇలా ఉన్నచోటనే ఉంటూ చేసే వృత్తులే చేస్తున్నప్పటికీ పారిశ్రామిక విప్లవం వల్ల బాగా దెబ్బతినిపోయారు.

గిరిజనులు ఉన్నచోట ఉంటూనే ఎప్పటిలాగే పోడు వ్యవసాయం చేసికొంటూరు. శ్రామిక కులాలు ఎప్పటిలాగే తమ వృత్తుల్ని తాము చేస్తూ ఉంటారు. వ్యవసాయ పద్ధతులు పారిశ్రామిక ఉత్పత్తి విధానం ముందుకు సాగాయి. శూద్రులు ఉన్నచోటనే ఉన్నారు. ముందుకు సాగిన వారు శూద్రులను వెనకబడిన వారని అన్నారు. అలా గిరిజనులు, శ్రామిక కులాలు, పారిశ్రామిక విప్లవంతో వెనకబడిపోయి అంతరాలు బాగా పెరిగాయి. పారిశ్రామిక విప్లవ ఫలితాలు అందిపుచ్చుకున్న వర్ణవాదులు శూద్రులను తీవ్రంగా అణచివేశారు. వారి అణిచివేత మరింత సుస్థిరంగా కొనసాగించడం కోసం వారు జాతీయోద్యమ రూపంతో ముందుకు వచ్చారు. వారి ఆధిక్యత అణిచివేతలకు ప్రజల భాష, ఆశల రూపం యివ్వబడింది. దానికి స్పష్టమైన రూపం యిచ్చిన వాడు తిలక్. ఇలాంటి వర్ణవాద జాతీయ వాదాన్ని వ్యతిరేకించారనే పేరుతో పూలే, అంబేద్కర్‌లను ఈసడించారు. జాతీయోద్యమ కాలంలో ఆరేడు సామాజిక సిద్ధాంతాలు బలంగా ముందుకు వచ్చాయి.

1. వర్ణ, కులధారుల బ్రాహ్మణీయ, హిందూ, భూస్వామ్య, పారిశ్రామిక జాతీయవాదం
2. శూద్ర కుల, రైతు, కూలి, కార్మిక, అస్పృశ్య, దళితవాదం.
3. జాతుల సమస్యలవాదం, ప్రాంతీయ వాదాలు, భాషా వాదాలు
4. నాస్తిక హేతువాదం,
5. ముస్లిం జాతీయవాదం,
6. కమ్యూనిస్టు, సోషలిస్టు వాదం,
7. గిరిజన రైతాంగ తిరుగుబాట్లు.
8. పూలే, లోహియా, అంబేద్కరిజం

కాంగ్రెస్, ఆరెసెస్, బిజెపి, రాజారామ్మోహన్‌రాయ్ ఆర్యసమాజం బ్రహ్మసమాజం మొదటి దాన్లోని పాయలు. జ్యోతిబాపూలే, అంబేద్కర్, నారాయణగురు, భాగ్యరెడ్డి వర్మ (బాగయ్య) సత్యశోధక ఉద్యమం, రిజర్వేషన్ల ఉద్యమం రెండో దాన్లో భాగం. భాషా ప్రయుక్త రాష్ట్రాలు, రాష్ట్రాలకు యితోధిక అధికారాలు, అధికార వికేంద్రీకరణ మాతృభాష ప్రాధాన్యత కేంద్ర రాష్ట్ర సంబంధాలు మూడో దాన్లో భాగం. పెరియార్

రామస్వామి, త్రిపురనేని రామస్వామి, ద్రవిడ కజగం, డి.యం.కె.ద్రవిడ దేశం వాదన నాలుగో దాన్లో భాగం. ముస్లింల అధికారం ఇస్లాం ముస్లింకు ప్రత్యేక దేశం మహమ్మద్ ఆలీ జిన్నా, ముస్లింలీగ్ నేటి మైనారిటీల సమస్య అయిదో దాన్లో భాగం. కమ్యూనిస్టులు, నక్సలైట్లు సోషలిస్టులు ఆరోదాన్లో భాగం. గిరిజన రైతాంగ పోరాటాలు, గిరిజన రాష్ట్రాల ఏర్పాటు, నక్సలైట్ల సాయుధ పోరాటాలు, బిర్సాముండా, కొమరంభీం, ఏడోదాన్లో భాగం.

ఈ ఆరేడు సామాజిక సిద్ధాంతాలు, ఉద్యమాలు వాటి ఆచరణ ఈ నూటయాభయి ఏళ్ళల్లో దాదాపు ఏకకాలంలో రూపుదిద్దుకున్నాయి. ముస్లిం జాతీయవాదం పాకిస్తాన్ బంగ్లాదేశ్‌గా పరిష్కరించబడింది. మన దేశంలో మాత్రం మైనారిటీ సమస్యగా యింకా కొనసాగుతోంది. దళితవాదం రిజర్వేషన్లు సమాన హక్కులు సాధించుకునే పూర్తి స్థాయికి ఎదగడానికి ముందుకు వస్తోంది. ఆరెసెస్ బిజెపి పరివారం స్పష్టంగా వర్ణవాద హిందూ భూస్వామ్య పారిశ్రామిక పారిశ్రామిక వాదంగా ఎదుగుతూ కాంగ్రెస్ సన్నగిల్లుతోంది. నాస్తిక హేతువాదాలు, ద్రవిడ వాదం తమిళనాడులో అధికారంలోకి కూడా వచ్చాయి. జాతుల సమస్యల రాష్ట్రాల పునర్ విభజన రూపంలో కొంత పరిష్కరించబడి మరికొంత యిప్పటికీ రగులుతూనే ఉంది. జార్ఖండ్, గోర్ఖాలాండ్, ఈశాన్య రాష్ట్రాలు, ప్రత్యేక తెలంగాణ, ఉత్తరఖండ, ఖలిస్తాన్, గోండ్వానా మొదలైన ఎన్నో రూపాల్లో కొనసాగుతూనే ఉంది. గిరిజన సమస్య పరిష్కరించబడకపోగా అది జాతుల సమస్య రూపంలోకి, పోరాటాల రూపంలోకి మలుపు తీసుకుంటున్నది. జాతీయోద్యమం నుండి నేటిదాకా కొనసాగుతున్న పరిణామాలివి.

మిత్రులే గాయం చేస్తారు. శత్రువులతో నైతే డాలు, కత్తి వెంట వుంటాయి. మిత్రుల దగ్గరికి నిరాయుధంగా వెళతాము. నిర్మల హృదయంతో వెళతాము. హృదయం తెరిచి వుంచి వెళతాము. అందుకే మిత్రులు గాయం చేయడం సులభంగా జరుగుతుంది. హిందుత్వవాదులు, హిందూ అగ్రవర్ణాలు, వామ పక్షవాదులు మిత్రులు అనుకొని హృదయం తెరిచిఉంచి శూద్రులు వెళ్ళి గాయపడు తున్నారు. జెండాలు మోస్తున్నారు. శూద్ర నాయకులను కార్యకర్తలుగా మార్చడం వారి ప్రత్యేకత. అగ్రవర్ణ కార్యకర్తలను నాయకులుగా ఎదిగించడం వారి విశిష్ఠత.

## ఆర్య త్రైవర్ణికులు దోపిడీ వర్గాలు

భారతదేశం కులాల సమాజం అని కొందరు, వర్గ సమాజం అని కొందరు, మతాల కూడలి సమాజం అని కొందరు, హిందూ సమాజం అని కొందరు అంటుంటారు. కులాల సమాజమైతే ఆర్యత్రైవర్ణిక బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలు, కులాలు, దోపిడీ వర్గాలు, శూద్రులు, పంచములు పీడిత ప్రజలు. వర్గసమాజమైతే



శూద్రులు, పంచములు పునాది, ఉత్పత్తి శక్తులు ఉత్పత్తి సాధనాలు – అగ్రవర్ణాలు, దోపిడీ వర్గాలు, ఉపరితల అంశం. హిందూ సమాజమైతే శూద్రులు, పంచములు పునాది. ఆర్య త్రైవర్ణికులు ఉపరితలం.

ఆర్యత్రైవర్ణికులు వెనుకటి కాలం బాగుండే అని అంటారు. వారు దోపిడీ చేస్తే సాగిన కాలం అది. వెనుకటి కాలం బాగుండేదైతే వారికి ఒక మాట చెప్పాలి. నేటి ఆధునిక విద్య, వైద్యం, విద్యుత్, రవాణా సాధనాలు, కారు, బస్సు, రైలు, విమానం, సిమెంట్, పెట్రోలు, డీజిల్, బ్యాంక్‌లు, ఇన్సూరెన్స్ కంపెనీలు, మిల్లు బట్టలు, పరిశ్రమల ఉత్పత్తులు, రేడియో, సినిమా, టీవీ, మైకు, పత్రికలు, అచ్చు పుస్తకాలు మొదలైనవన్నీ వాటితో సంబంధితమైనన్నీ వదిలివేసి జీవితంలో అవి లేకుండా ఎడ్లబండి, గుర్రం సవారీ, ఆముదపు దీపం, కిర్రు చెప్పులు, దోతీ పంచె, నల్లా నీళ్ళు లేకుండా బావి, చెరువు, కాలువ నీళ్ళను తాగుతూ కుండలో వంటతో గుడిసెలో లేదా పెంకుటింటిలో వుంటూ అల్లోపతి వైద్యం వదిలివేసి ఆయుర్వేదంతో బతకాలి. అలా బతుకుతూ అదే బాగుందని చెప్పాలి. ఆధునిక సౌకర్యాలన్నీ వాడుకుంటూ వెనుకటి కాలం బాగుండేదనటం దేనికి? దోపిడీ కోసం! దోపిడి చేయడానికి ఇదొక సిద్ధాంత మద్దతు. అగ్రవర్ణాల మాట చెల్లుబాటు కావడానికి వాళ్ళు హాయిగా బతకడానికి పుట్టించిన మాట ఇది. వాళ్ళు అది నిజంగా నమ్మేదైతే ఆర్‌ఎస్‌ఎస్ బిజెపి హిందుత్వ వాదులు ఇవన్నీ వదిలివేసి ప్రాచీన జీవితం జీవించి ఇతరులకు ఆదర్శవంతంగా వుండటం అవసరం అని శూద్రులు చెప్పాలి.

భారతదేశంలోకి విదేశీయులు కాబూల్‌మీదుగా భూమార్గాన ప్రవేశించిన క్రమం వల్ల ఉత్తర ప్రాంతాలు సైనిక యుద్ధ, రాజకీయ కేంద్రాలుగా నిలదొక్కుకునే క్రమంలో దక్షిణాదిపై పెత్తనం చెలాయించడం మొదలైంది. ఆర్యుల, ముస్లింల విస్తరణ సాగింది. యూరపు వారి ప్రవేశం సముద్ర మార్గాల గుండా పశ్చిమ, తూర్పు, ఉత్తర, దక్షిణ సముద్రతీర ప్రాంతాల ద్వారా జరిగింది. కలకత్తా, బొంబాయి, సూరత్, ఢాకా, మద్రాసు, గోవా వంటి ప్రాంతాలు వారి కేంద్రాలయ్యాయి.

యూరపు వారి వ్యాపారానికి, వలసలకు ప్రయాణ మార్గాలు సముద్రానికి అభిముఖంగా ఉండాలి. నౌకాశ్రయాలకు బెస్తలు ఎంతో అవసరం. నౌకల నిర్మాణానికి, రోడ్లకు, రైలు పట్టాలకు శ్రామిక కులాలు, వారి పశువులు అవసరం. ఇలా యూరపు వారి సంబంధంలోకి మొదట వచ్చినవి శూద్ర కులాలే. యూరపు వారితోసంపర్కంలో వీరు కొత్త జ్ఞానంలోకి ప్రవేశించారు.వారికి సహకరించిన శ్రామికకులాల నుండి వ్యాపార వేత్తలు దుబాసీలు కొంత ఎదిగారు. తద్వారా స్థానిక శ్రామిక కులాల నుండి వలస వాదుల ప్రాపకంతో ఒక కొత్త వర్గం రూపొందడం ఎదగడం ప్రారంభమైంది.

దాంతో మడీగిడి అంటూ సముద్రం అంటూ ముట్టూ, అంటూ కూర్చున్న వర్ణవాదులు రంగం మీదకు వచ్చారు. అవకాశాలు లాక్కున్నారు. శ్రామిక కులాలు వెనుకబడిపోయాయి. అయితే యిక్కడ మనం వేసికోవాల్సిన ప్రశ్న ఏమంటే మొదట ఎదిగిన శ్రామికకులాలు శ్రేణులు ఏమైపోయాయి. వాటి చరిత్ర ఎందుకు అడుగున పడిపోయింది? వారి నుండి ఎదగాల్సిన శ్రామిక కులాల నూతన బూర్జువా వర్గదృక్పథం ఏమైపోయింది? అది ఎదిగినా అణచివేయబడిందా? అసలు ఎదగలేదా? ఇంతదాకా యూరపు వలసలతో, నౌకాశ్రయాలతో ఎదిగిన అగ్రకుల బూర్జువా వర్గం గురించే చెప్తున్నారుగానీ, శూద్ర శ్రామిక కులాల నుండి ఎదగాల్సిన పారిశ్రామిక వేత్తల గురించి గానీ, వారు తిరిగి రాజకీయ అధికారంలోకి రావడం గురించి గానీ పట్టించుకోవడం లేదు. అది బీసీలే స్వయంగా చేయాల్సిన కృషి.

పైన చెప్పిన ఆరేడు సామాజిక సిద్ధాంతాల్లో నాలుగైదు సిద్ధాంతాలు ఈ నౌకాస్థావరాలు, వాటి వ్యాపార మార్గాల, ప్రాంతాల నుండే వచ్చాయి. అఖండ భారతదేశ పటాన్ని ఒకసారి పరికించి చూస్తే ఈ విషయం స్పష్టమవుతుంది. పంజాబ్ బెంగాల్‌ల నుండి ముస్లిం జాతీయవాదం, బెంగాల్ పంజాబీ జాతీయవాదాలు కమ్యూనిజాన్ని ఆదరించడం పుట్టాయి. బొంబాయి రాష్ట్రం నుండి పూలే, అంబేద్కర్‌ల శ్రామిక కులాల వాదం, ఆరెస్సెస్ హిందూ అగ్రకుల, జాతీయ వాదం, తిలక్ గాంధీలు వచ్చారు. మద్రాసు నుండి పెరియార్ రామస్వామి, నాస్తిక హేతువాదం, ద్రవిడ వాదం, కేరళ నుండి నారాయణగురు మొదలైన వారు ముందుకు వచ్చారు.

బొంబాయి, మద్రాసు, కేరళ ప్రాంతాల నుండి పూలే, అంబేద్కర్, నారాయణగురు, పెరియార్ రామస్వామి వంటి శ్రామిక కులాల జాతుల వాదం ఎదిగినట్టుగా, పంజాబ్, బెంగాల్, ఢాకా ప్రాంతాల నుండి స్థానిక శ్రామిక కులాల జాతుల వాదం, గానీ శ్రామిక కులాల జాతీయ బూర్జువా వర్గవాదం ఏమైంది? ఈ ప్రశ్నకు జవాబు చరిత్ర నుండి తవ్వి తీయడం ద్వారానే జాతీయోద్యమ కాలంలో జాతీయోద్యమం పేరిట శ్రామిక కులాల తాత్విక సిద్ధాంతాల అణచివేత, ఎలా కొనసాగిందో, అందుకు వర్ణవాద మార్క్సిజం ఒక సాధనంగా ఎలా ఉపయోగపడిందో తేటతెల్లం అవుతుంది.

ఇది దక్షిణాదివారి దృష్టిలో భారతీయ చరిత్ర. ఇది శూద్రులుగా చేర్చబడ్డవారి చరిత్ర. ఇది మనుషులను మానవతా వాదులుగా మలిచిన వారి చరిత్ర.

**శూద్రుల, బీసీల లక్ష్యం తిరిగి పాలకులుగా రాజ్యాధికారాన్ని చేపట్టడం. అందుకు దీర్ఘకాలిక ప్రణాళిక అవసరం. దీనికై బీసీలకు రాజకీయ అధికారం ఎలా సాధించుకోవాలో బీసీలకు రాజకీయ అధికారం అనే గ్రంథం దీనికి చేర్పుగా వెలువరించడం జరిగింది. బీసీలు దాన్ని అధ్యయనం చేసి సొంత పార్టీలను నిర్మాణం చేసుకొని అధికారంలోకి రావడం వారి చారిత్రక కర్తవ్యం.**





# బీసీలకు అధికారం దీర్ఘకాలిక ప్రణాళిక

**సూర్య దినపత్రిక, 27.12.2007**

బీసీలు రాజకీయ అధికారంలోకి రావడం అంత తేలికైనట్టు చాలా మంది మాట్లాడుతుంటారు. అంగట్లో వున్నవన్నీ మనవే అని పిల్లలు హటం చేసిన స్థాయిలో బీసీ నాయకులు, బీసీ ప్రజలు ప్రతి బీసీ, ఎస్సీల జాతర్లను మేళాలను బీసీల రాజకీయ చైతన్యంగా భ్రమపడుతున్నారు. అవన్నీ అగ్రకులాల పార్టీలు వ్యూహాత్మకంగా కొన్ని బీసీ, ఎస్సీ ముఖాలను ముందుకు తెచ్చి నడిపిస్తున్న వ్యవహారమే అని తెలియని వాళ్ళు రాజకీయాలు ఎలా చేయగలరు? అగ్ర కులాలు, ఇతర వర్గాలు అధికారాన్ని బీసీలకు పువ్వుల్లో పెట్టి అందిస్తారా? వాళ్ళు బీసీలు చేసే ప్రయత్నాలను బీసీ ప్రజల కన్నా ఎక్కువ లోతుగా, నిశితంగా పరిశీలిస్తూ అందుకు విరుగుడుగా వెంటది వెంట పావులు కదుపుతున్నారు. అందువల్ల ఎంతో దీర్ఘకాలిక దృష్టితో బీసీలు వ్యూహాత్మకంగా ముందుకు కదలడం అవసరం.

ఒక ఇల్లు కట్టాలంటే మొదట స్థలం కొనుకుంటారు. కొంత కాలం తరువాత ఇల్లు ప్రారంభిస్తారు. కనీసం 10-12 ఏళ్ళ ప్రణాళిక, పొదుపు ద్వారానే ఇల్లు కట్టుకుంటున్నారు. ఒక ఇల్లుకే ఇంత జాగ్రత్తగా ప్రణాళికా బద్ధంగా కృషి చేయాల్సి వున్నప్పుడు అనేక మంది, అనేక పార్టీలు, డబ్బు సంచులు, అధికారం రుచి మరిగిన కులాలు పోటీలో వున్నప్పుడు మరింకెంత జాగ్రత్తగా ప్రణాళిక, వ్యూహరచన చేసుకోవాలో బీసీలు అర్థం చేసుకోవడం అవసరం. డబ్బులు వున్న వాళ్ళు రెడీమేడ్ అపార్ట్‌మెంట్ కొనుక్కొంటారు. అలాగే అన్ని హంగులూ వున్న బీసీలు పార్టీ టికెట్లను ఏదో పార్టీలో కొనుక్కోవచ్చు. గెలవవచ్చు. స్వేచ్ఛా, సమానత్వం, రాజకీయ అధికారం అనేవి ఎంతో రిస్కుతో, దీర్ఘకాలిక లక్ష్యంతో ముందుకు సాగినప్పుడే సాధ్యం. కానీ డబ్బు సంచులు, అన్ని హంగులూ వున్న బీసీలు, ఎస్సీలు అవకాశ వాదంలో కూరుకు పోతారని, ఏదో పార్టీలో చేరి పోవాలని అనుకుంటారు తప్ప ఒక పార్టీ పెట్టాలని దీర్ఘకాలికంగా కృషి చేయాలని అనుకునే అవకాశం లేదు అని గుర్తించడం అవసరం.

బీసీలు అధికారంలోకి రావడానికి కనీసం 12 సంవత్సరాల ప్రణాళిక అవసరం. నేటి నుండి 12 సంవత్సరాల్లో మూడు ఎన్నికలు జరుగుతాయి. 12 ఏళ్ళల్లో వ్యూహాత్మకంగా ముందుకు సాగితే ఈ మూడు ఎన్నికల్లో మొదటిసారి, రెండవసారి క్రమ క్రమంగా బలమైన శక్తిగా ఎదుగుతూ మూడవసారి ఎన్నికల్లో బీసీలు అధికారంలోకి వస్తారు. అయితే సమస్త శక్తులను సమీకరిస్తే వచ్చే ఎన్నికల్లోనూ మెజార్టీ సాధించడం సాధ్యమే.

వాజ్‌పేయి అధికారంలోకి వచ్చాక ప్రతిపక్షాలు చేసే విమర్శలకు జవాబుగా అన్న ఒక మాట ఆదర్శంగా తీసుకోవడం అవసరం. మేము 40 ఏళ్ళు ప్రతిపక్షంలో వుండి అధికారం కోసం సహనంతో ఎదురుచూశాము. మీరు అధికారం నుండి ప్రతిపక్షంలోకి మారాక కనీసం ఐదేళ్ళు ప్రతిపక్షంలో వుండే ఓపిక లేకపోతే ఎలా? అని అన్నారు. సరిగ్గా బీసీ రాజకీయాలు అధికారంలోకి రావాలనే లక్ష్యం ఇంత సహనంతో కనీసం 12 ఏళ్ళ పాటు నిర్వహించడానికి, నాయకత్వం వహించడానికి సిద్ధంగా వుండే త్యాగపూరిత నాయకత్వం అవసరం.

భారతదేశంలో ఏ రాష్ట్రంలోనైనా అధికారంలోకి వచ్చిన కాంగ్రెసేతర పార్టీలను చూసుకుంటే అవి నిబద్ధతతో ఏళ్ళతరబడి పనిచేస్తూ క్రమ క్రమంగా బలం పుంజుకుని ప్రతిపక్షం నుండి అధికార పక్షంగా ఎదిగాయి. తమిళనాడులో డిఎంకె, ఉత్తరప్రదేశ్, బీహార్‌లలో లోహియా సోషలిస్టులు, పశ్చిమబెంగాల్‌లో మార్క్సిస్టులు 1967 నుండి అధికారంలోకి వస్తున్నారు. వారు అధికారంలోకి రావడానికి వెనుక దశాబ్దాల నిరంతర కృషి ఉంది. ఇదే పద్ధతిలో బిఎస్‌పి కూడా 1984లో ప్రారంభమై 1993లో అధికారంలోకి వచ్చింది. అది కూడా 68 శాసనసభ్యులతో మాత్రమే రావడం జరిగింది. పూర్తిస్థాయి మెజారిటీ 2007లో వచ్చింది. బిఎస్‌పి కూడా ఇలా పూర్తి మెజార్టీ రావడానికి 23 ఏళ్ళు పట్టింది. డిఎంకె, లోహియా సోషలిస్టులు అధికారంలోకి రావడానికి 1929 నుండి చేస్తున్న నిరంతర ద్రవిడ కజగం ఉద్యమం ద్వారా సుమారు 35 ఏళ్ళకు అధికారంలోకి రావడం జరిగింది. పశ్చిమబెంగాల్‌లో కూడా ఉమ్మడి కమ్యూనిస్టు పార్టీ చేసిన 30 ఏళ్ళ కృషి తరువాతే 1967లో అధికారంలోకి రావడం జరిగింది. అందువల్ల కనీసం 12 సంవత్సరాలు కృషి అవసరం.

రాష్ట్రంలో బీసీలు అధికారంలోకి రావాలంటే తెలంగాణ రాష్ట్ర ఉద్యమాన్ని సమర్ధిస్తూ ఆంధ్ర ప్రాంతంలోని బీసీలు ప్రత్యేక ఆంధ్రా రాష్ట్ర ఉద్యమాన్ని స్నేహపూరితంగా రెండు రాష్ట్రాలు ఏర్పడాలి అనే నినాదంతో ముందుకు వస్తే రాష్ట్ర రాజకీయాలు మలుపులు తిరుగుతాయి. కాంగ్రెస్, తెలుగుదేశం పార్టీలను ఓడించండి అనే రాజకీయ నినాదంతో ముందుకు సాగినప్పుడే బీసీలు ఒక పార్టీగా పునరేకీకరణ ప్రారంభమవుతుంది. ఇలా బీసీల ఉద్యమం, తెలంగాణ రాష్ట్ర ఉద్యమం, ఆంధ్రరాష్ట్ర ఉద్యమం మూడింటినీ సమానంగా కలుపుకుని ముందుకు సాగితే ఆ ఉద్యమాల్లోంచి నూతన నాయకత్వం ఎదుగుతుంది.

అయితే ఒక సిద్ధాంతం పునాదిగా ప్రజల శ్రేయస్సు లక్ష్యంగా త్యాగపూరిత స్వభావంతో ఉద్యమాలను, కార్యకర్తలను, నాయకులను తయారుచేసుకొనే రాజనీతిజ్ఞులు, మేధావులు మొదట పార్టీని నిర్మాణం చేసినప్పుడే అది దీర్ఘకాలికంగా ముందుకు సాగుతుంది.





# ఇంత జరిగినా వామపక్షాలు బలపడాలా?

**వార్త దినపత్రిక, డిసెంబర్ - 2007**

లాటిన్ అమెరికాలో, ఇతర దేశాల్లో కార్మిక ఉద్యమాలు వెల్లువెత్తుతున్నాయని కొందరు సంతోష పడుతున్నారు. రాష్ట్రంలో వామపక్షాలు అధికారంలోకి వస్తే బాగుండునని మరికొందరు ఆశపడుతూ అనేక సూచనలు చేస్తున్నారు. చావేజ్ ఇటీవల ఎన్నికల్లో హిట్లర్‌లాగ సంపూర్ణ అధికారాలు కోరుతూ ముందుకు వస్తే ప్రజలు తిరస్కరించారు. ఫెడల్ కాస్ట్రో 40 ఏళ్ళకు పైగా అధికారంలో ఉండి మరొకరిని అధికారంలోకి రాకుండా చూసి తిరిగి సహోదరులకే అవకాశం వచ్చేట్టు చేసిన రాజకీయం నెహ్రూ కుటుంబ రాజకీయాల కన్నా భిన్నమైనదా? హిట్లర్ రాజకీయాల కన్నా భిన్నమైనదా? భారతదేశంలో వామపక్షాలు అధికారంలోకి వస్తే ఏమిచేస్తాయో భావాలను, పత్రికా స్వేచ్ఛను, వాస్తవాలను ఎలా అణచివేయాలని చూస్తాయో పశ్చిమబెంగాల్‌లోని నందిగ్రాంలో జరిగిన సంఘటనలే సాక్ష్యం. వామపక్ష ప్రభుత్వం ప్రవర్తించిన తీరుకు, గుజరాత్‌లో నరేంద్రమోడీ ప్రవర్తించిన తీరుకు పోలికలే ఎక్కువ. ఇలాంటి వాళ్ళు రాష్ట్రంలో, కేంద్రంలో అధికారంలోకి వస్తే వాళ్ళ ప్రణాళికలను, భావాలను మాత్రమే ఆచరిస్తారు. మిగతా వాటిని, మిగతా వారిని అణచివేస్తారు. కనీసం భావప్రకటనకు కూడా అవకాశం ఇవ్వరు.

ఉదాహరణకు వామపక్షాల సిద్ధాంతాల్లో, ఎన్నికల ప్రణాళికల్లో, రాజకీయ తీర్మానాల్లో బీసీలకు చట్టసభల్లో, సైనిక, న్యాయ వ్యవస్థ రంగాలతో సహా అన్ని రంగాల్లో, ప్రయివేట్ రంగంలో రిజర్వేషన్లు వుండాలి అని కోరుతున్న బీసీల గురించి వ్యతిరేకిస్తూ వాటితో ఐక్యసంఘటన కట్టకూడదని కనీసం సీట్ల ఒప్పందం కూడా చేసుకోకూడదని, అలాంటి పార్టీలను, ఉద్యమాలను వ్యతిరేకించాలని స్పష్టంగా ప్రకటిస్తున్నారు. వెనుకబడిన ప్రాంతాల ప్రజలు తమ అభివృద్ధి కోసం, తమ అభ్యున్నతి కోసం, స్వీయ పరిపాలన కోసం, ఆత్మగౌరవం కోసం అభివృద్ధి చెందిన వలస వాదుల విస్తరణను అదుపు చేయడం కోసం కోరుతున్న తెలంగాణ రాష్ట్ర ఏర్పాటును, చిన్న రాష్ట్రాల ఆకాంక్షలను ఇప్పటికీ తీవ్రంగా వ్యతిరేకిస్తున్నారు.

ఇలాంటి వామపక్షాలు రాజకీయ అధికారంలోకి రావడం దేనికి? పైగా నల్గొండ

జిల్లాలో గత సంవత్సరం పర్యటించిన తరువాత ఈ వ్యాసకర్తకు వామపక్షాల పట్ల వున్న ఆకాస్త భ్రమలు కూడా పోయాయి. వామపక్షాలు వున్నచోట ఇతర ప్రాంతాల కన్నా ప్రజలు చైతన్యంలో, జీవన ప్రమాణంలో కాస్త మెరుగ్గా వుంటారని ఆశించడం సహజం. కానీ వామపక్షాలు అక్కడ ఎన్నికైన కాలంలోనే నాగార్జునసాగర్, శ్రీశైలం ప్రాజెక్టుల నుండి 20 లక్షల ఎకరాలకు నల్గొండ, మహబూబ్‌నగర్ జిల్లాలకు రావలసిన సాగునీటి కాలువలు రాకుండా చేయబడ్డాయి. దాన్ని రాజకీయంగా ప్రజలను సమీకరించి సాధించలేకపోయారు. పశ్చిమబెంగాల్‌లో కూడా ప్రజలు నగరాలను వదిలేస్తే మిగతా సగం జనాభా శ్రీకాకుళం, విజయనగరం, మహబూబ్‌నగర్, అదిలాబాద్ జిల్లాలోని ప్రజల లాగ వెనుకబడిన జీవితాలను జీవిస్తున్నారు. అందువల్ల వామపక్షాలు అధికారంలోకి రావాలని కోరుకోవడం దేనికి? వామపక్షాలు సాంప్రదాయక వాదులుగా కొనసాగడం వల్ల ఆధునిక పరిణామాలను పాతకాలం నాటి కళ్ళద్దాలతో చూస్తున్నారు. ప్రజలు ముందుకు సాగుతున్నారు. వామపక్షాలు వెనకబడిపోతున్నాయి.

వామపక్షాలు ప్రజల్ని రాజకీయంగా చైతన్యం చేసేదైతే, ప్రజల నుండి రాజకీయ నాయకత్వాన్ని తయారు చేసేదైతే ఎన్టీరామారావు, టిడిపి అధికారంలోకి ఎందుకు వచ్చేవి? కమ్మ, రెడ్డి కులల నాయకత్వానికి పరిమితం కావడం వల్ల ఏర్పడిన వామపక్షాల వైఫల్యం నుండే టిడిపి పుట్టుక జరిగింది. అలాగే టిఆర్ఎస్ కూడా వామపక్షాల వైఫల్యం నుండే పుట్టడం జరిగింది. తెలంగాణ ప్రజలకు వారి ఆకాంక్షలకు నాయకత్వం వహించేదైతే వామపక్షాలు తెలంగాణ రాష్ట్రాన్ని 1950 - 1970ల మధ్య ప్రతిసారీ కోరివుండేవి. ఇందుకు భిన్నంగా తెలంగాణ ప్రజలకు వ్యతిరేకంగానే ప్రవర్తించాయి. ఎవరి రక్తమాంసాలు, ఎవరి బలిదానాలు, ఎవరి త్యాగాలు వామపక్షాలకు చరిత్రను ఇచ్చాయో ఆ ప్రాంత ప్రజలకు వ్యతిరేకంగానే రాజకీయ సిద్ధాంతాలు కార్యక్రమాలు తీసుకుంటూ నడిచారు. ఇప్పటికీ సిపిఎం దీని నుంచి బయటపడక పోగా సమర్థించుకుంటున్నది. ఎందుకని దళిత బహుజనులే వామపక్ష నాయకత్వంలో ఉద్యమిస్తున్నప్పటికీ ఆ దళిత బహుజనులు నేటికీ ఈ పార్టీల నాయకత్వం బీసీ, ఎస్సీలకు గానీ, తెలంగాణ వారికి గానీ దక్కడం లేదు? ఇలాంటి వామపక్షాలు బలం పుంజుకోవడం రాష్ట్రంలోని ప్రజలకు మరింత అన్యాయం చేయడానికే పనికివస్తుంది.

ఇటీవల వామపక్షాలు భూమిపోరాటాలు నిర్వహించాయి. గత అరవై ఏళ్ళుగా భూమిపోరాటాలు నిర్వహిస్తూనే వున్నాయి. ఎన్నికల రాకకు ముందు, తెలంగాణ రాష్ట్ర ఉద్యమం వెల్లువెత్తినపుడు భూమి పోరాటాలు, ఇతర పోరాటాలు తీసుకోవడం వామపక్షాలు ప్రజల రాజకీయ, సామాజిక చైతన్యాన్ని దారిమళ్ళించడం కోసమే. వామపక్షాలు ఆర్థిక పోరాటాలు తీసుకుంటున్నాయి. ఆర్థిక పోరాటాలు ట్రేడ్ యూనియనిజంలో భాగమవుతాయి. ఆర్థిక పోరాటాలు ఎన్నడూ రాజకీయ చైతన్యంగా



భ్రమపడకూడదని రాజకీయ చైతన్యంతోనే ఉద్యమాలు నిర్మించాలని లెనిన్ చెప్పి 110 ఏళ్ళు అయిపోయింది. అయినా ఆర్థిక పోరాటాల ద్వారా రాజకీయ పార్టీ గెలవాలని అనుకోవడం భారతదేశంలో ముఖ్యంగా రాష్ట్రంలో మానడం లేదు. సరిచేసుకోవడం లేదు. ఆర్థిక పోరాటాల్లో కనీసం రాజకీయ చైతన్యాన్నైనా అందించడం లేదు. ఉదాహరణకు భూమి పోరాటాల్లో 60 గజాల ఇళ్ళస్థలాలైనా ఇవ్వాలి. లేదా అధికారం నుంచి తప్పుకోవాలి. మేమే అధికారంలోకి వచ్చి మేమే ఇళ్ళస్థలాలు సాధించుకుంటాము అనే తీరులో నినాదాలు రూపొందించలేకపోయారు. అనగా ప్రజల నుండి రాజకీయ నాయకత్వం ఎదిగించడానికి, చైతన్య పరచడానికి సిద్ధంగా లేరు. కేవలం పార్టీ నాయకులు మాత్రమే రాజకీయ నాయకులుగా ఎదగాలని అందుకు ఆర్థిక పోరాటాలు అవసరమైన ప్రజలు వామపక్ష నాయకత్వానికి మద్దతు ఇవ్వాలని, వారినే గెలిపించాలని కోరుకుంటున్నారని అర్థం. ఉద్యమాల నుండి నాయకత్వం ఎదుగుతుంది. దాన్ని విస్తరింపచేయాలి అనే అవగాహననే గాలికి వదిలేశారు. రాజకీయ నాయకత్వం ప్రజాసంఘాల నుండి ఎదిగిన వారి ద్వారా రావడం లేదు. కేవలం పార్టీ నాయకత్వమే రాజకీయ నాయకత్వంగా వస్తున్నది. అందువల్ల వామపక్షాలు తమ వెంట నడిచే ప్రజలకు కూడా రాజకీయ అధికారంలో భాగస్వామ్యం ఇవ్వడానికి సిద్ధంగా లేదని కేవలం ఆర్థిక పోరాటాలకు, డిమాండ్లను తీర్చడానికి మాత్రమే పరిమితం చేస్తారని వారి దశాబ్దాల ఆచరణ స్పష్టం చేస్తున్నది.

వామపక్షాలు ప్రజల నుండి, ప్రజల ఆకాంక్షల నుండి, ప్రజల పోరాటాల నుండి రాజకీయ నాయకత్వాన్ని ఎదిగించే ప్రయత్నం చేస్తే 1944 - 1956 నాటి వామపక్ష చైతన్యం విస్తరించి 1962 నుండే ఆంధ్రప్రదేశ్‌లో వామపక్షాలు అధికారంలోకి వచ్చి వుండేవి. పశ్చిమబెంగాల్‌లో 1967లో అధికారంలోకి రావడం అనేది ఆంధ్రప్రదేశ్‌లోని వామపక్షాలు అవమానంతో, అసమర్థతతో, సిగ్గుపడాల్సిన విషయం. ఎందుకంటే 1944 - 1956 నాటి ఉద్యమాలు అంత గొప్ప చైతన్యాన్ని తెచ్చాయి. ఆనాటికి పశ్చిమబెంగాల్‌లో ఉన్న వామపక్ష ఉద్యమం చాలా తక్కువ. 1944 - 1956 నాటి వామపక్ష చైతన్యం రాజకీయ చైతన్యంగా మారలేకపోయింది? ప్రజల నుండి వచ్చిన వారిని రాజకీయ నాయకులుగా ఎందుకు ఎదిగించలేకపోయారు? సినిమాల్లోకి వెళ్ళాలని ప్రజా నాట్యమండలి కళాకారులకు ఎందుకు సూచించారు? తెలంగాణలో తక్కువ ధరకు భూములు దొరుకుతాయి ఇక్కడ అమ్ముకుని తెలంగాణలో కొనుక్కొని వ్యవసాయం చేసుకోండి అని ఎందుకు వలస వాద విస్తరణ కార్యక్రమాన్ని ఇచ్చారు? ఎందుకు చిన్న చిన్న వ్యాపారాలు, ప్రెస్‌లు, పరిశ్రమలు మొదలైనవి పెట్టుకొని బతుకమని పూర్తికాలం పనిచేస్తామని జీవితాలను త్యాగం చేస్తామని వచ్చిన కార్యకర్తలను, ప్రజలను తిరిగి సాదా జీవితంలోకి పంపించారు? రాజకీయ చైతన్యంతో వారందరినీ రాజకీయ నాయకులుగా ఎందుకు విస్తరింపచేయలేదు? ఆంధ్ర వలస వాదులను విస్తరింపచేయడానికి మాత్రమే ఎందుకు పరిమితమయ్యారు?

ఇదంతా దేన్ని తెలియజేస్తున్నది? ఒకటి. ప్రజలను రాజకీయ నాయకులుగా మార్చడానికి సిద్ధంగా లేకపోవడం. రెండు. తెలంగాణ ప్రాంతం నుండి వచ్చిన చైతన్యాన్ని ఆంధ్ర ప్రాంతానికి విస్తరింప చేయడానికి నిరాకరించడం. మూడు. కోస్తాంధ్ర కమ్మ, రెడ్డి కులాల వలస వాదానికి, తెలంగాణలోకి విస్తరించడానికి పరిమితం కావడం. అందుకే కమ్మ, రెడ్డి కలసి కామ్రేడ్ అయిందని 1960లోనే సామెత పుట్టింది.

ఇలా గత అరవై ఏళ్ళుగా వామపక్షాలు తాము ఉద్యమాల్లోకి సమీకరించే ప్రజలకు రాజకీయ చైతన్యాన్ని అందిస్తూ రాజకీయ అధికారాన్ని పొందండి, సాధించుకోండి అని చెప్పడానికి సిద్ధంగా లేరని అర్థం. అనగా ప్రజలకు రాజకీయ అధికారాన్ని అందులో భాగస్వామ్యాన్ని ఇవ్వడానికి వామపక్ష పార్టీలు సిద్ధంగా లేవు. అయితే అవి అధికారం అందుకోవడానికి కూడా మానసికంగా సిద్ధంగా లేవు. ఎలాగంటే వామపక్షాలు అలా చేయాలి, ఇలా చేయాలి అని డిమాండ్ చేయడం లోనే ఇతరులను అధికారంలో వుండాలని కోరుకోవడం వున్నది. అది చేస్తాం, ఇది చేస్తాం అనడానికి వారి నాలిక తిరగదు. అలా చేస్తాం, ఇలా చేస్తాం అని చెప్పేవాళ్ళే రాజకీయ నాయకులు. కానీ వీరి నాలిక అది చేయాలి, ఇది చేయాలి అనే పలుకుతుంది. అది చేస్తాం, ఇది చేస్తాం అని అనడం ద్వారా రాజకీయ అధికారంలోకి వస్తాం, రావడానికి అవకాశం ఇవ్వండి అనే భావన వుంటుంది. ఈ విషయం వామపక్షాలకు ఇప్పటికీ అర్థం కాలేదు. అనగా రాష్ట్రంలోని వామపక్షాలు రాజకీయ అధికారం సాధించుకోవాలని ఏకోశానా కోరుకోవడం లేదని దీని అర్థం. వారికే లేని కోరికను ఇతరులు కోరడం దేనికి?

వామపక్షాలు ఎదగాలని కోరడం బీసీలను, ఎస్సీలను వారి రాజకీయ పార్టీ నిర్మాణ ప్రయత్నాలను, తెలంగాణ రాష్ట్ర ఏర్పాటు ప్రయత్నాలను వమ్ము చేసే ప్రయత్నాలే అవుతాయి. ప్రపంచ కార్మికులారా ఏకంకండి అని పిలుపునిస్తూనే వందలాది పార్టీలుగా చీలిపోయిన వామపక్షాలు ఏ ఆదర్శాలను ప్రజలకు అందించగలవు? చీలిపోయిన రెండు పార్టీలు కనీస కార్యక్రమం మీద కలసి పనిచేయలేక పోతున్నారు. అలాంటి వాళ్ళు ఆంధ్రా, తెలంగాణ రాష్ట్రాలు మాత్రం కలసి ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంగానే కలసి వుండాలని కోరుతున్నారు. ఇలాంటి వాళ్ళు ఎదిగితే రాష్ట్రంలోని, దేశంలోని దళిత బహుజన వర్గాలకు ఆర్థిక సౌజన్యం పెరుగవచ్చునేమో గానీ, స్వేచ్ఛా సమానత్వం, రాజకీయ నాయకత్వం పెరిగే అవకాశం లేదు. అందువల్ల ఆనాడు డా॥ బి.ఆర్.అంబేద్కర్ వేసిన ప్రశ్న తిరిగి మన ఎదుట నిలుస్తుంది. వామపక్షాలు బీసీ, ఎస్సీ, ఎస్టీల నాయకత్వంలో సమస్త కుల, వర్గ, ప్రాంత, జాతి, భాష, దేశ, లింగ, వివక్షతలకు అసమానతలకు వ్యతిరేకంగా, స్వేచ్ఛా సమానత్వం పునాదిగా స్వయం నిర్ణయాధికార చిన్న రాష్ట్రాల ఏర్పాటును సమర్థిస్తూ, ఆయా సామాజిక వర్గాల ఉనికిని గుర్తిస్తూ వాటి నాయకత్వమే తమ నాయకత్వంగా పరిణామం చెందాల్సి వుంటుందని గుర్తించినప్పుడే అవి భారతదేశంలో, రాష్ట్రంలో రాజకీయ అధికారానికి పోటీ పడగలిగే స్థాయి వస్తుంది.



శతాబ్దాల క్రితమే శూద్రుల టెక్నాలజీ ఎంత గొప్పగా వికసించిందో తెలిపిన నోబుల్ బహుమతి గ్రహీత రాబర్ట్ కర్ల్ ప్రసంగం హిందూ దినపత్రిక నుండి

# 'Indians used nano materials long ago'

## Carbon nanotechnology much older than carbon nano science : Nobel Laureate

Hyderabad: Nanotechnology might be of raging interest to scientists world over now. But Indians had used nano materials in the 6th century "unwittingly" and enabled Arab blacksmiths in making 'Damascus steel sword' which was stronger and sharper.

Delivering a talk on 'The contributions of elemental carbon to the development of nano science and technology' at the Indian Institute of Chemical Technology (IICT) here on Monday and interacting with the media, Nobel laureate Robert F. Curl said that carbon nanotechnology was much older than carbon nano science, For the Damascuas sword, Indians produced the raw material - mined iron ore and exported it. He said that up to the middle of 18th century, the steel swords depended on this particular material and when the mines in India stopped, "they lost the technology." The Damascus sword when subjected to scrutiny by an electron microscope in 2006 had shown to contain large amounts of nanotubes. Similarly, glass materials produced in the Roman time had nano materials. He said the glass was covered with nano particles of gold and silver. He said the people were using such materials without understanding what they were doing for a long time.

Prof. Curl shared the Nobel Prize in Chemistry in 1996 for discovery of fullerenes along with Richard Smalley and Harold Kroto. Replying to a question about the use of nano materials in facial creams, he wondered whether they made any difference. Asked whether he approved of their use, he replied that he did not approve of using chemicals which were not thoroughly evaluated. "I feel with new materials, you have to be careful." Asked about the discovery of fullerenes, he said "this was all a lucky accident."

Prof. Curl was later given the 'Lifetime Achievement Award in Science' instituted by B.M. Birla Science Centre. The Noble laureate gave away prizes to six young scientists.

**The Hindu Daily, Hyderabad, 1.1.2008**

# సంప్రదించిన ఇంగ్లీషు పుస్తకాలు

ఏన్సెంట్ ఇండియా – డి.ఎన్. ఝా, 2004
లోకాయత – దేవీప్రసాద్ చటోపాధ్యాయ 1992
ది బుద్ధాస్ ఏన్సెంట్ పాత్ – తేరా పియదస్సే 1987
ప్రి సాతవాహన కాయినేజ్ ఆఫ్ ఆంధ్రా – ప్రొ॥ డి. రాజారెడ్డి –2007
వాట్ ఈజ్ లివింగ్ వాటీజ్ డెడ్ ఇన్ ఇండియన్ ఫిలాసఫీ –దేవీప్రసాద్ 1976
ఏన్సెంట్ ఇండియన్ హిస్టరీ – ఏన్ ఇంట్రోడక్షన్
– డి.డి. కోశాంబి – రొమిల్లా థాపర్, బిపిన్ చంద్ర
టెంపుల్స్ ఆఫ్ సౌత్ ఇండియా – డా ॥ జె. రమణయ్య – 1985
ది హిస్టరీ ఆఫ్ ఎడుకేషన్ ఇన్ ఎన్సెంట్ ఇండియా – సురేష్‌చంద్రఘోష్ – 2001
ద్రవిడియన్ కిన్‌షిప్ – థామస్ ఆర్ ట్రవుట్‌మెన్ – 1995
మిలీనియమ్ టెస్ట్ భారతీయ సుడెన్స్ ఆఫ్ హిస్టరీ – శ్రీరాంసాఠే –2000 ఎడి
ఓవర్ 300 గ్రేట్ లైవ్స్ – అజయ్‌కుమార్ కోఠార్స్, వి.ఎం. శర్మ – 2006
కబీర్ – వీవర్ ఆఫ్ ది గాడ్స్ నేమ్ – వి.కే. సేఠీ – 1984
స్టోరీ ఆఫ్ ఎయిట్ సెయింట్స్ రీఫార్మర్స్ – ఎ. పద్మనాభన్ – 1999
పెరియారానా ఇంగ్లీషు అనువాదం : ప్రొ॥ ఎం. ధర్మలింగం
మదర్ గాడెసెస్ – పప్పుల్ జయాకర్
ఇండియన్ సొసైటీ – ఇ.కె. కర్ – 2004
The Wisdom of India - Lin Yutang Latest Edition: 1966
A New Renaissance - Sibnarayan Ray 1998
Sri Sailam, Its History and Cult - P.V.Parabrahma Sastry1990
Social Roots of Religion in Ancient India
- Ramendra Nath Nandi
Political and Social Thought of the Buddhist Writers
- K.B. Krishna
Bhuddhist Logic - TH. Stcherbatsky 1935, Latest Edition: 2000
The Dialectics of Nagarjuna - Dr. Ramendra Nath Ghose
Debrahmanising History - Braj Ranjan Mani



2500 Years of Buddhism - Prof. P.V.Bapat
Buddhist Philosophy in Theory and Practic
- Herbert V. Guenther, 1972.
History of Education In India - Suresh C.Ghosh 2007
A Text Book of Historiography 500 BC to AD 2000
- E. Sreedharam, 2005
Hindu Temples What happened to them - Sita Ram Goel, 2000
The Chalukya and Kakatiya Temples - J.Ramanaiah 1989
Delhi and its Neighbourhood 2001

# సంప్రదించిన తెలుగు, హిందీ పుస్తకాలు

భారత చరిత్ర – డి.డి. కోశాంబి 2004
హిందూ మహాయుగము (ఇండియన్ హిస్టరీ) – కొమర్రాజు వెంకటలక్ష్మణరావు
(ప్రథమ ముద్రణ–1907 లేటెస్ట్ ముద్రణ–2002)
మహమ్మదీయ మహాయుగము – కొమర్రాజు వెంకట లక్ష్మణరావు
(ప్రథమ ముద్రణ–1907 లేటెస్ట్ ముద్రణ–2004)
శూద్రవర్ణం ఎలా పుట్టింది – ఆర్.యస్.శర్మ 2003)
ప్రాచీన భారతదేశ చరిత్ర – డి.డి. కోశాంబి పరిచయం– కె. బాలగోపాల్
హిందూ జాతి నిజ చరిత్ర – శ్రీ శ్రీరాంసాఠే, 2004
భారతదేశము–ప్రజలు సంగీత వాయిద్యాలు – బి.సి. దేవ, 1994
ఆధునిక ప్రపంచ చరిత్ర – భారతదేశ చరిత్రలో ముఖ్య ఘట్టాలు
–డా॥ వి. రామకృష్ణారెడ్డి, (1994)
ఏది చరిత్ర? – ఎం.వి.ఆర్. శాస్త్రి, 2003
ఇదీ చరిత్ర – ఎం.వి.ఆర్. శాస్త్రి, 2005
చరిత్ర అంటే ఏమిటి? – ఇ.హెచ్.కార్, 1994
ఇతిహాస చక్రం – రామ్ మనోహర్ లోహియా
ప్రపంచ చరిత్ర – క్రిస్ బ్రేజియర్, 2004

చరిత్రలో ఏం జరిగింది? -గార్డన్ చైల్డ్, 2005
ఇండియాలో సామాజిక పరిణామం ఒక పరిశీలన -(ప్రొ॥కె.యస్.చలం 2000
ప్రాచీన భారత విశ్వ విద్యాలయములు - ఎ. నమ్మళ్వార్ 1953, 2005
తెలుగులో భక్తి కవిత్వం సామాజిక విశ్లేషణ - డా॥పిల్లలమర్రి రాములు, 1999
ఆంధ్రుల సాంఘిక చరిత్ర - సురవరం ప్రతాపరెడ్డి
జనకథ - రాంభట్ల కృష్ణమూర్తి 1997
బహుజనతత్వం - బి.యస్. రాములు
బీసీ, ఎస్సీ, ఎస్టీ విద్యార్థి యువజనులారా - బి.యస్. రాములు
ప్రవహించే పాట ఆం.ప్ర.దళిత పాటలు - విశాల సాహితి, 1996
బీసీ, ఎస్సీల పాటలు - విశాల సాహితి, 2004
బీసీలు ఏం చేయాలి? - బి.ఎస్. రాములు
అంబేద్కరిజం, సోషలిజం - బి.ఎస్. రాములు, 1996
గతితర్కం, అంబేద్కరిజం, మార్క్సిజం - బి.ఎస్. రాములు, 1993
గతితర్క తత్వదర్శన భూమిక - బి.ఎస్. రాములు, 1991
సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి - బి.ఎస్. రాములు, 2004
సమగ్ర సామాజిక కథ 50 ఏళ్ళ తెలుగుకథ తీరుతెన్నులు - బి.ఎస్. రాములు
ప్రేమ అంటే ఏమిటి? - బి.ఎస్. రాములు, 1996
భారతీయ సమాజం నేటి రాజకీయ సామాజిక పరిణామాలు - బి.ఎస్. రాములు
శుక్రనీతి (హిందీ, పాళీ, సంస్కృతం) - డా॥ జగదీశ్చంద్ర మిశ్రా, 1998
భారత్ కే సామాజిక క్రాంతికారి - దేవేంద్రకుమార్ బైసంతరీ, 2001
వేదవాఙ్మయము - తిరుమల శ్రీనివాసశర్మ - 1953
ప్రాచీన భారతదేశ చరిత్ర - డి.డి. కోశాంబి పరిచయం - కె. బాలగోపాల్
ప్రపంచ ప్రజల చరిత్ర - క్రిస్ హర్మాన్ - 2006
హిందూజాతి నిజచరిత్ర - శ్రీరాంసాఠే - 2004
సమగ్ర భారత చరిత్ర ప్రాచీన యుగం - కె. కృష్ణారెడ్డి - 2007



భారతీయ గ్రామము - ఎస్.సి. దూబె - 1974
శూద్రులు - ఆర్యులు - డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్
విశ్వమంతటా విస్తరించిన ప్రాచీన భారతీయ సంస్కృతి -శ్రీరామ్‌సాఠే -1998
ఆంధ్రుల సంస్కృతి - చరిత్ర 1, 2 - కంభంపాటి సత్యనారాయణ, 1998
పెళ్ళి దాని పుట్టు పూర్వోత్తరాలు - తాపీ ధర్మారావు, 1996
దేవాలయాల మీద బూతుబొమ్మలెందుకు? - తాపీ ధర్మారావు, 1998
ఆది శంకరాచార్య వ్యక్తిత్వం - తత్వం - రావిపూడి వెంకటాద్రి, 1991
శివకవుల రచనలు-సమాజం - నడుపల్లి శ్రీరామరాజు,1991
శివాజీ - సేతుమాధవరావు ఎస్. పగడి, 2000
ఆది భారతీయుల చరిత్ర - డా॥ కె. లక్ష్మీనారాయణ, 2007
ఇస్లాం అంటే.... - డా॥ క్రాంతికార్, 2003
దళిత తంత్రము - దుర్గం సుబ్బారావు, పందిరి అంజయ్య, 2005
ఆంధ్రుల చరిత్ర - డా॥ బి.యస్.యల్.హనుమంతరావు, 2003
జోగినీ వ్యవస్థ - వకుళాభరణం లలిత, 2007
రామానుజాచార్యులు - ఆర్. పార్థసారథి, 1991
ఆధునిక ఆంధ్రప్రదేశ్ చరిత్ర - పి. రఘునాథరావు, 2005
కాలగమనములో కోనసముద్రం - డా॥ జె. రమణయ్య, డా॥ ఎస్. జై.కిషన్
కాకతీయ సౌరభం - కుందవరం - వంగా నర్సయ్య, 2006
బంజారాల చరిత్ర - రామావత్ కుసుమకుమారి, 2006
కాకతీయుల కాలం నాటి సామాజిక జీవితం - మలయశ్రీ, 1990
కాకతీయ వైభవతోరణాలు - డా॥ పోలవరపు హైమవతి, 2005
ప్రాక్పశ్చిమ దర్శనాలు - రాహుల్ సాంకృత్యాయన్, 1987
మాదిగవారి చరిత్ర - తాళ్లూరి లాబన్ బాబు, 2005
మరుగునపడ్డ వారసత్వం - ఎస్.కె. పాండియన్, 1989
సంస్కృత సాహిత్య చరిత్ర - డా॥ ముదిగంటి గోపాలరెడ్డి, సుజాతారెడ్డి
కులాల సమస్య - డా॥ రామమనోహర్ లోహియా, 1989
పురాణాలు-కుల వ్యవస్థ-3 షట్చక్రవర్తులు - డా॥ విజయభారతి, 2003

రామాయణం (యదార్థ పరిశీలన) - పెరియార్ ఇ.వి. రామస్వామి, 1995
నరబలి - సి.వి. 1970, లేటెస్ట్ ముద్రణ : 1993
మన జానపద సంగీతం-పుట్టు పూర్వోత్తరాలు - వింజమూరి సీతాదేవి 2004
మహాత్మా జోతిరావ్ ఫులే - డాక్టర్ బి. విజయభారతి, 1996
ఆంధ్రదేశం మతపరిణామాలు - భట్టిప్రోలు హనుమంతరావు, 2005
చార్వాకుల కథలు - రావిపూడి వెంకటాద్రి, 1986
జమీందారీ వ్యతిరేకోద్యమ సాహిత్యం - కందుల పవన్ చౌదరి, 1995
తెలంగాణ ఆంధ్రోద్యమము - మాడపాటి హనుమంతరావు, 1995
పితృస్వామ్య వ్యవస్థలో స్త్రీ -డా॥ కత్తి పద్మారావు, 2003
భారతీయ సాహిత్యంలో స్త్రీ -డా॥ కత్తి పద్మారావు, 1996
దళితుల చరిత్ర -డా॥ కత్తి పద్మారావు, 1999
జాతీయ భారతదేశ చరిత్రలో వక్రీకరణలు - ఎన్.ఎస్. రాజారాం, 2001
చరిత్రలో మతాలు - సెర్గియ్ తొకరెవ్, 2005
ఋగ్వేద ఆర్యులు - రాహుల్ సాంకృత్యాయన్, 1990
ఆదిగురువు ఆచార్య చండాల - బొనిగల రామారావు, 2005
శాంతిదేవుని బోధిచర్యావతారం - ఈశ్వరవాక రామలింగారెడ్డి, 1998
హిందూ జాగృతి శాపమా? వరమా? - శ్రీరామ్‌సాఠే, 1990
ఆధునిక భారత చరిత్ర - బిపిన్ చంద్ర , 2005
తెలుగునాట సాంస్కృతిక పునరుజ్జీవనోద్యమాలు - డా॥ వి. వీరాచారి, 1993
ఆంధ్రదేశంలో జైన, బౌద్ధ మతాలు - డా॥ బి.యస్.యల్.హనుమంతరావు
ప్రాచీన భారతదేశ సంస్కృతి, నాగరికత - డి.డి.కోశాంబి, 2004
కాకతీయ సంచిక - డా॥ మారేమండ రామారావు 1935, 2000
ఆంధ్రుల సంక్షిప్త చరిత్ర - ఏటుకూరు బలరామమూర్తి, 2002
భారత్ మే సాంప్రదాయికత - అస్గరలీ ఇంజనీర్, 2007
కౌటిల్యుని అర్థశాస్త్రం - మామిడిపూడి వెంకటరంగయ్య, 1981
పాంచజన్యం - శ్రీ గురూజీ ,1986



సంత్ కవి రవిదాస్ ఔర్ ఉన్‌కీ సామాజిక చేతన - జగదీశ్‌చంరద సితారా
సంత్ రైదాస్‌కా నిర్వర్ణ సంప్రదాయ - డా॥ ధర్మవీర్,1990
బుద్ధదర్శనం - నారద మహాథేరా, 2004
మానవుడే చరిత్ర నిర్మాత - గార్డన్ చైల్డ్ 2004
సంక్షిప్త ప్రపంచచరిత్ర -తల్లాప్రగడ సత్యనారాయణమూర్తి, 2004
చరిత్ర ఖజానా - నాణాల్లో చరిత్ర - డా॥ డి. రాజారెడ్డి 2006
ఆర్యులెవరు? - శ్రీ రాంసాఠే, 1991
బుద్ధ ఔర్ ఉన్‌కా సమకాలీన భిక్షు - డా॥ భదంళ్‌సామంగే, మేథంకర్
తెలుగు భాషా చరిత్ర - డా॥ వెలమల సిమ్మన్న
హిందూమతతత్వం ఒక పరిశీలన - రామసాహెబ్ కస్బే
దశావతారాలు - డా॥ విజయభారతి, 2003
కొమర్రాజు లక్ష్మణరావు - బుదరాజు రాధాకృష్ణ, 2004
సింధునాగరికత - సి.వి., 1982
విజ్ఞాన శాస్త్రం - మనిషి విస్తరణ - జె.డి. బర్నాల్, 1995
వేధభూమి కాదు నాగభూమి - కొత్త శివమూర్తి
తరతరాల గుట్టు - కొత్త శివమూర్తి
మన లిపి పుట్టు పూర్వోత్తరాలు - తిరుమల రామచంద్ర, 1993
చరిత్ర సామాజిక ఆర్థిక రాజకీయ తత్వక దృక్పథాలు - వి.జి.ఆర్ నారగోని
కరీంనగర్ జిల్లా చరిత్ర సంస్కృతి - డా॥ జె. రమణయ్య, 2004
ఈ శతాబ్ది బీసీ వాదం - కె. కొండలరావు, 2006
బీసీలకు రాజకీయ అధికారం - బి.యస్. రాములు, 2007
భారతీయ లౌకికవాదం నూతన పోకడలు - ఆచార్య కె.యస్. చలం-2005
బీ.సీ.ల భారతం - మణ్యం కుమారి మూర్తి - 1995
ఆచార్య నాగార్జునుడు - అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి - 2007
బుద్ధుని దీర్ఘ సంభాషణలు అనువాదం: అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి
వేదాలు, ఉపనిషత్తులు అనువాదాలు - డాక్టర్ దాశరథి రంగాచార్య
గులాంగిరి, సేద్యగాని చర్నాకోల - జ్యోతిరావు పూలే రచనలు
భారతీయ చరిత్ర - శూద్ర దృక్పథం

డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ రచనలు - సమగ్ర సంపుటాలు సం॥ వసంతమూన్
దక్షిణవేదం (తిరుక్కురళ్) అనువాదం: ఆరుద్ర - 1989
పెరియార్ దృష్టిలో ఇస్లాం - కూర్పు: జి. అలాయ్‌సెమస్
నిప్పుకథ - డా॥ మహీధర్ నళినీమోహన్ - 1990
ఆర్.ఎస్.ఎస్. చర్చా దర్శనం - సాహిత్య నికేతన్ - 1997
భారత కమ్యూనిస్టుపార్టీ (మార్క్సిస్టు) 18వ మహాసభ రాజకీయ తీర్మానం -2005
బసవ ప్రజ్ఞ - కంచ్చా దర్గా - 2004
జైనం బౌద్ధం - అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి - 1989
అంబేద్కర్ - నవయాన బౌద్ధ ఉద్యమం - టిఎస్ మిల్కిన్‌సన్, ఎంఎం థామస్
భారత ఆర్థిక వ్యవస్థ (1600-1947) - కె.యస్.గిల్ (1992)
భారతీయ పారిశ్రామిక పరిణామం (1860-1939) - డి.ఆర్. గాడ్గిల్ -1988
చండాల (అస్పృశ్యుల చరిత్ర) - పిల్లి రాంబాబు
తర తరాల భారత చరిత్ర - రొమిల్లా థాపర్
భారతదేశ చరిత్ర - సతీష్‌చంద్ర
ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర - పి.వి.కె. ప్రసాదరావు - 2007
నాగులు - భూపతి నారాయణమూర్తి
పురాణాలు కుల వ్యవస్థ - బొజ్జా విజయభారతి
జానపద సాహిత్యంలో అలంకార విధానం - డా॥ కె. ఫక్రుద్దీన్ - 1989
భారతదేశంలో కల్లుగీత కులాలు - వి.జి.ఆర్. నారగోని - 2002
చరిత్ర పాఠాలు - కాషాయ అబద్ధాలు - కె.ఎన్.పణిక్కర్ మొదలైనవారు
మార్క్స్ - ఏంగిల్స్, సంపుటాలు - ప్రగతి ప్రచురణ మాస్కో - 1978
పాణిని సమకాలీన భారత వర్ష (హిందీ) - వాసుదేవ చరణ్ అగ్రవాల్
సమగ్ర గౌడుల చరిత్ర - బుడ్డిగ ఆదినారాయణమూర్తి గౌడ్
సమాజ పరిణామంలో స్త్రీ - డి.బి.యస్. ఆర్.సిహెచ్. మూర్తి - 2005
సర్దార్ సర్వాయి పాపన్న - కొంపెల్లి వెంకట గౌడ్ - 2003
'నిజాం బ్రిటిష్ సంబంధాలు' - ప్రొఫెసర్ డా॥ సరోజినీ రేగాని.

(ఇంకా ఎన్నో మిగిలిపోయిన గ్రంథాలను తరువాత గ్రంథంలో పేర్కొంటాను.)

బి.ఎస్.రాములు



'యు.పిలో బిఎస్‌పి గెలుపు' పుస్తకం గురించి ఇండియాటుడే సమీక్ష

# బహుజన విజయగాథ

**ఉత్తర ప్రదేశ్ ఎన్నికల ఫలితాలపై దళిత కోణంలో సునిశిత విశ్లేషణ**

ఈ ఏడాది మే 11వ తేదీ భారతదేశ చరిత్రలో ఒక చెరగని జ్ఞాపకంగా మిగిలిపోతుంది. ఇది భారత రాజకీయాలను మాయావతి మలుపు తిప్పిన ఘట్టం. కాన్షీరామ్ కలల సాకారాల జ్ఞాపకం. బుద్ధుడి జననాన్ని మళ్ళీ స్మరణకు తెచ్చిన జ్ఞాపకం. ప్రపంచంలో 192 దేశాల కన్నా పెద్దదైన ఉత్తర ప్రదేశ్ రాష్ట్రానికి బహుజన సమాజ్ పార్టీ (బి.ఎస్.పి) అధినేత్రి మాయావతి ముఖ్యమంత్రిగా పూర్తి మెజారిటీతో ఎన్నికయ్యారు. రెండు నెలల పాటు జరిగిన పోలింగ్ అందరిలో ఉత్కంఠ రేకెత్తించింది. ఒకవైపు ములాయం సింగ్ నేతృత్వంలోని సమాజ్‌వాది పార్టీ, మరోవైపు కాంగ్రెస్, భారతీయ జనతా పార్టీలు పోటాపోటీగా ఎన్నికల బరిలోకి దిగాయి. అయినప్పటికీ, వీటన్నిటినీ ఎదుర్కొని మాయావతి అఖండ విజయం సాధించగలిగారు. ఇది సామాన్యుల అంచనాలకు అందని విషయంగా ఆశ్చర్యాన్ని కలిగించింది. బహుజన సమాజ్ పార్టీ గెలుపు వెనుక గల నిర్మాణాన్ని, కార్యదక్షతను, ఎన్నికల ఫలితాలను ప్రముఖ సామాజిక తత్త్వవేత్త బి.యస్.రాములు ఈ పుస్తకంలో నిశితంగా విశ్లేషించారు. బహుజన సామాజిక శాస్త్రవేత్త తులసి సంపత్ కుమార్ సంపాదకత్వంలో ఈ పుస్తకం వెలువడింది. సామాజిక తాత్త్విక విశ్వ విద్యాలయం దీన్ని ప్రచురించింది. మాయావతి ఘన విజయం సాధించిన సందర్భంగా బి.యస్. రాములు పత్రికల కోసం రాసిన వ్యాసాల సంకలన రూపమే ఈ పుస్తకం.

ఇటీవలి ఉత్తరప్రదేశ్ శాసనసభ ఎన్నికల్లో బిఎస్‌పి గెలుపు ఒక సామాజిక, రాజకీయ చైతన్యమని చెబుతూ, శాంతియుత పద్ధతిలో ఎన్నికల ప్రక్రియ ద్వారా అధికార మార్పిడి ఎలా సాధ్యమో వివరించిన విప్లవమన్నారు. ఇది బహుజన విజయగాథ. "అంబేద్కరిజాన్ని కాన్షీరామ్ విభిన్నంగా తన సమకాలీన పరిస్థితుల్లో అన్వయించగా, మాయావతి మరింత విభిన్నంగా ప్రయోగాలు చేశారు. ఆ ప్రయోగం యొక్క విజయమే ఉత్తరప్రదేశ్ గెలుపు" అని సిద్ధాంతీకరించారు రచయిత. ఉత్తరప్రదేశ్ ఎన్నికలకు బి.ఎస్.పి. అభ్యర్థులను ఏడాది ముందే ప్రకటించడం ప్రపంచానికే ఆదర్శమని రాములు పేర్కొన్నారు. సమాజ్‌వాది పార్టీ, బిఎస్‌పిల పోట్లాటలో బిజెపి కానీ, కాంగ్రెస్ కానీ లాభపడకుండా బి.ఎస్.పి. లాభపడడానికి అగ్రకులాలకు టికెట్లు ఇచ్చి, తన

నాలుగవది ఆధునిక పారిశ్రామిక విప్లవం.

ఐదవది కంప్యూటర్ విప్లవం.

ఆధునిక పారిశ్రామిక విప్లవంతో అస్పృశ్యత అంతానికి ప్రారంభం జరిగింది. ఆధునిక విద్య, ఉద్యోగ, రాజకీయ హక్కులతో, అస్పృశ్యతా సమస్య చర్చ పూర్తయింది. దళితులు, పారిశ్రామిక ఆర్థిక రంగాల్లో ఇతరులతో పాటు ఉన్నత స్థాయికి ఎదగాలి. ఇక మిగిలింది శూద్రుల సమస్య.

శూద్రులు రెండుగా చీలిపోయారు. కొందరు రాజులయ్యారు. కొందరు ప్రజలు గానే మిగిలిపోయారు. రాజులుగా ప్రజలుగా చీలిపోయిన వారు కులాలవారిగా కూడా చీలిపోయారు. వీరంతా శూద్రులే. బౌద్ధం కాలంలో వెయ్యి ఏళ్ళు ప్రపంచానికి వెలుగునిచ్చే కళలు, ఉత్పత్తులు, శూద్రులు సృష్టించారు. ఇండియాలో శూద్రుల ఉత్పత్తి విస్తరణ నుండే బౌద్ధం, జైనం, బ్రాహ్మణవాదం, ఇస్లాం పుట్టి పెరిగాయి. అన్ని మతాల సృష్టికి మూలం శూద్ర విప్లవమే. ఈ దృష్టితో చరిత్రను అధ్యయనం చేసే క్రమం ఇది. దీన్ని చాలా మంది వ్యతిరేకించ వచ్చు. కొంత మంది అయినా ఇందులోని చారిత్రక అంశాలను గుర్తిస్తారు.

శూద్ర విప్లవానికి ముందు నాగరికత లేదు. సంస్కృతి ఒక్కటే ఉండేది. శూద్ర విప్లవం నుండి రాజరిక వ్యవస్థ, వర్తక వ్యవస్థ, అనేక సిద్ధాంతాలు ఏర్పడ్డాయి. శూద్ర విప్లవం నుండే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలు ఏర్పడ్డాయి. ఆర్యులు మూడు వర్ణాలు. (ఆర్య త్రైవర్ణిక) అనే మాట శూద్ర విప్లవం వచ్చాక తమను పై శ్రేణుల్లో చేర్చుకోవడానికి పుట్టింది. అటు తరువాత శూద్రుల్ని చాతుర్వర్ణం అన్నారు. ఇలా ప్రథమ వర్ణం నాలుగవ వర్ణంగా మార్చబడింది. శూద్ర విప్లవం పుట్టుకకు ముందటి చరిత్ర సంచార తెగల, జనపదాల చరిత్ర మాత్రమే. ఇవీ నేను ఈ చరిత్ర రచనలో ముందుకు తెచ్చిన ప్రధాన అంశాలు.

శూద్ర ఉత్పత్తి విధానం వల్లనే ఇండియా ప్రపంచంలో అత్యంత సంపన్న రాజ్యం అయింది. శూద్రుల సంపద సృష్టి నుండే జనపదాలు నగరాలుగా, రాజ్యాలుగా, సామ్రాజ్యాలుగా రూపుదిద్దుకోవడం సాధ్యపడింది. గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ అనేది శూద్ర విప్లవమే. శూద్రుల ఉత్పత్తి వికాసమే గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ. ఈ మాట మార్క్సిస్టులు, ఆర్.ఎస్.ఎస్ హిందూ వాదులు ఇప్పటికీ చెప్పడానికి నిరాకరిస్తున్నారు. శూద్రుల సంపద సృష్టి నుండి, గ్రామీణ సంపద మిగులు నుండి నగరాలు ఏర్పడ్డాయి. ఆ తరువాతనే రాజ్యాలు, వాటి విస్తరణ జరుగుతూ వచ్చాయి.



శూద్ర విప్లవం నుండి బౌద్ధం ఏర్పడింది. బౌద్ధం అందరికీ విద్యను అందించింది. కుల, మత, వర్ణ, వివక్షతకు తావు ఇవ్వలేదు. తద్వారా అన్ని కులాల, తెగల నుండి ప్రజలు శాస్త్రవేత్తలుగా, రచయితలుగా, మేధావులుగా, కళాకారులుగా, రాజ్యాధినేతలుగా, మంత్రులుగా ఎదిగారు. బౌద్ధం విశ్వ విద్యాలయాలను తెరిచింది. అందులో అందరికీ ప్రవేశం ఇచ్చింది. బ్రాహ్మణత్వం ఇందుకు భిన్నమైనది. బ్రాహ్మణత్వం గురుకుల విద్య ప్రవేశపెట్టి విద్యను ప్రైవేటీకరించింది. ఇంటి వద్ద చదువు నేర్పే ప్రైవేటు ట్యూషన్‌గా బ్రాహ్మణత్వం విద్యను కుదించింది. బౌద్ధ (బుద్ధుడు క్రీ.పూ 563-483) పూర్వకాలం నుండి శతాబ్దాలుగా భారతదేశాన్ని శూద్రులే పరిపాలించారు. చిన్న రాజ్యాలు, పెద్ద రాజ్యాలు ఎక్కువ మేరకు శూద్రులే రాజులు.

**రాజుల వద్ద గుళ్ళ వద్ద పేరుకుపోయిన సంపద శూద్రులు నిర్మించిన గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ ద్వారా సమకూరినదే.**

నగరాలు, గుళ్ళు గ్రామీణ సంపదను సేకరించే కేంద్రాలు. ఎంత ప్రాచుర్యం ఉన్న గుళ్ళయితే అంత పెద్ద నగరాల్లాగా గుళ్ళు చరిత్రలో ప్రాధాన్యత వహించాయి. నగరాలు స్వయం పోషకాలు కావు. అవి గ్రామాల వ్యవసాయ మిగులు మీద ఆధారపడి బతుకుతాయి. అలాగే గుళ్ళు స్వయం పోషకాలు కావు. రాజులు గుళ్ళను, భూములు, దానాలు వగైరా ఇచ్చి స్వయం పోషకాలుగా మార్చారు. దాంతో గుళ్ళు, పూజారి వ్యవస్థ కొనసాగాయి. రాజరికాలు ఎప్పటికప్పుడు పడిపోతూ నిర్మాణమవుతూ వచ్చాయి. శూద్రుల చరిత్ర రాజవంశాల చరిత్రగా, క్షత్రియుల చరిత్రగా రాసి కుల, మత మార్పిడి జరిపి పరాయీకరించారు. అందుకు బ్రాహ్మణ వర్ణం అనేక సౌకర్యాలను, పదవులను పొందింది.

బ్రాహ్మణులు ఒక కులం కాదు. బ్రాహ్మణులు ఆర్యులు కాదు. అన్ని కులాల నుండి, అన్ని తెగల నుండి బ్రాహ్మణ వర్ణంగా పరిణామం చెందారు. అన్ని దేశాల మేధావులు అమెరికాకు చేరుకొని ఒక వర్గంగా అభివృద్ధి చెందినట్లు ఆయా కులాల్లో తెలివైన వారు బహుశా బ్రాహ్మణుల్లో చేరి వుంటారు. వైశ్యులు, క్షత్రియులు కూడా అంతే. బ్రాహ్మణుల గోత్రాలన్నీ ఆయా కులాల నుండి బ్రాహ్మణులుగా మారిన క్రమాన్ని తెలుపుతాయి. నగరాల్లో సంపద పేరుకొన్నప్పుడు అది విదేశీ వర్తక వాణిజ్యాలకు ఎంతగానో ఉపయోగపడింది. తద్వారా దేశం మరింత సంపద్వంతమైంది. గుళ్ళల్లో సంపద పేరుకుపోవడం వల్లనే విదేశీ వర్తక వాణిజ్యాలు తగ్గాయి. విదేశీయులు గుళ్ళపై దాడులు చేసి సంపద తీసుకుపోయారు.

గుళ్ళను ధ్వంసం చేశారని అందులోని సంపద ఎత్తుకెళ్ళారని చెపుతారు. ఆ

గొడుగు కిందకు తీసుకురావడం ఒక గొప్ప రాజకీయ చాతుర్యానికి నిదర్శనమన్నారు రచయిత. మనీ, మీడియా, మాఫియా ప్రభావాలకు అతీతంగా బి.ఎస్.పి. విజయం సాధించిందనేది అన్నిటి కన్నా ముఖ్యమైన విషయం.

బహుజన సమాజ్‌పార్టీ 1984లో కాన్షీరామ్ నాయకత్వంలో ఆవిర్భవించింది. మాయావతి 2007లో పార్టీని సర్వజన ప్రతినిధి పార్టీగా మలచి ఘన విజయం సాధించారు. ఉత్తరప్రదేశ్‌ను పాఠకులకు పరిచయం చేస్తూ, మోతీలాల్ నెహ్రూ, లాల్‌బహదూర్ శాస్త్రి, రామ్ మనోహర్ లోహియా రాజకీయ జీవన విధానాలు తనకు ఉత్తేజం కలిగించాయన్నారు. 1967లో సోషలిస్టు పార్టీ తరపున రామ్ నరేశ్ యాదవ్ ముఖ్యమంత్రి కావడంతో బీసీలకు అధికారం ఇచ్చిన ప్రజల పట్ల, ఆ రాష్ట్రం పట్ల రచయితకు ఆసక్తి పెరిగింది. 1960ల నుంచి ఉత్తర ప్రదేశ్ ఒక ప్రయోగశాలగా ఉంటూ వస్తోందనీ, యు.పి.లో జరిగే ప్రయోగాలు, పరిణామాలు భారతదేశంలోని అన్ని రాష్ట్రాలలో పునరావృతమవుతూ వస్తున్నాయనీ రాములు సూత్రీకరించారు. 1990లో తనకు బి.ఎస్.పి.తో పరిచయం అయిందనీ, బి.ఎస్.పి. ముందుకు తెచ్చిన చారిత్రక వారసత్వాన్ని రాష్ట్రం నలుమూలలా వ్యాప్తి చేయడంలో తన వంతు కర్తవ్యాన్ని నిర్వహించాననీ రచయిత వివరించారు. ఉత్తరప్రదేశ్ తర్వాత భారత రాజకీయాల్లో కీలక పాత్ర వహించింది ఆంధ్రప్రదేశ్ అని చెబుతూ, మాయావతి గెలుపు తెలంగాణ రాష్ట్ర సాధనలో మలుపు కావాలనే ఆకాంక్షను వెలిబుచ్చారు. దళితుల నాయకత్వంలో విభిన్న వర్గాలు ఒక్కటై అధికారంలోకి రావడాన్ని మాయావతి గెలుపు స్పష్టం చేస్తోందన్నారు. అలాగే, ఇటీవల జరిగిన ఉత్తరప్రదేశ్ అసెంబ్లీ ఎన్నికల పోలింగ్ సరళిని కూడా ఆయన వివరించారు. జానపద వీరగాథలను విస్తృతంగా ప్రచారంలోకి తేవడం ద్వారా బిఎస్‌పి కార్యకర్తల నిర్మాణ దక్షతను చాటుకుంది. సామాజిక వర్గాల సమీకరణ గురించి కూడా రచయిత ప్రస్తావించారు.

"వోటు మీ సొంత కూతురు. మంచి వరునికివ్వండి" అని బి.ఎస్.పి. సంస్థాపకుడు కాన్షీ రామ్ వోటు పట్ల ఇచ్చిన నిర్వచనం గొప్పది. వోటు అనేది కూతురులాంటిది. కూతురికి యోగ్యుడైన వరుణ్ణి చూసినట్లు చూసి వోటు వేయాలి. కూతురిని అయోగ్యునికి ఇవ్వాలని ఎవరూ అనుకోరు" ఇలా వోటును సొంత కూతురిలా అగ్రవర్ణ పార్టీలు పోల్చలేదంటారు రచయిత. ఇది దళితుల అభ్యున్నతికి అట్టడుగు స్థాయి నుంచి కృషి చేసిన బహుజన సమాజ్ పార్టీ సిద్ధాంతాల విజయానికి అద్దం పట్టిన పుస్తకం.

**ఇండియాటుడే, 18. 09. 2007**



'బీసీలకు రాజకీయ అధికారం' పుస్తకం గురించి వార్త దినపత్రిక సమీక్ష

# బీసీల్లో రాజకీయ చైతన్యం

బియస్ రాములు తాజాగా రాసిన పుస్తకం బీసీలకురాజ్యాధికారం, అవగాహన - పార్టీ నిర్మాణం, కార్యక్రమ - ఎన్నికల ప్రణాళిక. వెనుకబడిన తరగతులకు చెందిన వారు అన్ని రంగాల్లో ముందుకురావాలన్న ఆకాంక్షతో రాసిన ఈ పుస్తకంలో బీసీల పార్టీ నిర్మాణం గురించి సోదాహరణంగా చర్చించారు. సామాజిక తాత్విక విశ్వవిద్యాలయం ప్రచురించిన ఈ పుస్తకంలో ముందుమాటలో నూతన శతాబ్దికి నూతన రాజకీయాలు అందించాలనే లక్ష్యంతో తానీ కృషికి శ్రీకారం చుట్టినట్లు చెప్పారు. దశాబ్దాల సామాజిక, రాజకీయ రంగాల ప్రత్యక్ష పరోక్ష అనుభవాల క్రోడీకరణే ఈ పుస్తకమని రచయిత వివరించారు. ముందుమాటలో త్యాగ పురుషులు పోటీ చేసి గెలవలేని దుస్థితి పెరుగుతున్నదని రాములు విచారం వ్యక్తం చేశారు.

ఈ పుస్తకంలో తాజాగా రాష్ట్రంలో చర్చనీయాంశమైన సినీతారల రాజకీయ రంగ ప్రవేశంపై జరుగుతున్న ప్రయత్నాలను కూడా ప్రస్తావించారు. ఈ వ్యాసం ఆరంభంలోనే మహానది ఇసుకలో ఇంకిపోయినట్లుగా బీసీల చైతన్యం, బీసీ ఉద్యమాలు చీరంజీవి గ్లామర్ మీద ఆధారపడే దుస్థితిలో కూరుకుపోయాయా? బీసీ ఉద్యమం అంటే ఎవరిని నిలబెట్టినా గెలిస్తేనే అది ఉద్యమం అంటారు. చిరంజీవి పేరుతో ఓట్లు సంపాదించేవారు బీసీ నాయకులు ఎలా అవుతారు? అని ప్రశ్నించారు. బీసీలకు సినిమా గ్లామర్ అవసరం అయ్యేదైతే బీసీ ఉద్యమాలు దేనికి? తెలంగాణా ఆంధ్ర రెండు రాష్ట్రాలు ఏర్పడ్డాక చిరంజీవి రాజకీయాల్లోకి వస్తే అతనికి గౌరవం ఉంటుంది. లేదా ఇప్పుడు రెండు రాష్ట్రాల ఏర్పాటును సమర్థిస్తూ రాష్ట్ర వ్యాప్తంగా పర్యటించి చిత్తశుద్ధిని నిరూపించుకోవాల్సి ఉంటుందని రచయిత సూచిస్తున్నారు. 'గత మంతా మంచిదేమీ కాదు' అనే శీర్షికలో సామాజిక న్యాయం, సామాజిక మార్పు కోసమే బీసీలకు రాజకీయ అధికారం రావాలని తాను అభిలషిస్తున్నట్లు పేర్కొన్నారు. కుల వృత్తుల గురించి ప్రస్తావిస్తూ, కుల వృత్తులు చేస్తున్నంత కాలం ఆధునిక అభివృద్ధి ఆధునిక జీవితం సాధ్యం కాదు. ఆధునిక విద్య అందుకున్నవారికే ఆధునిక అభివృద్ధి సాధ్యమవుతుందని రచయిత విశ్లేషించారు.

'కులసంఘాల నిర్మాణం రాజకీయ అధికార సాధనకు సోపానం' అన్న శీర్షికలో సామాజిక ఉద్యమాలకు నాయకత్వం ఉంటుంది. సిద్ధాంతం ఉంటుంది.

కానీ పార్టీ ఉండదు. సిద్ధాంతం, నాయకత్వం ఈ రెంటి ద్వారా సామాజిక ఉద్యమాలు నిర్వహించగలుగుతారు. కాని సామాజిక విప్లవం లేదా సామాజిక పరివర్తన తీసుకురావడం సాధ్యం కాదు. కనుక రాజకీయ పార్టీ అవసరం.

కొందరు నాయకులు సిద్ధాంతం లేకుండానే ఉద్యమాలను నడుపుతారు. వారికి చారిత్రక వారసత్వం కూడా ఉండదు. ఇవి తాత్కాలికమైనవి. వ్యక్తి పరంగా నడిచేవి. ఇవి ఆయా రంగాల్లో కొంత మార్పుకు కారణం అవుతాయి. అవి మొత్తం సమాజాన్ని అన్ని రంగాల్లో మార్చలేవు. అలాగే కొన్ని సంఘటనల సందర్భంగా ఉద్యమాలు వెల్లువెత్తుతాయి. ఆ తరువాత సామాజిక ఉద్యమంగా విస్తరిస్తుంది. ఇవి కూడా అంతే. అన్ని రంగాలను మార్చలేవని రాములు పేర్కొన్నారు. అంతేగాక బీసీలు కాలంతో పాటు మారక తప్పదని, సమాజంతో పాటు అందరూ మారక తప్పదని, కులవృత్తులు వదిలేయక తప్పదని, లేకపోతే ఉజ్వల భవిష్యత్తు ఉండదన్నారు. పారిశ్రామిక ఉత్పత్తుల వల్ల వృత్తి కోల్పోయిన వారికి ఇతర రంగాల్లో వృత్తి ఉద్యోగ అవకాశాలు కల్పించాలని, ఈ విషయంపై ప్రభుత్వం సరైన ప్రాధాన్యత ఇవ్వడం లేదని పేర్కొన్నారు. అందుకని బీసీలు ఎస్సీలను కలుపుకొని ఒక సంఘటిత రాజకీయ శక్తిగా ఎదగవలసి ఉందన్నారు.

**వార్త దినపత్రిక, 30. 12. 2007**



# జీవిత పరిచయం

సామాజిక తత్వవేత్త బి.ఎస్. రాములుగారు కరీంనగర్ జిల్లా జగిత్యాలలో 23-08-1949న పేద పద్మశాలి కుటుంబంలో బేతి లక్ష్మిరాజు, మిట్టపల్లి నారాయణ దంపతులకు జన్మించారు. తండ్రి బొంబాయి బట్టల మిల్లు కార్మికుడు. ఆరో యేట తండ్రి చనిపోగా తల్లి బీడీలు చేసి పోషించింది. రచయితగా, సామాజిక ఉద్యమకారుడిగా, తత్వవేత్తగా బి.ఎస్. జీవితం చుట్టూ తెలంగాణ ప్రాంతం వివిధ ఉద్యమాల భూమిక ఉంది. 1967 నుండి 1972 దాకా ఆర్ఎస్ఎస్ ముఖ్య శిక్షక్‌గా పని చేశారు. విద్యార్థి దశలో 1964 నుండి రచనలు చేస్తున్నారు. సాహిత్య సమావేశాలు నిర్వహిస్తున్నారు. 1977 నుండి పౌరహక్కుల సంఘం, అంబేడ్కర్ సంఘాల, విప్లవ సంఘాల జిల్లా కార్యక్రమాలు. 1980 నుండి విరసం సభ్యులు. 1983- పౌరహక్కుల సంఘం జిల్లా కార్యదర్శి. 1984-88 రాడికల్ యువజన సంఘం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి. 1985-90 గద్దర్, వరవరరావు, సంజీవ్ తదితరులతో కలిసి అఖిలభారత పర్యటన, అజ్ఞాతవాసం. 1990 ఏప్రిల్‌లో బహిరంగ జీవితం. 1992లో ఆం.ప్ర. దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక నిర్మాణం. వ్యవస్థాపక అధ్యక్షులు.

1991లో వెలువడిన 'గతితర్క తత్వదర్శన భూమిక' అనే తాత్విక గ్రంథం తెలుగునాట భావజాల చర్చతీరును పూర్తిగా మార్చివేసింది. ప్రపంచ భావజాల ఉద్యమరంగంలో ఈ గ్రంథం ఒక మైలురాయి. ఈ గ్రంథం బీసీ, ఎస్సీ, ఎస్టీల వేదికైన దళిత రచయితల కళాకారుల మేధావుల ఐక్యవేదిక నిర్మాణానికి తాత్విక పునాది వేసింది. ఆ క్రమంలో వీరు 'గతితర్కం - అంబేడ్కరిజం - మార్క్సిజం', 'అంబేడ్కరిజం-సోషలిజం', 'నేను ఎవరు?', 'ప్రేమ అంటే ఏమిటి?', 'భౌతికవాద ప్రాపంచిక దృక్పథం', 'జ్ఞానం పుట్టుక', 'బహుజన తత్వం', 'బీసీలు ఏం చేయాలి?' మొదలైన గ్రంథాలు వెలువరించారు. సామాజిక అర్థశాస్త్రాన్ని రూపొందించే పనిలో ఉన్నారు.

బతుకుపోరు నవల, పాలు, స్మృతి, మమతలు - మానవ సంబంధాలు, వేపచెట్టు, పాలు చదువు, తేనెటీగలు, బతుకుపయనం కథా సంపుటాలు వెలువరించారు. అడవిలో వెన్నెల కథకు కొడవటిగంటి కుటుంబరావు స్మారక పురస్కారం 1984. డా॥ దాశరథి రంగాచార్య పురస్కారం. కొండా లక్ష్మణ్ బాపూజీ ఫౌండేషన్ పురస్కారం. పాల్కురికి సోమన పురస్కారం. హేతువాదిగా, తెలుగు విశ్వవిద్యాలయం ధర్మనిధి పురస్కారం. మమతలు - మానవ సంబంధాలు కథల సంపుటికి తెలుగు విశ్వవిద్యాలయం పురస్కారం. మరెన్నో పురస్కారాలు అందుకున్నారు. 1985 నుండి విశాల సాహితి సభలు, సమావేశాలు. 50వ జన్మదినం నుండి విశాల సాహితీ బి.ఎస్. రాములు కథా పురస్కారాలు. రాష్ట్రంలో 27 మంది ప్రఖ్యాత కథకులు వీటిని అందుకున్నారు.

125కి పైగా కథలు, ఆరు నవలలు, 150 సిద్ధాంత వ్యాసాలు, 150 సాహిత్య వ్యాసాలు, పది తాత్వికగ్రంథాలు, మూడు అలంకార శాస్త్ర గ్రంథాలు, పలు సెమినార్ పత్రాలు, 120కు పైగా పీఠికలు రాశారు. సభల్లో వేలాది ప్రసంగాలు చేశారు. పలు పుస్తకాలకు సంపాదకత్వం వహించారు. వివిధ కథా సంకలనాల్లో వీరి కథలు 50 వరకు ప్రచురించబడ్డాయి. కత్తిపద్మారావు గారన్నట్టు "బి.ఎస్. రాములు గారొక తాత్విక విశ్వవిద్యాలయం". బి.ఎస్. భారతీయ తాత్వికరంగంలో జీవనదిలా ప్రవహించే తెలుగు తాత్విక చైతన్యం. ఈతరం మార్గదర్శకులు. వారొక జీవన తత్వనిధి.

–గూడూరి సీతారాం, పత్తిపాక మోహన్

# బి.ఎస్.రాములు రచనలు

| | | |
|---|---|---|
| 1. | బతుకుపోరు (తెలంగాణ నవల 3వ ముద్రణ 2004) | 1982 |
| 2. | పాలు | 1991 |
| 3. | గతితర్క తత్వదర్శన భూమిక (3వ ముద్రణ 1997) | 1991 |
| 4. | గతితర్కం-అంబేద్కరిజం-మార్క్సిజం | 1993 |
| 5. | అంబేద్కరిజం - సోషలిజం | 1994 |
| 6. | ప్రేమ అంటే ఏమిటి? | 1996 |
| 7. | స్మృతి కథల సంపుటి | 1997 |
| 8. | జ్ఞానం పుట్టుక | 1998 |
| 9. | భౌతికవాద ప్రాపంచిక దృక్పథం | 1998 |
| 10. | కథల బడి - కథా సాహిత్య అలంకార శాస్త్రం | 1998 |
| 11. | మమతలు మానవ సంబంధాలు (కథలు) | 2000 |
| 12. | వేపచెట్టు (తెలంగాణ కథలు) | 2003 |
| 13. | సమగ్ర సామాజిక కథ, 50 ఏళ్ళ తెలుగు కథ తీరుతెన్నులు | 2003 |
| 14. | బహుజనతత్వం (బి.సి., ఎస్సీ, ఎస్టీ సిద్ధాంతాలు-కార్యాచరణ) | 2004 |
| 15. | బీసిలు ఏం చేయాలి? | 2004 |
| 16. | బీసీ, ఎస్సీ, ఎస్టీ విద్యార్థి యువజనులారా! | 2004 |
| 17. | తేనెటీగలు - కథల సంపుటి | 2004 |
| 18. | బతుకు పయనం | 2005 |
| 19. | తెలంగాణ తల్లి ఎరుక | 2005 |
| 20. | భారతీయ సమాజం-నేటి రాజకీయ సామాజిక పరిణామాలు | 2004 |
| 21. | సాహిత్య చరిత్రను కొత్త చూపుతో తిరగరాయాలి | 2004 |
| 22. | వ్యక్తిత్వ వికాసం -సామాజిక నాయకత్వం | 2006 |
| 23. | జీవితం అంటే ఏమిటి? | 2006 |
| 24. | తెలంగాణ రాష్ట్ర చరిత్ర | 2006 |
| 25. | తెలంగాణ రాష్ట్రం - నడుస్తున్న చరిత్ర | 2006 |
| 26. | తెలంగాణ రాష్ట్ర ఉద్యమం - భవిష్యత్ కార్యక్రమాలు | 2006 |
| 27. | తెలంగాణ జైత్ర యాత్ర | 2007 |
| 28. | అదిగదిగో తెలంగాణ - ఎంతో దూరంలో లేదు | 2007 |
| 29. | మీ వూరిని మీరే అధ్యయనం చేయండి | 2007 |
| 30. | తెలంగాణ ఉద్యమంలో నక్సలైట్ల పాత్ర | 2007 |
| 31. | తెలంగాణ రాష్ట్ర ఉద్యమంలో మలుపులు | 2007 |
| 32. | యు.పి.లో బీఎస్పీ గెలుపు | 2007 |
| 33. | 60 ఏళ్ళ తాత్విక సామాజిక పరిణామాలు | 2007 |
| 33. | బీసీలకు రాజకీయ అధికారం | 2007 |
| 34. | భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం | 2008 |

ఇంకా వందలాది వ్యాసాలు, కొన్ని పుస్తకాలు, కొన్ని అముద్రిత పుస్తకాలు.

సంపదంతా శూద్రులు సృష్టించినదే. ఆ సంపద అంతా శూద్రులకు చెందాల్సిందే. బి.సి. వాదానికి చారిత్రక పునాదిగానీ, సాంస్కృతిక పునాది గానీ, ఏకత్వం గానీ లేదు. శూద్రత్వానికే చారిత్రక, సాంస్కృతిక, సాంఘిక, ఏకత్వ పునాది ఉంది. జన్మనా జాయతే శూద్ర అనే సిద్ధాంతం నాలుగు వర్ణాలు ఏర్పడడానికి తోడ్పడింది. గుణ కర్మ విభాగశ అనేది కూడా నాలుగు వర్ణాలు రూపొందడానికి ఉపయోగపడింది. ఈ రెండు సిద్ధాంతాల ద్వారా అన్ని తెగలు, కులాలు బ్రాహ్మణ, వైశ్య, క్షత్రియ వర్ణాల్లోకి మారడం జరిగింది.

## శూద్రులకు ఇచ్చిన స్థానం గొప్పదే. పాదాలు శరీరంలో ప్రధానాంగాలే

ఆర్య సిద్ధాంతాన్ని దాని సమర్థకులు, లాభోక్తలు, వారసులు ఇప్పుడు వదులుకుంటున్నారు. ఆర్య, వర్ణ సిద్ధాంత ధారులు అనేక బృందాలుగా చీలిపోయారు. వారంతా ఒకటే. మరొకరికి అవకాశం లేకుండా ఒకరు ఆర్యవాదం ఉందని, మరొకరు లేదని చర్చలు చేస్తారు. అసలుచర్చ అయిన **"వర్ణ, కుల నిర్మూలన"**ను చర్చకు రాకుండా చూస్తుంటారు. బౌద్ధం ప్రాధాన్యతను నారాయణగురు, ఫూలే, అంబేద్కర్, పెరియార్ రామస్వామిలను వదిలేస్తారు. చరిత్రను బ్రాహ్మణ, ఆర్య వ్యతిరేక, అనుకూల చర్చలను చేస్తారు. తద్వారా ఈ రెంటిని ప్రధాన స్రవంతిగా చూపిస్తారు. ఇలా అనుకూల, వ్యతిరేక వాదుల లక్ష్యం ఒకటే. అది వర్ణ, కుల వాదాన్ని, ఆర్య, బ్రాహ్మణ వాదాన్ని ఆధిక్యతలో నిలపడం. చరిత్రలో నిజానికి వీటికంత సీన్‌లేదు. జైనం, బౌద్ధం, స్థానిక, ఆదివాసీ సంస్కృతులు, జాతులు మొదలైనవి వీటికన్నా ఎంతో విస్తారమైనవి, ఎంతో చరిత్ర కలిగినవి. వారు రాజులుగా, చక్రవర్తులుగా కూడా ఎదిగారు.

పశువులను మచ్చిక చేసినవారు, సంచారం చేసినవారు, తెగలుగా జీవించిన వారు, సామూహికంగా జీవించిన వారు ఉత్పత్తులు చేసినవారు రాజులయ్యారు. దంపతీ కుటుంబ వ్యవస్థ, దేవదాసీ వేశ్యవాటికల వ్యవస్థ, బ్రహ్మచర్యం, సన్యాసి వ్యవస్థ శతాబ్దాలుగా సమాంతరంగా కొనసాగాయి. ఇండియాలో ఫ్యూడలిజం లేదు. శూద్ర స్త్రీలు ఉత్పత్తిలో పాల్గొన్నారు. అగ్రవర్ణ స్త్రీలు ఇల్లాల్లుగా మార్చబడ్డారు. అగ్రవర్ణ స్త్రీ, పురుషులు ఉత్పత్తికి దూరమయ్యారు. అగ్రవర్ణ స్త్రీలు కూడా శూద్రులుగా లెక్కించబడ్డారు. అగ్రవర్ణ పురుషులే ద్విజులు, అగ్రవర్ణాలు. బుద్ధుడి కాలం నుండి శాతవాహనుల కాలం దాకా భారత ఉపఖండ జనాభా మూడు నుండి అయిదు కోట్లు మాత్రమే. ఇందులో నాలుగు కోట్లు శూద్రులే. 1921లో ఇండియా, పాకిస్తాన్, బంగ్లాదేశ్ ప్రాంతాల జనాభా 20 కోట్లు మాత్రమే. 2007లో ఇది 137 కోట్లకు పెరిగింది. ప్రస్తుతం శూద్రులు, అతి శూద్రులు దేశంలో 80శాతం. బ్రాహ్మణులు,



క్షత్రియులు ఒకటి, రెండు శాతమే. ఆదివాసీలు 7శాతం.

## ఆర్య సిద్ధాంతం లేకుండా బ్రాహ్మణ, వర్ణ, కుల సిద్ధాంతం లేదు

ఆర్య సిద్ధాంతం లేకుండా బ్రాహ్మణ సిద్ధాంతం లేదు. ఆర్య త్రైవర్ణిక అని చెప్పే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, సిద్ధాంతం లేదు. చాతుర్వర్ణం అని చెప్పే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర సిద్ధాంతం, పంచములు అనే సిద్ధాంతం లేదు. ఇవి ఉన్నాయి కనుక ఆర్య సిద్ధాంతం చేసే పని జరుగుతూనే ఉంది. ఇవి పోయినప్పుడే ఆర్య సిద్ధాంతం పోయినట్టు. వీటి ద్వారా ఆర్య సిద్ధాంతం వల్ల ఏవి సాధించాలనుకున్నారో అవి సాధ్యమవుతున్నాయి. కనుక ఆర్య సిద్ధాంతాన్ని వదిలేయడానికి వారికి అభ్యంతరమేమీ లేకుండా పోయింది. మరి కొందరు అందరు ఆర్యులే అని ఆర్య సిద్ధాంతాన్ని వీరిలోనే ఒక సెక్షన్ సమర్థిస్తూ వస్తుంది.

ఆర్య సిద్ధాంతం బ్రాహ్మణుల కోసం పుట్టించారు. పెంచి పోషించారు. వర్ణాల్ని, కులాల్ని, వివక్షతల్ని అస్పృశ్యతను సమర్థించడానికి ఉపయోగించారు. క్షత్రియులు వైశ్యులు, శూద్రులు, పంచములు అనేవి కూడా ఆర్య సిద్ధాంతంలో భాగంగా సృష్టించినవే. బ్రాహ్మణ ఆధిక్యత భావజాలంలో, రాజకీయాల్లో, ఉద్యోగ మేధోరంగంలో, ఆధ్యాత్మిక రంగంలో, గుళ్ళలో కొనసాగడానికి డోకాలేదు. కనుక ఇప్పుడు ఆర్య సిద్ధాంతాన్ని వదులుకుంటున్నారు. మేమే శూద్రులం. మేమే రాక్షసులం. మేమే ద్రావిడులం. మేమే నాగులం. మేమే జానపదులం, అని ఆర్యులు విదేశీయులు అని శూద్రులు, అతిశూద్రులు అనేసరికి బ్రాహ్మణ వాదులు ఆర్యసిద్ధాంతాన్ని వదులుకుంటున్నారు. అయితే వర్ణం, కులం, కుల వ్యవస్థ ఉన్నంతకాలం ఆర్య సిద్ధాంతం కొనసాగుతున్నట్టే లెక్క.

ఇలా ఆర్య సిద్ధాంతం వర్ణ, కుల వ్యవస్థల సిద్ధాంతాల ఆధిపత్యం కోసం కొనసాగించ బడింది. ఆర్య సిద్ధాంతం, వర్ణ, కుల సిద్ధాంతాలు మూడూ ఒక్కటే. ఆర్య సిద్ధాంతాలు తొలిదశ. వర్ణ సిద్ధాంతం రెండో దశ. కుల సిద్ధాంతం, కులవివక్షత మూడో దశ. ఆర్య సిద్ధాంతం కాలం తీరిపోయింది. ఇప్పుడు అదే సారాన్ని వర్ణ కుల సిద్ధాంతాలతో కొనసాగిస్తున్నారు. అందువల్ల ఆర్య సిద్ధాంత వాదులు, వర్ణవాదులు ఆర్యసిద్ధాంతాన్ని వదిలేయడానికి అభ్యంతరం ఏమీ లేకుండా పోయింది. ప్రపంచ చరిత్ర మలుపులకు ఇండియా శతాబ్దాల తరబడి కేంద్రంగా ఉంది. చరిత్రలో గుర్రాలకు, పందులకు, పశువులకు, ఇనుముకు ఎంతో ప్రాధాన్యత ఉంది.

ఆర్యులను, ఆది మానవులను సంచార జాతులను నేటి దేశాల సరిహద్దుల దృష్టితో విదేశీయులు అనడం సరికాదు. పదేళ్ళ నివాసంతో ఇప్పుడు పౌరసత్వం,

గ్రీన్‌కార్డులు పొందుతున్నారు. అలాంటప్పుడు వేల ఏళ్ళనాడు వచ్చి స్థిరపడిన వారిని విదేశీయులు అనడం సరికాదు.

***భారతీయ చారిత్రక భౌతిక వాదం ప్రత్యేకమైనది. అది శూద్ర అతిశూద్ర ఆదివాసీల, స్త్రీల, భారతీయుల పక్షపాతం కలిగి ఉంటుంది. సంస్కృత భాష ఆధారాలు చరిత్రను వక్రీకరిస్తాయి. అందువల్ల సంస్కృత భాష ఆధారాలను చరిత్రకు ఆధారంగా తీసుకోకూడదు.***

శూద్ర విప్లవం క్రీ.పూ. 10వ శతాబ్దంలో ప్రారంభమైంది. క్రీ.శ 18వ శతాబ్దంలో దీని క్షీణదశ మొదలైంది. పారిశ్రామిక విప్లవం శూద్ర విప్లవాన్ని చరిత్రలోకి నెట్టింది. శూద్ర విప్లవం నగరాలకు పునాది. శూద్ర విప్లవానికి పునాది వ్యవసాయం, పశుపోషణ, ఆహార సేకరణ, అదనపు ఉత్పత్తి, వ్యాపార విస్తరణ, గ్రామీణ వ్యవస్థలు. శతాబ్దాలుగా కుల వృత్తులు వదిలేసినవారే రాజులయ్యారు. క్షత్రియులయ్యారు. వ్యాపారులయ్యారు. బ్రాహ్మణులయ్యారు. మంత్రులయ్యారు. క్రీ.శ. 1750 నుండి పారిశ్రామిక విప్లవం తరువాత కుల వృత్తులు వదిలివేసినవారే ఆధునిక అభివృద్ధిని అందుకున్నారు. 1810 నుండి కుల వృత్తుల్లో ఉన్నవాళ్ళు క్రమంగా పేదలయ్యారు. ఆనాటి నుండి కుల వృత్తుల్లో ఉన్నవాళ్ళు పేదలే. కులవృత్తులు వదిలి విద్య, ఆధునిక అభివృద్ధి, ఉద్యోగాలు, వ్యాపారాలు, ఆధునిక వ్యసాయాలు, రాజకీయాలలో చేరినవారే రాజులయ్యారు. మంత్రులయ్యారు. శాసన సభ్యులయ్యారు. ప్రజా ప్రతినిధులయ్యారు.

గతానికి, వర్తమానానికి మధ్య సంభాషణే చరిత్ర. గతంలో మిగిలిపోయి కొనసాగుతూ వస్తున్నవాటిని వర్తమానంలో పరిష్కరించడమే చరిత్ర. సామాజిక న్యాయం, సామాజిక మార్పుకు తోడ్పడేదే చరిత్ర రచన. ఇందుకు భిన్నంగా సమాజాన్ని వెనక్కి నడపడం మత చరిత్ర. మతవాదం. ముందుకు నడపడమే చరిత్ర.

హిందూ పదం భాషా పదం మాత్రమే. దానికంటూ నిర్వచనాలు లేవు. హిందూ మత సారం కులం కాదు. కుల వ్యవస్థ, వర్ణ వ్యవస్థ లేకపోయినా హిందూమతం ఉంటుంది. అది బౌద్ధానికి దగ్గరగా ఉంటుంది.

## భారతీయ సమాజ నిర్మాతలు శూద్రులు

బానిస సమాజం లేకుండా గ్రీకు, రోమన్ సమాజంగానీ, కళలు, అభివృద్ధిగానీ లేదు. శూద్ర సమాజం లేకుండా భారతీయ సమాజంగానీ, కళలు, సంస్కృతి గానీ, అభివృద్ధిగానీ, ఉత్పత్తిగానీ లేదు. శూద్రులు లేకుండా సామూహిక జీవనం లేదు. భారతీయ గ్రామం లేదు. ఇది నేటికీ గ్రామాల్లో ప్రత్యక్షంగా చూడవచ్చు.

సర్‌ప్లస్, ఉత్పత్తులు, నిలువ, వ్యాపారం లేకుండా నగరాలు ఏర్పడవు. మిగులు



లేని చోటుకి మిగులు సరఫరా చేసే ప్రాంతాలు, వ్యాపార కేంద్రాలుగా, నగరాలుగా రూపుదిద్దుకుంటాయి. ఆ తరువాత పరిపాలనా కేంద్రాలుగా ఆనగరాలే ఏర్పడు తుంటాయి. మిగులు ఉత్పత్తిని గ్రామం తనకు తాను ఉపయోగించుకోలేదు. ఉపయోగించుకుంటే గ్రామమే వ్యాపార కేంద్రంగా, నగరంగా మారుతుంది.

పశుపోషక, ఉత్పత్తి, సేవా కులాలకు శూద్రులు అని పేరు పెట్టడం వర్ణవాద సిద్ధాంతంలో భాగం. శూద్ర విప్లవంలో లోహ, ఖనిజాలది, పంచతాయి, విశ్వ కర్మలది, నేత తదితర చేతి వృత్తులది ప్రధమ పాత్ర. నాగరికత అనేది వివిధ వృత్తుల వికాసమే.

స్థానిక భాషల నుండి ప్రాకృత పాళీ, సంస్కృత, సంస్కృత అనుసంధాన భాషలు రూపుదిద్దుకున్నాయి. సంస్కృతం కన్నా తెలుగు, ప్రాకృత భాషలు ప్రాచీన మైనవి. పర్యాయ పదాలు అలా ఏర్పడ్డాయి. నిత్య వాడుక పదాలకు పర్యాయ పదాలు చాలా తక్కువ. ఉదాహరణకు వేపచెట్టు అనే పదానికి తెలుగులో పర్యాయ పదం లేదు. వేదాలు బ్రాహ్మణులవి కావు. పశుపాలకులు, శూద్రులు సృష్టించుకున్నవే వేదాలు. శూద్రుల సంపదను, జ్ఞానాన్ని, కళలను పరాయికరించి అగ్రవర్ణాలుగా బ్రాహ్మణులు రూపొందే క్రమంలో శూద్రుల్లోని కొందరు బ్రాహ్మణులుగా మారిన తరువాత బ్రాహ్మణులకు మాత్రమే వేదాలను పరిమితం చేశారు.

వర్ణం - కులంల స్థిరీకరణ ఎందుకు అవసరమైంది. రాజ్యాల స్థిరీకరణకు వర్ణం, కులం స్థిరీకరణ అవసరమైంది. ఇతర దేశాల్లో తెగలను, రాజ్యాలను పూర్తిగా నిర్మూలించారు. భారతదేశంలో వీటిని సమాఖ్య దృష్టితో కలుపుకుపోయారు. తద్వారా వర్ణం, కులం సిద్ధాంతాలు అవసరమయ్యాయి. నేటి రాష్ట్రాలన్నీ ఇతర దేశాల ప్రకారం చూస్తే ప్రత్యేక దేశాలుగా మారాలి. యూరప్‌లో అలా మారాయి. ఇండియాలో కలిసి ఉన్నాయి. అలా కలిసి ఉండే అవసరం నుండి వర్ణ, కుల సిద్ధాంతాలు ఏర్పడ్డాయి.

## గతం నుండి విముక్తి పొందాలి

చరిత్ర రచన ఇటీవలిదే. అది పరిపూర్ణం కాదు. అది సత్యం కాదు. జరిగిన సంఘటనను గుది గుచ్చి వారికి అనుకూలంగా ఉండే వివరణ ఇస్తూ ఎవరికి వీలైనట్టు వారు నిర్మించినదే మనం చదివిన చరిత్ర. చరిత్ర కోసం కొట్లాడుకోనవసరం లేదు. యుద్ధాలు ఎప్పుడూ చరిత్ర కాదు. పర రాజ్యంలోని ఆర్థిక వనరులను కొల్లగొట్టడం, అధికారం విస్తరించుకోవడం కోసమే యుద్ధాలు సాగాయి. ప్రజాస్వామిక చరిత్ర యుగంలో గతాన్ని అనుసరించి స్పందించడం సంఘర్షించడం సమాజాన్ని ఆనాటి వెనుకటి కాలానికి నడపడమే.

గతం నుండి విముక్తి పొందాలి. గతం నుండి విముక్తి పొందడమే నిజమైన

ప్రజాస్వామిక స్వేచ్ఛ, సమానత్వం, సోదరత్వం. గతం తాలూకు కుల, మత, ప్రాంత, లింగ గుర్తింపులను, వివక్షతలను, ఆధిక్యతలను వర్తమానంలో ప్రదర్శించడం ప్రజాస్వామిక రాజ్యాంగ, మానవ హక్కుల స్ఫూర్తికి విరుద్ధం. గతంలోని అన్ని వదిలి కొన్ని మాత్రమే నేను, నాది అనే భావాలతో స్వీకరించడం నుండి ఈ విభేదాలు, ఘర్షణ, దృక్పథాలు, కుల ఆధిక్యత ప్రారంభమౌతుంది. గతాన్ని గతంగానే చూడాలి.

గతాన్ని వదులుకోవాలి. గతాన్ని వదులుకోవడమంటే జ్ఞాపకాలను, జ్ఞాపక శక్తిని, చరిత్రను వదులుకొమ్మనడం కాదు. వర్తమానంలో సజీవంగా ఉన్న గతాన్ని మాత్రమే వర్తమానంగా పరిష్కరించడం సాధ్యం. గతంలోని చర్య, ప్రతిచర్యలు ప్రతిచర్యాతీత చర్యలు జరిగిపోయాయి. వీటికి అతీతంగా వర్తమానంలో చర్య, ప్రతిచర్య, ప్రతిచర్యాతీత చర్య సాగాలి. అప్పుడే వర్తమానంలో జీవించడం జరుగుతుంది. అలా జరగనప్పుడు చరిత్రలో జీవిస్తూ వర్తమానంగా భావించడం అవుతుంది. గతం నుండి విముక్తి పొంది స్వేచ్ఛ, సమానత్వం సోదరత్వం వెల్లి విరియాలి. అనగా చరిత్ర జ్ఞాపకాల నుండి విముక్తి పొంది స్వేచ్ఛగా జీవించాలి.

### శూద్రులే భారతీయ చరిత్ర నిర్మాతలు, భారతీయ చరిత్ర చోదక శక్తులు

ఎందరో రాజ్యాలు పోయి రాజులు గిరిజనులయ్యారు, శూద్రులయ్యారు, పంచములయ్యారు. ఇతిహాసాల నుండి డా॥ బి.ఆర్. అంబేద్కర్ అనేక ఉదాహరణలు చూపారు. ఒకప్పటి రాజులు, శతాబ్దాల తరబడి రాజ్యాలు ఏలిన గోండులు, లంబాడీలు, ముండాలు, ఇప్పుడు గిరిజనులు. ఒకప్పుడు రాజ్యాలు ఏలిన మాదిగలు, మాలలు ఇప్పుడు పంచములు. అలాగే యాదవులు, గౌడిలు, పద్మశాలీలు, విశ్వబ్రాహ్మణులు, ముదిరాజులు, వడ్డెర, ఎరుకల, దొమ్మరి, మంగలి, చాకలి, గంగపుత్రులు, చెంచులు, కోయలు, కొండరాజులు మొదలైన వాళ్ళు రాజ్యాలు ఓడిపోయి శూద్రులుగా చేర్చబడ్డవారే. శూద్రులుగా చేర్చబడ్డవారు రాజ్యాలు గెలిచి రాజులయ్యారు. అగ్ర కులాలు అయ్యారు. రెడ్డి, రాజు, క్షత్రియ, వెలమ, కమ్మ, జాట్, కాపు, బలిజ మొదలైన కులాలు వ్యవసాయం నుండి ఎదిగి రాజులయ్యారు. అగ్రకులాలయ్యారు.

ఎందరో గొప్ప కళాకారులు బిచ్చగాళ్ళుగా మారారు. బిచ్చగాళ్ళ కులాలుగా చేర్చబడ్డారు. **భారతీయ చరిత్ర వర్ణాల ప్రకారం, కులాల ప్రకారం సాగిన చరిత్ర కాదు. వర్ణాలు, కులాలు, రాజులు, రాజ్యాలు, రాజరికాలు, విద్యా విధానాలు నిరంతరం మారుతూ వచ్చిన చరిత్రే భారతీయ చరిత్ర. శూద్రులు భారతీయ చరిత్ర నిర్మాతలు. శూద్రులే భారతీయ చరిత్ర చోదక శక్తులు.**



# శూద్రుల తాత్విక భూమిక చారిత్రక దృక్పథం

చారిత్రకంగా కొనసాగుతూ వచ్చిన శూద్రులే నేటి బీసీలు. శూద్రుల చరిత్రకు వారసులు బీసీలే. భారత రాజ్యాంగం బీసీలకు ఒక నిర్వచనం ఇవ్వలేకపోయింది. ఇచ్చిన నిర్వచనం బాగాలేదు. భారత రాజ్యాంగంకన్నా వివరంగా, అదనంగా శూద్ర దృక్పథంలో ఏమి వున్నాయి? మార్క్సిజంలో లేనివి శూద్ర దృక్పథంలో ఏమేం ఉన్నాయి? దళితవాదంలో లేనివి ప్రత్యేకంగా శూద్ర దృక్పథంలో ఏమేం ఉన్నాయి? అలాగే స్త్రీవాదంలో లేనివి ప్రత్యేకంగా శూద్ర దృక్పథంలో ఏమేం ఉన్నాయి? అని ఆసక్తి కలగడం సహజం.

బీసీల సాధికారికత విషయానికి వస్తే బిసిలు ఒక కులం కాదు. అది రాజ్యాంగ పరమైన ఒక వర్గీకరణ. శూద్రులు అనేది అందరికీ తెలిసిన పదం.

ఇటీవల కొందరు ' బీసీవాదం' ఒక 'గుర్తింపు వాదం' (ఐడెంటిటీ) అని నిర్వచించి ముందుకు కదిలారు. బీసీ వాదంను బీసీ అస్తిత్వవాదం, అస్తిత్వ వాద ఉద్యమంగా పరిగణించారు. అస్తిత్వం అనేది సాధికారికతకు (ఎంపవర్‌మెంట్‌కు) మొట్ట మొదటి అవసరం అని, ఒక సామాజిక వర్గం తన గుర్తింపును ఎస్టాబ్లిష్ చేయకుండా తన సాధికారికతను సాధించుకోవడం సామాన్యంగా జరగదు అని వారి అభిప్రాయం.

గుర్తింపువాదన సమగ్రమైనది కాదు. అంతకన్నా విస్తృతంగా, సమగ్రంగా దార్శనికతతో బీసీలు ఒక సొంత చారిత్రక దృక్పథం కలిగి ఉండాలి. అందుకు శూద్రులందరికి సంబంధించిన సాధారణ అంశాలను, భూమికగా తీసికొని చరిత్ర నిర్మాణం, తాత్విక భావజాల ఉద్యమాలు సాగించాలి. సగం జనాభా అయిన బీసీలకు అన్ని రంగాల్లో సాధికారికత సాధించడంలోనే దేశాభివృద్ధి వుంది. శూద్రులను పక్కన పెట్టి సాధించే అభివృద్ధి, సాధికారికత వల్ల శూద్రులకు జరిగేదేమీ లేదు.

హిందూమతంలోని సంప్రదాయ వాదులు శూద్రుల, బీసీల సాధికారికత ఆవశ్యకతను అంగీకరించడానికి సిద్ధంగా లేరు. సమస్యంతా ఇక్కడే వచ్చి పడింది.

హిందూ మతంలోని సంప్రదాయ వాదులు, సి.పి.ఎం వంటి వామపక్ష పార్టీలు, అన్ని రంగాల్లో సాధికారికతలో ఉన్నారు. ఈ కారణంగానే రిజర్వేషన్‌లకు వ్యతిరేకంగా కోర్టులు, ప్రభుత్వాలు, పార్టీలు, కుల సామాజిక వర్గాలు ప్రవర్తిస్తున్నాయి. పర్యవసానంగా, సామాజిక సంఘర్షణ, సైద్ధాంతిక సంఘర్షణ అనివార్యమౌతున్నది.

ఏ తాత్విక భూమిక పునాదిగా శూద్ర ఉద్యమాలు సాగుతాయి అనేది ఆ ఉద్యమాల స్వభావాన్ని, కార్యక్రమాలను, ఫలితాలను తెలుపుతుంది. గాంధీయిజాన్ని శూద్రులు తమ తాత్వికభూమికగా స్వీకరిస్తే వాటి పోరాటాలు, నిర్మాణాలు ఒక రకంగా ఉంటాయి. హిందూ మతతత్వ వాదాన్ని స్వీకరిస్తే శూద్ర ఉద్యమాలు మరో రకంగా ఉంటాయి. శూద్రులు మార్క్సిజాన్ని స్వీకరిస్తే ఇంకో రకంగా ఉంటాయి. ఇలా తాత్వికభూమికను అనుసరించి ఉద్యమాలు, కార్యక్రమాలు, వాటి ఫలితాలు నిర్మాణ స్వరూపాలు ఏర్పడతాయి.

శతాబ్దాల పరిణామాల వారసత్వానికి శూద్ర పదం నిదర్శనం. బీసీ పదం అలా కాదు. దీనికింత చరిత్ర లేదు. బిసి చైతన్యం ప్రత్యేకంగా అలవర్చుకోవలసినదే. బిసి అనేది ప్రధానంగా చదువుకున్నవారికి, మధ్యతరగతికి మాత్రమే తెలుసు. గ్రామీణ పేదలకు బిసి అనే పదం తెలియదు. వారికి కులం, శూద్రత్వం మాత్రమే తెలుసు. బిసి అనే పదం నిజానికి సిద్ధాంతపరమైన వర్గీకరణ కాదు. కాని భారత రాజ్యాంగం, భారతీయ రాజకీయాలు, పరిపాలన, న్యాయవ్యవస్థ, సంస్కృతి, సాంఘిక న్యాయం రీత్యా బిసి అనే వర్గీకరణ ఒక ప్రత్యేక అస్తిత్వాన్ని, పొందింది.

కొన్ని శూద్ర కులాలు శూద్రులు అనే పదం వదిలేసి అగ్రకులాలుగా ప్రాచుర్యం లోకి రావడం వల్ల మిగతా శూద్రులు బిసిలు అనే పదంలోకి వర్గీకరించబడ్డారు. చరిత్రలోని శూద్రులకు నేటి బిసిలు చారిత్రక వారసులు. దళితులకు శూద్ర అగ్రకులాలు అనే పదం లాగా దళిత అగ్రకులాలు అనే వర్గీకరణ ఇంకా ఏర్పడలేదు. అంటరానితనం దళితులందరినీ వర్గీకరించే ఒక గీటు రాయి. శూద్రుల నుండి శూద్ర అగ్రకులాలను, బిసి కులాలను వేరుచేసి వర్గీకరించే గీటురాయి నిజానికి ఏదీ లేదు. ఒక వేళ ఉన్నా అది అసంపూర్ణమైనది. అందువల్ల చాలా మంది తమ కులాలను బిసిల్లో చేర్చాలని డిమాండ్‌లు చేస్తున్నారు.

శూద్రుల వల్లనే హిందూమతం, అగ్రకులాధిపత్యం కొనసాగుతున్నది. దళిత దృక్పథానికి, శూద్ర దృక్పథానికి మధ్య అవర్ణులకు, సవర్ణులకు మధ్య ఉండే అంతరం, వైవిధ్యం ఉంటుంది. శూద్రులు భారతీయ సమాజ నిర్మాతలు. శూద్రులు సామాజిక ఉత్పత్తి శక్తులకు, భారతీయ సామాజిక, చారిత్రక అభివృద్ధికి మూల పురుషులు.



శూద్రులు లేకుండా భారతీయ చరిత్ర లేదు. రాజ్యాలు లేవు. రాజరికాలు లేవు. వలస దండయాత్రలు లేవు. శూద్రుల ఉత్పత్తి నైపుణ్యమే వీటన్నింటికీ మూలం. అందువల్ల శూద్రులు చరిత్ర నిర్మాతలు. పారిశ్రామిక విప్లవం కన్నా ముందు వ్యవస్థల్లో పశుపోషకులు, వ్యవసాయదారులు సైంటిస్టులు, కార్మికులు, వైద్యులు, వృత్తినిపుణులు, లోహ పరిశ్రమ నిపుణులు మొదలైన వారంతా శూద్రులే. చారిత్రక ఆధారాలుగా స్వీకరించే కుండలు, ఇటుకలు, నగలు, కత్తులు, కోటలు, దారులు, బట్టలు, అలంకరణలు, ఆయుధాలు అన్నీ శూద్రుల ఉత్పత్తులే.

## దళితదృక్పథానికి, శూద్ర దృక్పథానికి మధ్య తేడా

దళితులు సమాజానికి వెలుపల ఉంచబడ్డారు. శూద్రులు సమాజంలో భాగంగా ఇరుసుగా జీవించారు. అందువల్ల దళితులు భారతీయ సామాజిక వ్యవస్థను, చట్రాన్ని దానికి వెలుపలి నుండి పరిశీలిస్తారు. దాన్ని కూలదోయాలని చూస్తారు. దాన్ని విమర్శిస్తారు. ద్వేషిస్తారు. శత్రువుగా చూస్తారు. దాన్ని తమది కాదని ప్రకటిస్తూ డిజోన్ చేసుకుంటారు. చాతుర్వర్ణం కలిసి హిందూమతం అయింది. పంచములుగా వర్ణించబడిన దళితులు హిందూ మతానికి వెలుపలి వారు. అంబేద్కర్ దళితులను, గిరిజనులను హిందువులు కాదని సైద్ధాంతికంగా నిరూపించారు. అందువల్ల దళిత దృక్పథం హిందూ మతానికి వెలుపల ఉండిపోయిన, ఉంచబడిన, కించపర్చబడిన వారి దృక్పథంగా కొనసాగుతుంది.

## గిరిజన దృక్పథానికి, శూద్ర దృక్పథానికి మధ్య తేడా

గిరిజనులు మత పూర్వ దశలకు చెందిన వారని వారికి మతం లేదని చాలా మంది అభిప్రాయపడ్డారు. అందువల్ల దళిత, గిరిజన దృక్పథాలు ప్రత్యేక గుర్తింపుతో నిర్దిష్ట స్థలకాల దృక్పథంతో హిందూమతానికి వెలుపలి దృక్పథాలుగా కొనసాగుతుంటాయి.

శూద్రులు దళిత గిరిజనుల వలె హిందూమతానికి వెలుపలివారు కాదు. హిందూ మతంలో శూద్రులు ఒక భాగం. **శూద్రులు లేకుండా హిందూమతం లేదు. ఉత్పత్తి, నైపుణ్యాలు, శక్తులన్నీ శూద్రులవే. శూద్రుల ఉత్పత్తి సామర్థ్యంపై, సేవలపై ఆధారపడి హిందూ సామాజిక వ్యవస్థ, రాజ్యం, రాజరికాలు, చాతుర్వర్ణ వ్యవస్థ కొనసాగాయి. కొనసాగుతున్నాయి. శూద్రుల ఉత్పత్తిని, సేవలను పరాయికరించే వ్యవస్థగా హిందూ మతం రూపొందింది.** సాంఘికంగా, ఆర్థికంగా, రాజకీయంగా, సాంస్కృతికంగా హిందూ అగ్రవర్ణ దృక్పథాలన్నీ శూద్రుల ఉత్పత్తులను, సంపదలను, సేవలను నైపుణ్యాలను, సైన్సు, టెక్నాలజీలను పరాయీకరించి తమ సౌఖ్యాలను, ఆధిక్యతను,

రాజ్యాలను నెలకొల్పుకున్నాయి. శూద్రులు ఆనాటి ఉత్పత్తిదారులే కాకుండా సమాజానికి, సామాజిక అభివృద్ధికి మూల స్థంభాలు.

అందువల్లనే శూద్రులు భారతీయ చరిత్రను, పరిణామాలను, సంస్కృతిని, హిందూ జీవన విధానాన్ని దళితుల వలె, గిరిజనుల వలె తమది కాదని డిజోన్ చేసుకోలేరు. పైగా అదంతా తమ సంపదను, నైపుణ్యాన్ని, ఉత్పత్తిని తమ నుండి లాక్కొని ఎదిగిన క్రమమే. మాకు చెందాల్సినవే. మా చరిత్ర – మా నైపుణ్యం వారి పేరిట రికార్డైంది అని చెప్తూ అదంతా మా కృషి అని గర్వించే స్థానం శూద్రులది. మరో రీతిగా చెప్పాలంటే ఫెమినిస్టులు చరిత్ర అంతా పురుషుల పరంగా రాయబడింది కాని అదంతా స్త్రీల పరంగా రాయబడాలి. చరిత్రలో స్త్రీల కృషి పురుషుల కన్నా తక్కువేమీ కాదు అని అన్నట్టుగా శూద్రులు కూడా చరిత్ర అంతా అగ్రవర్ణాల పరంగా, రాజుల పరంగా, రాజరికాల పరంగా రాయబడింది అని అదంతా శూద్రుల పరంగా, బిసిల పరంగా రాయబడాలి అంటారు.

చరిత్రలో శూద్రుల సంపద సృష్టి క్రమమే, సేవల క్రమమే ప్రధానమైనది. భారతీయ చరిత్ర పరిణామాలన్నీ వీరి శక్తి సామర్థ్యాలు, ఉత్పత్తి నైపుణ్యాలు, మానవ వనరుల మీదే ఆధారపడి సాగాయి, అదంతా బిసిల పరంగా రాయబడాలి అని బిసిలు భావిస్తుంటారు. అందువల్ల శూద్రుల దృక్పథం, దళితుల దృక్పథం, గిరిజనుల దృక్పథం, అగ్రవర్ణాల దృక్పథం, హిందూ మత దృక్పథం ఒక్కటి కావు. వేరు వేరుగా ప్రత్యేక గుర్తింపుతో ప్రత్యేక దృష్టితో కొనసాగుతాయి.

## అగ్రవర్ణ దృక్పథాలు అనేక రకాలు

అగ్రవర్ణ దృక్పథం కూడా ఒకటి కాదు. రాజుల దృక్పథం, బ్రాహ్మణుల దృక్పథం, వైశ్య వ్యాపార వర్గాల దృక్పథం ప్రత్యేకంగా నిర్దిష్టంగా వేరుగా కొనసాగాయి. అవసరమైన చోటనే ఇవి కలుస్తాయి. ఈ మూడు వర్ణాల దృక్పథాల మధ్య సమన్వయం, పరస్పర సహకార ఒడంబడికలు కొంత సంఘర్షణ కూడా చరిత్ర పొడవునా సాగాయి. అందువల్ల భారతీయ ప్రజల చారిత్రక దృక్పథాలు వైవిధ్యంతో కొనసాగాయి.

అగ్రవర్ణ బ్రాహ్మణ, వైశ్య వ్యాపార వర్గాల రాజుల, రాజరికాల, క్షత్రియుల దృక్పథాలు నేటి సమాజానికి పనికిరాని దృక్పథాలు. ఈ దృక్పథాలు శూద్రులను అణిచివేస్తూ వారి సంపదను కైవసం చేసుకొని దోచుకొని తిన్నాయి. రాజ్యాలు, భోగాలు అనుభవించారు. అందువల్ల అవి శూద్రులకు వ్యతిరేకమైనవి. శూద్రులను దోపిడి చేసేవి. సాంఘికంగా, రాజకీయంగా ఆర్థికంగా, సాంస్కృతికంగా అణిచివేసేవి. వాటి బంధనాల నుండి బిసిలు విముక్తి కావడం వారి అభ్యున్నతికి, అభివృద్ధికి, స్వేచ్ఛకు,



సమానత్వానికి ప్రాతిపదిక అవుతుంది.

## దళిత దృక్పథం హిందూ మతానికి చివరి అంచున ఉండేది శూద్ర దృక్పథం హిందూ మతం లోపలిది

దళిత దృక్పథం హిందూ మత సవర్ణ చాతుర్వర్ణ వ్యవస్థకు చివరి అంచున ఉండేది, వర్ణ వ్యవస్థకు వ్యతిరేకమైనది. చాతుర్వర్ణంలో భాగంగా ఉన్న శూద్రులకు అది యథాతథంగా ఉపయోగపడదు. బౌద్ధ దృక్పథం, ఫెమినిస్టుల దృక్పథం, అంబేద్కరిస్టు దృక్పథం మొదలైనవి శూద్ర దృక్పథాన్ని సొంతంగా రూపొందించుకోవడానికి పునాది ప్రాతిపదికగా ఎంతో ఉపయోగపడతాయి. చరిత్ర పట్ల, మానవ సమాజ పరిణామాల పట్ల డార్విన్, మార్క్సిజం ముందుకు తెచ్చిన మౌలిక అవగాహన కూడా భారతీయ పరమైన మార్పులతో ఎంతో ఉపయోగపడుతుంది.

## అంబేద్కరిజం వెలుగును స్వీకరించాలి

అందువల్ల అంబేద్కరిజం ఇచ్చిన వెలుగులో శూద్రులు తమ శూద్ర దృక్పథాన్ని ప్రత్యేకంగా మరింత నిర్దిష్టంగా రూపొందించుకోవాల్సి ఉన్నది. శూద్రుల చారిత్రక దృక్పథం, దళిత దృక్పథం కన్నా భిన్నంగా కూడా ఉంటుంది. ఈ తేడాలు చారిత్రక దశల్లో శూద్రులు, అతిశూద్రులు పొందిన అనుభవాలు, స్థానాలను, పని నైపుణ్యాలను అనుసరించి ఏర్పడ్డవి. ఈ రెండు దృక్పథాలు విడివిడిగా స్వతంత్ర అస్తిత్వంతో కొనసాగుతూ ఒక సమన్వయం కూడా సాధించుకోవాలి.

పూలే, అంబేద్కర్ తదితరులు శూద్రుల చరిత్రను వెలికి తీయడానికి అపారమైన కృషి చేశారు. కులం, దాని నిర్మాణం, అందులోని బలం, బలహీనతలు, దాన్ని ఎలా కనిష్టం చేయాలో, అంతిమంగా కుల నిర్మూలన ఎలా సాగాలో ఇత్యాది ఆలోచనలను సశాస్త్రీయంగా వివరించిన చెప్పిన వైనం ఎవరైనా గమనించాల్సిందే. వీటిని పూలే, అంబేద్కర్ రచనల్లో సవివరంగా గమనించవచ్చు. దళితులు, బీసీల దృక్పథంతో స్థానిక చరిత్రలైనా పునర్నిర్మాణం చేయాల్సిన అవసరం ఉంది. సైద్ధాంతిక చర్చలతో, పూనా ఒప్పందంతో సాధించిన దళిత రిజర్వేషన్లను అనుసరించి బిసిలకు కూడా రిజర్వేషన్లు అడిగే సైద్ధాంతిక భూమిక, అవకాశం ఏర్పడింది. శూద్రుల తాత్విక చారిత్రక దృక్పథం మహాత్మా జ్యోతిరావుపూలే, అంబేద్కర్‌లు ఇచ్చిన వెలుగులో బుద్ధుని కాలం నుండి నేటి దాకా కొనసాగిన సామాజిక పరిణామాలను శూద్రులు కేంద్ర బిందువుగా ప్రాధాన్యతా క్రమంతో పరిశీలించేదిగా ముందుకు సాగాలి.

సకల సంపదల సృష్టికర్తలం మేమే, సకల సామాజిక పరిణామాలకు మూలం మేమే. మా శ్రమశక్తి, నైపుణ్యాల మీదే భారతీయ సమాజం కొనసాగుతూ వచ్చింది.

భారతీయ సమాజ నిర్మాతలం మేమే. భారతీయ నిజమైన చరిత్ర నిర్మాతలం మేమే అని శూద్రులు సగర్వంగా ప్రకటించుకుంటారు. అయితే ఆ క్రమంలో అగ్రవర్ణ, బ్రాహ్మణీయ దృక్పథాలను కౌగిలించుకోగూడదు. అంబేద్కరిజాన్ని నిరాకరించకూడదు. అంబేద్కరిజాన్ని నిరాకరించడం ద్వారా, హిందూయిజాన్ని కౌగిలించుకోవడం ద్వారా బిసిలు నష్టపోయే అవకాశం అధికంగా ఉంటుంది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత 60 ఏళ్ళకు కూడా చట్టసభల్లో గాంధీయిజం, కాంగ్రెస్, బిజెపి హిందూయిజం బిసిలకు రిజర్వేషన్లను కల్పించలేక పోయాయి. వ్యతిరేకిస్తూ వస్తున్నాయి. అందువల్ల గాంధీయిజం, హిందూయిజం, కాంగ్రెస్, బిజెపి తదితర పార్టీలు వాటి ఉద్యమాలు, సిద్ధాంతాలు ఎన్ని చెప్పినప్పటికీ బిసిలకు చట్టసభల్లో రిజర్వేషన్లను వ్యతిరేకించే వారే అని స్పష్టమవుతున్నది. అలాగే మార్క్సిజం, లెనినిజం, మావోయిజం కూడా బిసిలకు చట్టసభల్లోనే కాదు, ఉద్యోగ రంగంలో, చివరకు తమ పార్టీల్లో కూడా రిజర్వేషన్లను వ్యతిరేకిస్తున్నవి.

గాంధీయిజం, మార్క్సిజం, హిందూయిజం, లోహియాయిజం, మావోయిజం, నక్సలిజం మొదలైన యిజాలు, కాంగ్రెస్, టిడిపి, బిజెపి, బిఎస్‌పి, ఎస్‌పి, ఆర్‌జెడి, డిఎంకె, అన్నాడిఎంకె, సిపిఐ, సిపిఎం, నక్సలైట్ మావోయిస్టు పార్టీలు బిసిలకు మిత్రులయ్యే అవకాశం ఉంది. అయితే వారు శూద్రులకు ప్రతినిధులు కారు. శూద్రుల రాజకీయ అధికారానికి అవి అవకాశాలు ఇవ్వవు. కొంత స్థానాన్ని మాత్రమే ఇస్తాయి. అందువల్ల శూద్రులు తమ స్వతంత్రమైన సైద్ధాంతిక భూమికను, తమదైన చారిత్రక దృక్పథాన్ని స్వతంత్ర శూద్ర సైద్ధాంతిక భూమికను రూపొందించుకోవాలి.

### ఇది "శూద్ర చారిత్రక దృక్పథం"

మార్క్స్, ఏంగెల్స్‌లు చరిత్రను ఎందుకు తిరగరాశారు? పూలే, అంబేద్కర్‌లు చరిత్రను ఎందుకు తిరగరాశారు? ఆర్.ఎస్.ఎస్., బీజేపీ, వామపక్షాలు, మార్క్సిస్టులు, ప్రజాస్వామ్యవాదులు, అంబేద్కరిస్టులు చరిత్రను ఎందుకు తిరగరాశారు? అవెందుకు రాశారో ఇదీ అందుకే ! శూద్రులైన బీసీల కర్తవ్యం కోసమే ఈ "శూద్ర చారిత్రక దృక్పథం". ఇది శూద్ర హిస్టీరియోగ్రఫీని ప్రతిపాదిస్తుంది. వివరిస్తుంది. అగ్ర కులాలు శూద్రులే అని విపులీకరిస్తుంది. వారి మూలాలను వెలికి తీస్తుంది. బ్రాహ్మణిజం నుంచి బౌద్ధం వైపు నాగార్జునిలా పయనించాలని ప్రజాస్వామ్యానికి బౌద్ధం బాగా నప్పుతుందని, రాముడు, కృష్ణుడి అవతారాల కన్నా, భగవద్గీత కన్నా బుద్ధుని అవతారాన్ని బుద్ధగీతను అంబేద్కర్ చెప్పిన నవబౌద్ధంతో వాతావరణంగా వ్యాపించాలి అని ప్రతిపాదిస్తుంది. ఇది ఇప్పటిదాకా రాసిన చరిత్రలో ఖాళీలను పూరించే చరిత్ర.



# కులాల స్థిరీకరణ

# శూద్ర విప్లవం - ప్రారంభ వికాస దశలు

కుల వ్యవస్థ అని పిలువబడేది శూద్ర విప్లవం. ఆధునిక పారిశ్రామిక విప్లవం దాకా సాగిన ఉత్పత్తి విధానం, ఉత్పత్తి శక్తులు, నైపుణ్యాలు అన్నీ శూద్ర విప్లవం అని పేర్కొనడం జరుగుతున్నది. శూద్ర విప్లవమే కుల వ్యవస్థగా పిలువబడుతున్నది. శూద్ర విప్లవం స్థిరపడిన తరువాత సాంఘిక వ్యవస్థలో అంతస్తులు, రక్తసంబంధాలు అనుసరించి కులాలు స్థిరపడ్డాయి. స్థిరపడిన క్రమంలో ఘనీభవించాయి. వర్ణ వ్యవస్థ శూద్ర విప్లవ ప్రారంభదశను తెలుపుతుంది. భగవద్గీతలో జన్మనా జాయతే శూద్ర అని పుట్టిన ప్రతి ఒక్కరూ శూద్రులే అని పనిని, ప్రతిభను, సామర్థ్యాన్ని అనుసరించి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, శూద్ర వర్ణాలుగా మారారు అని ఈ శ్లోకంలో చెప్ప బడింది. గుణకర్మ విభాగశ అని చెప్పింది కూడా ఇదే అర్థంలో. అందువల్ల వర్ణాలుగా, కులాలుగా స్థిరపడడానికి ముందు మనుషులందరినీ పనిని బట్టి, ప్రతిభను బట్టి, సామర్థ్యాన్ని బట్టి నాలుగు వర్ణాలుగా వర్గీకరించి సాంఘిక సంబంధాలు, రక్తసంబంధాలు నెలకొల్పుకోవడం జరిగింది. ఈ శ్లోకాలు ఆనాటి దశను తెలుపుతాయి. జన్మనా జాయతే శూద్ర అనే శ్లోకంలోని భావం శూద్ర విప్లవ ప్రారంభ దశను అదే సమయంలో వర్ణ వ్యవస్త స్థిరపరచడానికి తీసుకున్న అభివృద్ధికరమైన సిద్ధాంతాన్ని తెలుపుతుంది.

***పరస్పర సంబంధాలు లేకపోవడం వల్ల ఒకే వృత్తి చేస్తున్నప్పటికీ వివిధ ప్రాంతాల్లో, వివిధ కులాలుగా పిలువ బడ్డారు. అలాగే ఒక కొత్త జీవావరణం, నైసర్గికత, వనరుల లభ్యత, శైవ, వైష్ణవ మత ప్రచారాలు కొత్త కులాల ఏర్పాటుకు కారణమైంది. భక్తి ఉద్యమాలు కులాలను తగ్గించబోయి రెండు, మూడు రెట్లు పెంచాయి.***

ఆధునిక పారిశ్రామిక విప్లవం ఆవిరియంత్రం, జెన్నీ నూలువడుకు యంత్రం కనుక్కోవడంతో ప్రారంభమైంది. క్రీ.శ. 1750లో వేగం పుంజుకుని 1810 నుండి యంత్రాలద్వారా ఉత్పత్తి అయిన సరుకులను వర్తక వాణిజ్యాల ద్వారా ఇతర ప్రాంతాలకు, దేశాలకు ఎగుమతి చేసే స్థాయికి ఎదిగింది. యూరప్ కేంద్రంగా పారిశ్రామిక విప్లవం

ప్రారంభమైంది. యూరప్‌లో ఆసియా దేశాలను దోచిన సంపద పోగుపడింది. ఆఫ్రికా, అమెరికా, ఆస్ట్రేలియా ఖండాల నుండి మనుషులను బానిసలుగా మార్చి అనేక రకాలుగా ఉపయోగించుకున్నారు. తద్వారా యూరప్‌లో సంపద పోగుపడింది.

అమెరికా ఖండాన్ని కనుక్కోవడం యాదృచ్ఛికంగా జరిగింది. ఇండియాకు సముద్రమార్గాన్ని కనుక్కోవడం కోసం పోర్చుగీసు నుండి కొలంబస్ క్రీ.శ. 1492లో బయలుదేరాడు. ఈ సముద్రమార్గాన్ని కనుక్కోవడం ఎందుకవసరమైందంటే కాన్‌స్టాంట్ నోపుల్‌పై ముస్లింల (ఖలీఫాల) అధికారం స్థిరపడింది. కాన్‌స్టాంట్‌నోపుల్ నగరంపై అధికారం ఉన్నవారే అటు ఆసియా, ఇటు యూరప్ దేశాల భూమార్గాలను, వర్తక వాణిజ్యాలను నిర్దేశిస్తారు.

ఖలీఫాలు యూరప్ దేశీయుల వర్తక వాణిజ్యాలను కాన్‌స్టాంట్ నోపుల్ మీదుగా జరగడాన్ని అడ్డుకున్నారు. అందువల్ల ఇండియాతో వర్తక వాణిజ్యాలకు మరో మార్గంగా సముద్రమార్గాన్ని వెతుక్కుంటూ బయలుదేరి ఇతర ఖండాలను కనుక్కోవడం జరిగింది. దాంతో చరిత్ర గతి మారింది. భారతదేశంలోకి ప్రవేశించిన పోర్చుగీసు, ఫ్రెంచి, ఇంగ్లాండ్ వర్తక వాణిజ్య సంస్థలు తమ దేశంలో వలెనే సొంత సైన్యాలను ఏర్పర్చుకున్నారు.

వీరు అక్బర్ కాలం నుండి ఇండియాలో ప్రవేశించి ఔరంగజేబు కాలం నాటికి స్థిరపడ్డారు. 350 సంవత్సరాలు ఆసియాదేశాల నుండి దోపిడీ చేసి కూడబెట్టిన సంపదతో యూరప్‌లో పారిశ్రామిక విప్లవం ముందుకు వచ్చింది అని సుప్రసిద్ధ సోషలిస్టు రామ్‌మనోహర్ లోహియా అంటాడు.

కుల వ్యవస్థ, స్థిర నివాసం, స్థిర వ్యవసాయం, పశు పోషణ, కులవృత్తుల స్థిరీకరణను తెలుపుతుంది. బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వారు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలుగా స్థిరపడిన తరువాత నాగలి దున్నలేదు. నాట్లు వేయలేదు. కత్తులు చేయలేదు. బట్టలు నేయలేదు. రాళ్ళు కొట్టలేదు. తాటి చెట్లు ఎక్కలేదు. చేపలు పట్టలేదు. పశువుల మందలను కాయలేదు. ఇలా మూడు వర్ణాలు ఉత్పత్తికి దూరమయ్యాయి. ఉత్పత్తిని వాడుకొనే వినియోగదారులుగా బ్రాహ్మణులు ఎదిగారు. ఉత్పత్తిని సంపదను పన్నుల రూపంలో సేకరించే వారుగా రాజులు ఎదిగారు. వైశ్యులు ఉత్పత్తిని, సంపదను వర్తక వాణిజ్యాల ద్వారా సేకరించి వ్యాపారం చేస్తూ సంపద కూడ గట్టారు.

వేల కులాలు ఏర్పడడానికి కుల వృత్తులు కారణం కాదు. ఇప్పటికీ గ్రామాల్లో కుల వృత్తుల ప్రకారం చూస్తే 25-30 రకాల కులవృత్తుల కన్నా ఎక్కువ ఏ గ్రామంలోనూ కనపడరు. అనగా వ్యవసాయం ఉత్పత్తులు, పశువుల పెంపకం మొదలైనవి అన్నీ చేయడానికి గ్రామాల్లో 25-30 కులాలే అవసరం. అందుకే పూర్వం రాజులు ఒక



గ్రామాన్ని రూపొందించడానికి 16 కులాల వారిని పిలిచి వారికి భూమి కూడా కేటాయించి ఆ ఊరి మీద వృత్తి చేసుకునే హక్కు ఇస్తూ అడవులు నరికి, చెరువులు పోసి, ఊర్లు నిర్మించి గ్రామాలను రూపొందించారు. ఆ 16 కులాలకు బదులుగా నేడు 25-30 కులాలు కనపడతాయి. అయితే వందల కులాలుగా ప్రజలు చీలిపోవడానికి కారణం ఏమిటి? స్థానిక తెగల రక్త సంబంధాలకు పరిమితం కావడం వల్ల కులాలు పెరిగాయి. సంచార తెగలుగా జీవించే తెగలు నేటికీ తమ రక్త సంబంధాలను తమ తెగకే పరిమితం చేసుకోవడం చూడవచ్చు. ప్రతి కులం నేటికీ ఇలా రక్తసంబంధాలను తమ కులానికే పరిమితం చేసుకోవడం గణ తెగల, జన పదాల కాలం నాటి సంప్రదాయం. దీనివల్ల కుల వృత్తులు ఎక్కువ లేకపోయినా కులాలు ఎక్కువయ్యాయి.

కుల వృత్తులు ఖనిజ లోహాల వెలికితీత నుండి ప్రారంభమయ్యాయి. కొత్త రాతి యుగంలో ప్రారంభమైన కంచుయుగం నుండి ఇనుప యుగం దాకా సాగిన కాలంలో శూద్ర విప్లవం ప్రారంభమై స్థిరపడింది. క్రీ.పూ. 10వ శతాబ్దంలో ప్రారంభమై క్రీ.పూ. 7వ శతాబ్దంలో ఇనుప యుగం స్థిరపడడం నుండి కులాలుగా స్థిరపడడం మొదలైంది.

శూద్ర విప్లవం ప్రధానంగా చేతి వృత్తుల విప్లవం. కుటీర పరిశ్రమల విప్లవం. అంతకుపూర్వం సాగిన జీవన విధానం వ్యవసాయం, పశుపోషణ, ఆహారసేకరణ, వేట దశలకు సంబంధించినది. వ్యవసాయం, పశుపోషణ, ఆహారసేకరణ దశలో వర్ణ వ్యవస్థ రూపుదిద్దుకున్నది. వర్ణ వ్యవస్థలోకి ఇతర నిపుణులను కలుపుకోవడానికి వృత్తి కులాల నుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల్లో కలుపుకోవడానికి జన్మనా జాయతే శూద్ర అనే సూత్రీకరణను ప్రవేశపెట్టారు. తద్వారా వృత్తి కులాలలోని మేధావులను, శాస్త్రవేత్తలను, కుల పెద్దలను కలుపుకొని పై వర్ణాల్లోకి మార్చుకొన్నారు. వృత్తి కులాల నుండి వ్యతిరేకత రాకుండా చేసుకోవడం జరిగింది. ***అలా శతాబ్దాల తరబడి వృత్తి కులాల నుండి పై మూడు వర్ణాలలోకి మారుతూనే వచ్చారు. అలా అన్ని కులాల నుండి, అన్ని తెగల నుండి రూపొందిన వర్ణాలే బ్రాహ్మణ, క్షత్రియ వైశ్య వర్ణాలు.***

శూద్ర విప్లవం స్థిరపడి శూద్ర కులాలుగా స్థిరపడిన తరువాత కూడా శతాబ్దాల తరబడి శూద్ర కులాల నుండి పై మూడు వర్ణాలలోకి చేరిక అనేది కొనసాగుతూనే వచ్చింది. "నాగశాల" ఈ క్రమం తెలుపుతుంది. అందువల్లే పై మూడు వర్ణాల వాళ్ళు స్థానిక భాషలను, స్థానిక దేహ నిర్మాణాలను, రంగును కలిగి ఉండడం జరిగింది. ఒక ప్రాంతంలోని పై మూడు వర్ణాలు ఆ ప్రాంతంలోని మిగతా శూద్ర, అతిశూద్ర కులాల వారినే అన్ని విధాలుగా పోలి ఉండడం గమనించవచ్చు.

పై మూడు వర్ణాలు తమ సంబంధాలకు అనువుగా స్థానిక భాషల నుండి అనుసంధాన భాషలను రూపొందించుకోవడం అవసరమైంది. బౌద్ధులు, బౌద్ధం, సామ్రాజ్యాలు అనుసంధాన భాష అవసరాన్ని తొలిసారిగా గుర్తించాయి. స్థానిక భాషల నుండి అనుసంధాన భాషలను రూపొందించుకున్నారు. అలా ప్రాకృతం, పాళి, సంస్కృతం భాషలు స్థానిక, ప్రాంతీయ భాషల పదాలను, నుడికారాలను, వ్యాకరణాన్ని తీసుకొని సమన్వయించి రూపొందించడం జరిగింది. బౌద్ధ విశ్వవిద్యాలయాలు పాళి ప్రాకృతాలను తొలి దశలో విశ్వవ్యాప్తంగా ప్రచారం కావడానికి ఎంతగానో ఉపకరించాయి. రెండవ దశలో సంస్కృతం విశ్వ వ్యాప్తం కావడానికి కూడా బౌద్ధం, బౌద్ధ విశ్వవిద్యాలయాలు ఉపకరించాయి.

ఖనిజ లోహ యుగంలో అనేక కుటీర పరిశ్రమలు అవసరమయ్యాయి. వాటి ఉత్పత్తులు, ప్రకృతి సంపదను వర్తక వాణిజ్యాల ద్వారా ఇతర దేశాలకు రాకపోకల ద్వారా తరలించారు. అక్కడి సంపదను ఇక్కడికి తెచ్చారు. విదేశాలతో బౌద్ధ కాలంలో వర్తక వాణిజ్యాలు బాగా కొనసాగాయి. అందుకు అనుగుణంగా బౌద్ధం శాంతియుత సహజీవనాన్ని ప్రవేశపెట్టింది. దొంగతనాలను చాలా దుర్మార్గమైనదిగా సూత్రీకరించింది. దొంగతనాలు తెగ జీవితంలో ఆహారసేకరణ దశలో భాగంగా హక్కుగా భావించారు. 18వ శతాబ్దం దాకా ప్రపంచ వ్యాప్తంగా ఇలాగే కొనసాగింది. జపాన్‌లో ఇలా దాడి చేసి ఎత్తుకుపోయే దండయాత్రలను నిరోధించడానికి సమురాయ్‌లు, సుమోలు అనే ప్రత్యేక వర్ణాన్ని రూపొందించుకున్నారు. భారతదేశంలోను ఇలా ప్రత్యేక వర్ణాలు ఏర్పడ్డాయి.

శూద్ర విప్లవంలో ప్రధాన పాత్ర విశ్వకర్మలది. అటు తరువాత నేత, తోలు, కుమ్మరి, శిల్పకార పరిశ్రమలది. బంగారం, వెండి, ఇత్తడి, రాగి, కంచు, ఇనుము రాజ్యాలకు, సామ్రాజ్యాలకు ఆయుధాలను, మారకపు నాణాలుగా, అలంకరణలుగా, వంట సామాగ్రిగా ఉపయోగ పడ్డాయి. అందువల్ల వీటి వెలికితీత పెరిగిన మేరకు రాజ్యాలు సామ్రాజ్యాలుగా ఎదిగాయి. ఇనుము ఒక పరిశ్రమగా ఏర్పడ్డ తరువాతే సామ్రాజ్యాలు ఏర్పడే అవకాశం ఏర్పడింది. ఇనుములోని గట్టితనం, విస్తారంగా దొరకడం వల్ల కత్తులకు, బల్లాలకు, డాల్‌లకు, ఈటెలకు, రథాలకు, గుర్రాలకు, ఏనుగులకు అన్నిటికీ సంబంధించిన పరికరాలను ఆయుధాలను తయారుచేసుకోవడం వల్ల యుద్ధం చేయడానికి సాధనాలు పెరిగాయి. అలా ఇనుము, ఇనుప పరిశ్రమలు ఉన్న చోట నుండి సామ్రాజ్యాల ఏర్పాటు ప్రారంభమైంది. దక్షిణ భారతదేశంలో క్రీ.పూ. 10వ శతాబ్దం నాటికే ఇనుప ఖనిజాలు వెలికితీత వేగం పుంజుకుంది. అవి జనపదాలు, మహాజనపదాలుగా మారడానికి ఉపయోగపడ్డాయి. నేటి నిజామాబాద్ జిల్లా కమ్మర్‌పల్లి ప్రాంతంలోని అనేక గ్రామాల్లో క్రీ.పూ. నాటి ఇనుప ఖనిజాల బట్టీలు ఇటీవల బయల్పడ్డాయి. అక్కడి నుండి డమాస్కస్‌కు ఇనుప ముద్దలు ఎగుమతి



చేయబడ్డాయి అని సాక్ష్యాలు వెలికి వచ్చాయి. ఈ క్రమంలో శాతవాహన పూర్వ రాజ్యాలు మహా జనపదాల నుండి రూపుదిద్దుకున్నాయి. అటు తరువాత శాతవాహన సామ్రాజ్యం ఏర్పడింది.

శాతవాహనులు బంగారం తవ్వడానికి, తయారు చేయడానికి, వెండి, రాగి, ఇనుము, ఇత్తడి, కంచు వెలికి తీయడానికి గనులను తవ్వించారు. వాటి కోసం ప్రత్యేకంగా విశ్వబ్రాహ్మణులు అని పిలువబడుతున్న కంచర, కమ్మరి, అవుసుల శిల్పుల, కుమ్మరుల, వడ్రంగులతో పరిశ్రమలను విస్తరింపజేశారు. ఒక అభిప్రాయం ప్రకారం శాతవాహనుల్లో కొందరు కుమ్మరి వారి పుత్రులు అంటారు. కొందరు అయివుండ వచ్చు కూడా. కుమ్మరి కులం విశ్వబ్రాహ్మణ కులాల్లో ఒకటిగా చాలా కాలం భావించబడింది. కుండలు చేసే వృత్తి అతి ప్రాచీనమైనది.

కుండలు చేయడానికన్నా రాతితో ఆయుధాలు, శిల్పాలు, బొమ్మలు చెక్కడం ఇంకా ప్రాచీనమైనది. కనుక ఆ వృత్తులు కొనసాగిస్తున్న విశ్వబ్రాహ్మణ కులాలకు శాతవాహన సామ్రాజ్యం నిర్మించిన ఖ్యాతిలో వాటా వుంది. అలాగే నంద రాజులు, మౌర్య రాజులు, గుప్త రాజులు నిర్మించిన సామ్రాజ్యాల ఖ్యాతిలో విశ్వబ్రాహ్మణులు, కుమ్మరులు, నేత, తోలు ఉత్పత్తుల నిపుణులు నిర్వహించిన పాత్ర మహోన్నతమైనది. అప్పటికి కులాలుగా విభజన జరగక పోయినప్పటికి ఆ వృత్తులకు నేటికీ వారసులైన వారికి కూడా ఆ ఖ్యాతి దక్కడం సహజం.

నాణేల తయారీలో, నగల తయారీలో, కిరీటాల తయారీలో, శాసనాలు చెక్కడంలో, కత్తులు, డాల్లు, కవచాలు, కోటల తలుపులు తయారుచేయడంలో, వజ్రాలు, రత్నాలను పొదగడంలో, వాటి నాణ్యతను నిర్ణయించడంలో విశ్వకర్మ, విశ్వబ్రాహ్మణ కులాలకు చెందిన ఆదివాసి జాతులు, తెగలు ప్రధాన పాత్ర నిర్వహించాయి. కోటలు కట్టడంలో ఆదివాసి గిరిజన తెగలతో పాటు అంటరానివారుగా పిలువబడుతున్న బౌద్ధ, జైన తెగలు, జాతులు, మొదలైన వారితో పాటు శిల్పులు, విశ్వబ్రాహ్మణ కులాలుగా రూపొందిన వారి పూర్వీకుల నైపుణ్యం, ఇంజనీరింగ్ పనితనం కొనియాడదగినది.

సోమనాథ్ దేవాలయం, దాని నిర్మాణం ఖ్యాతి శిల్పులకు, విశ్వకర్మలకే చెందుతుంది. ధనరాశుల రహస్యాలన్నీ విశ్వకర్మ, విశ్వబ్రాహ్మణ, శిల్పుల నిర్మాణ సహకారం ద్వారానే రహస్యంగా గర్భగుళ్ళలో, కోటల్లో దాచుకోవడం సాధ్యం. అలా శిల్పులకు, విశ్వబ్రాహ్మణులకు రహస్యాలు చాలా తెలుసు. అందుకని బ్రాహ్మణుల కన్నా తాము ఎంతో గొప్పవారమని ప్రకటించుకున్నారు. నిజానికి విశ్వబ్రాహ్మణులుగా ఇటీవల పేరుపెట్టుకున్న విశ్వకర్ములు, పారిశ్రామిక ఉత్పత్తిదారులు, పారిశ్రామికవేత్తలు చరిత్రలో తోలు విప్లవం తర్వాత, నూలు విప్లవంతో పాటు గొప్ప పారిశ్రామిక విప్లవానికి వారసులు, నిర్మాతలు.

ఇలాంటి నైపుణ్యం గల విశ్వకర్మలు లేకుండా ఏ రాజు కూడా, ఏ బ్రాహ్మణ పూజారులు కూడా బంగారం, వెండి, ఇత్తడి, కంచు, రాగి వంటి లోహాలను నాణ్యంగా రకరకాల రూపంలోకి మార్చుకోవడం, ఆయుధాలుగా చేయించుకోవడం, దాచుకోవడం సాధ్యం కాదు. అందువల్ల బ్రాహ్మణ పూజారుల పని పూర్తి అయ్యాక విశ్వకర్ములు హత్య చేయబడుతుండేవారని, రాజులు కోటల్లోని రహస్య సొరంగాలను నిర్మించినవారిని కూడా ఇలాగే హత్య చేసేవారని ప్రజల్లో విస్తారంగా ప్రచారంలో ఉంది. అది వాస్తవమేనని చరిత్రకారుల అభిప్రాయం.

ఆచార్య నాగార్జునుని కాలంలో మరొక రససిద్ధి పొందిన విశ్వకర్మకు చెందిన నాగార్జునుడు ఉండేవాడని, అతడు రసవిద్యతో బంగారం తయారుచేసేవాడని, ఆ విద్యని విశ్వకర్మ వృత్తివారు తరతరాలుగా రహస్యంగా కొనసాగించారని భావించబడుతున్నది.

లోహాల తయారీలో, వాటి నాణ్యత పెంచడంలో, అందమైన కళాకృతుల్లోకి మలచడంలో, రకరకాల కిరీటాలు, నగలు, దేవుళ్ళ ఆభరణాలు తయారుచేయడంలో, శిల్పాలు చెక్కడంలో, వజ్రాలను సానపెట్టడంలో ఇలా మొత్తం పారిశ్రామిక విప్లవంలోని సైన్సు టెక్నాలజీ నిర్మాతలు, నిపుణులు, ఆదివాసి గిరిజన తెగల నుండి ఎదిగి విశ్వకర్మ, విశ్వబ్రాహ్మణ వృత్తిదారులుగా, కులాలుగా, నేత కులాలుగా పరిణామం చెందారు.

నందరాజులు, మౌర్య రాజులు, శాతవాహనులు, గుప్తుల కాలంలో సంపద, వస్తు మారకం నుండి నాణేల మారకం లోకి, బంగారం, వెండి, రాగి నాణేల మారకంలోకి మారడానికి, నాణేల అచ్చులు తయారు చేయడంలో విశ్వకర్మ వృత్తిదార్లు చేసిన కృషి మహోన్నతమైనది. వీరి కృషితో సృష్టించిన లేదా కళాకృతులుగా మార్చిన వాటిని గుళ్ళల్లో బ్రాహ్మణ పూజారులు తమ ఆస్తులుగా దాచుకున్నారు. వాటిని దాడుల్లో సేకరించి అరబ్బుదేశాలకు తరలించారు. అందులో మయూర సింహాసనం ఒకటి. ఇది ప్రపంచంలోని గొప్ప కళాకృతుల్లో ఒకటి.

విశ్వకర్ములను తమ దేశాలకు పంపించకపోతే యుద్ధాలు చేసి రాజులను ఓడించి విశ్వకర్ములను పంపించే ఒప్పందాలు చేసుకుని , సంధి కుదుర్చుకుని తిరిగి రాజ్యాలను అదే రాజులకు అప్పగించిన చరిత్ర కనపడుతున్నది. ఉదాహరణకు కనోజ్ రాజ్యాన్ని జయించాక వేలాది మంది నిపుణులను తరలించుకుపోయి రాజ్యాన్ని తిరిగి రాజుకు ఇచ్చివేయడం. దీని ద్వారా విశ్వకర్మ వృత్తిదార్ల ప్రాధాన్యత ఏమిటో స్పష్టమౌతున్నది. ఇండియా నుండి మౌర్యుల కాలంలోను, శాతవాహనుల కాలంలోను రోమ్, గ్రీకు దేశాలకు విశ్వకర్మ వృత్తిదారులను ఎంతో గౌరవంతో, నిర్బంధంతో వందలాది మందిని తీసుకువెళ్లారు. రాజులు వారిని నయానా, భయానా ఒప్పించి పంపించారు.



అలా ప్రపంచమంతటా ఇండియాలోని కళలు, నైపుణ్యాలు ఇతర దేశాల్లో కూడా విస్తరించాయి. వాటిలోని పోలికలకు కారణం విశ్వకర్మ వృత్తిదార్లను కూడా తీసుకు వెళ్ళడమే ప్రధాన కారణం. ఇది ఆ కాలంలో ప్రధానమైన విద్యగా, రహస్య విద్యగా, విద్యా శాస్త్రంగా కొనసాగింది. బౌద్ధ విశ్వవిద్యాలయాల్లో ఈ విద్యను అభ్యసించడం కోసం ఇతర దేశాల నుండి వేలాది మంది వచ్చేవారు. విశ్వకర్మ వృత్తిదార్ల నుండి ఎదిగిన బౌద్ధ, జైన ఆచార్యులు, ప్రొఫెసర్లు, వీటిని నేర్పేవారు. వీటి సంబంధించిన విహారాలను ఎ.నమ్మాళ్వారు 'ప్రాచీన భారత విశ్వవిద్యాలయములు' (1953) అనే గ్రంథంలో చక్కగా వివరించారు.

శాతవాహనులు నౌకల నిర్మాణంలో తోలును విరివిగా ఉపయోగించేవారు. వ్యవసాయంలో వాగుల ద్వారా నీరును ఉపయోగించేవారు. అందుకు తోలుతో చేసిన చేటలను అటొకరు ఇటొకరు తాళ్ళతో పట్టుకుని నీటిని తోడేవారు. కాళ్ళకు చెప్పులు వాడేవారు. తోలును నీటి రవాణా కుండలుగా వాడేవారు. గుర్రాల మీద తోలు కుండల్లో నీరు తీసుకుని వెళ్ళేవారు. ఇలా తోలు ఉత్పత్తులు, తోలు పరిశ్రమ విస్తరించింది. నందరాజుల కాలం నుండి కృష్ణదేవరాయల కాలం దాకా తోలు పరిశ్రమ ప్రాధాన్యత కలిగి ఉంది. ఇప్పటికీ ఇది ఎంతో ప్రాధాన్యత కలిగిన పరిశ్రమ.

తోలు పరిశ్రమ అభివృద్ధి చెందించటంలో భాగంగా ప్రత్యేక పారిశ్రామిక వాడలు ఏర్పడ్డాయి. వారు బౌద్ధాన్ని, జైనాన్ని స్వీకరించారు. బౌద్ధం, జైనం స్వీకరించిన వారిని వీరశైవ, వైష్ణవ ఉద్యమాలు చంపివేశాయి. చిత్రహింసలు పెట్టాయి. తక్కువ కులాలుగా వర్గీకరించాయి. దాంతో సంపద సృష్టించే వృత్తికులాలు ఇస్లాంలోకి చేరిపోయాయి. బెంగాల్‌లో ముస్లింలుగా అలా మతం మార్చుకున్నారు.

దక్షిణ ఇండియాలో శైవ, వైష్ణవ మతాల్లోకి కొందరు చేరిపోయారు. మరికొందరు చేరకుండా వారిని ఎదిరించారు. దాంతో వారిని అంటరానివారిగా ముద్రవేసి రకరకాల కథలు వారికి వ్యతిరేకంగా సృష్టించారు. ఇలా తోలు విప్లవం కోసం, అడవులను వ్యవసాయయోగ్యం చేయడం కోసం ఊరికి దూరంగా ప్రారంభమైన నివాసాలు, కాలనీలు అంటరాని కులాల గూడెంలుగా పిలువబడ్డాయి. విలువ మార్చబడ్డాయి. కంచ ఐలయ్య మాదిగ తత్వం అనే తన వ్యాసంలో ఇలాంటి విశేషాలను చరిత్ర నుండి, అంటరాని కులాల కులపురాణాల నుండి, చారిత్రక పరిణామాల నుండి సంశ్లేషించి స్పష్టం చేశారు. ఇందుకు తొలి ఆధారాలను డా॥ బి.ఆర్. అంబేద్కర్ సేకరించి అస్పృశ్యులు ఎవరు అనే గ్రంథంగా ప్రచురించారు.

శాతవాహనుల కాలంలో వారి రాజ్య పరిపాలనలోకి వచ్చిన ఉత్తర, దక్షిణ, తూర్పు, పడమర ప్రాంతాల్లో ఇలా తోలు పరిశ్రమలు, వ్యవసాయం, లోహ పరిశ్రమలు

విస్తరించాయి. నంద రాజుల, మౌర్యుల కాలంలో ఈ పరిశ్రమల విస్తరణ పాటలీపుత్రం సమీప ప్రాంతాలకే పరిమితమైనట్లుగా తెలుస్తున్నది.

శాతవాహనుల పరిపాలన బౌద్ధ, జైన, ప్రజాస్వామిక విధానాలతో కొనసాగింది. రెండవ దశలో బ్రాహ్మణ వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ సిద్ధాంతాలను స్వీకరించి ప్రజల్లో ప్రవేశపెట్టే చర్యలు తీసుకున్నారని తెలుస్తున్నది. అయితే ప్రజల్లో విద్యా విధానంలో శ్రీపర్వతం విశ్వవిద్యాలయం, ప్రతిష్ఠానపురం విహారాలు బౌద్ధ సిద్ధాంతాలతో విద్యావిధానాన్ని అందరికీ అందించినట్టుగా భావించబడుతున్నది.

చరిత్రలో ఉత్పత్తి విధానాలు, వాటి పరిణామం గురించి వైవిధ్యపూరితమైన సిద్ధాంతాలు, సూత్రీకరణలు వెలువడ్డాయి. రాజరిక వంశాల చరిత్ర లభించని కాలంనాటి ఉత్పత్తి విధానాలను మొత్తం మానవాళి ఉత్పత్తి విధానాలుగా చరిత్రకారులు వర్ణించారు. గార్డెన్ చైల్డ్, డి.డి.కోశాంబి మొదలైన వారు ఈ పద్ధతిని ఎన్నుకున్నారు.

రాజరిక వంశాల చరిత్ర లభించిన తర్వాత కూడా వీరు ఇదే పద్ధతిని ఎవరి పేరు లేకుండా కళల శాస్త్రాల అభివృద్ధిని చర్చించారు. చరిత్రలో లభ్యమయ్యే పేర్ల కోసం వీరు కృషి చేయలేదు. అదే సమయంలో భావజాల రంగాల్లో కృషి చేసిన వారి పేర్లను పేర్కొంటున్నారు.

కాని తోలు, నూలు, లోహాలు, శిల్పాలు, కళలు, సంగీత వాయిద్యాలు కనుక్కొని అభివృద్ధిపరచి పరిశ్రమలుగా విస్తరింపజేసిన వారి కృషిని వారి పేర్లతోగాని, వారు వచ్చిన వర్గాలు, కులాల పేరుతోగాని, వృత్తుల పేర్లతో గాని సంశ్లేషించి పేర్కొనడం లేదు. శ్రీరామ్ సాఠే, ఎం.వి.ఆర్.శాస్త్రి, కోట్ల వేంకటాచలం, దామోదరశాస్త్రి, పి.ఎన్.ఓక్ వంటి ఆర్.ఎస్.ఎస్. వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంత ప్రచార చరిత్రకారులు కూడా ఆయా వృత్తులకు, వర్ణాలకు, కులాలకు ఈ ఖ్యాతి చెందుతుందని చరిత్ర రచనలో చెప్పకపోవడం శోచనీయం. చరిత్రలో ఆయా వృత్తులు నిర్వహించిన మహోన్నత పాత్రను వీరు వదిలివేయడం సరియైనది కాదు.

నందరాజులు, మౌర్యులు, శాతవాహనులు, గుప్తుల కాలంలో, మధ్యయుగాల్లో ఆయా వృత్తులు, వృత్తికులాలు, వారి నైపుణ్యం మానవ నాగరికతకు, ఇండియాలోని మొత్తం సమాజంలో వారు నిర్వహించిన మహోన్నత కృషిని ప్రశంసించినప్పుడే చరిత్ర సమగ్రమౌతుంది. ప్రజల చరిత్ర గుర్తించినట్లవుతుంది. పేరులేకుండా చరిత్ర రాయడం, కొందరి గురించి మాత్రమే పేర్లు రాయడం వర్ణ వివక్షతకు సంబంధించిన వర్ణవాద, కులవ్యవస్థవాద దృక్పథం అవుతుంది.

చరిత్రలో బంగారం, వెండి, వజ్రవైఢూర్యాలు, రత్నాలు, నాణేలు, నోట్లు నిర్వహించిన పాత్ర మహోన్నతమైనది. వస్తుమారకంలోని వస్తువుకు విలువ కట్టి



సంక్షిప్త రూపంలోకి విలువను మార్చడం ద్వారా బంగారం విలువ నిర్ణయించబడింది. బంగారం విలువను అనుసరించి వెండి విలువ నిర్ణయించబడింది. వస్తుమారకం నుండి నగదు మారకంలోకి మారడానికి తొలుత గవ్వలు, రాళ్ళు మొదలైనవి ఉపయోగించారు. తర్వాత రాగి నాణేలు వచ్చాయి. అటు తర్వాత బంగారు, వెండి కూడా నాణేలుగా ప్రవేశపెట్టబడ్డాయి. ఇప్పటికీ ద్రవ్య విలువల నిర్ణయంలో బంగారం, వెండి పాత్ర కొనసాగుతూనే ఉన్నది. మానవ సమాజం నిర్ణయించుకున్న విలువలు ఇలా బంగారం, వెండి రూపంలో వేల ఏళ్ళుగా కొనసాగుతూ క్రీ.శ.2007 నాటికి కూడా మార్గదర్శకంగా ఉన్నాయి.

బంగారంతో పాటు ఒక దేశంలోని మొత్తం సరకుల ఉత్పత్తి, వాటి నాణ్యత, విలువ అనుసరించి ద్రవ్యం (కరెన్సీ) యొక్క నోట్ల విలువను లెక్కించడం జరుగుతున్నది. ఒక దేశపు రిజర్వు బ్యాంకులో ఎంత బంగారం నిల్వ వుంటుందో అంతే విలువ గల కరెన్సీని చలామణిలోకి తెస్తుంది. అంతకన్నా ఎక్కువ ముద్రిస్తే ద్రవ్యోల్బణం పెరిగి ధరలు పెరుగుతాయి. అనగా నోట్లు ఎక్కువవుతాయి. సరుకులు అంతే వుంటాయి. తద్వారా ధరలు పెరుగుతాయి. అందువల్ల ఎక్కువ నోట్లు ప్రభుత్వాలు అచ్చువేయడం పన్నులు వేయడంతో సమానం. లేదా దొంగతనంతో సమానం. ఇతర దేశాలతో మారకపు విలువను నిర్ణయించడంలో ఆ దేశంలోని బంగారంతో పాటు సరకుల ఉత్పత్తి విలువను కూడా లెక్కిస్తున్నారు. క్రీ.శ.1935లో ఇండియాలోని రూపాయి విలువను, ఇంగ్లండ్‌లోని పౌండ్ విలువను మారకం విలువల్లో వచ్చిన సంక్లిష్టతను పరిష్కరించడానికి డా॥ బి.ఆర్. అంబేద్కర్ రూపాయి విలువ అనే గ్రంథాన్ని రాశారు.

బంగారం, వెండి, రత్నాలు, వజ్రవైఢూర్యాలు తరలించుకు వెళ్ళడానికి రవాణాలో ఎంత సౌకర్యంగా ఉంటాయో వాటిని దాడి చేసి తీసుకుపోవడం కూడా అంతే సులభం. అందువల్ల వీటికి భద్రత ఏర్పాట్లు చేశారు. ఒక ప్రాంతం నుండి పన్నుల రూపంలో వసూలు చేసిన ధాన్యాన్ని అక్కడే వ్యాపారులకు అమ్మి బంగారం, వెండి రూపాల్లో సంపదను రాజులు తరలించుకు వెళ్ళేవారు. అది పసికట్టిన వాళ్ళు కొందరు దారిదోపిడీలతో వాటిని తీసుకుపోయేవారు.

బౌద్ధం, జైనం దొంగతనాన్ని మహాపాపంగా పరిగణించింది. తద్వారా రాజులకు, వ్యాపారులకు సంపదను తరలించుకు పోవడంలో, సరకులు రవాణాలో ఎంతో మేలు జరిగింది. దారిదోపిడీలు తగ్గిపోయాయి. అందువల్ల రాజులు, వ్యాపారులు, జైన, బౌద్ధ విహారాలకు, విశ్వవిద్యాలయాలకు సబ్సిడీలను, గ్రాంటులను, దానాలను విరివిగా ఇచ్చారు. శాతవాహన రాజులు కూడా ఇలాగే జైన, బౌద్ధ విహారాలకు, విద్యాలయాలకు దానాలిచ్చారు. రోమ్‌తో చేసిన వ్యాపారంలో వచ్చే లాభాలను కూడా ఇలా విహారాలకు ఇచ్చేవారు.

ప్రజలు తోలుతో పలు వాయిద్యాలను తయారు చేసుకున్నారు. వెదురు కర్రతో పిల్లనగ్రోవితో పాటు పలు పరికరాలు తయారుచేసుకున్నారు. కంచు, ఇనుము, రాగితో కూడా వాయిద్యాలు చేసుకున్నారు. జంతువుల నరాలతో విల్లును, బాణాన్ని తయారుచేసుకున్నారు. జంతు నరాలను, తోలును గుమ్మడి బుర్రను అనుసంధానించి తాంబుర్ర, వీణ తొలి రూపాలను రూపొందించుకున్నారు. ప్రజలు ఎప్పటికప్పుడు ఇలా కొత్త వాయిద్యాలను తయారు చేసుకున్నారు. రాజులు రాజాస్థాన వాయిద్యకారులు సంగీత కారులు, దేవాలయాల్లోని వాయిద్యకారులు వీటిని మరింత అభివృద్ధి పరిచారు. అలా వాయిద్యాలు సంగీత వాయిద్యాలు, సంగీతం నిరంతరం అభివృద్ధి చెందుతూ వచ్చింది. శివుని ఢమరుకం డప్పు తర్వాత సృష్టించిన వాయిద్యం. శాతవాహనులు ఇలాంటి వాయిద్యాలను, సంగీతాన్ని, కళలను పెంచి పోషించారు.

పత్తి నుండి నూలును ప్రతి ఇంటా వడికేవారు. ఎవరి బట్టలకు వాళ్ళే నూలు వడుకుకొని బట్టలు నేయించుకునేవారు. నూలు బట్టలు, పట్టు బట్టలు ఎగుమతి ప్రారంభమయ్యేదాకా విస్తారమైన పరిశ్రమగా విస్తరించింది. చైనా, ఇండియాల మధ్య ఏర్పడ్డ దారిని సిల్క్ (పట్టుదారి) అని పిలిచారు. అలా దారిపేరే పట్టుదారి అని ప్రాచుర్యం పొందింది. ఇలా బౌద్ధం, విదేశీ వర్తక వాణిజ్యాలు విడదీయరాని విధంగా విదేశాలకు విస్తరించాయి. పరస్పరం ఆధారపడి ఇవి విస్తరించాయి. బౌద్ధ ఆరామాలు, విశ్వ విద్యాలయాలు ఆయుర్వేదం, ఖనిజలోహ వెలికితీతలను, నైపుణ్యాలను నేటి విశ్వ విద్యాలయాల వలె నేర్పేవి. అక్కడ నేర్చుకున్నవాళ్ళు ప్రపంచం అంతటా విస్తరించారు. క్రీ.పూ. నాలుగవ శతాబ్దం నుండి క్రీ.శ. ఏడవ శతాబ్దం దాకా విస్తరించిన ఈ క్రమం వల్ల ప్రపంచ భాషల్లో ఎంతో పద సంపద చేరింది. ఆయా స్థానిక భాషల్లో, అనుసంధాన భాషల్లో భారతీయ భాషల పదాలు, ఆనవాళ్ళు కనపడడానికి బౌద్ధం, విదేశీ వర్తక వాణిజ్యాలు ప్రధాన కారణం.

బౌద్ధ, జైన కాలంలో విదేశీ వర్తక వాణిజ్యాలు కొనసాగాయి. వినియోగం తక్కువ. ఎగుమతి ఎక్కువ సాగింది. విద్య పరోపకారం, కోరికల అదుపు అనేవి ఈ మతాలు సంస్కారంగా మార్చడం వల్ల ఇది సాధ్యపడింది. బ్రాహ్మణీయ గుళ్ళు, బ్రాహ్మణీయ సంస్కృతిలో వినియోగం ఎక్కువ. గుళ్ళలో సంపద పేరుకు పోయింది. బౌద్ధ విశ్వ విద్యాలయాల పద్ధతి, బ్రాహ్మణిజంలో కొనసాగించలేదు. గురుకుల పద్ధతిని, గురువును ఆశ్రయించే పద్ధతిని మాత్రమే కొనసాగించేవారు. సంపద బ్రాహ్మణ వ్యవస్థలో గానా బజానాలకు ఖర్చయింది. విదేశీ వాణిజ్యం ఆగిపోగానే సంపద సర్క్యులేషన్ ఆగిపోయింది. సంపద గుళ్ళల్లో, బ్రాహ్మణుల్లో కేంద్రీకరణ పెరిగిపోయింది. తద్వారా విదేశీ దాడులు తీవ్రమయ్యాయి. అది కుల వ్యవస్థను, గుళ్ళను, గురుకుల విద్యను స్థిరపరిచింది. ఇలా శూద్ర విప్లవం సృష్టించిన సంపద బౌద్ధాన్ని, బ్రాహ్మణ మతాన్ని, వర్ణ వ్యవస్థను,



కుల వ్యవస్థను స్థిరపరచడానికి విస్తరించడానికి ఉపయోగపడింది. శూద్ర విప్లవమే వీటన్నిటి విస్తరణకు మూలం. శూద్ర విప్లవమే వర్ణ వ్యవస్థ స్థిరపడి మూడు కులాలుగా పై కులాలు మారడానికి ప్రాతిపదిక అయింది. ఈ క్రమంలోనే ఎదిగిన రాజ్యాలను, రాజులను, రాజవంశాలను క్షత్రియులు అని, బ్రాహ్మణులు అని వర్గీకరించడం జరిగింది. అలా రాజులు రాజ్యాలు స్థాపించిన రాజవంశాలు తమ పరిపాలన అవసరాల రీత్యా చేరదీసిన బ్రాహ్మణ, వైశ్య తదితర వర్ణాల వారు రాజులను తమకు అనుకూలంగా ఉన్న మేరకు రికార్డు చేశారు. నేటి పత్రికలు, మీడియా, ప్రభుత్వ యంత్రాంగం, ప్రభుత్వ అధికారులు, శాసన అధికారంలో ఉన్నవారిని ఎలా రికార్డు చేస్తూ ప్రభావితం చేస్తున్నారో రాజ్యానికి పని చేస్తూనే రాజ్యాన్ని తమకు అనుకూలంగా ఎలా మలుచుకుంటున్నారో అదే రాజ్యాలు ఏర్పడిన కాలం నుండి కొనసాగుతూ వచ్చింది. ఆ క్రమంలోనే వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థ స్థిరపడింది.

ఆ క్రమంలో వర్ణ కుల వ్యవస్థలను సమర్థించే సిద్ధాంతాలు, పురాణాలు, ఇతిహాసాలు, తత్వశాస్త్రాలు అవసరమయ్యాయి. రెండవ తరంలో నేటి ఆధునిక విద్య, ఉద్యోగాలు, అధికారాలు అందుకున్న ఎస్.సిలు, ఎస్.టిలు, బి.సిలు చాలా మంది బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాల వలె సంప్రదాయాలను, సంస్కృతిని, ఆహారపు అలవాట్లను, మాటతీరును, భాషను మార్చుకుంటున్నారు. దీన్ని సంస్కృతీకరణ అని ఎం.ఎన్. శ్రీనివాసన్ పేరు పెట్టాడు. ఈ సంస్కృతీకరణ జనపదాల కాలంలో జనపదాల రాజన్‌ల, రాజుల నుండి ప్రారంభమైంది. జనపదాల రాజన్‌లను, రాజులను క్షత్రియులు అని పేర్కొనడం నుండి వాళ్ళు దాన్ని అంగీకరించడం నుండి క్షత్రియ వర్ణం ప్రాచుర్యంలోకి వచ్చింది. మహావీరుడు, బుద్ధుడు మొదలైన వారిని ఈ క్రమంలోనే క్షత్రియులు అని ప్రచారంలోకి తేవడం జరిగింది. వాళ్ళు జన పదాలనాటి నాయకుల పిల్లలు మాత్రమే.

### యూరపు పారిశ్రామిక విప్లవం శూద్రుల రక్తమాంసాల ఫలితమే

గత అధ్యాయంలో చెప్పినట్టు శూద్ర విప్లవం క్రీ.పూ. 10వ శతాబ్దంలో ప్రారంభమైంది. క్రీ.శ 18వ శతాబ్దంలో దీని క్షీణదశ మొదలైంది. యూరప్ పారిశ్రామిక విప్లవం దేశం నుండి యూరప్‌కు తరలించిన శూద్రుల సంపద రక్తమాంసాల ఫలితమే. లాభం యూరపు పాలు కాగా దాని పర్యవసానాలు, కుటీర పరిశ్రమల పతనం భారతీయ శూద్రుల పరమైంది. ఇలా యూరప్ పారిశ్రామిక విప్లవం శూద్ర విప్లవాన్ని వెనక్కి నెట్టింది. వ్యవసాయ సమాజంలో కులాలు స్థిరీకరించబడ్డాయి. వ్యవసాయం, పశుపోషణ, ఆహార సేకరణ మొదలైనవి గ్రామీణ వ్యవస్థలకు సంబంధించినవి. పారిశ్రామిక విప్లవం నగర విప్లవానికి సంబంధించినది. ఆధునిక పారిశ్రామిక విప్లవం వల్ల మొట్ట మొదట దెబ్బతిన్నది ఇండియాలోని శూద్ర కులాలు. ముఖ్యంగా చేతి

వృత్తులు, కుటీర పరిశ్రమలు. ఇనుము, ఇత్తడి, రాగి, కంచు, వెండి, బంగారం, నూలు, బట్టలు, వైద్యం, ఆయుర్వేద ఔషధాలు మొదలైన కుటీరపరిశ్రమలన్నీ దెబ్బతిన్నాయి. వ్యాపార కేంద్రాలైన నగరాల నుండి, రాజధాని కేంద్రాల నుండి ప్రజలు పల్లెలకు వలస సాగించారు. దాంతో వ్యవసాయంపై ఒత్తిడి పెరిగి కూలీలు పడిపోయాయి. ప్రజలు కరువలకు, ఆకలి చావులకు గురయ్యారు. కోట్లాది మంది భారతదేశంలో కరువులతో, ఆకలి చావులతో, చనిపోవడానికి ఇండియా నుండి 350 ఏళ్ళు దోపిడి చేసి యూరపులో పారిశ్రామిక విప్లవాన్ని తెచ్చుకొని అక్కడి సరుకులను ఇండియాకు దిగుమతి చేయడం, దేశీయ ఉత్పత్తులపై 200 శాతం పన్నులు విధిస్తూ యూరప్ పారిశ్రామిక ఉత్పత్తులకు సబ్సిడీలు ఇవ్వడం ప్రధాన కారణం.

ఇలా అక్కడి పారిశ్రామిక విప్లవం ఇండియాలో శూద్రులను కోలుకోకుండా దెబ్బతీసింది. దీని దెబ్బకు పద్మశాలి విశ్వబ్రాహ్మణ, వంజర, తదితర కులాలు వెనుకబడి పోయారు. దాని వల్ల శూద్రులు వృత్తులు కోల్పోయారు. వ్యవసాయంలోకి తరలి పోయారు. పారిశ్రామిక విప్లవం వల్ల విదేశాల నుండి సరుకుల కుమ్మరింపు పెరగడం వల్ల అవి అమ్మడానకి అనువుగా దేశీయ ఉత్పత్తులపై 200 శాతం పైగా పన్నులు వేసి దెబ్బతీశారు. భారతదేశంలో వ్యవసాయంపై నగరాల నుండి, చేతివృత్తి కులాల నుండి వచ్చినవారి వత్తిడి పెరిగింది. అలా భూస్వామ్య యజమానుల ఆధిక్యత, అధికారం పెరిగింది. అంబేద్కర్ ఈ క్రమాన్ని సైమన్ కమీషన్ రిపోర్టులో చక్కగా వివరించాడు. ఆధునిక పారిశ్రామిక విప్లవం భారతదేశంలోని శూద్రులను అత్యున్నత స్థాయి నుండి ఇలా అట్టడుగు స్థాయికి నెట్టివేసింది. కరువుల వాత పడ్డారు. రోగాల వాత పడ్డారు. పని లేకుండా పోయింది. ఇలా శూద్ర విప్లవం ఓటమిగా గత చరిత్రగా మారిపోయింది. కానీ శూద్ర విప్లవం నాటి కుల వృత్తులు అలాగే ఇప్పటికీ కొనసాగుతున్నాయి. కులాలు కూడా అలాగే కొనసాగుతున్నాయి.



# భారతీయ సమాజ నిర్మాతలైన ఉత్పత్తి శక్తులను శూద్రులు అనడం వర్ణవాద సిద్ధాంతంలో భాగం

ఉత్పత్తి శక్తులైన శూద్రులు సమాజ నిర్మాతలు. ఇండియా యొక్క మహోన్నత నాగరికతకు చారిత్రక పరిణామాలకు మూలపురుషులు. ఆదివాసీ తెగలు, జాతుల నుండి ఎదుగుతూ ఉత్పత్తి శ్రేణులుగా, ఉత్పత్తి నైపుణ్యం గల సైంటిస్టులుగా, కళాకారులుగా, ఉత్పత్తి కులాలుగా శూద్రులు ఎదిగారు. సమాజ నిర్మాతలైన ఉత్పత్తి శక్తులకు శూద్రులని పేరు పెట్టడం వర్ణవాద సిద్ధాంతంలో భాగం. శూద్రులనే పేరు సరి అయింది కాదు. కొత్త పేరు సృష్టించడం నూతన చారిత్రక దృష్టికి ఎంతో అవసరం.

ప్రపంచ దేశాల్లో ఇండియా ప్రజల పురావస్తు అవశేషాలు, సంస్కృతి అవశేషాలు అన్నీ ఉత్పత్తి కులాలు శూద్రులు సృష్టించి విస్తరింపజేసినవే. అందువల్ల ఇండియా మహోన్నత నాగరికతా సంస్కృతులకు ఇండియాలోని ఇతర ప్రజానీకంతో పాటు ప్రపంచం శూద్రులకు ఉత్పత్తి కులాలకు ఎంతో రుణపడివుంది. శూద్రుల, ఉత్పత్తి కులాల చరిత్ర మహోన్నతమైనది. ప్రపంచానికి తమ స్వీయానుభవాల నుండి జ్ఞానాన్ని రూపొందించి వేల ఏళ్లుగా సంపదను సృష్టించి పంచింది ఉత్పత్తి కులాలే. శూద్రులంటే శుద్ధమైన, పరిశుద్ధమైన, తెల్లనైన, నిర్మలమైన హృదయం, జీవనవిధానం కలవారని రక్షకులని అర్థం. సుద్ద అంటే తెల్లని, స్పష్టమైన, శుద్ధి, శుద్ధ అంటే పరిశుభ్రమైన, స్పష్టమైన, జీవితం జీవించేవారని అర్థం. ప్రాకృత, ప్రాకృతపూర్వ భాషల్లో నిర్మలమైన శుద్ధియైన పరిశుభ్రమైన అనే అర్థం వున్న శూద్ర అనే పదానికి సంస్కృత భాషలో హీనమైన అర్థాన్ని ఇచ్చారు. ఆనాటి స్థానిక ప్రజల భాషలో అర్థం వెలికి తీయాలి.

ఇండియాలోని సంపదను దోపిడీ చేసి తీసుకుపోవడానికి చేసిన దండయాత్రలకు, శూద్రుల, ఉత్పత్తి కులాల మహోన్నతమైన నాణ్యమైన ఉత్పత్తులతో సృష్టించిన మిగులు సంపదే ప్రధాన కారణం. ప్రపంచంలో శూద్రుల ఉత్పత్తి కులాల చరిత్ర గర్వించదగిన చరిత్ర. వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలు శూద్రుల ఉత్పత్తిని తమ స్వార్థానికి

వాడుకోవడానికి సృష్టించిన ఆ సిద్ధాంతాలను ఉత్పత్తి శక్తులమీద రుద్దడం వల్ల వారిని శూద్ర కులాలు అని పిలవడం జరిగింది.

శూద్రుల ఉత్పత్తి కులాల మహోన్నత చరిత్ర సంస్కృతిని కూడా తమదిగా పరాయీకరిస్తూ ఉత్పత్తి కులాల శూద్రులకు హైన్యతను ప్రచారం చేసారు. వారి చరిత్రను కూడా వారి స్వంత భాష నుండి సంస్కృతీకరించి వర్ణవాద సిద్ధాంతాలకనువుగా మార్చివేసారు. అందులో భాగంగానే చరిత్రలోని అసలు పేర్లను బ్రాహ్మణీకరించిన పేర్లుగా సంస్కృతంలోకి మార్చి ప్రచారం చేసారు. వీటన్నిటినీ వెలికితీయడం సమాజ నిర్మాతలైన ఉత్పత్తి కులాల చరిత్రను వెలికితీయడమే.

అసలు పేర్లు ఆనాటి స్థానిక భాషను, కులాలను తెలుసుకోవడానికి ఎంతగానో ఉపకరిస్తాయి. సంస్కృతీకరించిన పేర్లు ఇలాంటి ఆధారాలను చెరిపివేస్తాయి. ఉదాహరణకు చిముక రాజును శ్రీముఖ శాతవాహనుడు అని సంస్కృతంలో రాశారు. రెండు పేర్ల మధ్య సంస్కృతీకరణ, అగ్రవర్ణీకరణ చూడవచ్చు. అందువల్ల తొలి పేర్లు ఎలా ఉండేవో సాహిత్యం మీద కన్నా, శాసనాలలోని, నాణేలలోని భాషను తిరిగి చదవడం, రికార్డు చేయడం అవసరమౌతున్నది. వాటిని బ్రాహ్మణీకరించిన చరిత్ర నుండి విడదీసి సామాజిక చరిత్రలో భాగంగా అన్వయించి చూసినప్పుడు మరుగున పడిన, మరుగుపరచ బడిన పలు విషయాలు వెలికి వస్తాయి. ఉదా॥కు శాతవాహనులు, చాళుక్యులు, కాకతీయ రాజులు, విజయనగర రాజులు, కృష్ణదేవరాయలు తమ నాణేలపై పంది బొమ్మను ముద్రించారు.

పంది బొమ్మను ఎందుకు ముద్రించారు అని చరిత్రకారులు ప్రశ్నించుకోలేదు. పంది అనే పదానికి బదులుగా వరాహ చిహ్నం అని రాశారు. వరాహ చిహ్నం అనే పదం పందులను పెంచి పోషించే దొమ్మరి, ఎరుకలి కులాలను గుర్తు చేయలేవు. కానీ పంది బొమ్మను ముద్రించారు అని రాస్తే వెంటనే ప్రజలకు పందులను సాదేది దొమ్మరి, ఎరుకలి, వడ్డెర మొదలైన కులాలు అని కనుక వారికి ఆ రాజులకు రక్త సంబంధం ఏమైనా ఉందా, సైనికులుగా విజయాలు సాధించడంలో వీరు సహకరించారా అనే సందేహాలు కలుగుతాయి.

ఈ సందేహాలు కొత్త చరిత్రను వెలికి తీయడానికి స్ఫూర్తిని ఇస్తాయి. సంస్కృత పదాల్లోకి మార్చితే ఈ స్ఫూర్తి అందదు. అలాగే కనహ అనే సాతవాహన రాజును కృష్ణ సాతకర్ణి అని పేరుతో రికార్డు చేశారు. సాహిత్యంలో రికార్డు చేసినప్పుడు బ్రాహ్మణీకరిస్తూ, సంస్కృతీకరిస్తూ కొంత, గణ యతి, ప్రాసల ఛందస్సు కోసం కొంత, ప్రశంస, విమర్శ కోసం కొంత కలిసి అసలు పేర్లను మార్చే క్రమం కనపడుతున్నది. లచ్చయ్య అనడానికి లక్ష్మయ్య, లక్ష్మణ, లక్ష్మణశాస్త్రి, లక్ష్మణరావు



అనడానికి, లచ్చారావు, లచ్చారెడ్డి, లచ్చప్ప, లచ్చన్న, లచ్చిగాడు అనడానికి మధ్య భావంలో చాలా వ్యత్యాసాలున్నాయి. లచ్చన్న పేరును లచ్చిగాడు అని పిలిచే అవకాశం ఉంది. కాని లక్ష్మణశాస్త్రిగాడు అని పిలిచే అవకాశం తక్కువ. సంస్కృతీకరించిన నామాలు విలువల శాస్త్రంలో భాగంగా ఉన్నత విలువను కలిగించే విలువల శాస్త్రాన్ని బ్రాహ్మణీయ సంస్కృత భాషా శాస్త్రం నిర్ధారించింది.

అందువల్ల లచ్చన్న అనే పేరు స్థానిక భాషల శూద్ర కులాన్ని సులభంగా తెలుపుతుంది. లక్ష్మణశాస్త్రి అనే పేరు బ్రాహ్మణ కులాన్ని తెలుపుతుంది. చాలా బ్రాహ్మణీయ ధర్మ శాస్త్రాలు సూద్రులు మంచి పేర్లు పెట్టుకోకూడదని నెయ్యి వాడకూడదని, మంచి బట్టలు వేసుకోకూడదని రాసుకున్నాయి. ఇది కుట్రపూరిత చర్య. ఇది గుప్తుల కాలంలో, మరాఠా, పిష్వాల కాలంలో క్రూరంగా అమలు జరిగింది. దీనివల్ల బ్రాహ్మణీయ విలువల శాస్త్రం వర్ణ వాదం, వర్ణవాద సిద్ధాంతాన్ని వదిలేసి లేక అధిగమించి కుల వ్యవస్థ సిద్ధాంతాన్ని విలువల శాస్త్రంగా మార్చిందని స్పష్టమౌతున్నది. పర్యవసానంగా సంస్కృత పేర్లు వేరే అర్థాన్ని ఇస్తాయి. స్థానిక భాషల పేర్లు, ప్రాచీన భాష యధాతథ పేర్లు వేరే అర్థాన్ని ఇస్తాయి. అందువల్ల శాసనాల్లోని, నాణేల్లోని యధాతథ పేర్లను యధాతథంగానే స్వీకరించి చరిత్ర రాయడం అవసరం. అందువల్ల కనహ అనే సాలివాహన రాజు పేరును కృష్ణ అనే పేరుగా మార్చి చెప్పడం తప్పు, నేరం కూడా.

ఇలా శూద్ర ఉత్పత్తి కులాల ప్రాధాన్యతను, చరిత్రలో ఆయా శూద్ర కులాలు నిర్వహించిన పాత్రను, ఉత్పత్తి సంబంధాలను, ఉత్పత్తి సాధనాలను, అవి రాజ్యం రూపొందడంలో, రాజ్యాలు విస్తరించడంలో, విదేశీ, స్వదేశీ వ్యాపారం విస్తరించడంలో అవి నిర్వహించిన పాత్రను వెలికి తీసే ప్రయత్నాలు క్రీ.శ. 1990 నుండి ఇండియాలోని ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలో వేగవంతమయ్యాయి.

దళిత రచయితల, కళాకారుల, మేధావుల ఐక్య వేదిక క్రీ.శ. 1991లో ఏర్పడి సామాజిక చరిత్రను, సాహిత్య అలంకార శాస్త్రాలను పునర్ నిర్మించే కృషి మొదలైంది. దానికి కన్వీనర్‌గా, రాష్ట్ర అధ్యక్షులుగా బి.ఎస్. రాములు వందలాది ప్రసంగాలు చేస్తూ చరిత్రను పునరధ్యయనం చేయాల్సిన ఆవశ్యకతను కూడా స్పష్టం చేయడం జరిగింది. తాత్విక దృష్టి నుంచి చరిత్రను వ్యాసాల్లో చర్చించడం జరిగింది. తాత్విక రంగంలో, సామాజిక రంగంలో చరిత్ర పరిణామాలు నిర్వహించిన పాత్రను పలు వ్యాసాల్లో, గ్రంథాల్లో రికార్డు చేశారు.

ఆయుర్వేద వైద్యంలో పేర్కొన్న వన మూలికలు ఆదివాసి తెగలు, జాతులు కనుక్కొన్న విశేషాలే. గ్రీకు వైద్యం యునాని వైద్యంగా పిలువబడుతున్నది. అరబ్బులు గ్రీకు గ్రంథాలను అనువాదం చేసుకుని గ్రీకు వైద్యాన్ని యునాని వైద్యంగా ప్రాచుర్యంలోకి

తెచ్చారు. ఈ యునాని వైద్యం ఆయుర్వేద వైద్యం నుండి స్వీకరించినదే.

పళ్ళు తోముకోవడానికి వేపపుల్ల, పెరట్లలో ఎక్కడపడితే అక్కడ దొరికే ఉత్తరేణి చెట్టు వేరు, పిడుక బూడిద, మెత్తని బొగ్గు వాడేవారు. కుంకుడు కాయలు, రేగడి మట్టి షాంపూలా తల స్నానానికి వాడేవారు. రేగడి మట్టిని, ధాన్యం పిండిని స్నానానికి సబ్బులాగా వాడేవారు. పీచును గంగరాళ్లను శరీరాన్ని తోముకోవడానికి వాడేవారు. ఆముదం నూనె, నువ్వుల నూనె, అవిశ నూనె తలకు వాడేవారు. వీటిని వంటకు కూడా వాడేవారు. వంటలో మొదట జంతు కొవ్వులను నూనెగా వాడేవారని భావించవచ్చు.

దెబ్బ తాకితే నల్లాలం ఆకు నలిచి రాసేవారు. నల్లాలంలో అయొడిన్ ఉంటుంది. వంటల్లో వాడే ఉల్లి, వెల్లులి, కరివేప, పసుపు, జిలకర మొ॥ ఔషధ గుణాలు కలిగినవి. గొల్లలు, పశువుల వ్యాధులకు, విరిగిన కాళ్లకు కట్లు కట్టడం కోసం వనమూలికలను కనుక్కున్నారు. అలా పశువైద్యంతో పాటు మానవుల వైద్య విధానాలు కూడా కనుక్కోవడానికి ఆస్కారం ఏర్పడింది. ముదిరాజ్, తెనుగు మొదలైన కులాలవాళ్లు అడవుల్లోని ఔషధ మొక్కలను గుర్తుపట్టడంలో నిష్ణాతులు. మంగలివారు పుండ్లు, గడ్డల శస్త్ర వైద్యంలో నిపుణులు. వెంట్రుకల ద్వారా కలిగే చికాకును దూరం చేసే క్షౌర విద్య స్నానం వలెనే మానవ జీవితానికి ఒక గొప్ప ఫ్రెష్‌నెస్‌ని అందించింది. సాతానులు అని పిలువబడే చాత్తాద వైష్ణవులు శూద్రులకు, అతి శూద్రులకు అక్షరాలను నేర్పారు. మత విద్యను, భక్తి ఉద్యమాలను, సిద్ధాంతాలను ప్రజల మధ్య ప్రచారం చేయడంలో కీలకపాత్ర నిర్వహించారు.

చేనేత కులాల వారు పట్టు నేత, నూలు నేతలో నిష్ణాతులు. వారు ఆయుర్వేద వైద్యంలో నిపుణులు. వీరికి సేనానులని కూడా పేరు. సైన్యాధ్యక్షులుగా పని చేసిన క్రమానికి నేత కులాలకు సేనానులు అని కూడా పేరుంది. చేనేత వృత్తి చేయడానికి సంబంధించిన ఇసిరెలు (పరికరాలు) ఎరుకలి, వడ్రంగి, కమ్మరి, కంచరి, మేదరి, మాదిగ మొదలైన పలు కులాలవారు చేసి ఇచ్చేవారు. అలా అవి చేసి ఇచ్చే కులాలకు కూడా నేత వృత్తి నైపుణ్యంలో, ఖ్యాతిలో వాటా వుంది. అన్ని కులాలకు వాళ్ల కులవృత్తికి అవసరమైన ఇసిరెలు ఇతర కులాలవాళ్లు వారి నైపుణ్యంతో చేసి ఇచ్చేవారు. ఇలా ప్రతి ఇసిరె ఎంతో శాస్త్రీయంగా అది తయారుచేసేవారికి, దాన్ని ఉపయోగించేవారికి మధ్య గొప్ప సమన్వయం సాధించి అభివృద్ధి పరచబడింది. ఎవరికి వారు తమ కులవృత్తి ఇసిరెలను చేసుకుంటే ఇంత గొప్ప నైపుణ్యం అభివృద్ధి చెంది వుండేదికాదు.

పరిశుభ్రతలో, అంటువ్యాధి నివారణలో బట్టలు ఉతికించి అందుకు సౌడును సోడాగా కనుక్కుని వాడారు. అలా వుతికిన చాకలివారు సమాజానికి మహోపకారం చేశారు అని చరిత్రకారుల అభిప్రాయం. పల్లెల్లో చాకలి స్త్రీలను సూద్ర కులాలవాళ్లు



తమ ఇంటి ఆడపడుచు అని, స్వంత ఆడపడుచు వలె గౌరవించాలని, పండుగలకు పబ్బాలకు స్వంత ఆడపడుచు వలె గౌరవించే సంస్కృతి ఇప్పటికీ కొనసాగుతున్నది.

బంగారం, కంచు, ఇత్తడి, రాగి, వజ్రాలు, రత్నాలు, ఇనుము కనుక్కోవడం వెలికి తీయడం సానపెట్టడం, క్వాలిటీ నిర్ణయించడం, వెలకట్టడం, నగలు నాణాలు తయారు చేయడం, వ్యవసాయ పనిముట్లను, అన్ని కులాల కులవృత్తుల కోసం అవసరమైన అన్ని ఇసిరెలను, (పనిముట్లను) తయారుచేసే పంచాణులు విశ్వకర్మలు ప్రపంచ పారిశ్రామిక విప్లవానికి మార్గం వేసిన మహోన్నత శాస్త్రవేత్తలు. ఉత్పత్తి కులాలు పారిశ్రామిక విప్లవాన్ని ముందుకు నడిపారు. ఈ ఉత్పత్తి కులాల పారిశ్రామిక శాస్త్రవేత్తలకే శాస్త్రవేత్తలుగా పనిముట్లను అద్భుతమైన నైపుణ్యంతో తయారుచేసి, నిరంతరం వాటిని అభివృద్ధి పరిచినవారు విశ్వకర్మలే. విశ్వకర్మలు లేకుండా పెట్టుబడిదారీపూర్వ పారిశ్రామిక విప్లవం ఊహకందని విషయం. చరిత్రకందిన కాలం నుండి సైంటిస్టులు, శాస్త్రవేత్తలు నైపుణ్యం గల కార్మికులుగా, పారిశ్రామికవేత్తలుగా విశ్వకర్మలు ప్రపంచానికి అందించిన ఉత్పత్తులు, సేవలు మహోన్నతమైనవి.

క్రీ.శ.1810 దాకా ఇండియానుండి ప్రపంచానికి ఉత్పత్తులు, సంపదలు ఎగుమతి అయ్యేవి. ఇలా 2 వేల ఏళ్లు ప్రపంచానికి పారిశ్రామిక విప్లవానికి పునాదులు వేసి ముందుకు నడిపిన విశ్వకర్మల చరిత్ర, దాని ప్రాధాన్యత ఎంత చెప్పినా తక్కువే. విశ్వకర్మల నైపుణ్యం చూసి ఆశ్చర్యం పొంది వారిని తమకు కొంతకాలం పంపించాలని పలు దేశాలు కోరాయి. అందుకు కొందరు రాజులు నిరాకరించారు. దాంతో ఆ రాజుల పైకి ఇతర రాజులు యుద్ధాలు చేశారు. రాజులను ఓడించారు. ఓడించిన తరువాత కూడా సంధి ఒప్పందాలు చేసుకున్నారు. విశ్వకర్మ నిపుణులను వందలాదిమందిని గుర్రాలు, గాడిదలు, బండ్లు, రథాల మీద ఇంతమందిని ఒప్పించి పంపించాలి అని సంధి చేసుకొని ఇంతకు ముందే చెప్పినట్టు కనోజ్ రాజ్యాన్ని 9వ శతాబ్దంలో తిరిగి అదే రాజుకు ఇచ్చేశారు. ఇందుకు విశ్వకర్మలు ఎంతో గర్వించాలి. వారి కోసం, వారి సేవల కోసం ప్రపంచ దేశాలు ఎంతగా ఎదురుచూశాయో ఇలాంటి యుద్ధాలు చరిత్రలో స్పష్టం చేస్తున్నాయి. అలాంటి విశ్వకర్మల ప్రాధాన్యత చరిత్ర రచనలో కనపడకపోవడం ఆశ్చర్యం.

పూర్వం యుద్ధాల్లో, జంతువుల దాడిలో గాయాలయ్యాక సెప్టిక్ అయ్యి చనిపోయినట్టు రికార్డులు కనపడవు. అవయవాలు తెగినా, విరిగినా, దెబ్బలు తాకినా సెప్టిక్ కాకుండా వుండే వైద్య విధానాలు పూర్వం కొనసాగాయి. ఆయుర్వేద వైద్యం ద్వారా సూద్ర ఉత్పత్తి కులాలు, వర్ణవాద, కర్మవాద సిద్ధాంతాలను వ్యతిరేకించారు. రోగాలు పూర్వజన్మ పాపాలనే వర్ణ, కర్మ సిద్ధాంతాలను వ్యతిరేకిస్తూ రోగాలను నయం

చేసే వైద్య విధానాన్ని ఆదివాసీలు సూద్ర ఉత్పత్తి కులాలు అభివృద్ధి పరిచాయి. అటు తర్వాత వర్ణవాదులకు కూడా వైద్యం అవసరం ఏర్పడింది. దాంతో వాళ్లు వైద్యాన్ని వేదంతో సమానంగా భావించే ప్రజల సెంటిమెంటును గౌరవించి ఆయుష్షును పెంచే వేదం అనే అర్థంలో ఆయుర్వేదం అనే శాస్త్రంగా గుర్తించారు.

తోలును మెత్తపరిచి నాణ్యమైనదిగా మార్చడంలో ఎన్నో మొక్కలను, రసాయనాలను ఉపయోగించడం జరిగిందని చర్మాన్ని శుద్ధిచేసే ప్రక్రియ ప్రపంచంలో మొదటి పారిశ్రామిక విప్లవం అని డాక్టర్ కంచె ఐలయ్య మాదిగ తత్వం అనే గ్రంథంలో విశ్లేషించారు.

పూర్వకాలంలో మలవిసర్జన తర్వాత కొన్ని తెగలు ఆకులతో తుడుచుకునేవి. కొన్ని తెగలు నీళ్ళతో కడుక్కొనేవి. కొన్ని తెగలు ఇవేవీ చేసేవి కావు. ఆకులతో తుడుచుకునే పద్ధతి యూరోప్‌లో కాగితాలతో తుడుచుకునే పద్ధతిగా మారింది. వీటిని చరిత్రకారులు పెద్దగా స్పర్శించలేదు. వీటి ప్రాధాన్యతను గుర్తించక పోవడం వల్ల ఉత్పత్తి కులాలు, ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తులు సామాజిక పరిణామాలను మలుపు తిప్పిన క్రమాన్ని చెప్పకుండా వదిలేసినవారయ్యారు.

ఒక సమగ్ర స్థాయిలో ఇండియా చరిత్ర ఉత్పత్తి కులాల దృక్పథంతో ఇంకా వెలువడవలసి వుంది. అందుకు స్ఫూర్తిని ఇవ్వడానికి, తాత్విక దృక్పథం ప్రాతిపదికను అందించడానికి తొలిభాగం పరిమితమౌతున్నది. ఇప్పటిదాకా నిర్ధారించిన చరిత్రను సంక్షిప్తంగా పరిచయం చేస్తూ కొత్త విశేషాలు ఉన్నప్పుడే విస్తరించి రాయడం దీని పరిమితి. మిగతా కర్తవ్యాలను యువ చరిత్రకారులు పూరిస్తారు.

ప్రపంచ చరిత్రలో ఇనుము నిర్వహించిన పాత్ర మహోన్నతమైనది. అలాగే మానవ నాగరికతలో ఉన్ని, పత్తి, నూలు, నూలు బట్టలు, బుట్టలు, కుండలు, రాతి పనిముట్లు, ఇనుప, లోహ పనిముట్లు నిర్వహించిన పాత్ర మౌలికమైనది. చలి దేశాల్లో తోలు, ఉన్ని బట్టలే చాలా కాలం అవసరమయ్యాయి. ఆ క్రమంలో తోలు నుండి ఉన్ని వరకు వచ్చి ఆగిపోయారు. వేడి దేశాల్లో తోలు, ఉన్ని వదిలి క్రమంగా పత్తి, నూలు, నూలు బట్టలకు మారడం అవసరమైంది. దక్షిణ ఇండియాలో నూలు బట్టలు నేయడానికి చారిత్రక నేపథ్యం ఉంది. దక్షిణ ఇండియా నుండి తోలు, నూలు బట్ట, కుండ, సౌడు, మంగలి కత్తి, వంట ఉత్తర ఇండియాకు విస్తరించాయి. ఏమంటే ఉత్తర ఇండియా చాలా కాలం బురద నేలగా ఉండిపోయింది. దక్కను పీఠభూమి మీదుగా వింధ్య పర్వతాల వరకే ప్రాచీన ఇండియా జనసంచారం ఉండేది.

వర్ణవాద, కుల వ్యవస్థ సిద్ధాంతాలు ప్రజలను విభజించి బ్రాహ్మణాధిక్యతను స్థాపించుకోవడానికి ప్రతిపాదించినవి. అయితే అవి పుట్టిన చారిత్రక దశలలో ఈ



అర్థంలో పుట్టే అవకాశం ఉంటుందా అనేది ఒక ప్రశ్న. శాంతియుత, సహజీవన వ్యవస్థ అవసరాల కోసం వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలు నిర్వహించిన సానుకూల పాత్ర ఏమీ లేదా అనే ప్రశ్న ముఖ్యమైనది. అలా అది నిర్వహించిన పాత్ర ఏమీ లేకపోతే ఆ సిద్ధాంతాలను వ్యతిరేకించేవారు యుద్ధాలు చేస్తారు, కొత్త సిద్ధాంతాలు చేస్తారు. అయినప్పటికీ వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలకు ఆర్య జాతి, బ్రాహ్మణ జాతి సిద్ధాంతాలతో సంబంధం లేకుండా సామాజిక పునాదిని వెలికి తీయడం అనే కర్తవ్యం మిగిలే ఉంటుంది.

**తాత్వికంగా చూస్తే పలు తెగలను, జాతులను ఒక సమూహంగా, సమైక్యంగా మార్చడంలో వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలు నిర్వహించిన పాత్ర జైనం, బౌద్ధం, భక్తి ఉద్యమాలు నిర్వహించిన పాత్రకు తక్కువేమీ కాదు. పరస్పర సంఘర్షణను నివారించడానికి శాంతియుత సహజీవనానికి ఇవి తోడ్పడ్డాయి.**

జైన, బౌద్ధ మతాలు సామూహిక సిద్ధాంతాన్ని ఒకదాన్నే చెప్పాయి. ఏక సిద్ధాంతాన్ని ముందుకు తెచ్చాయి. ఈ ఏక సిద్ధాంతం మోనిజంగా కొనసాగింది. భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని సాధించే సమాఖ్య సిద్ధాంతాలను రూపొందించుకోలేకపోయాయి. ఉన్న స్థితి నుంచి సమూలంగా తన విశ్వాసాలను, సంస్కృతిని మార్చుకోవడం తప్ప ఉన్న స్థితిలో ఉంటూనే కాస్త సామాజికంగా మారడానికి అవకాశం ఉండే విధంగా భిన్నత్వంలో ఏకత్వాన్ని, ఏకత్వంలో భిన్నత్వాన్ని అంగీకరించలేకపోయాయి. ఇతర తెగల, జాతుల సిద్ధాంతాలను, విశ్వాసాలను సమూలంగా మార్చి వేయడం తప్ప, వదిలివేయడం తప్ప జైన, బౌద్ధ సిద్ధాంతాల్లో వాటికి ఏ కాస్త స్థానం లభించలేదు. లభించే అవకాశం కూడా లేదు. అందువల్ల ఆదివాసీ తెగలు, జాతులు, ఉత్పత్తి శ్రేణులు, వ్యాపార వర్గాలు తమ తమ విశ్వాసాలతో పాటు, భిన్నాభిప్రాయాలు కలిగి ఉండే స్వేచ్ఛను కోరుకున్నారు. జైనం, బౌద్ధం ఇందుకు అవకాశం ఇవ్వవు.

తాత్వికంగా బౌద్ధం, జైనం, క్రైస్తవం, ఇస్లాం, మార్క్సిజం, ఏక సిద్ధాంతానికి, మోనిజానికి సంబంధించిన సిద్ధాంతాలు. వీటికి ప్లూరలిజానికి చుక్కెదురు. ఇవి ఇతర సిద్ధాంతాలను సంశ్లేషణతో కలుపుకుని స్వీకరించే శక్తి సామర్థ్యాలు కలిగినవి కావు. అందువల్ల భిన్నాభిప్రాయం కలిగితే చీలిపోవడం తప్ప వేరు మార్గం లేదు. బౌద్ధంలో హీనయానం, మహాయానం, తేరవాదం, తంత్రవాదం లేదా వజ్రయానం మొదలైన 27కు పైగా చీలికలు ఏర్పడి ఎన్నో రకాల బౌద్ధాలు, బౌద్ధం పేరు మీదనే కొనసాగాయి.

అలాగే క్రైస్తవంలో కూడా ఎన్నో రకాల చీలికలు ఏర్పడి కాథలిక్కులు, ప్రొటెస్టంట్‌లు అనే రెండు ప్రధాన సిద్ధాంతాలుగా చీలిపోయారు. వీళ్ళు పరస్పరం చంపుకున్నారు

కూడా. అలాగే ఇస్లాంలో కూడా ప్రారంభం నుండే పలు చీలికలు ఏర్పడ్డాయి. కర్బలా మైదానంలో జరిగిన యుద్ధం అందుకు సాక్ష్యం. ఇస్లాంలో షియాలు, సున్నీలు అనే ప్రధాన సిద్ధాంతాలు కొనసాగుతున్నాయి. ఇస్లాంలో చేరినప్పటికి రాజులు, రాజ్యాలు, తెగలు పరస్పరం కలహించుకోవడం వెనుక తాత్వికంగా అది ఇతర సిద్ధాంతాలను, విశ్వాసాలను అంగీకరించకపోవడం అనే భూమిక ఉంది. నేటికీ ఆఫ్ఘనిస్తాన్, పాకిస్తాన్ దేశాల్లో ముస్లిం తెగల తిరుగుబాట్లు, యుద్ధాలు ఇందులో భాగమే. యూనిటరీ రాజ్యాంగాన్ని, కేంద్రీకృత రాజ్యాన్ని, సిద్ధాంతాన్ని ఇవి అభిలషిస్తాయి. తాత్విక రంగంలో, సిద్ధాంత రంగంలో, రాజకీయ రంగంలో కేంద్రీకృత విధానాన్ని అనివార్యం చేసే విధంగా ప్రభావం వేస్తాయి.

వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలు కేంద్రీకృత, ఏక సిద్ధాంత స్థానంలో సమాఖ్య సిద్ధాంతాన్ని, ఫెడరల్ స్వభావ సిద్ధాంతాన్ని, వ్యవస్థను, ఫెడరల్ జీవన విధానాన్ని ప్రతిపాదించాయి. ఫెడరల్ జీవన విధానంలో కూడా సమాఖ్య తాలూకు కేంద్రీకృత వ్యవస్థ సిద్ధాంతాన్ని నెలకొల్పాయి. అదే వర్ణాధిక్యత. అదే కులాధిక్యత. వర్ణాధిక్యత, కులాధిక్యత అనే సిద్ధాంతాలు మోనిజంగా కాకుండా ఫెడరలిజంగా సామాజిక జీవితంలో కొనసాగాయి. అందువల్ల అవి శతాబ్దాల తరబడి కొనసాగడానికి ఒక సామాజిక, చారిత్రక అనివార్యత తాలూకు పునాది కొనసాగింది.

చారిత్రక అనివార్యత తాలూకు పునాది అంటే వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలకు చారిత్రక పునాది శతాబ్దాలుగా ఉందని అర్థం కాదు. ఫెడరల్ స్వభావంతో సామాజిక జీవితం జీవించడానికి అన్ని తెగలు, జాతులు, ప్రాంతాలు అంగీకరించే ఫెడరల్ స్వభావం తాలూకు సిద్ధాంతం యొక్క ఒక అంశ వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాల్లో ఉందని మాత్రమే ఇక్కడ ప్రతిపాదించడం జరుగుతున్నది. ఈ ఫెడరల్ స్వభావం కారణంగా అది ఇంకా ప్రజల్లో జీవించగలుగుతున్నది అని అంగీకరించడం అవసరం.

ఈ విషయాన్ని అంగీకరించలేని వారు వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలను వ్యతిరేకించే పేరిట మరో తప్పుడు సిద్ధాంతాల్లోకి, సూత్రీకరణల్లోకి చేరే అవకాశం ఉంటుంది. బౌద్ధం, జైనం గొప్ప ఆదర్శ సిద్ధాంతాలను ఇచ్చాయి. వాటికి భిన్నంగా జీవించే, ఆచరించే, ఆలోచించే ప్రజలకు, సిద్ధాంతవేత్తలకు, ఆదివాసులకు అవి నిర్బంధమైతే ఎంత చెరసాలగా పరిణమిస్తాయో చాలా మంది తత్వవేత్తలకు, చరిత్రకారులకు, బౌద్ధాభిమానులకు అర్థమైనట్టులేదు.

జైనం, బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం, మార్క్సిజం, బ్రాహ్మణిజం, ఫాసిజం మొదలైన ఏ సిద్ధాంతమైనా, అవి ప్రతిపాదించే సామాజిక జీవన విధానమైనా వాటికి భిన్నంగా ఉండేవారికి ఫాసిజంగానే కనపడతాయి. అలా కనపడ్డానికి వాటిలోని ఏక సిద్ధాంతం



కారణం తప్ప ప్రజలు కారణం కాదు. క్రీ.శ. 2007నాటికి హిందూ వాదం పేరిట కొనసాగుతున్న ఆర్.ఎస్.ఎస్. సిద్ధాంతం వర్ణవాద, కులవ్యవస్థ వాద ఫెడరల్ స్ఫూర్తికి వ్యతిరేకంగా ఏక సిద్ధాంతంగా హిందూ సమాజాన్ని మార్చే ప్రయత్నం చేస్తున్నది. అందువల్ల ఆర్.ఎస్.ఎస్. చెప్పే సిద్ధాంతం యూనిటరీ సిద్ధాంతమే తప్ప వర్ణవాద, కుల వ్యవస్థ వాద సిద్ధాంతాలలోని ఫెడరల్ స్ఫూర్తికి సంబంధించినవి కావు. ఆర్.ఎస్.ఎస్. వీటిలోని ఫెడరల్ స్ఫూర్తిని స్వీకరిస్తే వారి అవగాహనలో, సమాజంలో మౌలికమైన మార్పులు జరుగుతాయి. శూద్రులుగా నమోదు చేసి, వెనుకబడిన తరగతులుగా లెక్కించిన ఉత్పత్తి కులాలకు, సేవా కులాలకు కేంద్ర, రాష్ట్ర చట్టసభలతో పాటు ప్రభుత్వ, ప్రైవేటు అన్ని రంగాలలో వీరికి రిజర్వేషన్లు అమలు జరిపినప్పుడు ఆర్.ఎస్.ఎస్. చెప్పే హిందూ జీవన విధానంలో తిరిగి ఫెడరల్ స్వభావంతో అది విస్తరించింది అని చెప్పడం సాధ్యపడుతుంది.

ప్రతి క్షణం ఆధిక్యత ప్రదర్శించే వారిలో, కోరుకునే వారిలో నిజమైన ఆధిక్యత ఉండదని చెప్పవచ్చు. నిజమైన ఆధిక్యత ఉన్న వాళ్ళు అలా ప్రవర్తించరు. తనలో ఆధిక్యత లేదని తనకు తెలిసి ఇతరులకు తెలియకుండా ఉండడంకోసం చేసే ఆధిక్యత ప్రదర్శన వల్ల ప్రతి క్షణం ఆధిక్యతను ప్రదర్శిస్తుంటారు, కోరుకుంటారు. బుద్ధుని కాలం నుండి మానవ స్వభావ, మనస్తత్వ శాస్త్రాలు దీన్ని నిర్ధారించాయి.

శతాబ్దాలుగా బ్రాహ్మణ వాదులు వందలాది గ్రంథాల్లో ప్రదర్శించే బ్రాహ్మణ ఆధిక్యతను బలవంతంగా నొక్కి చెప్పడం వారి ఇన్‌ఫిరియారిటీ కాంప్లెక్స్‌ను, అల్పత్వ భావనను తెలుపుతున్నది. ప్రతీ క్షణం బ్రాహ్మణవాదులు, కుల ఆధిక్యతలను నేనే గొప్ప అని ప్రదర్శించే, కోరుకునే ఆధిక్యతలో వారి ఆధిక్యతా ప్రదర్శనే తప్ప, ఇన్‌ఫీరియారిటీ తప్ప నిజమైన ఆధిక్యతను సాధించిన స్వభావం ఉండదు.

అందువల్ల అలాంటి ప్రదర్శనను చూసినప్పుడు మొదట ఏవగింపు కలుగుతుంది. తర్వాత వారి పట్ల జాలి కలుగుతుంది. మను ధర్మ శాస్త్రంలో, కౌటిల్యుని అర్థశాస్త్రంలో, నారదస్మృతిలో, వైదిక, బ్రాహ్మణవాద సాహిత్యంలో, భాషలో, బాడీ లాంగ్వేజిలో ప్రదర్శించే బ్రాహ్మణాధిక్యతను చూస్తే అందర్నీ సమానంగా గౌరవించే సంస్కారం కోల్పోయినందుకు మొదట ఏవగింపు కలుగుతుంది. వారి స్వభావాన్ని అర్థం చేసుకున్న తర్వాత జాలివేస్తుంది.

నిజమైన ఆధిక్యత కలవాళ్ళు ఔదార్యంతో ఉంటారు. కరుణతో, ప్రేమతో, క్షమాగుణంతో ప్రజలను ప్రేమిస్తారు. ఎందుకంటే వారిని మించిన ఆధిక్యత ప్రజలు సంపాదించుకోవడం, చేరుకోవడం అసాధ్యమని తెలిసి ప్రేమ, కరుణ, వినయం, ఆత్మవిశ్వాసం కల వాళ్లే నిజమైన ఆధిక్యత కలవారు.

అందువల్ల నిజమైన ఆధిక్యత కలవాళ్ళు ప్రజలను కించపరిచే, ద్వేషించే,

అణచివేసే సూత్రాలను వల్లె వేయడం కాకుండా తోటివారు నిరంతరం తన స్థాయికి అభివృద్ధి చెందాలని కోరుకుంటూ తాను టీచర్‌గా ఉంటూ వారి నుండి తిరిగి నేర్చుకుంటూ మరింత ఉన్నతమైన టీచర్‌గా ఆధిక్యతను నిరంతరం సాధించుకునే కృషి చేస్తారు. ఇదే నిజమైన ఆధిక్యత.

ఈ నిజమైన ఆధిక్యత వైదిక సాహిత్యంలో, వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాల్లో, ఆర్.ఎస్.ఎస్. హిందూ సిద్ధాంతాల్లో కనపడదు. వారు కొందరిని వెనక్కి నెట్టడం ద్వారా, అణచివేయడం ద్వారా తమ ఆధిక్యతను ప్రదర్శించు కోవడానికి పరిమితమైన అల్పత్వ భావనకు సంబంధించిన మానవ స్వభావానికి చెందిన వారు. వారు ముస్లింల పట్ల, శూద్రుల పట్ల, దళితుల పట్ల, బి.సి. రిజర్వేషన్ల పట్ల, వ్యతిరేకత ధోరణిని, అణచివేత ధోరణిని ఆచరిస్తుంటారు. వారిలో నిజమైన ఆధిక్యత సాధించుకున్నప్పుడు వారు వీరిని కూడా ప్రేమ, కరుణ, క్షమ స్వభావాలతో ప్రేమిస్తారు. వారి ఉన్నతికి తోడ్పాటునందిస్తారు. తద్వారా వారితో పాటు వీరు ఎదుగుతారు.

ఇక్కడ చర్చిస్తున్నది నేడు బ్రాహ్మణీయ ఆర్.ఎస్.ఎస్. వాదులు ప్రచారం చేస్తున్న వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలను కాదు. వాటి తొలి రూపాలను, అవి బ్రాహ్మణవాద, వైదిక, హిందూ సిద్ధాంతాలుగా రూపాంతరం, స్వభావం చెందక ముందటి, ఇప్పటికీ చెందని వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలను ఆనాటి చారిత్రక అర్థంలో చర్చించడం జరుగుతున్నది.

వైదిక వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాలను పైనుండి బ్రాహ్మణవాదులు రుద్దారా? లేక సామాజిక ఉత్పత్తి క్రమంలో ఆనాటి వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాలకు కింది నుండి ప్రాతిపదిక ఏర్పడుతూ వచ్చిందా? చరిత్రకారులు వైదిక వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలను పైనుండి కిందికి రుద్దారని దాదాపు ఏకాభిప్రాయానికి వచ్చారు. అనగా ఉత్పత్తి కులాల, జాతుల, తెగల దృక్పథానికి జీవిత విధానానికి వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతానికి మధ్య సంబంధంలేదని 'బలవంతపు బ్రాహ్మణార్థం'గా ప్రజలపై నుండి వాటిని రుద్దారని తేలుతున్నది.

సామాజిక వ్యవస్థ వర్ణ వ్యవస్థగా కులవ్యవస్థగా రూపుదిద్దుకోవడానికి ఇండియా చారిత్రక పరిణామంలో సమస్త తెగలు, జాతులు ఒక సమాఖ్యగా కలిసి జీవించడంలో భాగంగా తెగ తాలూకు రక్తసంబంధాలను అలాగే కొనసాగించడం వల్ల క్రమంగా కులాలుగా స్థిరపడడం ప్రారంభమైంది. కులాలుగా స్థిరపడే క్రమంలో ఆ యా కులాలకు కొన్ని ఉత్పత్తుల్లో, కొన్ని రకాల పశువుల పెంపకంలో, కొన్ని రకాల ఆహార సేకరణలో, వనమూలికల సేకరణలో, వ్యవసాయ ఉత్పత్తుల్లో సాధించిన నైపుణ్యం ననుసరించి, లోహాలను, ఖనిజాలను వెలికితీసి ఉపయోగం లోకి తెచ్చే నైపుణ్యాన్ని అనుసరించి కొన్ని ప్రత్యేకతలు ఏర్పడ్డాయి.



ఒక ప్రధాన నైపుణ్యంతో పాటు ఉపనైపుణ్యం ఇతర వృత్తుల్లో సాధించేవారు. ఒక తెగ అన్ని వృత్తులను తనలో తాను చేసుకునేది. ప్రతి ఒక్కరికి వ్యవసాయం, నూలు వడకడం, పాములను, పిట్టలను పట్టడం, జంతువులను వేటాడడం, చేపలు పట్టడం, కర్ర చెక్కడం, ఇల్లు నిర్మించుకోవడం, వంట చేసుకోవడం వచ్చేవి. నీటిపారుదల సౌకర్యాలు విస్తరిస్తూ చెరువులు, నీటి ఆనకట్టలు నిర్మాణం చేస్తూ వ్యవసాయం, స్థిర నివాసం స్థిరపడే క్రమంలో ఒక గ్రామం రూపొందింది. నందరాజులు, మౌర్యరాజులు, సాతవాహనులు ఇలాంటి గ్రామాలను రూపొందించడంలో కృషి చేసారు.

## శూద్రులు గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ నిర్మాతలు

ఒక గ్రామంలో సుమారు తొలుత 7 నుండి 11 తరువాత 16 రకాల వృత్తి నైపుణ్యాలు గల శ్రేణులను కొత్తగా అడవులను నరికి వ్యవసాయం చేస్తున్న ప్రాంతంలో స్థిరపడడానికి రాజులు ప్రోత్సహించారు. స్వయంగానూ వెళ్లారు. అలా శూద్ర ఉత్పత్తి కులాలు, సేవాకులాలు, వ్యవసాయం, పశుపోషణ, కుటీర పరిశ్రమలతో గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థగా రూపుదిద్దుకోవడానికి కారకులయ్యారు. ఒక సమాఖ్యగా, సమైక్యంగా జీవించడానికి తెగ తాలూకు, వలస వచ్చిన ఊళ్ల తాలూకు రక్తసంబంధాలను అలాగే కొనసాగించడంవల్ల ఒకే ఊళ్లోని శూద్ర ఉత్పత్తి కులాల మధ్య పెళ్లిళ్లు తగ్గుతూ వచ్చాయి.

ఒకటి రెండు తరాలు గడిచేసరికి ఆయా శూద్ర సంపద, ఉత్పత్తి కులాల జనాభా పెరగడంవల్ల వృత్తి నైపుణ్యం పుట్టినప్పటినుంచే నేర్చుకుంటారని స్వంత కులంలో పెళ్లి చేసుకోవడానికి ప్రాధాన్యత ఇచ్చారు. చివరకు అది కుల వ్యవస్థగా రూపొందింది. ఇలా రూపొందిన తెగలు, కులాల సమన్వయంతో రూపొందిన గ్రామీణ సమాఖ్య గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ స్థిరపడడానికి ప్రాతిపదిక అయింది. ఇలాంటి సామాజిక క్రమంలో పైనుండి వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలు వీరిపై రుద్దబడ్డాయి.

అయితే ప్రజలు ఎన్నడూ కులాల మధ్య అంతరాలను పాటించకుండా పెళ్లిళ్లు చేసుకుంటూనే వున్నారు. వాటిని నిరోధించడానికి విభజించి పాలించే వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలను కులాల మధ్య, తెగల మధ్య సామాజిక గౌరవాల్లో, పంపిణీల్లో హెచ్చుతగ్గులను ప్రోత్సహిస్తూ ప్రచారం చేసారు. ఆధిక్యత పొందదల్చుకున్నవారు వీటిని ప్రచారం చేసి స్థిరపరిచే పని పెట్టుకున్నారు.

అలా పైనుండి తెగలు, కులాల సమాఖ్యలపై రుద్దబడిన వర్ణవాద, కులవాద వ్యవస్థ సిద్ధాంతాలు సంపద ఉత్పత్తి కులాల జీవన విధానం సమన్వయించబడి కులవ్యవస్థగా స్థిరపడింది. కులవ్యవస్థ స్థిరపడడానికి వర్ణవాద, కులవ్యవస్థ వాద

సిద్ధాంతాలకన్నా ఆనాటి గ్రామీణ జీవిత అవసరాలు ప్రధాన కారణమయ్యాయి.

### శతాబ్దాల తరబడి తరలించుకుపోయిన సంపద ఎవరు సృష్టించారు?

శతాబ్దాల తరబడి ఇండియాను వందల వేల రాజులు, దోపిడీదారులు మొదలుకొని యూరప్ దేశాల వలసవాదులు కోట్లాది సంపద తరలించుకు పోయినప్పటికీ ఇండియా ఇంకా సంపన్నంగానే కొనసాగింది. అందుకు శూద్రుల సంపద ఉత్పత్తి నిరంతర కృషి ప్రధాన కారణం. కులవ్యవస్థ లేకుండా వేల ఏళ్లుగా వృత్తి నైపుణ్యం గల ఇన్ని రకాల ఉత్పత్తులు, సేవలు మిగులు ఉత్పత్తులు సంపద ఉత్పత్తి సాధ్యమై ఉండేది కాదు. ఉత్పత్తి పెరగడం ద్వారా శూద్రులు, ఉత్పత్తి కులాలు ప్రపంచ నాగరికతకు గర్వించదగిన చేర్పును అందించాయి. కాని కులవ్యవస్థ, వర్ణ వ్యవస్థ సిద్ధాంతాలు వారిని గర్వించదగినవారిగా కాకుండా కించపరిచాయి. అందువల్ల కులవ్యవస్థ వేరు. వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలు వేరు. ఇవి రెండు వేరు వేరు విషయాలు.

శూద్రులు, ఉత్పత్తి కులాలు, సమాఖ్యగా కలిసి జీవించడంలో వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలు కూడా ఎంతో నష్టం చేసినప్పటికీ కొంత మేలు చేసాయి. అదే ఏకసిద్ధాంతంగా కాకుండా బహుళ సిద్ధాంత, జీవన విధానాలను అనుసరించడానికి అవకాశం ఇచ్చింది. అందువల్ల ఇండియాలో కులవ్యవస్థ స్థిరపడిన తర్వాత జైనం, బౌద్ధం వంటి ఏకసిద్ధాంత మోనిజం సిద్ధాంతాలు అభివృద్ధి చెందలేకపోయాయి. అది సాధ్యం కాదు.

బౌద్ధం విస్తరించాక సమాజంలో ఉత్పత్తి శక్తులు విస్తృతంగా అభివృద్ధి చెందాయి. కాల క్రమంలో పర్యవసానంగా వర్ణవ్యవస్థ కుల వ్యవస్థగా స్థిరపడింది. ఒకవైపు పశుపోషణ, వ్యవసాయం, పల్లెల స్థిర జీవనం, గణ తెగల జీవితం, ఉమ్మడి కుటుంబం కుల వ్యవస్థగా స్థిరపడడం, మరొకవైపు నగరాలు, సామ్రాజ్యాల విస్తరణ వల్ల ఇలా జరిగింది. నగరాలు, గ్రామాలు మధ్య సంబంధాలు మధ్య మార్పు లేకుండా స్థిరపడడం వల్ల వృత్తుల్లో మార్పులేకుండా స్థిరపడడం, గణతెగల రక్త సంబంధాల్లో మార్పు లేకుండా స్థిరపడడం కులం కులంగా స్థిరపడడానికి ప్రధాన కారణాలు.

గణ తెగల, పశుపోషక తెగల, వ్యవసాయిక తెగల జన పదాల సంస్కృతి, రక్తసంబంధాలు దేనికది నిర్దిష్టంగా, ప్రత్యేకంగా, స్వతంత్ర్య ప్రతిపత్తితో అంతర్గత ఆత్మగౌరవంతో కొనసాగడం వల్ల ఆయా ఉత్పత్తి ప్రక్రియలు భిన్నభిన్న పని విధానాలను తద్వారా జీవన విధానాలను అనివార్యం చేయడం వల్ల ఒకే సమాజంలో ఉంటూనే భిన్నత్వ ప్రత్యేకతలను సంతరించుకున్నాయి. దాని వల్ల ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం బహుళ వైవిధ్య సంస్కృతి ప్రత్యేకతలు స్థిరపడ్డాయి. అలా ఏకీకృత బౌద్ధ జైన సిద్ధాంతాల సంస్కృతికి నిత్యజీవితానికి మధ్య అంతరం పెరిగింది. ఉత్పత్తి



పెరగడానికి తద్వారా వర్తక వాణిజ్యాలకు, శాంతియుత సహజీవనానికి తద్వారా స్థిరమైన రాజ్యాలకు జైనం బౌద్ధం ఎంతగానో సహకరించాయి. అయితే ఆ క్రమం కొనసాగడానికి అలాగే బౌద్ధ బిక్ష సంఘాలు ఆరామాలు, బౌద్ధ విశ్వవిద్యాలయాలు స్థిరంగా కొనసాగడానికి వాటికి కెటాయించిన భూముల్లో, గ్రామాల్లో ఉత్పత్తి సంపద స్థిరంగా కొనసాగడానికి స్థిరమైన నిరంతర ఉత్పత్తి విధానం అవసరమైంది. పర్యవసానంగా శూద్రులు, ఉత్పత్తి కులాలు వేటికవే రక్తసంబంధాలతో మరింత స్థిరపడిన కులవ్యవస్థ బలపడడం జరిగింది అని కొందరు చరిత్ర కారుల అభిప్రాయం.

తొలుత భూ స్వామ్య విధానం ఏదైనా ఉంటే అది బౌద్ధ ఆరామాలకు, బౌద్ధ విశ్వ విద్యాలయాలకు కెటాయించిన భూములు, గ్రామాలు వాటి ఉత్పత్తి విధానం వల్లనే భారతదేశంలో భూస్వామ్య విధానం మొదలైందని కొందరి అభిప్రాయం. బ్రాహ్మణవాదులు గుడులు, గోపురాలు సంస్కృతి కూడా ఇదే విధానాన్ని అనుసరించింది. దానికి తోడు వర్ణ కుల వ్యవస్థలకు బలమైన కొత్త కొత్త సిద్ధాంత సమర్థనలను రూపొందించారు. కొంత కాలం జన్మనా జాయతే శూద్ర అన్నారు. అంటే పుట్టుకతో అందరూ శూద్రులే అన్నారు. జ్ఞానార్జనతో సంస్కారంతో ఎన్నుకున్న పని కర్తవ్యాలతో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు అవుతారని సిద్ధాంతీకరించారు. అందువల్ల ఈ మూడు వర్ణాలు లేదా కులాలు రెండు జన్మలు ఎత్తినట్టు లెక్క అని ద్విజులు అని పిలిచారు. శూద్రులుగా ఉండేవాళ్లు ఏక జన్ములు అని ఆ దశ నుండి ఎదిగిన వారు రెండు జన్మలు ఎత్తిన ద్విజులు అని సిద్ధాంతీకరించారు.

ఇలా అన్ని కులాల నుండి అందరూ శూద్రులే అని సమానం చేసి వారి నుంచి కాస్త ఎదిగిన వారిని మూడు కులాల్లోకి మార్చారు. మారారు. చేరారు. ఇలా అన్ని కులాల నుండి చేరిన వారితో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలు వర్ణాలు రూపొందాయి. ఈ క్రమం నేటి రాజకీయ పార్టీల నిర్మాణం వంటిదే. ఏ పార్టీలో చేరితే ఆ పార్టీ ముద్రతో సమాజంలో చెలామణి అయినట్టుగానే ఏ కులంలో చేరితే ఆ కులం వారిగా చెలామణి అయ్యారు.

హిందూ మతతత్వ వాదులకు, బ్రాహ్మణ వాదులకు ఈ విషయాలు తెలుసు. కులాలు మారడం ద్వారానే అగ్ర వర్ణాలు, అగ్ర కులాలు రూపొందాయనే ప్రధానమైన చారిత్రక పరిణామాన్ని ఎవరూ నొక్కి చెప్పడం లేదు. అది నొక్కి చెప్పినప్పుడు తిరిగి కులాలన్నీ ఒక్కటిగా కలిసిపోవడానికి రక్త సంబంధాలు కలుపుకోవడానికి చారిత్రక, సైద్ధాంతిక, భూమిక ఏర్పడుతుంది. ఆర్.ఎస్.ఎస్. పరివారంలో ఉండే చాలా మంది పుట్టుకతో అందరూ శూద్రులే అనే సిద్ధాంతాన్ని ఇప్పటికీ ప్రచారం చేస్తున్నారు. విశ్వసిస్తున్నారు. వాళ్లు రక్త సంబంధాల్లో కులాతీత వివాహాలు, సాంప్రదాయకంగా జరపడాన్ని ఒక సామాజిక పరివర్తన కార్యక్రమంగా తీసుకపోలేక పోతున్నారు.

పుట్టుకతో అందరూ శూద్రులు అయినప్పుడు పెరుగుదలతో ఇతర అగ్ర వర్ణాలుగా మారుతున్నప్పుడు అలా మారారని ఎవరు ధ్రువీకరించాలి? తమకు తామే పుట్టుకతో బ్రాహ్మణులు, క్షత్రియులు, వైశ్యులు, అగ్రకులాలు అని చెప్పుకోవడం హిందూ బ్రాహ్మణవాద సిద్ధాంతాలకు వ్యతిరేకమైనది. అయినా దీన్ని వ్యతిరేకిస్తూ నొక్కి చెప్పడం, ఉద్యమాలు చేయడం జరగడం లేదు. అందువల్ల చరిత్ర రచనలో శాస్త్రీయ విధానాలను సామాజిక పరిణామాలను వారు నొక్కి చెప్పడం లేదు. వెలికితీయడం లేదు. దేశంలో ఎన్ని కులాలున్నాయో అన్ని కులాలవారు పెరుగుదలతో జంధ్యంతో రెండో జన్మ ఎత్తి బ్రాహ్మణులుగా, క్షత్రియులుగా, వైశ్యులుగా మారిపోయారు. ఈ మారిన క్రమం చరిత్ర నిర్దిష్టతల నుండి వెలికి తీసి చెప్పడం అవసరం.

మరొకసారి దేవుని నోట అన్ని వర్ణాలు నేనే సృష్టించానని పలికించారు. అన్ని దైవ స్వరూపమైన సమాజ శరీరంలో భాగమే అని సిద్ధాంతీకరించారు. శరీరం రక్త మాంసాలతో నిరంతర చలనంతో కలిసి ఉంటుంది. కానీ ఈ వర్ణాలు అలా కలిసి ఉంటాయని, ఉన్నాయని సిద్ధాంతాలు చేసినప్పటికీ అవి స్థిరపడే క్రమంలో కాళ్ళు వేరైపోయాయి. చేతులు వేరైపోయాయి. తల వేరైపోయింది. మొండెం వేరైపోయింది. తొడలు వేరైపోయాయి. ఇలా శరీరంలోని అంగాలన్నీ రక్త ప్రసారం లేక, రక్త సంబంధాలు కోల్పోయి తల, చేతులు, భుజాలు, మొండెం, కాళ్ళు విడివిడిగా తెగగొట్టబడ్డాయి. శరీర భాగాలు ముక్కలు ముక్కలు చేస్తే ఏం జరుగుతుంది. అదే జరిగింది. సమాజం ముక్కలు ముక్కలై రక్తప్రసారం లేక శరీర అంగాలు నిర్జీవమైపోయాయి. శరీర అంగాలను తిరిగి అతికించాలి. గుండెనుండి రక్తప్రసారం అన్నిటికీ ప్రవహించాలి. అందుకు అన్ని విడగొట్టిన శరీర భాగాలను తిరిగి ఒక్కటి చేయాలి. అందుకు జన్మనా జాయతే శూద్ర అనే వెనుకటి సిద్ధాంతాన్ని తిరిగి విస్తృతంగా అగ్ర వర్ణాలకు అర్థం చేయించాలి. ఏ కులం గొప్పది కాదు. ఏ కులం చిన్నది కాదు. అన్ని కులాలు సమానమే. అన్ని కులాలు, హిందువులందరూ పుట్టుకతో శూద్రులే అని విస్తృతంగా ప్రచారం చేసి అగ్ర వర్ణాల, అగ్ర కులాల సాంఘిక రాజకీయ, ఆర్థిక ఆధిక్యతను, సాంస్కృతిక ఆధిక్యతను అన్ని రంగాల్లో తొలగించే కృషి చేయాలి. అందుకు ముందుగా వారి బ్రేన్ వాష్ చేసి వారందరూ శూద్రులే అని స్వయంగా అంగీకరించేటట్టు చేయాలి. అందుకు అనువుగా మైండ్ సెట్ మార్చాలి. అన్ని కులాల రక్తం ప్రతి కులంలో ప్రవహిస్తున్నట్టుగానే బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాల్లో కూడా శూద్ర కులాల రక్తం అంటరాని కులాల రక్తం ప్రవహిస్తున్నదని స్పష్టం చేయాలి.

పూర్వజన్మ, కర్మ సిద్ధాంతాలు మనిషిని తిరగబడకుండా మేధావులను ఒక దశకు మించి ఆలోచించకుండా చేశాయి. పూర్వ జన్మ సిద్ధాంతం ద్వారా అగ్ర కులాలుగా, అగ్రవర్ణాలుగా జన్మ ఎత్తారు. గత జన్మలో పుణ్యం చేసుకోవడం వల్ల ఈ అగ్రకుల



జన్మ ఎత్తడం జరిగింది అని మరొక సిద్ధాంతం ఉంది. దాని ప్రకారంగా చూసినప్పటికీ అంటరాని కులాల వాళ్ళు, శూద్రులు గత జన్మలో పుణ్యం చేసుకోవడం వల్లనే ఈ జన్మలో బ్రాహ్మణులుగా ఇతర అగ్ర కులాలుగా పుట్టారని అర్థం. అలాగే ఈ జన్మలో శూద్రులుగా పుట్టినవారు గత జన్మలో అగ్రకులాలుగా పుట్టి కర్మవశాన శూద్రులుగా మారినవారే. ఇలా చూసినప్పటికీ రెండు జన్మల సంబంధంలో అన్ని కులాలు పరస్పరం ఒక్కటే అని తేలుతున్నది. ఇలాంటి సిద్ధాంతాలను బౌద్ధం నుండి తిరిగి ప్రజలను తమ బ్రాహ్మణీయంలోకి మార్చడం కోసం చేయాల్సి వచ్చింది. అందువల్ల జన్మనా జాయతే శూద్ర అనే సిద్ధాంతం అనేక తెగలను, జాతులను, కులాలను, జన పదాలను ఒక్కటిగా కలిపి ఒక సమాఖ్యగా జీవించే విధానాన్ని ప్రతిపాదించడం కోసం ముందుకు వచ్చింది అని తేలుతున్నది. ఇలా బౌద్ధ ఏకత్వ సిద్ధాంతానికి భిన్నంగా ఏకత్వంలో భిన్నత్వం, భిన్నత్వంలో ఏకత్వం, నిర్దిష్టత్వం సాధిస్తూ ప్రజల నుండి ఐ.ఎ.ఎస్‌లను ఎన్నుకున్నట్లుగా అగ్రవర్ణీకరణ అన్ని కులాల నుండి ఎన్నుకొని అగ్రవర్ణాలుగా రూపొందించే సిద్ధాంతకృషి జరిగింది.

ప్రళయం వచ్చి వరదలు, తుపానులు, సునామీలు వచ్చి అందరూ చనిపోయి కొందరు మిగిలితే వారిలో వారు వర్ణకుల విభాగాలు, వివక్షతలు, అసమానతలు సృష్టించుకునే సిద్ధాంత భూమికలిస్తాయి వర్ణకుల సిద్ధాంతాలు. నష్టపరిహారం ఇవ్వడంలో అవకాశాల కల్పనలో, నిరాకరణలో ఈ అసమానతలు పెంచిపోషిస్తారు. అందుకే **హిందువులు ప్రపంచంలో ఎక్కడ వుంటే అక్కడికి కులాలు విస్తరిస్తాయి. అసమానతలు పెరుగుతాయి. రక్తసంబంధాలు అరికట్టబడతాయి. ఇందుకు భిన్నంగా బౌద్ధం, క్రైస్తవం, ఇస్లాం సమానత్వాన్ని ప్రతిపాదిస్తూ రక్త సంబంధాలను కలుపుకుంటూ వచ్చారు.**

బౌద్ధులు విహారాలు, విశ్వవిద్యాలయాలు, వైద్య సదుపాయాలు సమానత్వాన్ని నిర్మించుకుంటారు. వర్ణ కుల వ్యవస్థలను నిర్మూలించుకుంటారు. క్రైస్తవులున్న చోట చర్చిలు, ఆసుపత్రులు నిర్మించుకుంటారు. ముస్లింలు వున్న చోట సమానత్వాన్ని, మసీదులను నిర్మించుకుంటారు. సిక్కులున్న చోట గురుద్వారాలు నిర్మించుకుంటారు. హిందువులున్న చోట గుళ్ళు, గుళ్ళతో వర్ణకుల వివక్షత సమాజాలు నిర్మించుకుంటారు. అసమానతల సమాజాన్ని నిర్మించడమే వర్ణకుల సిద్ధాంతాల పని.

# హిందూమత సారం కులం కాదు

కుల వ్యవస్థ వల్లనే హిందూమతం కొనసాగుతున్నదని, కులం పోతే హిందూమతం పోతుందని, హిందూమతసారం కులం అని కొందరి అభిప్రాయం. కుల వ్యవస్థ లేక ముందు భారతీయ సామాజిక పరిణామాలు కొనసాగాయి. కుల వ్యవస్థ లేకపోయినా హిందూమతం కొనసాగుతుంది. వర్ణ, కుల వ్యవస్థలు హిందూ మత సిద్ధాంతాలుగా హిందూమతానికి ఎంతో బలాన్ని ఇచ్చాయి. అయితే అవే హిందూమతం కాదు.

హిందూమతసారం కులం అనడంతో పాటు, యాచనే హిందూమతానికి ప్రధాన సిద్ధాంతం అని, స్వకుల వివాహం హిందూ మతానికి ఆయువు అని మరికొందరు అన్నారు. ఈ అంశాలపై స్పష్టత అవసరం.

1. హిందూమత సారం కులం కాదు. వర్ణవ్యవస్థ కూడా కాదు. కులం, వర్ణ వ్యవస్థ లేక పోయినా హిందూ మతం ఉంటుంది. కొనసాగుతుంది.

2. యాచన హిందూమతానికి ప్రధాన సిద్ధాంతం కాదు.

3. కుల వివాహం హిందూమతానికి ఆయువు అయినప్పటికీ అది హిందూమతంలో భాగం కాదు.

**4. అసలు కులాన్ని హిందూ మతంలో, బ్రాహ్మణిజంలో భాగంగా చూడడమే తప్పు. కులాన్ని హిందూమతంలో భాగంగా చూడడం బ్రాహ్మణిజం యొక్క విజయానికి లొంగిపోవడమే. వీటిని కాస్త వివరిస్తాను.**

కులం అనేది శూన్యం నుంచి ఏర్పడలేదు. ఏదీ శూన్యం నుంచి పుట్టదు. గతం నుండి పరిణామం చెందుతూ వస్తూఉంటుంది. కులం కూడా గణ తెగల, రాజన్యరాజ్యాల, జన పదాల కాలం నాటి తెగల సంస్కృతి సంబంధాల నుండి, రక్త సంబంధాలనుండి రూపుదిద్దుకున్నది. కులంలో ఉన్న లక్షణాలు అన్నీ గణతెగల, జనపదాల మానవ సంబంధాలకు సంబంధించినవే. ఇవాళ జాతుల రూపంలో కూడా ఇవే లక్షణాలు కొనసాగుతున్నాయి. గత అధ్యాయంలో వీటినే పరిశీలించారు.

ఆఫ్రికా, అమెరికా ఖండాల్లోని, భారత దేశంలోని ఈశాన్య రాష్ట్రాల్లోని, రష్యాలోని,



ఆఫ్ఘనిస్తాన్‌లోని తెగలు కాలక్రమంలో మతంలోకి చేరినప్పటికీ, చేరకుండా ఉండిపోయినప్పటికీ తెగల మధ్య తగాదాలు సాగుతూనే ఉన్నాయి. మధ్య ఆసియా గోబీ ఎడారిలోని తెగల మధ్య సంఘర్షణను నివారించడానికి మహ్మద్ ప్రవక్త ఇస్లాంను ముందుకు తెచ్చారు. చెంగిజ్‌ఖాన్ ఆ తెగలన్నింటినీ ఒక సామ్రాజ్యంగా మలిచి ఇతర ప్రాంతాలకు విస్తరించారు. ఇలాగే తెగ దశ నుండి తెగల మధ్య సంఘర్షణను నివారించడానికి వర్ణవ్యవస్థ, కులవ్యవస్థ సిద్ధాంతాలు ముందుకు వచ్చాయి. ఇవి ఆ కాలంలో జన సమూహాల మధ్య సమైక్యతను సాధించడానికి పుట్టిన సిద్ధాంతాలే. దానికి, హిందూమతానికి లేదా బ్రాహ్మణిజానికి ముడివేయడం సరియైనది కాదు. సమాజం అలా ఏర్పడిన తరువాత వాటిని బ్రాహ్మణిజం స్థిరపరిచింది. మారకుండా సిద్ధాంతీకరించింది. గణ తెగల జనపదాల లక్షణాల నుండే కులం రూపొందింది అనే మేరకు ఇక్కడ పరిమితమవుతాను.

## కులంలో కొనసాగుతున్న సోషలిజం

కులం తనలోతాను, తనకొరకు తాను సోషలిజాన్ని ఆచరిస్తుంది. వర్గం కూడా తనలోతాను, తనకొరకు తాను మాత్రమే సోషలిజాన్ని ఆచరిస్తుందని ఎంగెల్స్, లెనిన్, మావో అన్నారు. జీన్‌పాల్ సార్త్రే కూడా థింగ్ ఇన్ ఇట్ సెల్ఫ్ మాత్రమే ఉంటుందని థింగ్‌ఫర్ అదర్స్ ఉండదని అన్నారు. అనగా పరోపకారం అనేదే ఉండదని వర్గదృక్పథం ప్రచారం చేసే లెనిన్, మావో, అలాగే జీన్‌పాల్ సార్త్రే సూత్రీకరించినట్లయింది. అయితే బుద్ధుడు పరోపకారం ప్రేమ, కరుణతో జీవించాలని ప్రజలకు జీవితాన్ని అంకితం చేయాలని బోధించాడు. చాలా సిద్ధాంతాలు ప్రజల కోసం త్యాగం చేయాలని చెప్తాయి. భారతీయ తాత్వికతలో పరోపకారం ఒక ప్రధాన దృక్పథం. కులంలో, వర్గంలో సోషలిజంలోని క్రమాలు 'బహుజన తత్వం' గ్రంథంలో విపులంగా చూడవచ్చు.

కులం పరోపకార దృక్పథాన్ని అలవర్చుకుంటే అనగా కులం ఇతరులకొరకు తానుగా మారగలిగితే అదే సోషలిజం. సోషలిజం లోని మూడు దశల్లో రెండు దశలు కులంలో, వర్గదృక్పథంలో, మార్క్సిజంలో కొనసాగుతున్నాయి. ఇవి మూడవ దశలోకి పరివర్తన చెందవలసి ఉన్నది. అదే పరోపకారం. అదే ఇతరుల కొరకు తాను. ఇతర కులాలకొరకు తాను. ఈ ఇతర కులాల కొరకు తాను అనే పరోపకార దృష్టి నుంచే గ్రామీణ స్వయంపోషక ఆర్థిక వ్యవస్థ శతాబ్దాలుగా కొనసాగింది. అయితే కొన్ని కులాలు అనగా ఆధిపత్య కులాలు వీటన్నింటినీ తనకొరకు తాను, తన ప్రయోజనాల కొరకు ప్రజలు అనేదిగా మార్చుకున్నాయి. అదే మనం విమర్శించే వర్ణ, కుల వివక్షతలు, ఆధిక్యతలు వాటి తాలూకు సిద్ధాంతాలు.

ఇలా కులాలు ఏర్పడ్డాక ఆ కులాలపై ఆధిక్యత సాధించే ఆధిపత్య కులాలు

లేదా కుటుంబాలు ఏర్పడ్డాయి. అవి ఆయా తెగల నుండి, కులాల నుండే రూపొంది ప్రత్యేక కులంగా సమీకరణ పొందాయి. గణ తెగల వ్యవస్థ, జన పదాల కాలంలో తెగ పెద్దలు, పూజార్లు ఇలా ఆధిక్యత స్థానాన్ని తమకు తాము నెలకొల్పుకున్నారు. అలాంటి వాళ్ళంతా కలిసి కులాలుగా రూపొందుతూ వచ్చారు. ఇది ప్రపంచ మానవ పరిణామంలోని క్రమం. పని చేసే వాళ్ళు లేకుండా దోపిడీ దారుడికి ఉనికి లేదు. గణ తెగల మధ్య, జనపదాల మధ్య, కులాల మధ్య సఖ్యత లేకుండా సంఘర్షణ నివారించుకొని సహజీవనం చేయడం లేకుండా ఆధిపత్య కులాలు ఏర్పడడం సాధ్యంకాదు. అందువల్ల అందరూ కలిసి మొదట ఒకటిగానే జీవించారు. కాల క్రమంలో నేటి అనేక పార్టీల నుండి వర్గాల నుండి, కులాల నుండి ఎదిగి పాలక వర్గాలుగా ఒక సమన్వయం సాధించుకొని రూపొందినట్లుగా ఆనాడు ఆధిపత్య కులాలు రూపొందాయి. మరింత వివరంగా తెలుసుకోవడానికి నేను రాసిన బహుజనతత్వం గ్రంథం చదవడం అవసరం.

ఇక రెండవ సిద్ధాంతం గురించి. యాచన హిందూమత ప్రధాన సిద్ధాంతం కాదు. గణ తెగల జనపదాల కాలంలో యాచన, బిక్ష అనే పదాలు, దృక్పథాలు ఉండే అవకాశం లేదు. గణ పెద్దలకు గౌరవంగా మిగతా సభ్యులు ఇచ్చేవారు. లేదా ఆదేశించి తీసుకునేవారు. బ్రాహ్మణిజంలో ఆదేశించి తీసుకోవడం ఉంది. అయితే బౌద్ధం బిక్షను బాగా ప్రాచుర్యంలోకి తెచ్చింది. సొంత ఆస్తి లేని బౌద్ధ బిక్షువుల సంఘ నిర్మాణాన్ని బౌద్ధం ప్రతిపాదించింది. శతాబ్దాల తరబడి అవి కొనసాగాయి. బౌద్ధంలో బిక్షువులు, శ్రమణులు అని రెండు స్థాయిలు ఉండేవి. ఉన్నాయి. శ్రమణులు కుటుంబ జీవితం జీవిస్తూ బౌద్ధాన్ని ఆచరిస్తారు. బిక్షువులు బ్రహ్మచారులుగా ఉంటారు. బౌద్ధాన్ని ప్రచారం చేస్తారు. విద్యను, వైద్యాన్ని, విశ్వ విద్యాలయాలను నిర్వహించారు. బౌద్ధాన్ని బౌద్ధంలోని ప్రధానాంశాలను తీసుకొని దాని ద్వారానే తాము తిరిగి నిలదొక్కుకోవాలని వర్ణకుల ఆధిక్యత వర్గాలు భావించాయి.

అలా బౌద్ధంలోని బిక్ష హిందూమతంలో బ్రాహ్మణిజంలో యాచనగా మారింది. బ్రాహ్మణులు బౌద్ధ శ్రమణులలాగా కుటుంబ జీవితాన్ని జీవిస్తూ సమాజంలో భాగంగా ఉండిపోయారు. బౌద్ధ బిక్షువులు ప్రజలకు వెలుపల ఉండిపోయారు. దీనివల్లే బౌద్ధం క్షీణించిందని ముస్లింల దండయాత్రలతో పూర్తిగా క్షీణించిందని అంబేద్కర్ అభిప్రాయపడ్డారు. పార్టీల్లో హోల్ టైమర్స్ పార్ట్ టైమర్స్, సింపతైజర్స్ అనే మూడు దశలు, వర్గాలు ఉంటున్నాయి. ఈ మూడూ ప్రతి సిద్ధాంతానికి అవసరమే నని అంబేద్కర్ అంటారు. బ్రాహ్మణులు వేదాధ్యాయనంతో హోల్ టైమర్స్‌గా ఉంటూనే కుటుంబ జీవితాన్ని జీవించారు. ప్రజల మధ్య జీవించారు. అందువల్ల కుటుంబ జీవితానికి, తమ సామాజిక ఆధిక్యతకి అనువుగా యాచనలో అడిగే వస్తువుల లిస్టు



తమ సుఖాలకు అనువుగా పెంచుకున్నారు. ఇవాళ యజమానుల నుండి ఉద్యోగులు, కార్మికులు, వ్యవసాయ కూలీలు మొదలైనవారు డిమాండ్స్ రూపంలో చేస్తున్నది యాచనే అని కొందరి అభిప్రాయం. సామాజిక ఉద్యమాలు ప్రభుత్వాలను డిమాండ్ చేసి తీసుకోవడం కూడా దళితింగ్ ఈజ్ బెగ్గింగ్ అని యాచనే అని కాన్సీరామ్ బలంగా నొక్కి చెప్పారు. అందువల్ల యాచన అనేది పాలక వర్గాల సిద్ధాంతంగా ఉండదు అని తెలుస్తున్నది.

యాచన అనేది ప్రజల మీద, సమాజం మీద, ప్రభుత్వాలమీద ఆధారపడి బతికేవారి సిద్ధాంతం. వైష్ణవం ప్రచారానికి వీరిని ప్రోత్సహించింది. కొత్త బిచ్చగాళ్ళను విస్తరింప చేసింది. ప్రభుత్వాలు పన్నులు వేస్తాయి. బలవంతంగా వసూలు చేస్తారు. అంతేగానీ యాచన అనేది ప్రభుత్వాల సిద్ధాంతం కాదు. ఆధిపత్యవాదుల సిద్ధాంతం ఎప్పుడూ యాచనగా ఉండదు. యాచన అనేది ఎన్నడూ ఎప్పుడూ ఆధిపత్యవాద వర్గాల సిద్ధాంతంగా లేదు. అందువల్ల ప్రపంచంలోని పాలక వర్గాలు, కులాలు, సమాజాలు యాచన మీద ఆధారపడి బతుకుతున్నాయంటే అవి స్వయం పోషకం కాదని అర్థం. అవి ఎవరినీ యాచించి బతుకుతున్నాయో వారిపై ఆధిపత్యం చెలాయించడం సులభం కాదు. ఉదాహరణకు అమెరికాను ఇతర దేశాలను యాచించి బతికే భారతదేశం ఆ దేశాలపై ఆధిపత్యం చెలాయించడం సాధ్యం కాదు. అందువల్ల యాచన అనేది ఆధిపత్యానికి ఉపకరించదు. ప్రజల మీద ఆధారపడి బతకడాన్ని అనివార్యం చేస్తూ బౌద్ధం ముందుకు తెచ్చిన బౌద్ధ బిక్షు సిద్ధాంతంలో భాగమే యాచన.

చాలామంది చరిత్రకారులు హిందూమత గ్రంథాల ఆధిపత్యంలో ఇరుక్కుపోయి ఆలోచించిన తీరులోంచి వచ్చిన ఆలోచన వల్ల బౌద్ధంలోని అనేక అంశాలను బ్రాహ్మణిజం హిందూమతం ఎలా స్వీకరించిందో విశ్లేషించలేకపోయారు. సాహిత్యాన్ని కాకుండా చరిత్రను అధ్యయనం చేసి నిర్ధారణకు రావడం అవసరం. సాహిత్యాన్ని కూడా చారిత్రక ఆధారంగా తీసుకోవాల్సిందే. అయితే బౌద్ధ సాహిత్యం 500ల గ్రంథాలు పాలీ, సంస్కృత, చైనా, టిబెట్ భాషల్లో ఇప్పటికీ మిగిలి ఉన్నాయి. దేవనాగరి లిపిలో ఇప్పటికీ రీ ప్రింట్‌లు వస్తూనే ఉన్నాయి. వాటిని మూలాధారంగా తీసుకోవడం బ్రాహ్మణిజాన్ని పూర్వపక్షం చేయాలనుకునేవారికి తక్షణ కర్తవ్యం.

ఇక మూడవది. కుల వివాహం హిందూమతానికి ఆయువు పట్టు అని చెప్పడం కూడా హిందూమతంలో భాగమని చెప్పడం హిందూమతానికి లేని ఆధిక్యతను ఆపాదించడమే. గణ తెగలు తమలో తామే వివాహాలు చేసుకుంటాయి. ఇప్పటికీ మిగిలి ఉన్న ఆదివాసీ తెగలు అనగా షెడ్యూల్డు తెగలు తమలో తామే వివాహాలు చేసుకుంటారు. ఇదే రక్త సంబంధాలు తెగ కులంగా పరివర్తన చెందిన తర్వాత

కూడా కొనసాగుతూ వస్తున్నాయి. అంతేగానీ మనువు చెప్పాడనో, మరెవరో చెప్పారనో కులంలో భాగంగా పెళ్ళిల్లు చేసుకోవడం జరగడం లేదు. ఇప్పటికీ కుల వృత్తులు వదిలివేసి ఆధునిక వృత్తి ఉద్యోగాల్లో చేరినవాళ్ళు కూడా తమ కులాల వారినే వెతికి వెతికి చేసుకోవడంలో ఉన్నది బ్రాహ్మణిజం కాదు. హిందూమతం కాదు. గణ తెగల కాలం నాటి రక్తసంబంధాల పర్యవసానమే. ఇతర కులాల వారిని పెళ్ళి చేసుకోవడానికి వెనుకంజ వేయడానికి రెండు కారణాలు ప్రధానంగా పని చేస్తున్నాయి. వాళ్ళ కులంలో పుట్టి పెరిగిన సంస్కృతి, ఆలోచనా విధానం, కుల వివక్షత వేరు. మన కులం, సంస్కృతి వగైరా వేరు అనేది ఒకటి.

రెండవది మన కులంలో ఆపాటి అర్హతలున్న వాళ్ళు లేరా? లేక లేక మన కులంలో ఒక స్థాయికి ఎదిగితే మన కులం పిల్ల సుఖపడ కూడదా? అగ్ర కులాల ఆడ పిల్లలు ఎగరేసుకుపోతే మన కులం ఆడపిల్ల నష్టం జరగడం లేదా? అని ప్రశ్నిస్తున్నారు. కుల వివక్షత అంతరిస్తే కులాల మధ్య పెళ్ళిల్లు మరింత సులభం అవుతాయి. కులాలన్నీ కలిసిపోయినా హిందూమతం, బ్రాహ్మణిజం కొనసాగుతుంది. ఇలా అసలు కులాన్ని హిందూ మతంలో, బ్రాహ్మణిజంలో భాగంగా చూడడమే తప్పు అని తేలుతున్నది.

సింధూనాగరికత దళితులు సృష్టించిందే అని కొందరి అభిప్రాయం. తెగలు కులాలుగా సమీకరణలు పొందాక వర్ణవ్యవస్థ, కుల వ్యవస్థ రూపొంది స్థిరపడడం మొదలైంది. నాలుగు వర్ణాలు ఉన్నవో లేవో గానీ ఉత్పత్తి కులాలు, తెగలు మాత్రం ఉండేవి. ఆధిపత్య వర్ణాలు ఉత్పత్తి కులాల సంపదలో సింహభాగం తమ కైంకర్యం చేసుకున్నారు. ఇలా ఉత్పత్తి, పంపిణీల మధ్య అంతరాలు వర్ణకుల వ్యవస్థల అంతస్సారం. సాంఘిక, సాంస్కృతిక రంగంలోనూ, భావజాల రంగంలోనూ ఇందుకు అనువుగా సిద్ధాంతాలు చేశారు. ఆచరించారు.

శూద్రులు అనే వర్ణం లేదా కులాలు అనే వర్గీకరణ లేదా వర్ణీకరణ ఏర్పడకుండా దళితులు ఏర్పడే అవకాశం లేదు. తొలి మూడు వర్ణాలు ఆ తరువాత నలుగవ వర్ణంగా శూద్రులు, ఆ తరువాత రూపొందించడం వల్ల లేదా వర్గీకరించడం వల్ల పంచమ వర్ణం అనే పదం ఏర్పడింది. దళితులు సిందూనాగరికత మూల పురుషులు అని అంటే ఆనాటికే కుల వ్యవస్థ ఏర్పడిందని అంటరానితనం ఏర్పడిందని చెప్పడమే అవుతుంది. సిందూనాగరికత ఇటీవలి పదాలైన దళితులు అనే పదాలతో చెప్పడం దేనికి? అది ఆనాటి భారతీయ మొత్తం సామాజిక పరిణామాలకు సంబంధించిన చరిత్రగ్గా చూడడం అవసరం. వర్ణ విభజన జరిగి ఉంటే సింధూనాగరికత సూద్రులు నిర్మించిన నాగరికత అవుతుంది. వర్ణ విభజన జరగక పోతే భారతీయుల నాగరికత అవుతుంది. అంతేగానీ దళితుల నాగరికత కాదు.



అలాగే ఆర్యులు విదేశాల నుండి వచ్చారు అనే వాదం కూడా సరియైనది కాదు. ఈనాటి దేశాల సరిహద్దులు ఆనాడు లేవు. భూమి పొడవు, వెడల్పులు టోపోగ్రఫీ కూడా వారికి తెలియదు. సంచార జాతులుగా, తెగలుగా తిరిగారు. ఆఫ్ఘనిస్తాన్ అని పిలువబడే దేశం గాంధార దేశంగా భారతదేశంలోనే భాగంగా ఉండేది. కంపూచియా, కాంబోజదేశంగా భారతదేశంలో భాగంగానే జానపద సాహిత్యంలో చూడవచ్చు. దక్కన్ పీఠభూమిలోని తెలంగాణ వాసులకు తెలిమన్ నాగరికతకు సుమేరు, మెసపొటేమియా నాగరికతకు సంబంధాలున్నాయని ఇటీవల అనేక సాహిత్య, చారిత్రక సాక్ష్యాలు లభించాయి. ఆర్యుల కన్నా ముందునాటి చరిత్రను, సిందూనాగరికత కన్నా వెనక్కి తెలుగువారి తెలిమన్ నాగరికత చరిత్ర వెలికి వస్తున్నది. గాంధార దేశం కన్నా కాస్త ముందున్న మధ్యాసియా ప్రాంతం భారత ఉపఖండంలో భాగంగా భావిస్తే ఆర్యులు, విదేశీయులు అనే మాట అర్థం కోల్పోతుంది.

మానస సరోవరం, టిబెట్ కూడా భారతీయ చరిత్ర సంస్కృతిలో భాగంగా ఉన్న విషయం అందరికీ తెలుసు. బుద్ధుడు పుట్టిన నేల ఇప్పుడు నేపాల్ దేశంగా మారింది. టిబెట్ ఆఫ్ఘనిస్తాన్ ఎప్పుడో విడి దేశాలయ్యాయి. సింధూ నాగరికత ఉన్న ప్రాంతం పాకిస్తాన్ దేశంగా మారిపోయింది. ఇలా ఇప్పటి దేశ సరిహద్దులను అనుసరించి ఆలోచిస్తే సింధూ నాగరికత పాకిస్తాన్ దేశ నాగరికత అవుతుంది. అలా కాకుండా మానవ ప్రస్తానాలు సాగిన క్రమం నుండి చరిత్రను చూడాలి. దక్కన్ పీఠభూమి నుండి ఉత్తర ప్రాంతంలోకి వలసలు వెళ్తూ ఆఫ్ఘనిస్తాన్ మీదుగా ఇరాక్, ఇరాన్, తాష్కెంట్, రోమ్, గ్రీక్ దాకా విస్తరించిన చారిత్రక క్రమం సాక్ష్యాలతో సహా మన ముందున్నది. రాంభట్ల కృష్ణమూర్తి జనకథ అనే గ్రంథంలో అనేక విషయాలను చర్చకు తెచ్చి మన ముందుంచారు. సంయుక్త కూనీయ్య మరికొన్ని సాక్ష్యాలు మన ముందుకు తెచ్చారు. 'తెలుగులో పాలీ పదాలు' గురించి చీమకుర్తి శేషగిరిరావు చక్కగా వివరించారు.అయితే తెలుగు పదాలే పాలీలో చేరాయి. 'బ్రహుఈ' బాష నేటి తెలంగాణ బాషకు లేదా, నాటి పాలీ, పైశాచి బాషకు సన్నిహిత సంబంధం గల భాష. అది ఆఫ్ఘనిస్తాన్‌లోని ఒక తెగ ఇప్పటికీ మాట్లాడుతున్నది. అందువల్ల దక్షిణాది నుండి ఉత్తరాదికి సాగిన వలస క్రమం కూడా ఉందని స్పష్టం.

ఇప్పటిదాకా చరిత్ర ఉత్తరాది నుంచి దక్షిణాదికి వలస సాగినట్లుగా రాస్తున్న దృక్పథం కొనసాగుతున్నది. ఇది హూణులు, ముస్లింలు బ్రిటిష్ వాళ్ళు తమ వలసలకనువుగా రూపొందించిన సిద్ధాంతం. ముస్లింలు కూడా అలాగే ఆఫ్ఘనిస్తాన్ పశ్చిమ కనుమల గుండా వలసవచ్చి రాజ్యాలు ఏర్పాటు చేశారు. యూరప్‌వాళ్ళు సముద్ర మార్గాన నౌకలతో వ్యాపారం కోసం వచ్చి వలసలుగా స్థిరపడ్డారు. కనుక ఆర్యుల వలస సిద్ధాంతాలను తేలికగా విశ్వసించారు. ఆర్యులు విదేశీయులని రాసిన

రాతల్లోని పరిమితులను దృక్పథాలను స్వార్థాలను కె.ఎస్. చలం 'భారతీయ సామాజిక చలనం' అనే గ్రంథంలో స్పష్టంగా వివరించారు. వాటిని పూర్వపక్షం చేయదల్చుకుంటే కత్తిపద్మారావు అంబేద్కర్‌ను, కె.ఎస్. చలంను పూర్వపక్షం చేయవలసి ఉంటుంది. దేశాలకు సరిహద్దులు తెలియని, టోపోగ్రఫీ, జాగ్రఫీ తెలియని కాలం నాటి తెగలు, జాతులు చేసిన ప్రస్తానాలు సంఘర్షణలు విదేశీయులు, విజాతీయులు అనే పదంతో చర్చించడం సరియైనది కాదు. విదేశీయులు అనే దృష్టి 18వ శతాబ్దానికి ముందు లేదు.

నిజాం రాజ్యంలోని ముల్కీ అనే స్థానికులను కాదని కేవలం పదేళ్ళు నివసిస్తే స్థానికులు అవుతారని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం, భారత రాష్ట్రపతి ఉత్తర్వులు జారీ చేశారు. అమెరికా ప్రభుత్వం గ్రీన్‌కార్డుతో పదేళ్ళ నివాసం ద్వారా పౌరసత్వం ఇస్తున్నారు. ఆంధ్రప్రాంత వలసలు, ఉద్యోగులు ఇతర ప్రాంతాలకు సాగినవన్నీ వెనిక్కి తిప్పడం సాధ్యం కాదు. అందువల్ల తెలంగాణ వాదం ఆంధ్రా గో బ్యాక్ అనే సిద్ధాంతాన్ని వదిలివేసింది. ఆధిపత్యవాదులను మాత్రమే ప్రశ్నిస్తున్నది. ఇలా నాగరికత పౌర సమాజం విస్తరిస్తున్నది. ఆధునిక సామాజిక జీవితానికి అనువుగా ఆధునిక దృక్పథంతో ఆలోచించవలసి ఉన్నది. ఆధునిక సమాజానికి వెనుకబడిపోయిన ఆనాటి పగలను సెగలను నాగరిక సమాజానికి అంటించి సంఘర్షణాయుతం చేయడం అవసరమా? అది అవసరమనుకుంటే హిట్లర్లు, హిందూమత తత్వ పాసిస్టులు, రేసిస్టులు మళ్ళీ మళ్ళీ పుట్టి విస్తరించాలని కోరుకోవడమే అవుతుంది అని మర్చిపోకూడదు. కత్తిపద్మారావు గారు తమ చరిత్ర రచనను ముందే ఏర్పర్చుకున్న అభిప్రాయాలతో కాకుండా చారిత్రక పరిణామాలననుసరించి సవరించుకొని కొనసాగించడం అవసరం.

ఒకటి స్పష్టం చేయదల్చుకున్నాను. బానిస సమాజం లేకుండా రోమ్, గ్రీక్ నాగరికత, రోమన్ సామ్రాజ్యం లేదు. గ్రీకు సాహిత్యం, కళలు, సిద్ధాంతాలు లేనే లేవు. బానిస సమాజం పునాది నుండే ఆనాటి అత్యున్నత కళలు, సాహిత్యం, సిద్ధాంతాలు సామ్రాజ్యాలు పుట్టి పెరిగి విస్తరించాయి. అలాగే శూద్ర సమాజం, కుల వ్యవస్థ లేకుండా భారతీయ నాగరికత, సామ్రాజ్యాలు, చరిత్ర, సాహిత్యం, కళలు, సిద్ధాంతాలు లేవు. సూద్ర సమాజ పునాదినుండే అనగా సూద్రుల శ్రమశక్తి మూలాల నుండే వేల ఏళ్ళ భారతీయ బౌద్ధ, బ్రాహ్మణ, హిందూ తదితర సమస్త సిద్ధాంతాలు, రాజ్యాలు కళలు, సంస్కృతి భారతీయ చరిత్ర పుట్టి పెరిగి విస్తరించాయి. ఇలా చెప్పినంత మాత్రాన బానిస సమాజంగానీ, కుల వ్యవస్థ గానీ ఉండాలని కోరినట్టు కాదు. సమర్థించినట్టు కాదు. భారతీయ సూద్ర ఉత్పత్తి నిపుణుల కోసం ఇతర ప్రాంతాల నుండి దాడులు చేసి, యుద్ధాలు చేసి ఇక్కడి నుండి సంపదతో పాటు మనుషులను కూడా వందలాది గుర్రాలపై ఒంటెలపై గాడిదలపై తరలించుకపోయి మధ్యాసియాదాకా



తమ అవసరాలను తీర్చుకున్నారు. ఇదంతా భారతీయ చరిత్ర. భారతీయ చరిత్రలో సూద్రుల కృషి మౌలికమైనది. శూద్రులే భారతీయ సమాజ నిర్మాతలు.

క్రీ.పూ. నుండి చార్వాకులు, లోకాయతులు, నాస్తికులు, హేతువాదులు, ఆదివాసులు భౌతికవాద సిద్ధాంతాలు ప్రచారం చేశారు. భారతీయ భాషలను శూద్రులే అభివృద్ధి పరిచారు. ఉత్పత్తి సాధనాల, ఉత్పత్తి సరుకుల, ఉత్పత్తి క్రమాల, ఉత్పత్తి వినియోగాల పేర్లను శూద్రులే సృష్టించారు. శూద్రుల అభివృద్ధి పరిణామాలే భారతీయ భాషా, అభివృద్ధి పరిణామాలను మెరుగు పరిచాయి. క్రీ.పూ నుండి ప్రాకృత ద్రావిడ పాలీ, మాగది, పైశాచి, తెలుగు భాషలు క్రీ.శ 7వ శతాబ్ది నుంచి కన్నడ, బెంగాలీ, మరాఠీ భాషలు 14వ శతాబ్దం నుండి హిందుస్థానీ, హిందీ, ఉర్దూ భాషలు అభివృద్ధి చెందడానికి శూద్రుల కృషి ఎనలేనిది. మూడువేల భాషలు మూడువందల భాషలుగా మారడంలో శూద్రుల ఉత్పత్తి, ప్రజల సంబంధాలు పెరగడం కారణం. ఆయా అదృశ్యమైన భాషాపదాలు పర్యాయపదాలుగా ఉనికిలో ఉన్న భాషలో చేరాయి. సంబంధాలు పెరిగే క్రమంలో స్థానిక భాషలు కొన్ని కాలం తీరిపోయి అనుసంధాన భాషలు రూపొందాయి. శూద్రుల కృషి ఇందులో గుర్తించదగినది.

కులం ప్రకారంగా భాషలు ప్రత్యేకంగా ఏర్పడలేదు. ఆదివాసీ తెగలు, జనపదాలు కులాలుగా ఏర్పడుతున్న కొద్దీ భాషలు అనుసంధాన భాషలుగా ఎదిగాయి. వృత్తులకు ప్రత్యేక పారిభాషిక పదాలు అవసరం. కానీ ఒకే భాష మాట్లాడే వారిలో కులాలు వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థ కొనసాగుతున్నది. అనగా ఒకే భాష మాట్లాడే వారిలో ఈ కులం వర్ణం సిద్ధాంతాలు ఆచరణలుగా పెట్టబడ్డాయి. నిజానికి వీరంతా ఒకే జాతికి, ఒకే ప్రాంతానికి, ఒకే భాషకు, ఒకే సంస్కృతికి చెందిన వారని భాషను అనుసరించి చెప్పవచ్చు.

# క్షత్రియులు, ఫ్యూడలిజం చరిత్రకారుల కల్పన

క్షత్రియులు, వర్ణ సిద్ధాంతం కల్పన మాత్రమే. ఇది ఆర్య, వర్ణ సిద్ధాంతంలో భాగం. ఆర్యులు, బ్రాహ్మణులు, వైశ్యులు, శూద్రులు, పంచములు అనేవి ఆర్య, వర్ణ కుల సిద్ధాంతంలో భాగం. ఈ కల్పనకనువుగా నేటి ప్రభుత్వ అధికారులను వర్గీకరించినట్లుగా ఆయా దశల్లో వర్గీకరిస్తూ వచ్చారు. వారి భాష ఒకటి. ప్రాంతం ఒకటి. ఏదో జరిగింది. ఎలాగో జరిగింది. జరిగిన దానికి తనకు తోచిన కారణాలు అతికించి చూపడమా చరిత్ర? అది జరిగిందనేది నిజం. కనుక ఎలాంటి కారణాలు చూపినా కావొచ్చు అనిపిస్తుంది. కారణాలపై నమ్మకం కలిగించేవారుంటే ఏది చెప్పినా కరెక్టే అని చరిత్ర అనిపించేట్టు చేస్తుంది. అందువల్ల **చరిత్ర కూడా కల్పనాసాహిత్యంలో భాగమే. అయితే ఆధారాలు చూపించడం ఈ సాహిత్య ప్రత్యేకత.** కథకులు, నవలా కారులు, సృజనాత్మక ఊహ కలిగిన వారే ఒక సాక్ష్యాధారంతో ఎంతో కథ అల్లి చరిత్రగా ప్రజల ముందుంచుతారు. ఇలా సింధూ నాగరికత గురించి, పిరమిడ్, సుమేరు మొదలైన అదృశ్యమైన నాగరికతలను జీవన విధానాలు, సంస్కృతి, కథలు కథలుగా అల్లుతారు.

ఇండియాలో క్షత్రియులు అనేవారు నందరాజుల కాలం నుండి ఎవరూ లేరు. అందరూ ఆదివాసీ తెగల జాతుల, శూద్ర వర్ణంగా పిలువబడిన ఉత్పత్తి కులాల నుండి రాజులుగా ఎదిగినవారే. ఉత్పత్తి కులాలు, శూద్రులు అని కొందరు వక్రీకరించి, సిద్ధాంతీకరించబడిన ప్రజలు ఇండియా సామాజిక చరిత్ర నిర్మాతలు. శూద్ర, అతి శూద్ర అని పేర్లు పెట్టబడిన ఉత్పత్తి కులాలు, సేవా కులాలు, ఇండియా ఉపఖండంలోని ఆర్థిక సంపదను మొత్తం సృష్టించినది వారే.

శూద్ర ఉత్పత్తి కులాలు సృష్టించిన సంపదని వ్యాపారం చేసి వర్తకులు, పన్నులు వేసి రాజులు, గుళ్ల దేవుళ్ల పేరు చెప్పి పాపభీతి చెప్పి బ్రాహ్మణులు, దండయాత్రలు చేసి ఇతర రాజులు శూద్ర ఉత్పత్తి కులాలు సృష్టించిన సమస్త సంపదల్ని హెచ్చు భాగం దోచుకుని తిన్నారు. ప్రపంచమంతా ఇండియాలోని సంపద కోసం వలసలు



దండయాత్రలు సాగించి, రాజ్యాలు స్థిరపరచి ఏలింది అంతా సూద్ర ఉత్పత్తి కులాల రక్తమాంసాలతో సృష్టించిన సంపదతోనే.

**వర్ణకుల సిద్ధాంత ధారులు చేసే పని**

"వర్ణవాద, కుల వ్యవస్థ సిద్ధాంత ధారు"లు నాలుగు రకాల పట్టుపరిశ్రమలను అభివృద్ధి పరిచారు. వేల ఏళ్లుగా ఆ పట్టుపరిశ్రమను ఆధునిక అవసరాల కనువుగా అభివృద్ధి పరుస్తున్నారు. ఆ నాలుగు రకాల పట్టుపరిశ్రమలు ఇవి. 1.కాకాపట్టు పరిశ్రమ. 2.కాళ్లు పట్టు పరిశ్రమ. 3.రాళ్లు పట్టు పరిశ్రమ. 4.కుట్ర పట్టు పరిశ్రమ. ఈ నాలుగు పరిశ్రమల ద్వారా వర్ణవాద సిద్ధాంత కార్మికులు పరాక్రమంతో, యుద్ధంతో, మాయోపాయాలతో గెలిచిన వారిని కాకాపట్టి వారిని ఇంద్రుడని, చంద్రుడని, సూర్యవంశులు అని ప్రశంసించి లేని క్షత్రియ వంశాలను సృష్టించి ఆదివాసీ భాషలో ఉండే రాజుల అసలు పేర్లను సంస్కృత పేర్లుగా మార్చి క్షత్రియులని చెప్పేవారు. అందుకు ప్రతిఫలంగా రాజాస్థానాల్లో మంత్రులుగా, రాజోద్యోగులుగా, ఉన్నతాధికార్లుగా, దేవాలయాలకు పూజారులుగా, అనేక సంపదలను, భూములను, హక్కులను, గౌరవాలను పొందేవారు. దీనికి తాజా ఉదాహరణ శివాజి ఉదంతం. బంగారం తీసుకొని శివాజిని బ్రాహ్మణుడిగా, తమ వాడిగా గుర్తించి పట్టాభిషేకం చేశారు. ఆ తరువాత బ్రాహ్మణుల పీష్వా రాజ్యంగా మార్చుకున్నారు.

ఈ "వర్ణవాద సిద్ధాంత ధారుల"ను ఆదరించని రాజులపై రాళ్ల పరిశ్రమతో రాక్షసులని, క్రూరులని, నీచులని రాస్తూ ముద్రలు వేస్తూ ప్రచారం చేసేవారు. ఇతర ప్రాంతాల, రాజ్యాల నుండి దండయాత్రలతో వచ్చే వారిని వారి వద్ద పలు హామీలను పొంది అంతదాకా ఆశ్రయం ఇచ్చిన రాజులను కుట్రలతో చంపించేవాళ్లు. విషం పెట్టి చంపించేవాళ్లు. తమ అధికారాన్ని మరింత సుస్థిరం చేసుకునేవారు.

అలా ఇరాన్, ఇరాక్, మధ్య ఆసియా, ఆఫ్ఘనిస్తాన్, యూరప్, దేశాల నుండి వలసలు, దండయాత్రలు, దోపిడీల కోసం వచ్చే వారికి స్వాగతం పలికి ఇంటిగుట్లు తెలిపి ఇండియా ఉపఖండం రెండు వేల ఏళ్లుగా దాడులకు, దండయాత్రలకు గురికావడానికి కారకులయ్యారు.

ఇతర రాజ్యాల, ప్రాంతాల, దేశాల వారు ఈ దేశంలో రాజ్యాలేర్పరచుకుని ప్రజలను పరిపాలించడానికి ఎర్రతివాచీ పరిచిన వారు ఈ వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంత కార్మికులే. వారే కాకాపట్టు పరిశ్రమల్లో భాగంగా, కాళ్లు పట్టు పరిశ్రమల్లో భాగంగా రాజ్యం ఏలుతూ తమకు తమ పొట్టతిప్పలకు సంపద, గౌరవాలను సమకూర్చినవారిని క్షత్రియులు అంటూ సర్టిఫికెట్లు జారీ చేసారు. వారు ఇలా ధృవీకరణ పత్రాలు ఇచ్చే ఉద్యోగాన్ని, అధికారాన్ని తమకు తామే సృష్టించుకున్నారు.

ప్రకటించుకున్నారు. ఎవరినైనా ఎవరో ఒకరు నియమిస్తారు. కాని వీరిని వీరే సర్టిఫికెట్లు జారీచేసే అధికారులుగా తమకు తామే ప్రకటించుకున్నారు. ఈ సర్టిఫికెట్లు జారీచేసే అధికారం మీకెక్కడిది అని పాదతాడనంతో ఈసడించి దూరం తరిమినవారిని తంత్రవాదంలో వలె ప్రతీకాత్మకంగా వారి చరిత్రను వక్రీకరించి దుష్ప్రచారం చేసారు.

వారే ఆధునిక యుగంలో ఇతర దేశాల సామాజిక పరిణామాలలో భాగంగా పుట్టిన ఆలోచనలను ఇండియా ప్రజలపై, ఇండియా సామాజిక పరిణామాలపై రుద్ది అక్కడిదే ఇక్కడ జరిగింది అని సిద్ధాంతాలు చేసారు. ఫ్యూడలిజం అని ఇండియా ఉపఖండంలోని సామాజిక పరిణామాలకు పేరు పెట్టడం వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంత కార్మికులు తమ పాపాన్ని రాజులమీద, జమీందార్ల మీద, జాగీర్దార్ల మీద, భూస్వాముల మీద రుద్దడానికి చేసిన ఒక పెద్ద కుట్ర.

**రాజుల పాపాలకు బాధ్యత ఎవరిది? కారకులెవరు?**

ఇండియాలోని విశాల తెలంగాణ జనపదాల్లో ఒక సామెత ప్రాచుర్యంలో ఉంది. రాజు చేసిన పాపాన్ని పురోహితులు అనుభవించాలి అని. తడిబట్ట కులాన్ని నమ్మవద్దు. తడిబట్టతో గొంతులు కోస్తారు. తడిబట్ట, మడిబట్ట కులాలు వర్ణవాద సిద్ధాంత కార్మికులుగా నిరంతరం కొనసాగారు. రాజులు చేసిన పాపాన్ని పురోహితులు అనుభవించాలని ప్రజలు ఎందుకు భావించారంటే రాజుకు చెవిలో జోరీగ లాగా సూచనలు చేస్తూ రాజు చర్యలన్నిటినీ నిర్దేశించేది వర్ణవాద సిద్ధాంత కార్మికులే. అందువల్ల రాజులు చేసిన పాపం రాజులది కాదని అది చేయడానికి తాత్విక, సిద్ధాంత పునాదిని సమర్ధనను సూచనలను ఇచ్చే పురోహితులే, బ్రాహ్మణులే అందుకు పూర్తి బాధ్యత వహించాలని ప్రజలు తమ సామెతలతో స్పష్టం చేసారు.

అయితే ఇప్పటికీ ఆ బాధ్యతను స్వీకరించడానికి సిద్ధంగా లేరు. ఐ.ఏ.ఎస్., ఐ.పీ.ఎస్. మొదలైన అధికారులు ఈనాటి రాజులైన మంత్రివర్గం, ప్రభుత్వం చేసే పాపాన్ని అనుభవించడానికి, వాటికి బాధ్యత స్వీకరించడానికి సిద్ధంగా లేరు.

అలాగే రాజు చేసిన పాపం పురోహితుని మీదుగా పోయింది అనేది మరో సామెత. అలాగే రాజ్యాలు ఏలిన అప్పులు కట్టెలు కొడితే తీరుతాయా? అనేది మరొక సామెత. రాజుల పంచన చేరి రాజులకు సలహాలు ఇస్తూ రాజరికం వల్ల తక్కువ కష్టంతో లేదా అసలే పనిచేయకుండా అధిక సుఖాలు, సంపదలు అనుభవించిన బ్రాహ్మణులు రాజులు చేసిన పాపాలకు కారకులు.

కాని నేడు ఐ.ఏ.ఎస్. అధికారులు ప్రభుత్వాలు చేసే పాపాన్ని అనుభవించడానికి సిద్ధంగా లేరు. ఐ.ఏ.ఎస్., ఐ.పి.ఎస్. వంటి అధికారులు చేసే పాపాలను కూడా ప్రభుత్వాలు, రాజకీయ పార్టీలే అనుభవిస్తున్నాయి. వీరిని, వీరితో పాటు న్యాయమూర్తులను,



న్యాయవ్యవస్థను, పరిపాలనా వ్యవస్థను ప్రభుత్వ పాపాలకు బాధ్యులను చేయడం అవసరం. అప్పుడే సమతుల్యత సాధించబడుతుంది. పూర్వం రాజులు వంశపారంపర్యంగా ఉండేవారు. ఇప్పుడు ప్రభుత్వాధినేతలు వస్తూ పోతుంటారు. ప్రభుత్వాధికారులు రిటైర్ అయ్యేదాకా కొనసాగుతూనే ఉంటారు. అందువల్ల ప్రభుత్వాధినేతల కన్నా ఎక్కువ న్యాయమూర్తులు, పరిపాలనా అధికారులు ప్రభుత్వాల పాపాలకు బాధ్యత వహించాలి.

ఇలా వర్ణవాద సిద్ధాంతధారులు, మార్క్సిజం ముసుగులో వారి పాపాలన్నిటికీ సిద్ధాంతం, భావజాలం, దాని ఆచరణ కారణం కాదని దాని రూపాలైన వారిని మాత్రమే బాధ్యులని సిద్ధాంతీకరించారు. అదే ఇండియాలో ఫ్యూడలిజం ఉంది అనే సిద్ధాంత రూపకల్పన. అసలు నేరస్తులైన బ్రాహ్మణీయ వర్ణ, కుల సిద్ధాంతధారులకు శిక్ష పడకుండా చేయడానికి శిక్షణ నుండి తప్పించడానికి, ఇతరులను నేరస్తులుగా చూపడానికి ఇదిగో సాక్ష్యాలు అని చూపే కారణాల కల్పనే ఫ్యూడలిజం ఉందనడం. ఇండియాలో ఫ్యూడలిజం ఉందని సిద్ధాంతం 1860 నుండి సృష్టించి పెంచి పోషిస్తున్నారు. బాణాలన్నీ వట్టిపోయేట్టుగా చేస్తున్నారు. యూరప్‌లో ఫ్యూడలిజం ఎలా పుట్టిందో ఎందుకు దాన్ని ఫ్యూడలిజం అన్నారో అనే విషయాలను వారు ఎప్పుడూ చరిత్రలో భాగంగా చెప్పరు. చెబితే ప్రశ్నించే ఎరుక కలుగుతుందని వారికి తెలుసు.

ఫ్యూడలిజం అనే పదం యూరప్‌లో ఉన్న సామాజిక పరిణామాల నుండి పుట్టింది. ఇండియా సామాజిక పరిణామాల నుండి వర్ణవాదం, వర్ణవ్యవస్థ, కులవాదం, కులవ్యవస్థ అనే పదాలు పుట్టాయి. ఫ్యూడలిజం అంటే రాజులకు యుద్ధంలో సైన్యాన్ని సప్లయి చేస్తూ పెద్ద పెద్ద వ్యవసాయ క్షేత్రాలను కలిగివుండి పశువుల కాపరులను కూలీలను పెట్టుకునే వ్యవస్థ.

క్రీ.శ.10వ శతాబ్దంలో మంచు కురిసి యూరప్ అంతటా పంటలు లేక కరువు వచ్చి ఎంతో మంది చనిపోయారు. కరువు చాలాకాలం కొనసాగింది. పంట భూములన్నీ బీడుభూములై గడ్డిమొలిచాయి. జనం చాలామంది చనిపోవడంతో పశువుల పెంపకం అవసరమైంది. పశువులు పెంచడానికి ఎంత పెద్ద మందకైనా ఇద్దరు చాలు. అలా పశువులు పెంచుకుంటూ వచ్చారు. ఆ తరువాత ఆ పచ్చికబయళ్లు వ్యవసాయ క్షేత్రాలుగా సేద్య యోగ్యం చేసారు.

తద్వారా పశువుల యజమానులు, వ్యవసాయ భూమి యజమానులు కూడా అయ్యారు. దాంతో పంట మిగులుతో కూలీలను పెట్టుకుని సైనికులను తయారుచేసుకుంటూ రాజులకు, సైనికులను సప్లయి చేసే ఫ్యూడల్ లార్డులుగా ఎదిగారు. ఈ విధానాన్నే ఫ్యూడల్ వ్యవసాయ విధానం అని పిలుచుకున్నారు. ఈ ఫ్యూడల్ లార్డుల వల్ల, కరువుల వల్ల ఏర్పడిన పరిస్థితి వల్ల పశువుల పెంపకంలో వచ్చిన

సంపద వల్ల వాళ్లు ఆ సంపదను ఇతర ప్రాంతాలకు తరలించడంలో భాగంగా యూరప్ వ్యాపారం ప్రారంభం అయింది. అది క్రమంగా ప్రపంచమంతా యూరప్ వలసలు ఏర్పాటు చేసుకోవడానికి ఎలా దారితీసిందో తర్వాత అధ్యాయంలో చూద్దాం.

ప్రస్తుతానికి యూరప్ తరహా భూస్వామ్యం, యుద్ధ ప్రభువులు ఇండియాలో లేరు అని చెప్పడానికి పరిమితమౌదాం. ఇండియాలో మొదటినుండి స్థానిక, దేశీయ, ప్రాంతీయ, జాతీయ, రాష్ట్రీయ, కేంద్రీయ స్థాయిలలో పరిపాలన వ్యవస్థలు ఏర్పడి సామ్రాజ్యాలు కొనసాగాయి. ఇండియాలో సైన్యాన్ని రాజులు స్వయంగా ఏర్పాటు చేసుకునేవారు. అలాగే సామంతరాజులుకూడా సైనికులను సప్లయి చేసేవారు. సామ్రాజ్య అధినేతలు బలహీనపడ్డప్పుడు సామంతరాజులు తిరుగుబాట్లు చేసి సొంత రాజ్యాలు స్థాపించుకుని విస్తరించారు. అందువల్ల ఇండియాలో యూరప్ తరహా భూస్వామ్య విధానం, ఫ్యూడలిజం సాధ్యం కాలేదు.

భారతదేశాన్ని అక్కడవుండే ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలను అంచనా వేసేటప్పుడు మార్క్స్ చాలా జాగ్రత్త వహించి 'ఆసియా ఉత్పత్తి విధానం' అన్న ఒక క్రొత్త సూత్రీకరణ చేశాడుగాని ఫ్యూడలిజం అన్నమాట ప్రయోగించలేదని వాదిస్తూ కొంత మంది పరిశోధకులు అంటారు. భారతదేశంలో మొదటి నుండి కూడా భూమి సామాజికపరంగా వుండేది.

ఒకే రక్తం పంచుకున్న బంధువుల అధీనంలో వుండేది. ఒకే ఎల్లలు పంచుకొని జీవించే గ్రామ సంఘం. ఇందులో దాయాదులే వుండనక్కరలేదు. కుటుంబ ఆస్తిగా ఉంటూ భాగాలు పంచుకోకుండా ఒకే ఉమ్మడి కుటుంబ ఆస్తిగా వుండేది. భారతదేశంలో చాలాకాలంగా భూమి సామాజికపరంగా వుండటంచేత భారతదేశంలో యూరప్‌లో లాగా ఫ్యూడల్ వ్యవస్థ అభివృద్ధి చెందటానికి వీలుపడలేదు. అలాగే టాడ్ వివరించిన 'భూమియ' పద్ధతిలో అభివృద్ధి చెందిన ఫ్యూడలిజమ్ నిజానికి ఫ్యూడలిజమ్ కాదు. కారణం, యిందులో ఒక తెగకు చెందిన రక్తసంబంధీకులు మాత్రమే ఈ భూమియ పొందటానికి అర్హులు. పైగా రాజపుట్‌లు ఒక వంశంగా మిలటరీ రాజకీయ అధికారాలతో వ్యవసాయంపై ఆధారపడే యితర కులాలవారిని తెగలవారిని తమ ఆధీనంలోకి తెచ్చుకుని తమ రక్త సంబంధీకులనొకరిని ప్రభువుగా నియమించటం చేత అది ఫ్యూడల్ విధానానికి వ్యతిరేకమైనదిగా భావించబడింది. ఒకవేళ ఈ పద్ధతి కొంతకాలం కొనసాగితే ఫ్యూడలిజమ్ వచ్చి వుండేదేమోగాని 1750 తరువాత బ్రిటిష్ వారి రాకతో దానికి తెరపడింది.

మధ్యయుగాల్లో శతాబ్దాల తరబడి వేలాది ఎకరాల భూమి దేవాలయాల కింద, పూజారుల అధికారంలో ఉండేది. అంతకుముందు బౌద్ధ జైన విహారాలకు కూడా



ఇలాగే వేలాది ఎకరాల భూమిని వందలాది గ్రామాల సంపదను వాడుకోవడానికి రాజులు దత్తత ఇచ్చేవారు. బౌద్ధ విశ్వవిద్యాలయాలకు ఇచ్చిన భూమిని, గ్రామాల దత్తతను కొందరు మార్క్సిస్టు మేధావులు అని ప్రాచుర్యం పొందిన బ్రాహ్మణవాదులు బౌద్ధ విహారాలతో భారతదేశంలో భూస్వామ్య వ్యవస్థ ప్రారంభమైందని చరిత్ర రచన చేసారు.

మొత్తం భూమి రాజుదే. లేదా కొందరి ప్రకారం మొత్తం భూమి దైవానిదే. అయినప్పటికీ రాజును, దేవుళ్లను భూస్వాములు అని పిలువలేదు. కాని వారు బౌద్ధ విహారాలకు, విశ్వవిద్యాలయాలకు వాటికి యు.జి.సి. గ్రాంటులా ఇచ్చిన భూములను, గ్రామాలను భూస్వామ్య వ్యవస్థ అని పిలిచారు. అదే సమయంలో బ్రాహ్మణ పూజారులున్న దేవాలయాలకు ఇవ్వబడిన భూములను, దత్తత ఇచ్చిన గ్రామాలను భూస్వామ్య వ్యవస్థ అని పిలువలేదు. కారణం తెలియదు.

అయితే బౌద్ధ విహారాలు, విశ్వవిద్యాలయాలు వారు సుఖాలను అనుభవించడం కోసం కాకుండా పలు శాస్త్రాలను, విద్యలను, కళలను, వైద్య విధానాలను అభ్యసించడానికి ఉపయోగించేవారు. దేవాలయాలకు, పూజారులకు ఇవ్వబడిన భూములు, సంపద కేవలం పూజారుల వర్ణవాదుల సుఖాలకు, ప్రయోజనాలకు, విద్యకు, కళలకు వినియోగించేవారు. ఈ రెండు వేర్వేరు ప్రయోజనాలను కలిగి వుండేవి.

ఫ్యూడలిజం అనే భావన, దాని తాలూకు సిద్ధాంతం, ఆచరణ విషయానికి వస్తే ఫ్యూడలిజం భారతీయమైనది కాదు. ముస్లిం, మొగలాయి రాజుల కాలంలో వచ్చిన 'ఇక్తా'కు మల్లే 'ముక్తి' అనే వేరొక విధానం కూడా వుంది. ఈ 'ముక్తి'లు సాధారణంగా ప్రభువుల దగ్గర పనిచేసే బానిసలు. నిజానికి ఆనాటి రాజుల్లో చాలామంది బానిసలు నుండి ఎదిగినవారు ఉన్నారు. వీరు సాధారణంగా ప్రభువుల మెప్పుపొందో లేక ప్రభుత్వ యంత్రాంగం ద్వారా ఈ స్థితికి వచ్చిన వారున్నారు. ఇందులో ప్రధానంగా లాభం పొందింది బ్రాహ్మలే. అందుచేతనే ఈ 'ముక్తి' పదవి పరిపాలనాపరమైనది. అందుచేత వారిని పదవి నుండి తొలగించవచ్చు, యింకొకచోటకి మార్చవచ్చు. తప్పు చేస్తే జరిమానా విధించవచ్చు. ముక్తీలు సాధారణంగా జమాఖర్చులు చూసి మిగిలిన సొమ్మును ప్రభువుకు పంపించే ఉన్నతోద్యోగి. తన వసూళ్ల నుండే మిలటరీకి కావలసిన ఖర్చులు చూసేవాడు. ఇతడు రెవెన్యూ మంత్రి ఆధీనంలో పనిచేసేవాడు. ఇటువంటి విధానం యూరోపియన్ ఫ్యూడలిజంలో కనిపించదు. ఈ వ్యవస్థలో ప్రభుత్వ యంత్రాంగం ఫ్యూడలిజం కలగలిపిలేవు. ప్రభుత్వ యంత్రాంగమే ప్రధానమైనది. దాని ఆధీనంలోనే మిగతావాళ్లంతా పనిచేసేవారు. కాబట్టి యూరప్‌లో కనిపించే ఫ్యూడలిజం భారతదేశంలో వుండడానికి అవకాశం లేదు.

భారతదేశంలో ఫ్యూడలిజం లక్షణాలు కనిపించినా, కనిపించకపోయినా ఈ గ్రామీణ ప్రాంతం ఇంచుమించు స్వయం సమృద్ధిగా వుండి దేశంలో మార్కెట్ కోసం పట్నం, గ్రామం పోటీపడలేదు. అందుకే వీరిమధ్య నూతనంగా శ్రమ విభజన జరగలేదు.

కుల తత్వానికి అనుత్పాదక కర్మకాండకు వ్యతిరేకంగా హేతుబద్ధమైన మతాలు జైన, బౌద్ధం వచ్చాయి. యుద్ధాలు తగ్గాయి. శాస్త్రీయ ఆలోచనలు పెరిగాయి. సేవింగ్స్ పెరిగి పెట్టుబడి కూడా ఈ దశలో పెరిగింది. వ్యాపారానికి కావలసిన వాతావరణం ఏర్పడింది. మధ్యతరగతి ఆవిర్భావం జరిగింది. ధర్మార్థ, కామ, మోక్షాల్లో అర్థానికి ప్రాముఖ్యత పెరిగింది. హిందూమతం దీనికి తట్టుకోలేక వెనుకంజవేసింది.

ఇండియాలో జైన, బౌద్ధ మతాలు వర్తక వ్యాపార వర్గాల్ని అభివృద్ధిపరచడానికి పనికివచ్చాయని కొందరు చరిత్రకారుల అభిప్రాయం కొందరు వాటిని సిద్ధాంతాలుగా మార్చారు. చరిత్రలో అది జరిగింది వాస్తవమే. అయితే వారికోసమే పుట్టి, వారికోసం మాత్రమే పనిచేసిన మతాలుగా వాటిని భావించడానికి వీలుకాదు.

ప్రపంచంలోనే మొట్టమొదటిసారిగా ఆటవిక, అనాగరిక సమాజాన్ని ఒక సిద్ధాంత దృష్టితో ప్రతి మనిషిని శాంతియుత సహజీవనం ప్రేమ, కరుణతో జీవించడానికి జైన, బౌద్ధాలు కృషి చేసాయి. పరస్పరం తెగలు జనపదాలు, జాతులు దాడులు చేసుకోవడాన్ని, దోపిడి చేసుకోవడాన్ని నివారించాయి. దొంగతనాన్ని, దోపిడీని మహాపాపంగా నైతిక విలువగా ప్రతిపాదించి మానవాళి శాంతియుత జీవితానికి మలుపుతిరగడానికి మార్గదర్శకం చేసాయి.

నిర్మలమైన మనస్సుతో, ఉన్నదానితో ఆనందంగా బ్రతుకుతూ అత్యున్నతస్థాయి ఉత్పత్తి నైపుణ్యాన్ని ఉత్పత్తి వేగాన్ని సంపద సృష్టిని సాధించడంలో జైన, బౌద్ధమతాలు, సిద్ధాంతాలు నిర్వహించిన పాత్ర మహోన్నతమైనది.

జైనం, బౌద్ధం సృష్టించిన సహకార ప్రేమపూరిత మానవ మనస్తత్వంతో ఎదిగిన ఉత్పత్తి శక్తులు అలాగే కొనసాగి ఉంటే ఇండియాలో ప్రపంచంలోకన్నా వెయ్యేళ్లముందు పారిశ్రామిక విప్లవం వచ్చి ఉండేది. వర్ణవాద కులవ్యవస్థ వల్ల ప్రపంచంలో పారిశ్రామిక విప్లవం వెయ్యేళ్లు వాయిదా పడింది. అది ఇండియాలోని ఉత్పత్తి శక్తుల, ఉత్పత్తి కులాల నాయకత్వంలో కాకుండా వారు సృష్టించిన సంపదను, నైపుణ్యాన్ని యూరప్‌కు తరలించుకుపోయిన తరువాత యూరప్‌లో పారిశ్రామిక విప్లవంగా కొత్త అవతారం ఎత్తింది. ఇండియా నుండి పారిశ్రామిక విప్లవం రాకుండా వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలు వారిదోపిడి అడ్డుకున్నాయి.

సోమనాథ్ దేవాలయంవంటి దేవాలయాల్లో కోట్లాది సంపద దాచుకున్నారు. సమాజంలో సామాజిక అభివృద్ధికి వాటిని ఉపయోగించలేదు. వాటిని ముస్లింలు



మధ్య ఆసియా దేశాలకు దోపిడి చేసి తరలించుకుపోయి అభివృద్ధి చెందారు. అటు తరువాత యూరప్‌వాళ్ళు దోపిడిచేసి తరలించుకుపోయి పారిశ్రామిక విప్లవాన్ని సాధించుకున్నారు.

ఇలా సుమారు 1500 సంవత్సరాలు ఇండియా నుండి ఉత్పత్తి కులాల సంపదను వర్ణవాదులు, రాజులు, వ్యాపారుల వారి నుంచి ఇతర రాజులు, ఇతర దేశాలు దోపిడిచేసి ఇస్లాం, క్రైస్తవం విస్తరించాయి. ముస్లిం రాజ్యాలు, క్రైస్తవ రాజ్యాలు, యూరప్ పారిశ్రామిక విప్లవం విస్తరించాయి. సంపద సృష్టికర్తలైన ఉత్పత్తి కులాల వద్దే ఆ సంపద ఉండిఉంటే ప్రపంచంలో పారిశ్రామిక విప్లవం సుమారు క్రీ.శ. నాలుగవ శతాబ్దం నుండి ప్రారంభమై ఉండేది. అప్పుడు ఆస్ట్రేలియా, ఆఫ్రికా, అమెరికా ఖండాలు అలాగే ఇండియా యూరప్‌వారి దోపిడీకి ఆదిపత్యానికి గురి అయ్యే ప్రశ్నే ఉత్పన్నమయ్యేది కాదు. చైనా, టిబెట్, గాంధార, బర్మా, మలయా దేశాలకు బౌద్ధం విస్తరించినట్టుగానే ఇండియా నుండి పారిశ్రామిక విప్లవం, పారిశ్రామిక ఉత్పత్తులు ప్రపంచ దేశాలకు విస్తరించి ఇండియా నైతిక రాజకీయ సామాజిక నాయకత్వం కంటిన్యూ అయి ఉండేది. చలం దీన్ని స్పష్టం చేస్తూ ఇలా అంటారు.

ఆ విధంగా కొనసాగి వుంటే ప్రపంచంలో ఇంగ్లాండ్, హాలెండ్‌ల కంటే భారతదేశం 1000 సంవత్సరాలు ముందుగానే పారిశ్రామిక విప్లవాన్ని, దాని ద్వారా పెట్టుబడిదారి వ్యవస్థ, వాటి అంతర్గత వైరుధ్యాల నుండి సోషలిజం, కమ్యూనిజం పుట్టే అవకాశం కోల్పోయినట్లు అవగాహన చేసుకుంటే బావుండేది. బౌద్ధం మానవుని జీవిత విధానంలో నమ్మకాల్లో కల్గించిన మార్పులు లాంటివే మార్టిన్ లూథర్, కాల్విన్ క్రైస్తవమతంలో మధ్య యుగాల్లో తెచ్చి పెట్టుబడిదారి వ్యవస్థకు దారి చూపించారని ఎంతోమంది చరిత్రకారులు ముఖ్యంగా వెబర్, టానీ, సొంబార్ట్ రచనల ద్వారా మనకు అర్థం అవుతోంది.

**మార్క్సు వర్గం గూర్చి ఎక్కడా నిర్వచించలేదు.** పైగా తన మెథడాలజీని ఆనాటి బూర్జువా మేధావులైన 'ప్యూరభా' 'హెగెల్'ల అవగాహనతో కొత్తగా రూపొందించి మతఛాందసుడైన 'మోర్గాన్' దగ్గర తెచ్చుకున్న చారిత్రక క్రమానికి అన్వయించాడు. అందులో భారతీయ సమాజాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి, ఏ యే చారిత్రక దశల్లో ఈ దేశంలో ఏ యే వర్గాలు వచ్చాయి. లేక ఏ యే కులాలు ఏ యే వర్గాల రూపంలో అన్వయించుకోవాలి అన్నవి మనముందున్న ప్రశ్నలు. ఈ ప్రశ్నలకు మార్క్సు సమాధానం కోసం ప్రయత్నించాడు. భారతీయ సమాజాన్ని ప్రత్యేకంగా చూస్తూ శ్రమ విభజనను రెండుగా విభజించి తన కాపిటల్ 1లో వాల్యూం 1లో రెండు పేజీల్లో ప్రత్యేకించి దీన్ని వివరించడానికి ప్రయత్నించాడు.

మహారాష్ట్రలోని ధూలే జిల్లాకు చెందిన శరద్‌పాటిల్ అనే మార్క్సిస్ట్ తత్వవేత్త చరిత్రకారుడు విస్తారమైన అధ్యయనం చేసి క్రీ.శ.1978నుండి వ్యాసాల్లో బ్రిటిష్ వారు ఈ దేశానికి రాకముందు ఇక్కడ వర్గ సమాజం లేదు అని నిర్ధారించారు. దాస, సూద్ర, స్లేవరి అనే గ్రంథం వెలువరించారు.

శరత్‌పాటిల్ నిర్ధారించింది చాలామేరకు వాస్తవం అని చెప్తూనే ఇండియాలోని ఉత్పత్తి విధానంలో వచ్చిన మార్పుల వల్ల భూస్వామ్య వ్యవస్థ అని పిలువబడేది క్రీ.శ. 3వ శతాబ్దం నాటికి వచ్చిందని శ్రీ ఆర్.యస్.శర్మ అని పిలువబడే రాంశరణ్ శర్మ పేర్కొన్నారు.

ఫ్యూడలిజం అనేది యూరప్ పద్ధతిలో ఇండియాలో లేకపోయిన మరోరకమైన ఫ్యూడలిజం ఉందని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. అసలు ఫ్యూడలిజమే యిక్కడ లేదు అని మరికొందరి అభిప్రాయం.

వీటిని అధ్యయనం చేస్తూ ప్రొ॥కె.ఎస్.చలం ఫ్యూడలిజం అంటే ఒక విధమైన పద్ధతిలో నడిపే ప్రభుత్వంగా అనుకుంటే మౌర్యుల కాలం నుండి ఉత్తర భారతంలో ఫ్యూడలిజం వచ్చిందని భావించారు. ఆయన దీన్ని ఫ్యూడలిజం అనే అర్థంలో కాకుండా పెట్టుబడిదారి పూర్వ ఉత్పత్తి విధానాలు అని అంటారు.

ఫ్యూడలిజం కంటే కూడా పెట్టుబడి దారి పూర్వపద్ధతిలో ఉండే ఉత్పత్తి శక్తులు, ఉత్పత్తి సంబంధాలు ఇక్కడ వృద్ధి చెందటంలో కులాల్ని సృష్టించి వున్నాయి. ఆ కులాలు ఒక్కో ప్రాంతంలో వుండే భౌగోళిక, నదులు, వ్యవసాయం వంటి అంశాల మీద ఆధారపడి రూపొందించబడ్డాయి. నదులు, చెరువులు లేని గ్రామంలో మత్స్యకారులు వుండనట్లే, వెదురు దొరకని ప్రాంతాల్లో మేదరులు కనపడనట్లే అనేక కులాలు ఆ ప్రాంతంలో వుండే వనరుల మీద ఏర్పరుచుకున్న ఉత్పత్తి, వృత్తులు దానికి సంబంధించిన మిగతా విషయాల మీద ఆధారపడి అభివృద్ధి చెందుతూ వచ్చాయి. కొన్ని కులాలు కాలగర్భంలో కలిసిపోయాయి.

రవాణా సౌకర్యాలు పెరిగి, ఆధునిక యంత్రయుగం ప్రారంభమయ్యాక ముడిసరుకు ఒక ప్రాంతం నుండి ఇంకో ప్రాంతానికి సరఫరా అయిన తరువాత ఈ పరిస్థితిలో మార్పు వచ్చింది అని అంటారు కె.ఎస్.చలం.

పట్టు పరిశ్రమ లేకపోయినా, పట్టుచీరలు నేసే పద్మశాలీయులు ఇప్పుడు ఏ ప్రాంతంలోనైనా మనగలుగుతారు. ఇలా కొన్ని వృత్తులు కొన్ని ప్రాంతాలకే పరిమితమై అభివృద్ధి చెందాయి. అందుకే కొన్ని కులాలు కొన్ని ప్రాంతాల్లోనే వుంటాయి. అవి మిగతా ప్రాంతాల్లో కనపడవు. అందుకే రాష్ట్రాన్ని, జిల్లాని ప్రాంతాలుగా విభజించి చూసినపుడు 50-100కు మించి ఎక్కడా మనకు కులాల సంఖ్య కనిపించదు. ఒకప్పుడు



బాగా ఉచ్ఛస్థితిలో వున్న కులాలు, ఆ వృత్తి లేక వాటి అవసరం తీరిపోయినపుడు ఎందుకూ కొరగానివిగా మారిపోతాయి.

## యూరోపీయ సిద్ధాంత ధారులు

కొందరు చరిత్రకారులకు, యూరోపీయ సిద్ధాంత ధారులైన అర్థశాస్త్రవేత్తలకు ఫ్యూడలిజం, భూస్వామ్య వ్యవస్థ అనే పదాలమీద ఎంతో ప్రేమను పెంచుకున్నారు. వారి రక్తంలో ఈ పదాలు భాగమైపోయాయి. వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాల ద్వారా బ్రాహ్మణవాదం చేసిన దోపిడీని, అణచివేతను చర్చకు రానీయకుండా సమాజం దృష్టిని పక్కదారి పట్టించేందుకు యూరప్ చరిత్రలోని ఫ్యూడలిజం పదాలను ఇండియా చరిత్రలోకి సంశ్లేషించే పని పెట్టుకున్నారు.

## శూద్ర లేఖన శాస్త్రం - శూద్రుల చరిత్ర విస్తారమైనది

ఇలా వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాల ద్వారా కొనసాగిన దోపిడీని, దాని సంబందించిన దోపిడీ విధానాలను, దోపిడీదారులను వదలేయడంకోసం చేసిన అపారమైన పరిశ్రమలోభాగంగానే హిందూముస్లిం పరిపాలకుల మధ్య ఉండే వైరుధ్యాలను రాజ్యాలమధ్య వైరుధ్యాలుగా కాకుండా మతాలమధ్య ద్వేషంగా ప్రచారం చేస్తూ కొందరు, మరికొందరు వారిని బ్రాహ్మణవాద దోపిడి చర్చను పక్కదారి పట్టించడంకోసం సూద్ర కులాల నుండి రూపాంతరం చెందిన అగ్రకులాలమీదకు దృష్టిని మళ్ళించడంకోసం ఇండియాలో ఫ్యూడలిజం ప్రధానం అనే చర్చను చేస్తున్నట్టుగా తెలుస్తున్నది.

అలాగే "హిందూ టెంపుల్స్- వాట్ హాపెన్డ్ టూ దెమ్" అనే గ్రంథాన్ని రెండు భాగాలుగా వెలువరించిన సీతారామ్ గోయల్ (మొదటి ముద్రణ 1991. కొత్త ముద్రణ 2000) ముస్లింలు దేవాలయాలను ఎలా దోపిడీ చేశారో ముస్లింల చరిత్ర రచనల నుండి వందలాది సాక్ష్యాలను ఇచ్చారు. అయితే ఈ సంపద అంతా శూద్రుల నుండి ప్రజల నుండి నయానా, భయానా దోపిడి చేసి సేకరించినదే. వ్యాపారులు, రాజులు, బ్రాహ్మణులు, పూజారులు సంపదను శూద్రుల నుండి దోపిడి చేసి గుళ్ళలో దాచిపెట్టుకున్న సంపద ఇది. అలాగే 'ఎ టెక్స్‌ట్‌బుక్ ఆఫ్ హిస్టోరియోగ్రఫీ' (క్రీ.పూ. 500 నుండి క్రీ.శ 2000) గ్రంథంలో ఈ.శ్రీధరణ్ (ముద్రణ 2005) అనేక దశలుగా పరిణామం చెందుతూ వస్తున్న ప్రపంచ చరిత్ర లేఖన శాస్త్రాలను పరిచయం చేశారు. వీటి గురించి భారతీయ చరిత్ర శూద్ర దృక్పథం 2వ భాగంలో వివరంగా చర్చిస్తాను. అయితే ఇక్కడ ఒక మాట చెప్పక తప్పదు. వీరిరువురూ **శూద్ర చరిత్ర లేఖన దృక్పథం గురించి ఒక్క మాట కూడా రాయలేక పోయారు. అందువల్ల అవి శూద్రుల చరిత్ర దృక్పథాన్ని గానీ, చరిత్ర లేఖన దృక్పథాన్నిగానీ చర్చించక పోవడం వల్ల శూద్రులను ప్రజలుగా గుర్తించడానికి సహితం సిద్ధంగా లేరని అర్థం.**

# చరిత్ర లేఖన శాస్త్రంలో తాత్విక దృక్పథాలు

చరిత్రకు పలు నిర్వచనాలు, పలు ప్రయోజనాలు ఉన్నాయి. చరిత్ర మానవుడు పుట్టినప్పటినుంచి అతని ప్రతి పనినీ ప్రతి ఆలోచననూ జరిగిన ప్రతి సంఘటనను పరిశీలిస్తుంది. మానవుని ప్రతి ముఖ్యమైన పురోగతిని, తిరోగతిని లిఖిస్తుంది. శాస్త్ర, కళా, సాహిత్య, తత్వ, వాస్తు శాస్త్ర, సాంఘిక, రాజకీయ, యుద్ధ, మత, న్యాయ, విద్య, వైద్య రంగాలలో సంభవించిన పరిణామాలను విశ్లేషిస్తుంది.

చరిత్రను ఎందుకు చదవాలి? చరిత్ర అధ్యయనం వల్ల ప్రయోజనమేమిటి? గడిచిపోయిన కష్టాలు తెలుసుకోవడం ద్వారా వర్తమానంలో అనవసరమైన ఆవేశకావేశాలు, రాగద్వేషాలు పెరుగుతాయి. కాలం గాయాల్ని మాన్పుతుంది. చరిత్ర గాయాల్ని కెలుకుతుంది. అనుభవాలు జ్ఞాపకాలుగా, జ్ఞానంగా మిగిలిపోయినట్టుగా చరిత్ర మానవసమాజ జ్ఞాపకాలుగా మిగిలిపోవాలి. అంతేగాని, వర్తమాన సమాజంలో చిచ్చురేపడానికి ఉపయోగపడకూడదు. కానీ, చరిత్ర ఇదే పని చేస్తుంది. అందువల్ల చరిత్ర అధ్యయనం అనవసరం అంటారు కొందరు.

సమాజ చరిత్ర నిర్మాతలైన సంపద, ఉత్పత్తి కులాలైన శూద్ర కులాలు ప్రపంచ చరిత్ర నిర్మాణానికి అందించిన చేర్పు మహోన్నతమైనది. ప్రపంచ నాగరికతలు ఇండియాలోని శూద్ర జాతుల రక్త మాంసాలతో, శ్రమ శక్తితో వారు సృష్టించిన సంపద వల్ల అభివృద్ధి చెందాయి. ఈ మాటని వామపక్ష చరిత్రకారులు, బ్రాహ్మణవాద చరిత్రకారులు చెప్పగలిగినప్పుడే ఆర్యవాద సిద్ధాంతం, ఆర్యులు విదేశీయులు అనే సిద్ధాంతం వీళ్లు వదులుకున్నారని భావించవచ్చు. అంతదాకా వదులుకోలేదని అర్థం.

రెండు ప్రపంచ యుద్ధాలకు ముందు ప్రపంచం వేరు. రెండు ప్రపంచ యుద్ధాల తర్వాత ఏర్పడిన ఈనాటి ప్రపంచం వేరు. గత వేల ఏళ్ళలో ఇలాంటి ప్రపంచం ఎప్పుడూ లేదు. గతమంతా సంఘర్షణ, యుద్ధాలు, దోపిడీలు, బలమున్న వాడిదే రాజ్యం. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత ఈ స్థితి మారింది. ఆంధ్ర ప్రదేశ్ రాష్ట్రం కన్నా చిన్నగా వున్న 150 దేశాలు స్వతంత్ర దేశాలుగా ఐక్యరాజ్యసమితిలో సభ్యదేశాలుగా



కొనసాగగలుగుతున్నాయి. గతంలో యుద్ధాల కనువుగా చరిత్ర రాశారు. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత శాంతి, సహజీవనం, ప్రజాస్వామిక స్వేచ్ఛ, సమానత్వం, రాజ్యాంగ హక్కులు, ప్రజలు ఎన్నుకునే వ్యవస్థ ఏర్పడింది. చరిత్ర రచన ఈ కోణంలో రాయడం చారిత్రక కర్తవ్యంగా ముందుకు వచ్చింది.

చరిత్ర అంటే మానవాళి గడిచి వచ్చిన పరిణామాల పరిశీలన. చరిత్ర మానవ సమాజం పరిణామాలను తెలుపుతుంది. మనిషికీ మనిషికి మధ్య ఏర్పడిన తెగ, కులం, వర్గం, జాతి, ప్రాంత, భాష, రాజ్య సంబంధాలు, కుటుంబ సంబంధాలు, సంస్కృతి, కళలు, సైన్సు, విద్య, వైద్య విధానాలు, ఆలోచనా విధానాలు, ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాలు వాటి పరిణామాలు మొదలైనవి చరిత్రలో భాగంగా స్పర్శించడం చారిత్రక దృక్పథం అని పిలుస్తారు. ఇందులో పరిశీలించే వారి ఆసక్తి, స్వార్థం, ప్రాంతం, వర్గం, కులం, స్థలం, పురావస్తు ఆధారాల పరిమితి, వారి విశ్వాసాలు, దృక్పథం ననుసరించి చరిత్రలోంచి వెలికితీస్తారు. వారి పరిశీలన అనేది అయస్కాంతం వంటిది. చరిత్ర మట్టి వంటిది. చరిత్రలో తన పరిశీలనా దృక్పథం అనే అయస్కాంతంతో మట్టిలో తిప్పుతారు. తద్వారా అయస్కాంతానికి ఇనుప రజను అంటుకున్నట్టు అతను కోరుకున్నవి అంటుకుంటాయి. అందువల్ల ఇ.హెచ్.కార్ అనే చరిత్రకారుడు గతానికి వర్తమానానికి మధ్య నిరంతర సంభాషణే చరిత్ర అని నిర్వచించాడు.

కనుక తర్వాతి తరాల వారు కొత్త ప్రాధాన్యతలతో చరిత్రను అధ్యయనం చేసినపుడు తిరిగి చారిత్రక ఆధారాల కోసం వెతుక్కోక తప్పదు. అందుకోసం పురావస్తు ఆధారాలను, సంస్కృతిలో కొనసాగుతున్న విశేషాలను, భాషలో కొనసాగుతున్న ప్రాచీన విశేషాలను, ఆనాటి జీవన విధానాలను, ఆలోచనా విధానాలను, ఉత్పత్తి సాధనాలను, ఉత్పత్తి సంబంధాలను తిరిగి మూలాల్లోకి వెళ్ళి మొదటి నుండి పరిశీలించవలసి వస్తుంది. అంతదాకా రాసిన చరిత్ర రికార్డులు ఈ పరిశీలనకు సహాయకారిగా ఉంటాయి. గత చరిత్ర రచన, పూర్తి సత్యమని ఆధారపడ్డం, విశ్వసించడం సరి అయింది కాదు.

వర్తమాన సామాజిక జీవితానికి, ఉద్యమాలకు, వర్గాలకు, జాతులకు, దేశాలకు, జరిగిపోయిన అన్యాయాలపట్ల ధర్మాగ్రహానికి, స్ఫూర్తికి చరిత్ర అధ్యయనం ఎంతో అవసరమని కొందరి భావన. మరికొందరు గతం నుంచి ఉత్తేజాన్ని పొందడానికి, గర్వించడానికి చరిత్ర అవసరమని భావిస్తుంటారు.

గతాన్ని గురించి తెలుసుకోవడం అవసరమే కాని ఆధునిక నాగరిక పౌర సమాజం ఉన్నతమైనది. గడిచివచ్చిన ఆటవిక సమాజాల నుండి నడిచివచ్చిన పరిణామం ఒక పాత చిత్రంలా, వెనకటి కట్టడాలను శిల్పాలను చూసినట్టుగా చూడాలి అంటారు మరికొందరు. మనం చరిత్ర పొడవునా నిర్మిస్తూ వచ్చిన ప్రమాణాలు ఏమిటి?

దారులు ఏమిటి? ఎక్కడినుంచి ఇక్కడిదాకా చేరాము? ఇక్కడి నుండి ఎటు వెళ్తున్నాము? ఎటు వెళ్లాలి? గడిచిన అభివృద్ధి దశలు తెలుసుకోవడానికి చరిత్ర అధ్యయనం ఎంతో అవసరం అని మరొక అభిప్రాయం.

ఇలా చరిత్ర లేఖన శాస్త్రంలో అనేక తాత్విక సామాజిక రాజకీయ దృక్పథాలు కొనసాగుతున్నాయి. మొదట మనకు బ్రిటిష్ సామ్రాజ్యవాదుల దృక్పథంతో భారతీయ చరిత్ర అందించబడినది. ఆ తరువాత జాతీయోద్యమం క్రమంలో భారత జాతీయవాదుల దృక్పథంతో చరిత్ర రాయబడింది. నేడు అనేక కోణాల్లో విస్తరించిన చరిత్ర లేఖన దృక్పథాలను ఇలా పేర్కొనవచ్చు. నిజానికి ఇవన్నీ చరిత్రలో విభాగాలు.

1. బ్రిటిష్ వారి దృక్పథం – పాశ్చాత్య దృక్పథం
2. భారత జాతీయోద్యమవాదుల దృక్పథం
3. శూద్రుల దృక్పథం
4. దళిత దృక్పథం, అస్పృశ్యుల దృక్పథం
5. ఆదివాసుల దృక్పథం, మూలవాసుల దృక్పథం
6. వైదిక పురాణ ఇతిహాస, ఆర్య, వర్ణ, కులవాద దృక్పథం
7. ద్రవిడ, నాగ జాతుల, ప్రాంతాల దృక్పథం
8. బౌద్ధ దృక్పథం
9. ముస్లింల దృక్పథం
10. భక్తి ఉద్యమాల దృక్పథం
11. క్రైస్తవుల దృక్పథం
12. జ్యోతిబా పూలే, పెరియార్ రామస్వామి దృక్పథం
13. అంబేద్కరిస్టు దృక్పథం
14. మార్క్సిస్టు దృక్పథం
15. మానవతా దృక్పథం

**మరొక వర్గీకరణతో చారిత్రక దృక్పథాలను ఇలా వర్గీకరించవచ్చు**

1. మానవ శాస్త్రం (ఆంత్రోపాలజి) దృక్పథం
2. మానవ సమాజ పరిణామాల దృక్పథం
3. తల్లి నుండి గుర్తించే దృక్పథం
4. పురుష స్వామిక దృక్పథం, రక్తసంబంధాల లైంగిక సంబంధాల దృక్పథం



5. రాజుల, రాజరికాల దృక్పథం
6. ఉత్పత్తి పరిణామాల దృక్పథం
7. ఉత్తర భారత దృక్పథం
8. దక్షిణ భారత దృక్పథం
9. ఆసియా దృక్పథం
10. అమెరికా దృక్పథం
11. అంతర్జాతీయ దృక్పథం

**మరొక కోణంలో చారిత్రక దృక్పథాలను ఇలా పేర్కొనవచ్చు**

1. విజ్ఞానశాస్త్ర దృక్పథం
2. జీవావరణ, పర్యావరణ, నైసర్గిక దృక్పథం
3. వర్తక – వాణిజ్య దృక్పథం, నాణాల దృక్పథం
4. ప్రజాస్వామిక, సామాజిక న్యాయ దృక్పథం
5. భౌగోళిక, జాతి దృక్పథం
6. రాజకీయ దృక్పథం
7. సమకాలిన ఉద్యమ అవసరాల, సామాజిక మార్పు దృక్పథం
8. తత్వ మతవాదుల దృక్పథం
9. బహుజన దృక్పథం
10. కాంగ్రెస్ దృక్పథం
11. నేటి బిసిల దృక్పథం
12. కోశాంబి, దేవిప్రసాద్ చటోపాద్యాయ, రాహుల్ సాంకృత్యాయన్ దృక్పథం

**ఇటీవల పెరిగిన చారిత్రక దృక్పథాలను ఇలా పేర్కొనవచ్చు**

1. స్త్రీవాద దృక్పథం
2. సబాల్టన్ దృక్పథం
3. పోస్టుమార్డరన్ దృక్పథం
4. నగర దృక్పథం
5. గ్రామీణ దృక్పథం
6. మధ్య తరగతి దృక్పథం

7. ప్రధాన వైరుధ్య దృక్పథం, ప్రధాన చారిత్రక వాస్తవాల దృక్పథం
8. జాతుల దృక్పథం
9. స్థల కాల నైసర్గిక దృక్పథం
10. భాషావాదుల దృక్పథం
11. ఆర్థిక దృక్పథం
12. సాంస్కృతిక దృక్పథం
13. అలంకార శాస్త్రాల, కళల దృక్పథం
14. ఆస్తిక దృక్పథం
15. నాస్తిక దృక్పథం
16. హేతువాద, తార్కిక దృక్పథం
17. సాహిత్య దృక్పథం
18. ఏకపక్ష దృక్పథం
19. జాతీయవాద దృక్పథం
20. సామ్యవాద దృక్పథం
21. ఆధునిక ప్రజాస్వామిక స్వామ్యవాద దృక్పథం
22. విజేతల దృక్పథం, అభివృద్ధి అధికారం అందుకున్న వారి దృక్పథం
23. ఓడిన వారి దృక్పథం, అభివృద్ధి అధికారం అందని వారి దృక్పథం
24. అందరినీ కలుపుకుపోయే దృక్పథం
25. యోగా ధ్యానవాదుల దృక్పథం

**మానవ శాస్త్రం (ఆంత్రోపాలజి) దృక్పథం**

చరిత్ర పూర్వ దశలల్లో మానవుల అవయవాలను అనుసరించి వాటి ఆనవాళ్ళను అనుసరించి వారు చేసిన ప్రయాణాలు, వలసలు, కొనసాగించిన జీవితం గురించి పరిశీలించే దృష్టిని మానవ శాస్త్ర (ఆంత్రోపాలజి) దృక్పథం అంటారు. మానవ జాతుల పుట్టుక, పెరుగుదల, పరస్పర రక్తసంబంధాల్లో మారిన తీరు, గణ తెగల నిర్మాణం తల్లి నుండి గుర్తించే సమాజాలు, పురుషుల నుండి గుర్తించే సమాజాలు మొదలైనవాటిని ఈ దృక్పథంతో చరిత్రను పరిశీలిస్తుంది. ప్రాచీన ప్రజలు జాతులు అన్ని ఇప్పుడు లేకపోవచ్చు. కానీ ఇప్పుడు జీవిస్తున్న మనుషులంతా ప్రాచీన తెగల జాతుల జనపదాల, రాజ్యాల చరిత్ర వారసత్వంలోంచి వచ్చిన వారే. ఆ పరిణామ



దశలను దాటి వచ్చిన వారే. మానవ సంబంధాలు, రక్త సంబంధాలు, స్త్రీ, పురుష సంబంధాలు గతంలో సాగిన వాటన్నిటి గుండా ప్రవహించిన వారే. అలా ప్రవహించని వారు చనిపోయారు.

ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని కరీంనగర్ జిల్లా నుండి కీ॥ శే॥ ఠాకూర్ రాజారాం సింగ్ చరిత్ర లేఖన శాస్త్రానికి పలు విషయాలు జోడించారు. శాతవాహనుల చరిత్ర వెలికి తీసుకురావడంలో విశేష కృషి చేశారు. చరిత్ర రాసే దృక్పథాలను మలచడానికి అది ఎంతగానో ఉపయోగపడింది. దాంతోపాటు ఆయన పాలింటియాలజి అని ఇంగ్లీషులో పిలిచే రాక్షసబల్లి శాస్త్రాన్ని అభివృద్ధి పరిచారు. ఇది శిలాజాల గురించి చర్చించే శాస్త్రం. ప్రపంచ పాలియంటాలజీ చిత్రపటంలో కరీంనగర్, ఆదిలాబాద్ జిల్లాలకు స్థానం కల్పించిన మహా మేధావి. ప్రాచీన చరిత్రపై వీరు రాసిన వ్యాసాలకు పూణే డక్కన్ కాలేజీవారు డాక్టరేట్ ఇచ్చారు. లక్షలాది రూపాయల సొంత డబ్బులను ఖర్చు చేసి అడవులు, గుట్టలు పట్టుకొని తిరిగి శిలాజాలను సేకరించి ఆదిమానవుల, రాక్షసబల్లుల శిలాజాలను సింగరేణి బొగ్గుల్లో బొగ్గుగా మారకుండా వెలికి తీసారు. పురాతన చరిత్ర రంగంలో, శాతవాహనుల చరిత్ర పరబ్రహ్మ శాస్త్రి సూత్రీకరించడంలో ఠాకూర్ రాజారాం సింగ్ కృషి ఎనలేనిది. ఇలా ఎందరో ఔత్సాహికులు తమ జీవితాలను చరిత్ర వెలికితీతకై, తద్వారా దృక్పథాల మలుపులకై వెచ్చించారు.

చరిత్రలో ఇంతదాకా ఏ యే వర్గాలకు, ఏ యే జాతులకు, ఏ యే ప్రాంతాల్లో ఉండడం వల్ల సాధ్యపడింది? ఏ యే దేశాలకు ఎలాంటి ప్రయోజనాలు చేకూరాయి? ఎలాంటి జీవితం వలసలు, సంచారజీవితం, పశు పెంపకం, వ్యవసాయం, లోహాలు, ఖనిజాలు, పలు వృత్తుల, కులాల, జాతుల పుట్టుక, భాషల పుట్టుక, విజ్ఞాన శాస్త్రాల పుట్టుక, పరిణామం, మానవ సంబంధాల–చరిత్ర పరిణామాలు, సంస్కృతి, భాష, జీవనవిధానాలు, రాజ్యం, ప్రభుత్వ విధానాలు, భూమి యాజమాన్యం, పరిపాలన వ్యవస్థలు, రాజరికాలు, మతాలు, యుద్ధాలు మొదలైనవి ఎన్నో. ఎలా ప్రారంభ మయ్యాయి? అవి ఎలా మారుతూ వస్తున్నాయి? ఇప్పుడు వాటి అవశేషాలు జీవితంలో, నేటి మనిషి ఆలోచనలో జీవన విధానంలో ఎలా కొనసాగుతున్నాయి, ఎలా కనుమరుగు అవుతూ వస్తున్నాయి అని తెలుసుకోవడానికి చరిత్ర అధ్యయనం అవసరం.

చరిత్ర రచన ఆధునిక దృష్టితో సమగ్రంగా పరిశీలించడం ప్రారంభమై ప్రపంచంలో 200 ఏళ్ళు కూడా కాలేదు. వేలాది చారిత్రక ఆధారాలు, విశేషాలు చరిత్ర రికార్డు కెక్కకుండా శిథిలమైపోయాయి. ఒక దొరికిన ఎముకను పట్టుకుని అది జంతువుదా? మనిషిదా? మనిషిదైతే అతని వయస్సు ఏపాటి ఉంటుంది? అతను ఎలా చనిపోయాడు? మొదలైనవి ఊహించి కొన్ని శాస్త్రీయ ప్రమాణాల ద్వారా నిర్ధారించి ఆ ఎముక చరిత్రను ఆనాటి మనిషి చరిత్రగా రాయడం జరుగుతుంటుంది. ఇలాగే తమను

చరిత్రలో అణచివేస్తూ వచ్చారని భావించే ప్రజలు, స్త్రీలు, జాతులు, భాషీయులు, కులాలు, ప్రాంతాలు తమ చరిత్రకు సరియైన న్యాయం జరుగలేదని, ఇప్పటి లక్ష్యాలకు, అవసరాలకు స్ఫూర్తినిచ్చే విశేషాలను ఎక్కువ ప్రాధాన్యతతో చరిత్రను తిరిగి పరిశీలిస్తారు. చరిత్రను తిరిగి వ్యాఖ్యానిస్తారు. నేను ఈ కోణంలో చరిత్రను పరిశీలించడానికి పరిమితమవ్వడం జరుగుతున్నది.

గతంలోంచి వర్తమానం, వర్తమానంలోంచి భవిష్యత్తు రూపుదిద్దుకుంటాయి. చరిత్రలో జరిగిన పరిణామాలనుండి స్ఫూర్తిని, గుణపాఠాలను తీసుకుంటూ జరిగిన పొరపాట్లు తిరిగి జరగకుండా వర్తమానాన్ని మొత్తం సమాజ అభివృద్ధికి అనువుగా ముందుకు నడపడానికి చరిత్ర అధ్యయనం ఎంతో అవసరం అని చరిత్రకారుల, ఉద్యమకారుల అభిప్రాయం.

సుమారు మూడు వేల ఏళ్ళనాటి మానవ జీవితానికి, విద్యుత్, రవాణా సౌకర్యాలు, సాధనాలులేని నేటి మానవ జీవితానికి మధ్య పెద్దగా మార్పులేమీ రాలేదు. నేటి ఆదివాసీలు జీవిస్తున్న జీవితం, వారి ఆలోచనా విధానం మూడు వేల ఏళ్ళ నాటి తీరును తెలుపుతున్నది. అందువల్ల సాక్ష్యాధారాల కోసం సజీవమైన మనుషులు వారి సంస్కృతి సంబంధాలు మన ఎదుటే ఉన్నాయి. అవి తమ చరిత్రను రాయాలని ఎదురు చూస్తున్నాయి.

ప్రజల జీవితంలో ఇప్పటికీ పురావస్తు అవశేషాలుగా కొనసాగుతున్నవి ఎన్నో ఉన్నాయి. సంస్కృతి అంతా పురావస్తు అవశేషాలే. సంస్కృతి అంటేనే గతం నుంచి స్వీకరించి ఆచరించే సాంప్రదాయం. మతం కూడా సంస్కృతిలో భాగంగానే కొనసాగుతుంది. అందువల్ల సంస్కృతిని, విశ్వాసాలను, మత విశ్వాసాలను పరిశీలించడం ద్వారా మానవ సమాజం గడచి వచ్చిన ఎన్నో దశలు కనబడతాయి.

కనుక మానవ సంబంధాల పరిణామాలను, ఉత్పత్తి సంబంధాల పరిణామాలను పరిశీలించడానికి గొప్ప పురావస్తు ఆధారాలుగా సజీవమైన మానవ సమూహాలు ప్రపంచమంతటా నేటికీ లభ్యమవుతున్నాయి. ప్రపంచంలోని పలు ప్రాంతాల్లో ఆదివాసి తెగలు, జాతులు ఇప్పటికీ ఆహార సేకరణ దశలో, తొలినాటి వ్యవసాయ విధానాల్లో జీవిస్తున్నారు. వీరిని పరిశీలిస్తే ఎన్నో కొత్త విషయాలు బయటపడతాయి. మోర్గాన్ అనే చరిత్రకారుడు, ఆంత్రోపాలజీ, మానవ పరిణామాల శాస్త్ర నిపుణుడు అమెరికాలోని ఆదివాసి తెగలపై పరిశోధన చేసి విలువైన సమాచారాన్ని రికార్డు చేశాడు. మానవ సమాజంలో ఇదొక గొప్ప కృషిగా మిగిలిపోయింది.

మానవ శరీరంలో లాగే మానవ సంస్కృతిలోను ప్రాచీన అవశేషాలు కొనసాగుతుంటాయి. వాటిని చారిత్రక పరిణామాల దృష్టి కోణంతో పరిశీలించి నప్పుడు



అనేక విషయాలు తెలుస్తాయి. ఇది కేవలం పుస్తకాల అధ్యయనం వల్ల సాధ్యం కాదు. పుస్తకాలను అధ్యయనం చేయడంతో పాటు ప్రజలతో నిరంతరం కలిసి జీవిస్తూ, సానుకూల దృష్టితో వారి సంస్కృతిని, భాషను పరిశీలిస్తూ విశ్లేషించ గలిగినప్పుడే అది సాధ్యపడుతుంది. ఉదా॥కు తెలంగాణా ప్రాంతంలోని అనేక కులాల పెళ్ళి తంతును పరిశీలిస్తే చాలా విషయాలు, చరిత్ర పరిణామాలు గోచరిస్తాయి. వారి పెళ్ళి తంతులో సుమారు పదిహేను రకాల పెళ్ళి తంతులు కలిసి ఉన్నాయి. ఇలా వారి పెళ్ళి తంతును పరిశీలిస్తే మానవ సమాజంలో పెళ్ళి పద్ధతులు, పెళ్ళి విధానాలు ఎన్ని రకాలుగా మారుతూ వచ్చాయో వాటి కాలం ఎప్పటిదో తద్వారా వారి జీవన విధానం, మానవ సంబంధాలు, విశ్వాసాలు ఎలా ఉండేవో తెలుసుకోవచ్చు.

సబాల్టరన్ థియరీతో (అట్టడుగు వర్గాల, జాతుల, ప్రాంతాల, తెగల దృక్పథంతో అధ్యయనం చేసే ఒక పద్ధతితో) తెగ, జాతి, కులం, ప్రాంతం, భాష విశేషాలను పట్టించుకుని వెలికి తీయడం ఇటీవల ప్రారంభమైంది. ఆ దృష్టిని మొత్తం చరిత్రకు అన్వయిస్తూ మొత్తం సామాజిక చరిత్రలో భాగంగా వాటిని పరిశీలించే క్రమాన్ని సతీష్ చంద్ర ఎన్నుకున్నారు. అంతకు ముందు డి.డి.కోశాంబి, దేవీప్రసాద్ చటోపాధ్యాయ, రాహుల్ సాంకృత్యాయన్ ఈ దృష్టితో పరిశీలించలేక పోయారు. కాని వీరి కన్నా ముందే మహాత్మా జ్యోతిరావు పూలే, డా॥ బి.ఆర్. అంబేద్కర్ ఈ దృష్టితో చరిత్రను పరిశీలించారు. పూలే, అంబేద్కర్‌ల చరిత్ర రచనలో కులం, మతం విషయాలు, మానవ సంబంధాలు ప్రాధాన్యత వహించాయి. కాని ఉత్పత్తి సాధనాలు, ఉత్పత్తి సంబంధాలు, విద్యా విధానాల చరిత్ర, ఆదివాసి ప్రజల్లోకి వెళ్ళి వారి జీవితాన్ని, సంస్కృతిని, మానవ సంబంధాలను అధ్యయనం చేయడం కనపడదు.

డార్విన్ థియరీ ఇందుకు భిన్నమైనది. నిజానికి అది ఈ సిద్ధాంతాన్ని పట్టించుకోదు. ఒక కోణంలో దీన్ని వ్యతిరేకిస్తుంది. సర్వయివల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్ అనే డార్విన్ థియరీ గెలిచేవారెవరో సూచించదు. కాని గెలిచినవారే రైటు అని సిద్ధాంతీకరిస్తుంది. నిజానికది ఏమీ చెప్పకపోవడంతో సమానం. అది ఉన్నట్టు ఆమోదించడమే తప్ప వేరు కాదు. మార్క్సిస్ట్ చారిత్రక భౌతికవాదం ఆధునిక చరిత్ర పూర్వ దశల్లో ఈ సిద్ధాంతాన్ని చరిత్ర రచనగా స్వీకరించింది.

డార్విన్ సిద్ధాంతాన్ని చారిత్రక భౌతికవాదానికి అన్వయించడంలో రెండు పొరపాట్లు జరిగాయి. గెలిచినవారే రైటు అని అందుకు అనువుగా చారిత్రక భౌతికవాదం కారణాలను చూపింది. తద్వారా ఆ గెలుపు అనివార్యమని నిర్ధారించింది. అలాగే ఓడినవారిని ఓడిపోవడం అనివార్యం అనే తీరులో కారణాలు చూపింది.

ఒక సంఘటన ఎలా జరిగిందో నిర్ధారించే బాధ్యత కూడా చరిత్ర శాస్త్రంపై

వుంటుంది. తద్వారా ఆర్యుల ప్రస్థానాలకు, బ్రాహ్మణ కులాధిక్యతకు, అలెగ్జాండర్, అశోకుల క్రమాలకు, 14వ శతాబ్దం నించి యూరప్ దేశస్థులు సాగించిన వలస క్రమాలకు అనువుగా కారణాలు వెతకాల్సి వస్తుంది. ఆ క్రమంలో ఆఫ్రికా, ఆసియా, అమెరికా, ఆస్ట్రేలియా ఖండాలకు చేరి స్థానికుల్ని దోచి, చంపి, బానిసల్ని చేసి స్థిరనివాసాలు, సామ్రాజ్యాలు ఏర్పరచుకున్న అమానుష ఆచరణలకు ఆమోదిత విలువను సంతరించిపెడుతుంది.

చరిత్ర తత్వ శాస్త్రంలో మరో సిద్ధాంతం చలామణిలో ఉంది. దానిని 'నేషనల్ స్కూల్' అంటారు. మరొకటి 'ఓరియంటల్ స్కూల్' ఉంది. ఈ రెండూ జాతీయ చరిత్ర దృక్పథాన్ని ప్రవేశపెట్టాయి. జాతీయ చరిత్ర పేరిట అగ్రకులాల చరిత్రను పాఠ్యపుస్తకాల్లో చేర్చారు. శూద్రుల, దళితుల, ద్రావిడుల, నాగజాతి చరిత్రను తొక్కిపట్టారు. వక్రీకరించారు.

భారత ఉపఖండంలోని చరిత్రలు బ్రాహ్మణులచేత మత, కులపరంగా సృష్టించబడ్డవే అని అంటారు. వారు అత్యధిక ప్రజల భాషను, చరిత్రను అణచివేశారు. గనుక చరిత్రలన్నీ అగ్రవర్ణాల పరంగా రాయబడ్డాయనేది వేరే చెప్పనవసరంలేదు. అయితే దళిత శూద్ర ఆదివాసీ కులాల జాతుల చరిత్రకారుల్లో ఒక వైరుధ్యం కొట్టవచ్చినట్టు కనపడ్తుంది. వైదిక పురాణ బ్రాహ్మణవాద సాహిత్యం అంతా తప్పులతడక అసత్యాలతో స్వంత డబ్బా వాయించుకునే ప్రచారం తప్ప అందులో వాస్తవాలు లేవు అని చెప్తుంటారు. మరోవైపు అవి సత్యాలైనట్టు, ఆచరించబడ్డట్టు వాటినుంచి కొటేషన్లు తీసుకుని వాటిని తీవ్రంగా విమర్శిస్తూ కూర్చుంటారు. అవి అబద్ధాలైనపుడు, వాటిలో చారిత్రక వాస్తవాలు లేవు కనుక వాటిని అంతగా ద్వేషపూరితంగా విమర్శించాల్సిన అవసరంలేదు.

చరిత్ర తత్వ శాస్త్రంలో 'వెస్టర్న్ స్కూల్' అని మరొకటి వుంది. అలాగే 'మార్క్సిస్టు స్కూలు' ఒకటుంది. ఆ తర్వాత 'సబాల్టర్న్ స్కూలు' వుంది. ఇటీవల 'ఫెమినిజం స్కూలు' కూడా విస్తరించింది. వీటితోపాటు 'క్రానలాజికల్ స్కూలు' అని ఒకటి వుంది. ఇది కాలాన్ని అనుసరించి చరిత్రను చెప్పే పేరిట రాజులను, రాజవంశాలను వారి పరిపాలనా విధానాలను, యుద్ధాలను, గెలుపు ఓటములను ఆనాటి పన్నుల విధానాన్ని వివరిస్తుంది.

వీటితోపాటు 'ఇండియన్ ఎబ్ ఒరిజినల్ పీపుల్స్ హిస్టరీ కల్చర్ అండ్ ఇండాలజీ' అనే స్కూలు వుంది. ఈ చరిత్ర అధ్యయన దృక్పథాన్ని మొదట అనుసరించినవారు మహాత్మ జ్యోతిరావు పూలే. మహాత్మా పూలే గులాంగిరి అనే గ్రంథంతో సహా సుమారు 16 రచనలు చేశారు. వీటిలో ఆర్యుల దండయాత్రలను శూద్రుల దృష్టితో పరిశీలించారు.



చరిత్ర రచనకు ఆధారాలు అవసరం. మొదటే చెప్పినట్టు చరిత్రకారుడి ఆసక్తిని అనుసరించి, దృక్పథాన్ని అనుసరించి ఆధారాలను సేకరిస్తారు. ఆధారాలనేని అనేక రూపాల్లో సేకరిస్తారు. రాతప్రతులు, తాటాకులమీద రాసిన "తాళపత్ర గ్రంథాలు" బ్రాహ్మణవాద దృక్పథంతో రాయబడి వుంటాయి. పాళీ ప్రాకృతం భాషల రూపాలు ఇంకా మిగిలివున్న ద్రవిడ భాషల, తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ భాషల పదాలు వాటి అర్థ పరిణామాలు, రూప పరిణామాలు సామాజిక పరిణామాలతో తులనాత్మకంగా అధ్యయనం చేసి చరిత్ర రచనకు ఆధారాలను సమకూర్చు కోవాల్సివుంటుంది. ద్రవిడ భాషా ప్రజలు ప్రపంచంలోని పలు దేశాల్లో వలసలు సాగించి, వ్యాపారం చేసి స్థిరపడ్డారు. బౌద్ధ విశ్వవిద్యాలయాలు అందులో చేర్చుకున్న విద్యార్థులు ప్రపంచమంతా విస్తరించి ఇండియాలోని భాషా పదాలను అక్కడ వాడుకలోకి తీసుకొచ్చారు. వాటన్నిటినీ సేకరించడం ద్వారా పలు కొత్త చారిత్రక అంశాలు వెలికివస్తాయి. గ్రీకు, లాటిన్, హిబ్రూ, అరబిక్, భాషల్లో ప్రాకృతంలో పైశాచి భాషల్లో రాసిన గ్రంథాలు పత్రాలు శిలాశాసనాలు కూడా కొంతమేరకు ఉపయోగపడతాయి. అన్నిటికన్నా ముఖ్యంగా చరిత్ర పరిణామాలను అర్థం చేసుకున్న ఇంగితజ్ఞానం చరిత్ర రచనలో ప్రధాన పాత్ర వహిస్తున్నది.

పురావస్తుశాఖ సమకూర్చిన ఆధారాలను భారతీయ చరిత్ర రచనలో పూర్తిగా స్వీకరించలేకపోయారు. పురావస్తు శాఖ కూడా దొరికిన ఆధారాలను ప్రజలకు అందించడం లేదు. ఉదాహరణకు ఆంధ్రప్రదేశ్‌లో పురావస్తుశాఖ జరిపిన అనేక బౌద్ధ తవ్వకాల గురించి ఈనాటి వరకు రిపోర్టు ప్రచురించలేదు. నాగార్జున కొండ లాంటి బౌద్ధ క్షేత్రాల తవ్వకాలు జరిగి 40 సంవత్సరాలు అవుతున్నా దొరికిన ఆధారాలపై రిపోర్టులు ఈనాటికీ ప్రచురించినా బ్రాహ్మణ వర్గం వారు చేస్తున్న మౌన కుట్రగా భావించవచ్చు. చరిత్ర కారులు పురావస్తు ఆధారాలను తమ వర్ణవాద, కుల వ్యవస్థ వాద, మార్క్స్ వాద సిద్ధాంతాలకు భిన్నంగా, వ్యతిరేకంగా ఉన్నవాటిని స్వీకరించలేదు. కొన్నిటిని తరువాతి తరాలకు దొరకకుండా నాశనం చేసారు. పురావస్తు శాస్త్రం అంటే పురాతన కాలపు అవశేషాల అధ్యయనం. ఉత్పత్తి సాధనాలు, పరికరాలు, మానవ సంబంధాల సాక్ష్యాలు, భవనాలు, నాణాలు, మట్టిపాత్రలు, రాతిపనిముట్లు, లోహపరికరాలు, బొమ్మలు, ప్రతిమలు, వేల యేళ్ల కిందట మానవులు తమ నిత్యజీవితంలో ఉపయోగించిన సమస్త వస్తువులు ప్రాచీన నగరాలు, గ్రామాలు చాలా మేరకు శిథిలమైపోయాయి. కొన్ని నాశనమై పోయాయి. ప్రజలు వాటి ప్రాధాన్యత తెలియక ఆ శిథిలాలను అవసరాలకు వాడుకున్నారు. ఇంకా ఎన్నో భూమి పొరలు తవ్వి తీస్తే బైట పడతాయి. అయితే దేవాలయాలు, కోటలు, చెరువులు వంటివి నేటికీ నిలిచివున్నాయి.

**చరిత్ర లేఖన శాస్త్రం :**

# ఇండియా చరిత్ర లేఖన శాస్త్రం

### పురావస్తు ఆధారాలు దొరికిన క్రమం
### చరిత్రలోని తేదీలు నిర్ణయించిన క్రమం

దక్షిణ భారతంలో ఇనుము పరిశ్రమ యూరపులో కన్నా అతి ప్రాచీనం అన్నారు పుట్. గాలి, తేమ తగులుతే ఇనుప పనిముట్లు తప్పుపట్టి నాశనం అవుతాయి. ఇనుము యుగం మానవుడు తయారుచేసిన మట్టిపాత్రలు పగిలిపోయినా రూపుమాయవు. ఈ మాదిరి కుండపెంకులు రాతికత్తులు ఇతర పనిముట్లతోపాటు కనిపిస్తూండడాన్ని బట్టి లోహకారులు నూతన శిలాయుగ జనావాసాలలోనే పుట్టుకొచ్చి పనిచేసినారనుకోవాలి. క్రీటుద్వీపంలో, గ్రీసులో, ఇతర యూరపు దేశాలలో లాగా దక్షిణ భారతదేశంలో ఇనుము యుగానికి ముందు కంచుయుగం అంటూ లేదు – అంటారు పుట్. శ్రీనివాస అయ్యంగార్ కూడా ఇనుము అనేది మొదట భారతదేశంలోనే కనుక్కున్నారని అభిప్రాయపడ్డారు.

కొమర్రాజు వేంకట లక్ష్మణరావు తెలుగువారికి చరిత్ర రచనను పరిచయం చేయడానికి మొదటిసారిగా భారతదేశ చరిత్రను 1907లో హిందూమహాయుగం, మహ్మదీయ మహాయుగం అనే రెండు గ్రంథాలుగా ప్రచురించారు. అది అయిదేళ్ళలో ఐదు ముద్రణలను పొందింది. చాలా ప్రాచుర్యం పొందిన ఈ గ్రంథాలు ఇప్పుడు వదిలివేయబడిన అనేక చారిత్రకాంశాలను మనకు తెలుపుతాయి. ఇటీవల క్రీ.శ. 2002లో ఈ పుస్తకం పునర్ముద్రణ పొందింది. ఆనాటికి సింధూనాగరికత వెలికి రాలేదు.

కొమర్రాజు వేంకటలక్ష్మణరావు గతంలో బ్రిటిష్ చరిత్రకారులు అనుసరించిన పద్ధతిలో చరిత్ర రచనకు ఉపక్రమించి యుగ విభజన, విషయ విశ్లేషణ పద్ధతిని కొనసాగించారు. ఆయన మొదటిసారిగా తెలుగువారికి శాస్త్రీయ దృక్పథంతో చరిత్ర రచన, నిర్మాణ అవసరాన్ని తెలిపారు. దానివల్ల ఆ తరువాత తరంవారైన చిలుకూరి వీరభద్ర రావు ఆంధ్రుల చరిత్ర, తదితర రచనలు మల్లంపల్లి సోమశేఖర శర్మ, నేలటూరి వెంకట రమణయ్య, మారేమండ రామారావు, ఓరుగంటి రామచంద్రయ్య, బి.ఎన్. శాస్త్రి, రాయప్రోలు సుబ్రహ్మణ్యం లాంటి అనేక మంది కొమర్రాజు లక్ష్మణరావు



పద్ధతుల్లోనే చరిత్రరచన గావించారు. కందుకూరి వీరేశలింగం, గురజాడ అప్పారావు వంటి వారికి శాసన పరిశోధనను నేర్పి చారిత్రక దృక్పథంతో చరిత్ర అధ్యయన పద్ధతులను నేర్పినవాడు కొమర్రాజు వేంకట లక్ష్మణరావు.

క్రీ.శ. 1935లో 'కాకతీయ సంచిక' అనే చారిత్రక వ్యాస సంకనం వెలువడింది. ఇందులోని చారిత్రక అంశాలు కూడా క్రమంగా వదిలివేయబడుతూ వచ్చాయి. వాటి నుండి వదిలివేసిన అంశాలకు ఎంతో చారిత్రక ప్రాధాన్యత ఉంది.

క్రీ.శ. 1920 – 24 మధ్య సింధూ నాగరికత పురావస్తు విశేషాలు తవ్వకాల్లో లభించాయి. దాంతో చరిత్ర రచన మరో మలుపు తిరిగింది. అప్పటికే ఆర్యులు ఇతర ప్రాంతాల నుండి సంచార జీవిగా, యాదవులుగా పశుపోషణ చేసుకుంటూ ఇండియాకు వచ్చారని పలు గ్రంథాలు వెలువడ్డాయి. వైదిక సాహిత్యంలో వేలకొలది ఇందుకు సాక్ష్యాలు లభించాయి. మహాత్మా జ్యోతిరావు పూలే, కె.పి. జైస్వాల్, జె.ఎస్.మిల్, బాలగంగాధర్ తిలక్ మొదలుకుని క్రీ.శ. 1925 దాకా ఆర్యులు ఇతర దేశాల నుండి వచ్చిన వారే అని సగర్వంగా చరిత్రను రాశారు.

జ్యోతిరావు పూలే క్రీ.శ. 1870లో గులాంగిరీ అనే గ్రంథంలో ఇతర ప్రాంతాలనుండి వచ్చిన ఆర్యుల వలసలను, స్థానిక జాతులను అణిచివేసిన తీరును దశావతారాల అంతరార్థాన్ని పేర్కొన్నారు. పెరియార్ రామస్వామి లాంటి వారు ఆర్యులు విదేశాల నుండి వచ్చారని, ఇండియా స్థానిక తెగలను, జాతులను అణచివేయడానికి పూనుకున్నారని, అవే వైదిక సాహిత్యంలో దేవదానవ, రాక్షస యుద్ధాలుగా రికార్డయ్యాయని ఆర్యులను వ్యతిరేకిస్తూ చరిత్రలు రాశారు.

దశాబ్దాలు గడుస్తున్న కొద్దీ ఆర్యులు విదేశీయులు అనే భావం స్థిరపడింది. వైదిక సాహిత్యం తలకెత్తుకుని దాని వారసులం బ్రాహ్మణులమే అని ఒక కులానికి వ్యక్తిగత ఆస్తిగా భావించుకున్న వారు ఆ గర్వం వీడి ఒంటరి వారు కావాల్సి వచ్చింది. దాంతో ఆ సిద్ధాంతాన్ని వదిలివేసి ఆర్యులు ఇక్కడి వారే ఇక్కడి నుండే ఇతర దేశాలకు విస్తరించారు అని కొత్త పాట ఎత్తుకున్నారు. దాన్నే చరిత్ర రచనగా చెప్తున్నారు.

అయితే ఋగ్వేదంలోని సాక్ష్యాలన్నీ ఉత్తరాది నుండి కిందికి విస్తరించిన పరిణామానికి సంబంధించినవే. వైదిక, పురాణ సాహిత్యంలోని సాక్ష్యాలలోని ఆర్యుల లేదా వర్ణవాదుల లేదా బ్రాహ్మణుల క్రూరత్వాన్ని తెలిపే అంశాలన్నింటినీ ప్రచారంలోకి రాకుండా చాలా జాగ్రత్తగా చరిత్ర రచనల్లో తప్పిస్తున్నారు. అందులో శ్రీరామ్ సాఠే, పి.ఎన్.ఓక్, దామోదరశాస్త్రి, ముదిగొండ శివప్రసాద్, ఎం.వి.ఆర్. శాస్త్రి మొదలైన వారు ముఖ్యులు. వీరు హిందూ దేశ ప్రశస్తి అంటూ చెప్తూ అదే సమయంలో అవి హిందూ మత ప్రశస్తిగా హిందూ దేశాన్ని, హిందూ మతాన్ని పర్యాయపదాలుగా

అర్థం ఇచ్చేట్టుగా చరిత్ర రచనను కావాలని తప్పుదారి నడిపిస్తుంటారు.

అలా బౌద్ధ కాలంలో బౌద్ధం ద్వారా జరిగిన అభివృద్ధిని వైదిక, బ్రాహ్మణీయ, హిందూ వర్ణవాదులు సాధించిన అభివృద్ధి అనే అర్థం స్థిరపడే విధంగా చరిత్ర రచనలో నిజాయితీ కోల్పోయి వక్రీకరణలకు పాల్పడుతున్నారు. అందులో భాగంగా వైదిక, పురాణ సాహిత్యాలలోని తమకు వ్యతిరేకమైన సాక్ష్యాలను వదిలివేసి క్రైస్తవులు యూరోప్ దేశస్థులు ఇండియా చరిత్రను రాయడంలో ఎదుర్కొన్న చరిత్రకారుల మత విశ్వాసాలను, పరిమితులను పేర్కొని విమర్శిస్తూ చరిత్ర రచనను కల్పనా సాహిత్యంగా మార్చివేస్తున్నారు.

క్రీ.శ. 7వ శతాబ్దం వరకు ఇండియా చరిత్రకు క్రానలాజికల్ ఆర్డర్ లేదు. ఏదీ ఇదమిత్థంగా చెప్పలేము అనే అభిప్రాయం ఒకటి వుంది. అయితే, అలెగ్జాండర్ దండయాత్ర వల్ల గ్రీకు రాజుల చరిత్రలో ఇండియా గురించి రికార్డు అయింది. అలా మగధ, మౌర్య సామ్రాజ్యాల చరిత్ర, శిలా శాసనాల ద్వారా అశోకుడి చరిత్ర తెలుస్తున్నది. కానీ, స్థానిక ఆ యా ప్రాంతాల చరిత్ర కాలక్రమాన్ని ననుసరించి తెలియడంలేదు. ఉత్తరాది ప్రాంత చరిత్ర చెప్పినట్టుగా దక్షిణాది చరిత్ర క్రమాన్ని ప్రాధాన్యతతో చెప్పడంలేదు. ఇప్పటిదాకా కొనసాగుతున్న చరిత్రకు ఈ పరిమితి ఉంది. బుద్ధుడి కాలాన్ని క్రీ.పూ. 550లో అని నిర్ధారించారు. అయితే, వేదాల కాలాన్ని రామాయణ, భారతాల కాలాన్ని ఏ కాల క్రమంలో నిలుపాలి అని చర్చిస్తూ ఆరెసెస్ హిందూవాదులు 'ఇతిహాస సంకలన సమితి' ఆధ్వర్యంలో కొన్ని పరిశోధనలు లేదా కొన్ని అభిప్రాయాలు ప్రాచుర్యంలోకి తెచ్చారు. బిజెపి అధికారంలోకి రాగానే వాటినే ఆ యా రాష్ట్రాల్లో పార్టీ పుస్తకాలుగా ప్రవేశపెట్టారు. కేంద్రంలో కూడా బిజెపి ఆరెసెస్ శక్తులు ఈ ప్రయత్నాన్ని బలంగానే చేసాయి.

వారు బుద్ధుడి కాలాన్ని వెనక్కి జరిపితే వేదాలకు, రామాయణ భారతాల కాలాలకు స్థానం లభిస్తుందని భావించారు. బుద్ధుడి కాలం బర్మా దేశ బుద్ధిస్టుల ప్రకారం క్రీ.పూ. 13వ శతాబ్దం అని అది సరైనది కావచ్చు అని ప్రతిపాదించారు.

బౌద్ధ గ్రంథాల్లో ఇండియా చరిత్ర 14వ శతాబ్దం దాకా రికార్డయి ఉంది. హూయిన్త్సాంగ్, ఇట్సింగ్, మెగస్తనీస్, అల్ బెరూని వంటి బౌద్ధ పర్యాటకులు, అమీర్ కుస్రో వంటి ముస్లిం చరిత్రకారులు ఇండియా చరిత్రను విస్తారంగా రికార్డు చేశారు. శ్రీరామ్ సాఠే 18వ శతాబ్దంనాటికి చరిత్ర రికార్డు కాలేదని చెప్పడం అసత్యం.

బౌద్ధ గ్రంథాలు, ఈ పర్యాటకుల గ్రంథాలు పలు భాషల్లో లభిస్తున్నాయి. బౌద్ధ గ్రంథాలు టిబెట్టు, చైనా, సింహళ దేశాల్లో వారి భాషల్లో ఇప్పటికీ దొరుకుతున్నాయి. వాటి నుండి చరిత్రను పునర్ నిర్మించడం బౌద్ధ ధర్మ చరిత్రను, దాని ప్రాధాన్యతను గుర్తించడం అవుతుంది కనుక వాటన్నింటినీ చర్చించకుండా వాటిలోని చరిత్ర జోలికి



పోకుండా జాగ్రత్తగా అసత్యాలను సత్యాలుగా ప్రచారం చేస్తూ బ్రాహ్మణవాద, వర్ణవాద చరిత్రను మొత్తం భారతీయ చరిత్రగా రాస్తూ సూద్ర, అతిసూద్ర కులాలకు చరిత్రే లేదన్నట్టు భయాందోళనలకు, ఇన్ఫీరియారిటీకి గురి చేస్తున్నారు.

చారిత్రక వాస్తవం ఏమంటే బ్రాహ్మణవాదం, వర్ణవాదం, కులవ్యవస్థ సిద్ధాంతాలు వ్యాప్తి చెంది స్థిరపడుతున్న క్రమంలోనే ఆ సిద్ధాంతాల్లోని విభజించి పాలించే సామాజిక వర్గీకరణల వల్లే సామ్రాజ్యాలు కూలిపోయాయి. చిన్న రాజ్యాలు, అనైక్యత ఏర్పడింది. ఆ అనైక్యతే ముస్లిం రాజులు దండయాత్రల్లో జయించడానికి కారణమైంది. వాళ్ళంటున్నట్టు వెయ్యేళ్ళు ఇండియా బానిసత్వంలో మగ్గడానికి వర్ణవాద, బ్రాహ్మణవాదమే కారణం.

దామోదరశాస్త్రి చరిత్ర కాలాల్లో భారతీయ విద్యావిధానం గురించి క్రీ.శ. 1998లో చిన్న పుస్తకాన్ని వెలువరించారు. అందులో అందరికీ ఉచిత విద్య ఇవ్వబడిందని రాశారు. బౌద్ధుల కాలంలో బౌద్ధ విశ్వ విద్యాలయాల్లో జరిగిన విద్యా బోధనను హిందూ విద్యా బోధనగా వక్రీకరించి చూపారు.

బ్రాహ్మణులకు ఉచిత విద్య కోసం సత్రాలు నిర్వహించిన సందర్భాలను అందరికీ ఉచిత విద్య లభించేదని రాశారు. కాని వీరు మనువు శూద్రులకు విద్య నిరాకరించాలని రాసిన విషయాలను ఖండించలేదు. ఆ విషయాలను కూడా ఉన్నట్టు రికార్డు చేయకుండా దాటవేసి అసత్యాలను సత్యాలుగా రాశారు. వేదాలను, పురాణాలను వల్లె వేయడం, తర్క శాస్త్రాన్ని అభ్యసించడం విద్యగా పేర్కొన్నారు.

ఇలాంటి చరిత్రకారులు శూద్రుల సామాజిక ఉత్పత్తి, సంపద ఉత్పత్తి విద్యను వృత్తి కులాల విద్యగా కొద్ది వాక్యాలు రాసి వాటికి ప్రాధాన్యత లేనట్టుగా రికార్డు చేశారు. శూద్రుల సామాజిక సంపద సృష్టికర్తల విద్య, నైపుణ్యం అభివృద్ధి చెందిన క్రమంలోనే సంపద పెరిగింది. ఆ పెరిగిన సంపద ఇలా బ్రాహ్మణవాదులు, వర్ణవాదులు, వర్తక, వాణిజ్యవేత్తలు, రాజులు, వేశ్యలు, దొంగలు దోపిడీ చేయడం జరిగింది. ఈ విషయాలను శ్రీరామ్ సాఠే, ఎం.వి.ఆర్.శాస్త్రి, దామోదర శాస్త్రి, పి.ఎన్. ఓక్ మొదలైన బ్రాహ్మణవాద చరిత్రకారులు సంపద సృష్టి క్రమం, సంపద సృష్టికర్తల, శూద్రుల దృష్టికోణం నుండి రికార్డు చేయలేకపోయారు. వారు ఉద్దేశ్యంలో సామాజిక వ్యవస్థలో సంపదను ఏదో ఒక రూపంలో కైవసం చేసుకుని పై శ్రేణుల్లో చేరిన వారి అభివృద్ధి, సంఘర్షణ, యుద్ధాలు, పతనాలు మాత్రమే చరిత్రగా భావిస్తూ చరిత్ర లేఖన శాస్త్రాన్ని సృష్టించుకున్నారు.

క్రీ.శ. 1920–24లో బయల్పడిన హరప్పా, మొహంజదారో సింధూ నాగరికత నాగ జాతులదని, ద్రావిడులదని, దాసులుగా, శూద్రలుగా మార్చబడిన స్థానిక జాతులదని

పేర్కొంటున్న చారిత్రక దృక్పథాన్ని ఆర్.ఎస్.ఎస్. బ్రాహ్మణవాద చరిత్రకారులు వ్యతిరేకిస్తూ క్రీ.శ.1990 నాటికి అది సరస్వతీ నాగరికత అని, అది ఆర్యులదే అని చరిత్ర రచన చేయడం ప్రారంభించారు. గుప్తుల కాలంలో పూర్తిగా వైదిక మతం పునరుద్ధరించబడింది. ఆర్థిక దోపిడీ చేయటానికి ప్రముఖ సాధనాలైన కులం - శివ - విష్ణు - బ్రహ్మ తదితర దేవుళ్లను, దేవాలయాలు శూద్రులు సృష్టించే సంపదను, శ్రమ శక్తిని దోపిడి చేయటానికి ప్రముఖమైన సాధనంగా, పూజారి దోపిడీ చేసిన సొమ్మును నిలువ చేసేవారుగా, దోచుకొనేవారుగా, బ్రాహ్మణ కులమంతా దానికి భుక్తం చేసుకొని అనుభవించే వర్గంగా తయారయింది. గుప్తరాజులు - పూజారులు జంట దోపిడీదారులుగా ప్రసిద్ధి చెందారు. ఈ గుప్తుల కాలంలో బ్రాహ్మణుల ఆర్థిక దోపిడీని ప్రోత్సహించిన పురాణాలు - వేదాలు - ఉపనిషత్తులను తిరిగి బ్రాహ్మణులకు అనుకూలంగా తిరగరాశారు. రాముడిని - కృష్ణుడిని గురించి పెద్ద స్థాయిలో ప్రచారం జరిగింది."

గుప్తుల కాలంలో బ్రాహ్మణుల సుఖ సంతోషాలకు, విలాసాలకు, భోగ-భాగ్యాలకు అంతు లేదు. అందువల్ల బ్రాహ్మణులు స్వర్ణయుగంగా చరిత్రలో కీర్తించుకున్నారు. బ్రాహ్మణులు చరిత్రలో తమను పోషించిన రాజులను, రాజ్యాలను మెచ్చుకున్నారు. తమకు వ్యతిరేకంగా వున్న రాజులను, రాజ్యాలను కూలదోశారు. కుషాన్ రాజులు బౌద్ధాన్ని ఆదరించినప్పటికీ బ్రాహ్మణుల సుఖ-సంతోషాలకు లోటు లేదు. అన్నిరకాల కానుకలు, కట్నాలు, అగ్రహారాలు, గుడుల నిర్మాణాలు, పూజారి వృత్తి, కులం, ఆధ్యాత్మికవాదం యేరులై పారింది. శూద్రులను తమ ఇష్టం వచ్చినట్లు దోచుకున్నారు. నేటికీ విద్యావ్యవస్థలో ఇదే కొనసాగుతున్నది.

### ఇది శూద్రుల దృక్పథంతో రాసిన భారతీయ చారిత్రక భౌతికవాదం

చరిత్రబోధనను జీవికగా, జీవిస్తున్న చరిత్ర అధ్యాపకులు చరిత్రకారులుగా తమకు తాము భావించుకోవడంవల్ల విశ్వవిద్యాలయాలు, కాలేజీలు విస్తరించిన కొద్దీ చరిత్ర రచన, చరిత్ర వెలికితీత అకాడమిక్ అగ్రకుల విద్యావేత్తల చేతుల్లో బందీ అయిపోయింది. సమాజం కోసం నిజంగా జీవితాలను అంకితం చేసే వాళ్ళు చరిత్రను వెలికితీయడానికి పూనుకున్నప్పుడు అనేక అవరోధాలు ఎదుర్కొంటున్నారు. విశ్వవిద్యాలయాలు వీరిని అణచివేసే రాజ్యంగా, రాజ్యాంగ యంత్రంగా పరిణమించాయి. స్వచ్ఛందంగా చరిత్రను వెలికితీసే కర్తవ్యం చేపట్టిన వారికి ప్రోత్సాహకాలు కరువయ్యాయి. ముఖ్యంగా విద్యా రంగంలో జె.ఎన్.యు. మొదలుకొని **అన్ని విద్యా సంస్థల్లో బ్రాహ్మణీయ శక్తులు అనేక స్కూల్ ఆఫ్ థాట్స్‌లలో చేరి పీఠాధిపత్యం వహిస్తూ శూద్ర దృక్పథాన్ని, శూద్ర దృక్పథంతో భారతీయ చారిత్రక భౌతిక వాదాన్ని నిర్మించలేక పోతున్నారు. ఇది ప్రధానంగా శూద్రుల దృక్పథంతో రాస్తున్న 'భారతీయ చారిత్రక భౌతిక వాదం.'**





# 'ఆర్య' సిద్ధాంతం వదులుకోవడం నాగ, ద్రావిడ దక్కన్ జాతుల విజయం

మొదటి ప్రపంచ యుద్ధం తర్వాత యూరప్ సామ్రాజ్యవాదం విచ్ఛిన్నమై పలు దేశాలు స్వాతంత్ర్యం పొందాయి. క్రీ.శ.1918లో స్వాతంత్ర్యం పొందిన సోవియట్ రష్యా, తూర్పు యూరప్ దేశాలు సోషలిస్ట్ వ్యవస్థలోకి మారడానికి నిర్ణయించుకున్నాయి. రెండో ప్రపంచ యుద్ధం తర్వాత యూరప్ సామ్రాజ్యవాద దేశాలు యుద్ధ ఖర్చులతో బలహీనపడిపోయాయి. ఇండియా, చైనాతో పాటు పలు దేశాలు స్వాతంత్ర్యం పొందాయి. క్రీ.శ.1949లో యూదుల కోసం ఇజ్రాయిల్ అనే దేశం రెండు వేల ఏళ్ల తర్వాత ఒక కొత్త దేశంగా ఏర్పడింది. దానిపక్కనే పాలస్తీనా, అరబ్బు దేశం ఏర్పడింది. ఈ రెండు రాజ్యాలు క్రీ.శ.2007 నాటికి కూడా పరస్పరం సంఘర్షించుకుంటున్నాయి. ఈ సంఘర్షణలో స్వంత భూభాగంలేని దేశంగా పాలస్తీనా ప్రపంచదేశాల గుర్తింపు పొందింది.

పాలస్తీనా సమస్య ప్రపంచ దేశాల ముందుకు వచ్చాక యూదుల సమస్య, అరబ్బుల సమస్య, ముస్లింల సమస్య, ఆర్యుల సమస్య, క్రైస్తవుల సమస్య తిరిగి చరిత్ర ముందు పరిష్కారం కోసం నిలబడ్డాయి. రాజ్యాధినేతలు, ఐక్యరాజ్యసమితి, ప్రపంచ చరిత్రకారులు ఒక్కసారిగా ఆశ్చర్యానికి లోనయ్యారు. ఇంతదాకా రాస్తున్న చరిత్రలోని అవగాహనల్లో గల లోపాలు స్పష్టం కాసాగాయి. ఆర్యుల చరిత్ర, ఆర్య జాతి సిద్ధాంతంలో గల లోపాలు తెలిసిరాసాగాయి. ఆర్య జాతి సిద్ధాంతం ఎప్పుడు ఎందుకు ఎలా ప్రారంభమైంది? ఎందుకు దానికి అంత ప్రాచుర్యం కలిగించారు? అలా ప్రాచుర్యం కలిగించినవారి ప్రయోజనాలు ఏమిటి అనేవి 1960ల నుండి చర్చకు రాసాగాయి.

ఇలా మొదటి ప్రపంచ యుద్ధం, రెండవ ప్రపంచ యుద్ధం తర్వాత స్వాతంత్ర్యం పొందిన దేశాలు 1970ల నుండి తమ దేశాల చరిత్రను, వాటి ప్రారంభ వికాస దశలను తిరిగి స్వతంత్ర దేశాల కోణంలో అధ్యయనం చేయడం ప్రారంభించాయి. తమదైన స్వంత చరిత్రను తవ్వితీసి, వలసవాదులు, సామ్రాజ్య వాదులు చిల్లం కల్లం

చేసి వలసవాదానికి అనువుగా నిర్మించి ఇచ్చిపోయిన తమ దేశ చరిత్రలను పునర్నిర్మించుకుంటున్నారు. అందులో యూరోపియన్ల కృషి కూడా ఎంతో వుంది. వారి కృషిలో తిరిగి కొంతమేరకు వలసవాద, సామ్రాజ్యవాద లక్షణాలు చోటుచేసుకున్నాయి. అయినప్పటికీ వాటి ప్రభావంతో ఆ యా స్వతంత్ర దేశాల్లో చరిత్రకారులకు – ఆర్య సంతతి, ఆర్య జాతి, ఆర్య భాష సిద్ధాంతాలు, వాటి గొప్పతనం మత్తులో ఉన్నవాళ్లకు – ఒక్కసారిగా ఆ మత్తు దిగిపోయింది. అసలైన తమ చరిత్రను తమ దేశాల్లోకి వాళ్లు వలస రాకపూర్వం ఉన్న చరిత్రను సామాజిక పరిణామాలను తిరిగి మొదటినుండి కొత్త పురావస్తు, సాహిత్య, సాంస్కృతిక, శాసన ఆధారాలతో రాసుకోవడంలో వేగం పుంజుకుంది.

ఇలా సబాల్టన్ స్టడీస్ కూడా వేగం పుంజుకున్నాయి. ఆ యా దేశాల్లోని పరిపాలక వర్గాలు ఒక మేరకు మాత్రమే చరిత్రను వలసవాద చరిత్ర నుండి స్వతంత్ర దేశ చరిత్ర రాయడానికి అనుమతించాయి. అట్టడుగు వర్గాల, అణగారిన జాతుల, ప్రాంతాల చరిత్రను వెలికితీయడానికి పాలకవర్గాల ప్రయోజనాలకు కూడా ఇబ్బందిగా పరిణమించింది. దాంతో సబాల్టన్ స్టడీస్ ఈ కర్తవ్యాన్ని చేపట్టింది. చరిత్రలో, చరిత్ర రచనలో అట్టడుగు వర్గాల ప్రాంతాల, జాతుల, దేశాల ప్రాధాన్యత వదలివేయబడిన తీరును సబాల్టన్ స్టడీస్ వెలికితీస్తున్నాయి. సబాల్టన్ స్టడీస్, సబాల్టన్ థియరీ చరిత్ర దృక్పథం ప్రాచుర్యంలోకి రాకముందే మహాత్మా జ్యోతిబా పూలే, అంబేద్కర్, అట్టడుగు వర్గాల, అణగారిన జాతుల చరిత్రను పీడితుల దృష్టితో చరిత్రను అధ్యయనం చేయడానికి మార్గం వేసారు.

అందులో భాగంగా ఆర్యజాతి, ఆర్య సంతతి, ఆర్య భాష, ఆర్యుల తొలి నివాసం, ప్రపంచమంతా ఆర్యమయం, కృణ్వంతో విశ్వమార్యం, ఆర్యులే ప్రపంచ నాగరికతలకు మూలం అనే సిద్ధాంతాలన్నీ పటాపంచలయ్యాయి. అవి మోయలేని పెనుభారంగా పరిణమించిన సిద్ధాంతాలుగా గుర్తించారు. వాటిని ఎలా వదిలించుకోవాలో అని చరిత్ర రచన మొదలైంది.

శూద్రులంటే శుద్ధులని, సుద్దలని, పరిశుద్ధులని, నిర్మలమైన మనస్సు కలవారని రక్షకులని అర్థం. సుద్ద అంటే తెలుపు. ప్రాకృత, ప్రాచీన భాషల్లో సుద్ద, సూద్ర, శుద్ధ పదాలు ప్రేమ, కరుణతో నిండిన పరిశుద్ధమైన మానవులు అని అర్థం. దీన్ని బ్రాహ్మణవాదులు నీచార్థంలోకి మార్చారు. తాటకి అంటే తటాకాలు నిర్మించిన వారు అని అర్థం. అంటే చెరువులు నిర్మించిన ఇంజనీరు తాటకి. త్రాష్టుడు అంటే నీళ్లను బంధించినవారు అని అర్థం. అనగా చెరువుకట్టలు నిర్మించినవారు అని అర్థం. కాని శూద్ర, తాటకి, త్రాష్టుడు అనే పదాలు వైదిక పౌరాణిక సంస్కృత సాహిత్యంలో



నీచపదాలుగా మార్చబడ్డాయి. ఇలా పదాల విలువలను సంస్కృత భాషా శాస్త్రం సమూలంగా మార్చింది. అందువల్ల సంస్కృతం చరిత్ర రచనలో ఆధారపడదగిన భాష కాదు అని చరిత్రకారుల అభిప్రాయం.

మెడకు చుట్టుకున్న పాము కరవక మానదు అన్నట్టు ఆర్య జాతి, ఆర్య సంతతి సిద్ధాంతం దాన్ని తలకెత్తుకున్నవారిని కరవడం మొదలైంది. ఆర్యులు విదేశీయులు అని అన్ని స్వతంత్ర దేశాలు చరిత్రలో రాసుకోవడం వేగం పుంజుకుంది. దాంతో ఆర్యులకు, ఆర్య జాతి, ఆర్య భాష సిద్ధాంతధారులకు యూదులవలె స్వంత దేశం లేకుండా పోయింది. యూదులకైనా ఇజ్రాయిల్ అనే ఒక జిల్లా అంతటి దేశం వుంది. ఆర్యులకు ఆ పాటి దేశం కూడా లేదు. దాంతో ఆర్యజాతి, ఆర్య భాష సిద్ధాంతాలను పట్టుకుని వేలాడినవాళ్లు ఆ సిద్ధాంతానికి విడాకులు ఇవ్వాలని, విడాకులు ఎలా సంపాదించుకోవాలో నా నా తంటాలు పడ్డారు. పడుతున్నారు. ఆరెసెస్, బిజెపి, బ్రాహ్మణ వర్ణవాద, హిందూ మతవాదులు కూడా ఆర్యజాతి సిద్ధాంతాన్ని ఇలా అంతర్జాతీయ చరిత్ర రచనా పరిణామంలో వచ్చిన మౌలిక అవగాహనల మార్పుల మూలంగా తమ ఆర్యజాతి, ఆర్య భాష, ఆర్య ప్రాంత, ఆర్య సంతతి సిద్ధాంతాలను వదిలించుకోవాల్సిన అవసరం ఏర్పడింది. ఇది పూలే, అంబేద్కర్, పెరియార్ రామస్వామిలతో పాటు నాగ, ద్రావిడ, దక్కన్ జాతుల విజయం.

దాంతో ఆర్యులు ఇండియాలో పుట్టి పెరిగినవారే అని కొత్త సిద్ధాంతాలను చేయడం ప్రారంభించారు. ఇండియాలోని సూద్రులు, స్థానిక జాతులు, ద్రావిడులు, నాగులు, ఆదివాసీలు, దేశంలోని ప్రతి రాష్ట్రంలో ఆర్యులు విదేశీయులని స్పష్టం చేశారు. ఆర్య వర్ణ కులవాదులు పాలస్తీనా అరబ్బుల్లాగా స్వంత దేశం లేని ప్రజల్లాగా అల్లాడారు. దాంతో వారు ఆర్యులు ఈ దేశీయులే. సింధు నాగరికత ఆర్యులదే అని కొత్త సిద్ధాంతాలు తయారుచేసుకున్నారు. అందుకు పురావస్తు ఆధారాలు వెతుక్కుంటూ వైదిక పురాణ సాహిత్యంలో ఇండియాలోని స్థానిక జాతుల, తెగల, కులాల అణిచివేత గురించిన సాక్ష్యాలను జాగ్రత్తగా చర్చకు రాకుండా చేస్తున్నారు. ఇది సూద్ర, ఉత్పత్తి కులాల, ఆదివాసీ, దళిత మేధావుల చరిత్రకారుల విజయం. అయితే ఆర్య సిద్ధాంతాన్ని వాళ్లు వదిలేసినా ఆ సిద్ధాంతంతో అణచివేయబడిన కులాలు, వర్గాలు, ప్రాంతాలు ఆర్యులు విదేశీయులు అనే సిద్ధాంతాన్ని వదిలేయడానికి సిద్ధంగా లేరు.

వైదిక, పురాణ, ఆర్య సాహిత్యంలో ఆర్యేతర తెగల, జాతుల, ప్రాంతాల పట్ల గల వ్యతిరేకత, అణచివేత పొరపాటు అని దాని లాభోక్తులు చెప్పేదాకా, ఆ సాహిత్యాన్ని తమది కాదని అది మొత్తం సమాజానికి సంబంధించిన చరిత్రలో భాగమని ఆ ప్రాచీన ధర్మసూత్రాలు వైదిక పురాణ సాహిత్యానికి కాలం తీరిపోయిందని బ్రాహ్మణ

వాదులు ప్రకటించేదాకా సూద్ర, దళిత, ఆదివాసీ, నాగ, ద్రవిడ జాతులు, కులాలు ఆర్య సిద్ధాంతాన్ని, ఆర్యులు విదేశీయులు అనే సిద్ధాంతాన్ని క్షమించి వదిలేయడానికి సిద్ధంగా లేరు. ఇలా బ్రాహ్మణవాదులు చుట్టుకున్న తాడే మెడకు ఉరితాడుగా పరిణమించింది.

"అభివృద్ధి చరిత్ర", "అభివృద్ధి చెందినవారి చరిత్ర" క్రమానికి అనువుగా చరిత్ర రాయడం అంటే గెలిచిన ఆధిపత్య వర్గాలకు, కులాలకు, లింగాలకు, జాతులకు, రాజులకు ప్రాంతాలకు అనువుగా, వారి అణచివేత, పరాయీకరణల కనువుగా చరిత్ర రాయడం. మానవ సమాజ పరిణామంలో అభివృద్ధిని వివరించే క్రమంలో ఆ రాజ్యాల్ని, "అభివృద్ధిని గెలుచుకున్న" వాళ్ళ ఆధిక్యత, పరాయీకరణ లుంటాయి.

1978లో ఎడ్వర్డ్ సయ్యద్ అనే చరిత్రకారుడు, సామాజిక శాస్త్రవేత్త 'ఓరియంటలిజమ్' అనే గ్రంథం వెలువరించాడు. అందులో మూడవ ప్రపంచ దేశాల చరిత్రలో 300 ఏళ్లుగా జరిగిన పొరపాట్లను, వక్రీకరణలను విపులంగా చర్చించాడు. ఎందుకు అలా చేసారో కూడా కారణాలు పేర్కొన్నాడు. క్లాసికల్ ఓరియంటలిజమ్ గొప్పదని ఇండో యూరోపియన్ భావన గొప్పదని నిజానికది ఆర్యన్ సంతతి కేంద్రబిందువుగా ఓరియంటలిజమ్ సాగిందని ఇండో యూరోపియన్ ఐక్యతలో భాగంగా ఆసియా దేశాలను దోపిడి చేయడానికి ఈ సిద్ధాంతం ఉపయోగపడిందని ఎడ్వర్డ్ సయ్యద్ గ్రంథం ద్వారా తెలుస్తున్నది. ఓరియంటలిజమ్ అన్న భావన, ప్రాచ్య దేశాల వాదం అన్న భావన ఆర్య వాదానికి, ఆర్య సిద్ధాంతానికి సంబంధించినవే అని అంటాడు. ప్రఖ్యాత చరిత్రకారుడు మార్టిన్ బెర్నాల్ కూడా 'బ్లాక్ ఎథీనా' గ్రంథంలో ఓరియంటలిజమ్ అనేది ఆర్య సిద్ధాంత కేంద్రకంగా వుందని స్పష్టం చేశారు.

గార్డెన్ చైల్డ్ అనే ఆయన ప్రపంచంలో పేరెన్నికగన్న మార్క్సిస్టు చరిత్రకారుడు. అతడు కూడా 'ది ఆర్యన్స్' అనే గ్రంథాన్ని వెలువరించాడు. ఆ గ్రంథం రాయడంలో విశేషం ఏమీ లేదు కాని ఆయన కూడా ఆర్యులే ప్రపంచ నాగరికత నిర్మాతలని ఆ గ్రంథంలో రాయడం ఆశ్చర్యకరం. ఇంగ్లాండ్, జర్మనీ, ఫ్రాన్స్, రష్యా, మొదలైన యూరప్ దేశాలు, మధ్య ఆసియా దేశాలు అన్నీ ఆర్య సంతతి వారు అని ఆర్య సిద్ధాంతం చెప్తుంది. కేంబ్రిడ్జి వాళ్లు 'ఏన్సెంట్ హిస్టరీ' (ప్రాచీన చరిత్ర) గ్రంథాల్లో కూడా ఆర్యులను ప్రశంసించడానికి ప్రాధాన్యత ఇచ్చారు.

ఆర్యులే ప్రపంచ నాగరికత నిర్మాతలు అనే భావం ఇలా రకరకాల రూపాల్లో 300 ఏళ్లు కొనసాగింది. ఈ 300 ఏళ్లల్లో ఈ ఆర్య సిద్ధాంతం గొప్పదని, ఓరియంటలిజమ్ గొప్పదని 60 వేల గ్రంథాల్లో ప్రశంసించబడింది. ఇండియాలో మార్క్సిస్టు చరిత్రకారులుగా పేరుపొందిన డి.డి.కోశాంబి వంటి వారు కూడా ఇదే పని చేశారు. కోశాంబి లాంటివాళ్లు



చరిత్రలో లేని విచిత్రమైన విషయాలను సూత్రీకరణలు చేసి ఆదివాసీ గిరిజన తెగలకు, జాతులకు ద్రవిడ నాగ జాతులకు, స్థానిక జాతులకు, కులాలకు ఇండియా చరిత్రలో వారికి ప్రాధాన్యత లేకుండా చేసి పెట్టాడు.

కాంగ్రెస్ జాతీయోద్యమ చరిత్రకారులకు, మార్క్సిస్టు చరిత్రకారులు, హిందూ, బ్రాహ్మణవాద మతతత్వ, బిజెపి, ఆరెసెస్, చరిత్రకారులు రాసే చరిత్రకు యీ పరిమితి వుంది. పెట్టుబడిదారీ దేశాలు, ప్రాంతాలు సంబంధాలు వారి అభివృద్ధి, అక్కడి కార్మికవర్గం మొదలైనవి ఆధునిక ప్రపంచం అంటూ కుల, మత, ప్రీ ఫ్యూడల్, ఫ్యూడల్, పితృస్వామిక సంబంధాలను, ప్రజలను వెనకబడిన ప్రపంచం అంటుంది – కార్మికవర్గ వాద చారిత్రక భౌతికవాదం. మరోవైపు హిందూ, బ్రాహ్మణవాద చరిత్ర అధ్యయనం వర్ణాధిక్యతను, కులాధిక్యతను ఉన్నతీకరిస్తూ ఈ సమాజానికి సమస్త సంపదలను సృష్టించిన ప్రజలను వదిలివేస్తుంది. వీరు రాజులను, బ్రాహ్మణులను, గుళ్లు గోపురాలను హిందూ ముస్లిం యుద్ధాలను ద్వేషపూరితంగా ప్రధానం చేస్తారు.

ఇండియాలో బ్రాహ్మణవాదులు వేల సంవత్సరాలుగా ప్రత్యేక రాజకీయ సామాజిక సాంస్కృతిక ఆధిక్యతను అనుభవిస్తున్నారు. పుట్టుకతోనే వారికి హక్కు వచ్చిందని భావిస్తున్నారు. ఈ దుర్మార్గాన్ని వామపక్ష, ఆరెసెస్, హిందూ బ్రాహ్మణవాదులు, ఇంకా రకరకాల వాదాలు చేసే బ్రాహ్మణ మేధావులు, శాస్త్రవేత్తలు స్పష్టం చేసి ఖండించలేకపోయారు. సోషలిజం, కమ్యూనిజం సిద్ధాంతాల పేరుతో ఇండియాలో స్వాతంత్ర్యానంతరం ఆస్తులు సంపద ఉద్యోగాలు అధికారాలు కూడబెట్టుకుంటున్నది బ్రాహ్మణీయ వర్గాలే అనేది వీరెప్పుడూ చెప్పలేకపోయారు. ఒకనాడు సోషలిజం కమ్యూనిజం సిద్ధాంతాలను పేద ప్రజల కోసం ప్రచారం చేసింది శూద్ర, దళిత కులాల మేధావులే అనే విషయం కూడా వీరు చెప్పడంలేదు.

ఇలాంటి విషయాలను సాధికారికంగా చెప్పడానికి కృషి చేసిన శూద్ర దళిత మేధావుల మధ్య బ్రాహ్మణవాదులు విభజించి పాలించు అనే పద్ధతిలో విభేదాలను సృష్టించారు. ఆర్య, వైశ్య, క్షత్రియ మొదలైన ద్విజ కులాలుగా చెప్పుకునేవారు ప్రభుత్వరంగ సంస్థల అధిపతులుగా ఉంటూ వాటిని కైంకర్యం చేసి స్వంత ఆస్తులు పెంచుకుంటూ దాన్ని సోషలిజం అని ప్రచారం చేసారు. హిందూ మత తత్వాన్ని విమర్శిస్తున్నట్టుగా మాట్లాడుతూ దళితులు సూద్రులు మాట్లాడే అవకాశం లేకుండా జాగ్రత్త పడుతున్నారు. తద్వారా బ్రాహ్మణవాదులు విమర్శ రూపంలో తమ వారి ప్రయోజనాల కోసం జాగ్రత్తలు నేర్పుతూ రాస్తున్నారు.

ఇలా గతం నుంచి ఆధిక్యతలో కొనసాగుతూ ఆధునిక ప్రపంచంలోని సంపదను, అధికారాన్ని, అభివృద్ధిని అనుభవించే వాళ్ళెవరయినా, ఎంత కొద్దిమందైనా దాన్ని

సార్వత్రిక అభివృద్ధిగా ప్రచారం చేస్తుంటారు. మరికొందరు రాజుల చరిత్రను, బ్రాహ్మణ వాదుల ఆధిక్యత చరిత్రను తలకెత్తుకుంటారు. గతంలోని అణిచివేత వదిలేసి గొప్ప రాజ్యాలని స్వర్ణ యుగాలని కీర్తిస్తుంటారు. గతంలో అణిచివేతకు గురియైన కులాలు, వర్గాలు, ప్రాంతాలు ఇలాంటి చరిత్ర నిర్మాణాన్ని వ్యతిరేకించడం సహజం.

వీరు పీడిత స్త్రీలు, పీడిత కులాలు పాతనగరం స్థానికులవలె మెజారిటీ ప్రజల అభివృద్ధి ఆగిపోయిందనే విషయం మరుగుపరిచారు. వారు ఆధునిక ప్రపంచంలోని సంపన్నులైన ప్రజల, వలసవాదుల పోటీకి గురైపోవాల్సిన అనివార్యత ఏర్పడింది. చరిత్ర రచనలో ఈ విషయాలు ప్రపంచ ప్రధాన చారిత్రక వాస్తవాలుగా కాకుండా పోయాయి. వీళ్ళు ఒక పద్ధతి ప్రకారం మెజారిటీ స్థాయినుండి మైనారిటీకి, సార్వత్రిక స్థాయి నించి పర్టిక్యులారిటీకి విలువలు మార్చబడతారు. కొద్దిమంది సంపన్న, అభివృద్ధి చెందిన ప్రజలు, వారి అవసరాలు, వారి తాలూకు సామాజిక మార్పులు ప్రజల అభివృద్ధిగా ప్రదర్శించ బడతాయి.

ఒకాయనని ఎవరికి ఓటు వేశావు అని అడిగితే గెలిచినాయనకు వేశాను అని అన్నాడట. అంతేగానీ ఆయన ఎవరికి ఓటు వేశాడో చెప్పడు. గట్టిగా అడిగితే ఎన్నికల ఫలితాలు వచ్చాక చెప్తానంటాడు. సర్వయివల్ ఆఫ్ ది ఫిట్టెస్ట్ అనే డార్విన్ థియరీ ఇలాంటిదే. దీన్నే అంతర్జాతీయ మార్క్సిస్ట్ చారిత్రక భౌతికవాదం తన మూల సిద్ధాంతంలో ఒకటిగా భావించింది. బ్రాహ్మణవాదులు, వర్ణవాదులు కూడా డార్విన్ థియరీ రాకముందే వేల ఏళ్లుగా ఇదే పని చేస్తున్నారు. వాళ్లు ఎవరికి ఓటు వేశారో చెప్పరు. ఎవరు గెలుస్తారో చెప్పరు. గెలిచిన తర్వాత నేను ఓటు వేసింది మీకే అంటారు. అలా గెలిచినవారినల్లా క్షత్రియులు అని ఇంద్ర వంశమని, చంద్ర వంశమని, సూర్య వంశమని, వంశ వృక్షాలు రాసి కలం పేర్ల లాగా వారికి కొత్త పేర్లు పెట్టి ఆదివాసీ గిరిజన తెగల జాతుల కులాల నుండి ఎదిగి రాజులయ్యారని, బ్రాహ్మణులు అయ్యారని, వైశ్యులయ్యారని తెలియకుండా వారి మూలాలకు సంబంధం లేకుండా చుట్టూ కోటరీగా ఏర్పడి ఇతరులను దరి జేరకుండా చేస్తారు. అందుకు అపార్థాలను సృష్టించి దూరం చేస్తారు. ప్రశంసించి రాజులకు దగ్గర అవుతారు.

వామపక్ష చరిత్రకారులు కూడా బ్రాహ్మణవాదులలాగే సంపద సృష్టించి సమాజ నిర్మాణానికి మహోన్నతంగా పాటుపడిన శూద్రులను ఉత్పత్తి కులాలను, దళితులను, ద్రావిడులను, నాగులను పేదలు, అమాయకులు, అజ్ఞానులు, నిరక్షరాస్యులు అన్నట్టుగా చిత్రించి వారిలో ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్ ఎక్కించారు. బ్రాహ్మణవాదులు వీరిని పుట్టుకతోనే హీనులని ప్రచారం చేసారు. వారి సిద్ధాంతం ప్రకారం చూస్తే రాజులు, వైశ్యులు, బ్రాహ్మణులే గత జన్మల్లో దుర్మార్గాలు చేయడంవల్ల ఈ జన్మలో సూద్రులుగా,



అంటరానివారిగా పుట్టారు. కాని ఈ విషయాన్ని బ్రాహ్మణవాదులు సూద్రులంతా పూర్వజన్మల్లో ద్విజ కులాలవారే అని వైదిక పురాణ సాహిత్యంలో ఎక్కడ ప్రచారం చేయలేకపోయారు. ఇండియా ఉప్పు తిని బతికిన ముస్లిం, యూరప్ దేశాల వాళ్లు ఇండియాను, ఇండియాలోని ప్రజలను, ప్రజల సైన్సును, టెక్నాలజీని, కళలను, సాహిత్యాన్ని పేదవి అని, వెనుకబడిపోయినవి అని అనడం తల్లిపాలు తాగినవాళ్లు మాట్లాడవలసిన మాటలు కావని చరిత్రకారుల అభిప్రాయం.

బ్రాహ్మణవాదులు, హిందూ మతవాదులు ప్రలోభాలకు లొంగి సూద్రులు, దళితులు, ఆదివాసీలు ఇస్లాంలోకి పోతున్నారని, క్రైస్తవం తీసుకుంటున్నారని ప్రచారం చేస్తున్నారు. ఇవి హిందూ మత వాదుల వైఫల్యాన్ని తెలియజేస్తున్నదని చరిత్రకారులు రాయడంలేదేమని కొందరు చరిత్రకారులు ప్రశ్నిస్తున్నారు. ఇస్లాం నుంచి, క్రైస్తవం నుంచి లక్షలాదిమంది హిందూ మతంలోకి ఆకర్షించబడి మతం మార్చుకుంటున్నారని వార్తలు ప్రచారం పెరిగినప్పుడే హిందూ మత వాదులు తమ సామర్థ్యాన్ని ఆకర్షణ శక్తిని పెంచుకున్న వారౌతారు. ఒకనాడు ఆసియా, యూరప్, ఆఫ్రికా ఖండాల్లో 50 దేశాలకు విస్తరించిన హిందూమతం క్రీ.శ. 2007 నాటికి ఒకటి రెండు దేశాలకు కుదించుకుపోయింది.

చరిత్ర రచనలో ఆర్య సిద్ధాంతం పేరిట ఆధిక్యత కొనసాగిస్తూ ముందుకు సాగిన కుట్ర అకస్మాత్తుగా జరిగింది కాదు. యాదృచ్ఛికం కాదు. బ్రాహ్మణ వాదుల, వర్ణవాదుల ఆధిక్యత నిలబెట్టడం కోసం అన్ని రంగాల్లో ఇతరులను వెనక్కి నెట్టడం కోసం, అణచివేయడం కోసం ఆర్య సిద్ధాంతం ఇంతకాలం దాకా ఉపయోగించుకున్నారు. ఆర్య సిద్ధాంతంతో ఏ అణచివేత కొనసాగించారో అదే కొనసాగించడానికి ఇప్పుడు హిందూ వాద సిద్ధాంతాన్ని ఉపయోగిస్తున్నారు. అందువల్ల ఇక నుండైనా వారి నుండి విడివడి స్వతంత్రంగా ఆలోచిస్తూ పరిశీలిస్తూ శూద్రులు, దళితులు, నాగులు, స్థానిక జాతులు, కులాలు, ఆదివాసీలు తమ చరిత్రను తామే రికార్డు చేసుకోవాలి. అందుకు పురావస్తు, సాహిత్య, సామాజిక, సాంస్కృతిక ఆధారాలను తమ జీవితాల నుండి, అనుభవాల నుండి సేకరించుకోవాలి. చరిత్ర రచనలో ఆధారాలు కూడా, సాక్ష్యాలు కూడా లేకుండా చేయబడిన తమ చరిత్రను సజీవ సాక్ష్యాలతో స్వయంగా పునర్నిర్మించుకోవాలి. భారతీయ సంస్కృతి ప్రపంచ నాగరికతల్లో, సంస్కృతిలో ప్రాచీనమైనవాటిల్లో ఒకటి. అయితే బ్రాహ్మణవాదులు, వర్ణవాదులు, హిందూ మత తత్వవాదులు, ఆర్యవాదులు ప్రచారం చేస్తున్నట్టుగా అది వాళ్లకి సంబంధించినది కాదు. అది దక్షిణ ఇండియా నుండి శూద్రులు, నాగులు ద్రావిడులు, తెలుగువారు ప్రపంచమంతటా విస్తరించిన సంస్కృతి నాగరికతలకు సంబంధించినది.

**వైదిక ప్రాచీన రికార్డులు బ్రాహ్మణుల సృష్టి కాదు**

సింధు నాగరికత తరువాత వెలువడిన వేదాలు భారతీయ ఉపఖండ ప్రాచీన రికార్డులు. సంచార పశుపోషక, యాదవ, శూద్ర స్థాయి ప్రజలు వాటిని రచించారు. అవి ఆదివాసి తెగలవి. వాటిని వర్ణ వ్యవస్థ స్థిరపడే క్రమంలో బ్రాహ్మణులు ఎత్తుకెళ్ళారు. తమవిగా హక్కుభుక్తం చేసుకున్నారు. ఇతరులు చదవకూడదు, వినకూడదు అని ఆంక్షలు పెట్టి వ్యక్తిగత ఆస్తిగా మార్చుకున్నారు. అలా ఆర్యులవని చెప్పబడుతున్న వైదిక రికార్డులు కొన్ని ప్రాచీన కాలం నుండి కొనసాగుతున్నాయి. అందులో వేదాలు మొదటివి. వేదాలు ఆర్యులు జానపదులుగా పశువుల కాపర్లుగా అనగా నేటి యాదవులు, మున్నూరుకాపు వారి లాగా అటవీ ప్రాంతాల్లో, పల్లెల్లో సంచార జీవితం జీవిస్తూ పశువులను మేపుకుంటూ పాడుకున్న గేయాలని ప్రచారం వుంది. అవి తొలుత ఆర్యులు అనే వాళ్లు రాసారు లేదా పాడుకున్నారు. ఎవరైనా తాను తెలుసుకున్నది, తాను సృజించింది, ఊహించినది ఇతరులకు తెలపాలనుకోవడం, పంచాలనుకోవడం మానవ సహజ గుణం. ఇతరుల నుండి తీసుకున్నదైతే ముఖ్యంగా దొంగిలిస్తే దాచుకుంటారు. ఇతరులకు చెప్పరు. అందనీయరు. వైదిక, బ్రాహ్మణవాద సాహిత్యం, ఆయుర్వేదం కొంత కాలం తరువాత దాన్ని సృష్టించిన ప్రజల నుండి కొందరు కైవసం చేసుకొని ఇతరులకు అందకుండా చేయడం వల్ల రహస్యం చేయబడ్డాయి. ఇతరులకు అందించడానికి నిరాకరించారు. ఇవి స్వయంగా వాళ్ళు సృష్టించినవైతే తప్పకుండా ఇతరులకు చెప్పాలని ఆ జ్ఞానం పంచాలని అనుకొని ఉండేవాళ్ళు. అందువల్ల బ్రాహ్మణీయ శక్తులు వేదాలను, పురాణాలను స్వయంగా సృష్టించలేదు. ఇతరుల నుండి కైవసం చేసుకున్నవి. బౌద్ధపూర్వ, బౌద్ధ కాలీన, చార్వాకాది, బౌద్ధ, జైన, సాహిత్యాల నుండి దొంగిలించడం వల్లనే బ్రాహ్మణీయ శక్తులు తమ దొంగతనం బయటపడుతుందని ఇతరులకు తెలియకుండా విధి నిషేధాలు ప్రకటించారు.

ఆర్యులనే జాతి, తెగ అంటూ ప్రపంచ చరిత్రలో లేదని కొందరు చరిత్రకారులు భావిస్తున్నారు. వేదాలు, వైదిక సాహిత్యం తొలుత ఎవరు సృష్టించారో పరిశీలించి తేల్చుకోవాల్సి ఉంది. కొందరు చరిత్రకారులు, సంస్కృత సాహిత్యాన్ని మధించినవారు వేదాల్లోని ఋక్కులు ఎవరెవరు ఎన్నెన్ని ఏవేవి రాసారో ఆధారాలు సేకరించి ప్రకటించారు. అయినప్పటికీ ఇంకా చాలా వివరాలు సేకరించవలసే ఉంది. సేకరించిన వివరాల ప్రకారం వైదిక సాహిత్యం ఆర్యులుగా, తరువాత బ్రాహ్మణులుగా తమకు తాము ప్రకటించుకున్నవారి సాహిత్యం మాత్రమే కాదని శూద్రులుగా తరువాత వారి చేత ముద్ర వేయబడిన వారెందరో రాసిన, పాడిన ఋక్కులు వైదిక సాహిత్యంలో కోకొల్లలుగా ఉన్నాయని తెలుస్తున్నది. సప్తఋషులుగా పేర్కొనబడిన లిస్టులు కాలక్రమంలో మార్చబడుతూ వచ్చాయి. పురాణాల్లో సప్తఋషులు మంత్రివర్గంలోని మంత్రుల్లా ఒకరిని తీసి మరొకరిని పెట్టినట్టు నిర్ధారణ అవుతున్నది. ఇలా వేదాలు వైదిక సాహిత్యం



ఎప్పటికప్పుడు మార్పులు చేర్పులు చేయబడుతూ వస్తున్నది. క్రీ.పూ. 2వ శతాబ్దం నుండి క్రీ.శ. 4వ శతాబ్దం మధ్య వేదాల్లో పురుష సూక్తం అనే ద్విపద చేర్చబడిందని చరిత్రకారులు, సంస్కృత పండితులు భాషా పరిణామాన్ని అనుసరించి నిర్ధారించారు. కృష్ణుడి పేరిట చలామణిలో గల భగవద్గీత రచనతో పాటే అదే కాలంలో పురుష సూక్తం కూడా రాయబడిందని చరిత్ర తెలుపుతున్నది. పురుష సూక్తంలో, భగవద్గీతలో చెప్పిన వర్ణవాద సిద్ధాంతం క్రీ.పూ. 6వ శతాబ్దం నాటి నందరాజుల రాజ్యం కన్నా ముందు పుట్టే అవకాశం చరిత్రలో లేదు.

ప్రజలు పల్లెల నుండి, అడవుల నుండి వలస వస్తూ పట్టణాలు నగరాలు, పెద్ద రాజ్యాలు రూపుదిద్దుకొని పని విభజన పెరిగే క్రమంలో వర్ణవాద సిద్ధాంతం పుట్టడం సాధ్యపడుతుంది. అంతదాకా వర్ణవాద సిద్ధాంతం పుట్టాల్సిన చారిత్రక అవసరం చరిత్రలో కనపడదు. అందువల్ల వర్ణవాద సిద్ధాంతం ఇండియాలో ప్రచారం చేయబడిన వర్గవాద తొలి సిద్ధాంతం. సంపద పంపిణీ, గౌరవాలలో అంతస్తులు, పనులలో, రక్తసంబంధాలలో విభజన అనేది నందరాజ్యం వంటి పెద్ద రాజ్యం ఏర్పడకుండా అవసరం పడదు. నందరాజులపై బ్రాహ్మణులను చేరదీయలేదన్న కోపంతో వర్ణవాద సిద్ధాంతాలను సృష్టించి ప్రచారం చేయడం ప్రారంభించారు. గుప్తుల కాలంలో వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలకు పూర్తి సమర్థనను ఇచ్చి బ్రాహ్మణులచేత మరిన్ని రచనలు చేయడానికి ప్రోత్సహించారు. అందులో భాగంగా నేడు వైదిక సాహిత్యం, వేదాంత సాహిత్యం, పురాణ సాహిత్యం పేరుతో లభ్యమౌతున్నవన్నీ రీరైటు చేసి సంకలనం చేసారు. ఇప్పుడు ప్రచారం ఉన్నవి అవే. అవి సత్యాలు కావచ్చు. కాకపోవచ్చు. అవి చరిత్ర కావచ్చు. కాకపోవచ్చు. అయినప్పటికీ వాటిప్రకారం కూడా కాస్త పరిశీలించడం అవసరం. ఏమంటే ఏదీ శూన్యం నుంచి పుట్టదు. ఎంతోకొంత సామాజిక పునాదిగానీ, నేపథ్యం గానీ కనీసం భావజాల సిద్ధాంతాలుగానీ వాటికి బీజంగా ఉండే ఉంటాయి.

పురాణాల్లో విశ్వామిత్రుడు, వసిష్టుల సంఘర్షణ వర్ణాల మధ్య ఆధిక్యత కోసం జరిగినదని అర్థం చేసుకోవాలి. విశ్వామిత్రుడు క్షత్రియుల ఆధిపత్యాన్ని నిలపటానికి బ్రాహ్మలకు వ్యతిరేకంగా పోరాటం చేశాడు. పరశురాముడు క్షత్రియుల ఆధిపత్యాన్ని ప్రశ్నిస్తూ దేవుళ్లను సహితం తన గండ్రగొడ్డలితో నరికిపారేశాడు. ఈ కథల సారాంశం ఏమిటి? ద్విజకులాల మధ్య జరిగిన ఆధిపత్యపోరు, వర్ణ వ్యవస్థలోని అసంబద్ధాలను ప్రశ్నించే ఉద్యమాలు, వర్ణవ్యవస్థ ప్రారంభం నుండే వున్నట్లు వైదిక సాహిత్యం స్పష్టం చేస్తున్నది.

కులం బట్టి శిక్ష, కులం ఆధారంగా వడ్డీ వంటి కుల వివక్షతకు వ్యతిరేకంగా ఆనాడు కూడా పోరాటాలు సాగాయి. చరిత్రలో బౌద్ధమతాన్ని ప్రోత్సహించి, బ్రాహ్మణ వర్ణ వివక్షను ఎదిరించిన బృహద్రథున్ని అతని బ్రాహ్మణ సేనాని పుశ్యమిత్రుడు కుట్రతో

క్రీ.పూ. 185 సంవత్సరంలో హతమార్చి మళ్లీ హిందూ ధర్మాన్ని పునరుద్ధరించాడు. అశ్వమేధ యాగాన్ని నిర్వహించి బ్రాహ్మణీయ హిందూ సామ్రాజ్య వాదాన్ని నెలకొల్పి ఈ దేశంలో మళ్లీ కులం ఉనికిని చాలా గట్టిగా నెలకొల్పడానికి కావలసిన పునాదులు వేశాడు.

దక్షిణాదిన ఈ కుల వ్యవస్థను వ్యతిరేకించే ధోరణులు మత వేదికమీదే ప్రారంభమయ్యాయి. మధ్యయుగాల్లో వైష్ణవ, శైవ, భక్తి ఉద్యమాలు. మత సంస్కరణ ఉద్యమాలు వచ్చాయి. ఇందులో ముఖ్యమైనవి భక్తి ఉద్యమాలు. ఇవి బ్రాహ్మణ పాండిత్యాన్ని, అధికారాన్ని ప్రశ్నించాయి. 63 శైవ నయనారులు, 12 మంది వైష్ణవ ఆళ్వారులతో అభివృద్ధి చెందింది. ఈ ఉద్యమంలో పాల్గొన్న వారంతా వ్యవసాయం మీద ఆధారపడ్డ వెల్లల (కాపు) కులంవారు, వృత్తికులాలైన గౌడులు, చాకల్లు, మంగళ్లు, కుమ్మరులు, కమ్మరులు. వీళ్ళు బ్రాహ్మణ ఆధిక్యతను ప్రశ్నించారు. తరువాత కాలంలో ఆ ఉద్యమం ఉత్తర హిందూస్తాన్‌లో కబీర్, నానక్ వంటి సంస్కర్తల ద్వారా అంటరాని కులాల్లో కూడా ప్రవేశించింది. ఈ ఉద్యమంతో శూద్ర కులాలు సంఘటితమయ్యాయి.

దక్షిణ భారతదేశంలో శూద్ర కులాల వాళ్ళు తమ కులాల్ని సంఘటితపరచి రాచరిక వ్యవస్థలను స్థాపించారు. కృష్ణదేవరాయలు, శివాజీ, రెడ్డిరాజులు నాయకరాజులు, వెలమ రాజులు, కమ్మ ప్రభువుల వంటివారు అధికారాన్ని హస్తగతం చేసుకొని పరిపాలించారు. 12వ శతాబ్దం వరకు తక్కువ కులంగా చూడబడ్డ ఉత్తర హిందూస్థానంలోని 'కాయస్థులు' కులపరంగా సంఘటితపడి ముస్లిం, బ్రిటిష్ పరిపాలకులకు సేవలందించి ద్విజులస్థానాన్ని సంపాదించుకున్నారు. ఇది ఏ ఒక్క కుటుంబమో కాకుండా కులం మొత్తం కదలడం వల్ల సాధ్యపడింది. అలాగే శూద్రులైన మహారాష్ట్ర గైక్వాడ్‌లు సంఘంగా ఏర్పడి క్షత్రియులుగా నమోదు చేసుకున్నారు. కొన్ని ప్రాంతాల్లో గోండ్‌లు, కూర్గులు తమ శౌర్య ప్రతాపాలను చూపించి క్షత్రియ హోదాను సంపాదించుకున్నారు. ఈ శతాబ్దంలో ఉత్తరప్రదేశ్‌లోని 'సోనియా' అనబడే శూద్రకులం కాంట్రాక్టర్లుగా మారి కొద్దికాలంలోనే క్షత్రియులుగా నమోదు కాబడ్డారు. ఇలా చాలా కులాలు సామాజికంగా ముందుకు పోవటానికి తమ సాంఘిక అంతస్తుకు వృద్ధి చేసుకోవడానికి కుల సంఘాలను ఉపయోగించుకున్నారు.

ఆర్యుల తొలి నివాసం గురించి పండితుల, చరిత్రకారుల మధ్య భిన్నాభిప్రాయాలున్నాయి. బాలగంగాధర్ తిలక్ ఆర్యులు ఉత్తర ధృవం నుండి చైనా, టిబెట్, మానస సరోవరం కాశ్మీరు మీదుగా వచ్చారని ఊహించారు. పురాణాల్లోని శివుని మానస సరోవరం, పార్వతి పర్వతరాజ పుత్రి (అనగా గిరిజన రాజపుత్రిక) అనే అంశాలను బట్టి అలా ఊహించి వుంటారు. ఇలాంటి ఎన్నో ఊహలు చేశారు. అలా ఊహలు చేసినవారే నేడు ఆర్యులు విదేశీయులు కాదని ఇతర ప్రాంతాలనుంచి



వలసరాలేదని, ఇక్కడి స్థానికులే అని చెప్పడానికి నానా కష్టాలు పడుతున్నారు. ఆ కాలంలో సరిహద్దుల ఎల్లలు లేవు. ఏది ఏ ప్రాంతమో కూడా తెలియదు. అంతా చీకట్లో తడుములాట. ఇప్పటికీ పల్లెటూరివారు ముఖ్యంగా పల్లెటూరి స్త్రీలు నగరాలకు వచ్చినప్పుడు కనీసం ఆటో ఎక్కి, బస్సు ఎక్కి మరోచోటికి పోలేరు. చాలామందికి నగరాల్లో అంతా అయోమయంగా కనపడుతుంది. అన్నీ వీధులు ఒకేలాగ కనబడతాయి. ఆ కాలంలో ఎటుచూసినా దట్టమైన అరణ్యాలు, క్రూరజంతువులు, దారులు కూడా ఉండేవి కావు. ఇప్పటికీ ఇండియాలోని అడవుల్లో దారులు ఉండవు. మధ్యప్రదేశ్ చంబల్ లోయలో దొంగలు, కర్నాటక, తమిళనాడు సరిహద్దు అడవుల్లో వీరప్పన్ దశాబ్దాల తరబడి దొరక్కుండా స్వేచ్ఛగా తిరిగారు. ఇన్ని రవాణా సౌకర్యాలు, రోడ్లు, రైళ్లు ఏర్పడినప్పటికీ ఇప్పటికీ కొందరు మావోయిస్టులు, నక్సలైట్లు దట్టమైన అడవుల్లో ఎవరికీ దొరక్కుండా తిరగగలుగుతున్నారు. ఇక వేల ఏళ్ల క్రితం అడవులు, క్రూరజంతువులు, ప్రజలు ఎలా ఎటుపడితే అటు ఎలా సంచరించారో ఊహించుకోవచ్చు. నగరాల్లో అడ్రసులు వెతుకబోయి దారితప్పిపోయిన అనుభవాలు చాలామందికి కలిగేవుంటాయి. ఇప్పుడే ఇలా వుంటే ఆ కాలంలో అడవుల్లో ఎలా వుండేదో ఊహించుకోవచ్చు.

ఆర్యులు భారతదేశానికి విదేశీయులని ఒకప్పుడు ప్రపంచ చరిత్రకారుల ఏకాభిప్రాయం. నిజానికి ఈ మాటకు అర్థం లేదు. ఆ రోజు దేశాల సరిహద్దులే లేవు. వీసాలు లేవు. పాస్‌పోర్ట్‌లు లేవు. రాజ్యాలకు సరిహద్దులు లేవు. అసలు రాజ్యాలే రూపొందని ప్రాంతాలే హెచ్చు. ఇలాంటి దశలో ఆర్యులను విదేశీయులు అని పిలవడం ఆనాటి ప్రజలు ప్యాంటు, షర్టు వేసుకుని వీసాల మీద దేశాలు తిరిగారని చెప్పినట్టుగా వుంటుంది. గత 200 సంవత్సరాల్లో పల్లెల నుండి సంచార జీవులుగా, వలసలుగా వృత్తి వెతుక్కుంటూ, జీవిత భాగస్వాములను వెతుక్కుంటూ ఇల్లరికం వెళ్తూ ఎక్కడెక్కడికో వెళ్లినవాళ్లు చాలామందే వుంటారు. ఒకే ఇంటి పేరు గల వాళ్లు, ఒకే వూరు పేరును ఇంటిపేరుగా గలవాళ్లు ఎన్నో ప్రాంతాల్లో ప్రపంచమంతటా కనపడతారు. కనీసం ఐదారు తరాల పూర్వీకుల గురించి నూటికి 90 మందికి తెలియనే తెలియదు. వారి పూర్వీకులు ఎక్కడివారో కూడా తెలియదు. ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తరువాత వేలాది మంది ఇతర ప్రాంతాలనుంచి వచ్చి స్థిరపడ్డారు. స్థానికులుగా నమోదయ్యారు. శాసనసభ్యులుగా గెలిచారు. అలాంటప్పుడు శతాబ్దాలనాటి వలసల గురించి వారు విదేశీయులని అనడం అర్థంలేని విషయం. ద్వేషాన్ని ప్రచారం చేసి మౌలిక సమస్యలను పక్కదారి పట్టించడానికి రాజకీయ నాయకులు, చరిత్రకారులు దీనికి అనవసరమైన ప్రాధాన్యతను ఇస్తున్నారు. అంబేద్కర్ ఈ విషయంలో ఆర్యులు విదేశీయులు అనే వాదాన్ని వ్యతిరేకించారు. ఆర్యులుగాని, ముస్లింలు గాని, పల్లవులు గాని, రాజపుత్రులు

గాని ఇతర దేశాల నుండి వలస వచ్చి స్థిరపడ్డారు అనే చర్చ వల్ల ప్రస్తుతం ద్వేషాన్ని పెంచడానికి తప్ప మరెందుకూ ఉపయోగపడదు.

బ్రాహ్మణవాదుల్లోని ఇంటిపేర్లు, గోత్రాల పేర్లు, పండగలు, సంస్కృతి లోతుగా గమనిస్తే బ్రాహ్మణులు ఒక కులం కాదని అన్ని ఆదివాసి, గిరిజన సూద్ర తెగలనుండి, జాతులనుండి, వారి నాయకుల నుండి బ్రాహ్మణులుగా రూపొందుతూ వచ్చారని వర్ణ వ్యవస్థ అనేది ఒక సిద్ధాంతంగా తీసుకుని అలా రూపొందించు కున్నారని స్పష్టమవుతున్నది. అందుకే ఆ కాలంలో జన్మనా జాయతే సూద్ర అని చెప్పారు. అంటే పుట్టుకతో ఎవరైనా సూద్రులే. జ్ఞానంతో బ్రాహ్మణులౌతారు అంటూ వందలాది గిరిజన తెగల నాయకులను, సూద్రులను బ్రాహ్మణులలో కలిపేసుకున్నారు. తమకు తామే బ్రాహ్మణులుగా ప్రకటించుకున్నారు. అందువల్లే బ్రాహ్మణులు ఏ ప్రాంతంలోని ప్రజలు ఎలా వుంటారో ఆ ప్రాంతంలోని బ్రాహ్మలు కూడా అలాగే ముక్కు చెవులు తల ఆకారాలు రంగులు ఎత్తుచిత్తులు కలిగివున్నారు. ఉత్తరాది సూద్రులు, దళితులు, ఆదివాసీలు కూడా ఆర్యులని ఆపాదిస్తున్న బ్రాహ్మణవాదులలాగే తెలుపుగానే వుంటారు. ఎవరైనా ఆర్యుల్లో కాస్త మిగిలివుంటే వాళ్లు ఆఫ్ఘనిస్తాన్‌లోని బౌద్ధం వదిలి తిరిగి గిరిజన జీవితానికి వెళ్లి మళ్లీ ఇస్లాం తీసుకున్న ఆదివాసీ తెగలలో కొంత వుండవచ్చు. బంజారాలు అని పిలిచే లంబాడీలు ఆర్యులని కొందరు భావిస్తుంటారు. అది సరికాదు. బంజారాలు, రాజపుత్రులు కూడా అరబ్బు దేశాలనుండి వలస వచ్చినవారే అని చరిత్రకారుల అభిప్రాయం. 7వ శతాబ్దం నుండి వలస వచ్చి రాజ్యాలేలిన ముస్లింలు, గుజరాత్, రాజస్థాన్, ఉజ్జయిని ప్రాంతాలలోని రాజపుత్రులు కూడా ఒకే కుదురు నుండి పుట్టి ఒకే ప్రాంతం నుండి బతుకు వెతుక్కుంటూ సంచార జీవితంతో, దండయాత్రలతో ఇండియా ఉపఖండం ప్రాంతంలోకి ప్రవేశించారని చాలామంది చరిత్రకారుల అభిప్రాయం. ఇరాన్‌లోని పహ్లవీ రాజుకు మధ్యభారతంలోని పల్లవ రాజులుగా లెక్కించబడిన రాజులకు మధ్య ఒకే కుదురు సంబంధముందని కొందరు ఊహిస్తున్నారు. ఇలాంటి ఊహలన్నీ ప్రేంచంద్ చెప్పినట్టు చక్కని కథా రచయితలుగా సుప్రసిద్ధులు కావడానికి పనికిరావచ్చు కాని చరిత్రకారులుగా చరిత్రగా పనికిరాకపోవచ్చు.

క్రీ.శ. 1786లో ప్రసిద్ధ ఆంగ్ల చారిత్రక పరిశోధకుడైన సర్ విలియమ్ జోన్స్ ద్వారా గ్రీక్, లాటిన్, సంస్కృత, పారశీక, జర్మన్, ఇంగ్లీష్, లిథూనియన్ భాషలన్నిటికీ మూలమొకటేనని తెలిసిరావడం, భారతదేశ అత్యంత ప్రాచీన నాగరికతైన సింధు నాగరకతకు ముఖ్యమైన తేడాలుండడం అనార్య జాతులైన దాసదశ్యుల నిర్మూలనకై రుగ్వేదంలో ఆర్యులు చేసిన దేవతా ప్రార్థనలు, పశ్చిమాసియాలోని బోగజ్‌కోయ్ వద్ద క్రీ.పూ. 1400 నాటి శాసనాల్లో ఆర్య దేవతలైన ఇంద్ర, వరుణ, మిత్ర, అగ్ని, అశ్వనీ దేవతలు పేర్కొనబడటం, ఇదే ప్రాంతంలో రథభోదనం గురించి ఇండో-పారశీక



భాషలో రచించబడ్డ గ్రంథం లభ్యం కావడం, కాలానికి చెంది, ఈజిప్ట్‌లోని ఎల్.అమర్న అను ప్రదేశం వద్ద లభ్యమైన మృణ్మయ ఫలకాలపై, ఇండో-పారశీక పేర్లున్న రాజవంశాలు పేర్కోటం, మొదలైనవన్నీ దీన్ని బలపర్చుతున్నాయి.

ఆర్యుల జన్మస్థలమేదనే విషయంలో బాలగంగాధర తిలక్, రోడ్స్ లాసెన్, మాక్స్‌ముల్లర్, కిత్ పండితులు భిన్నాభిప్రాయాలను వ్యక్తం చేశారు. ఆర్కిటిక్ తీరం, పర్షియా, పామీక్, మెసపొటేమియాలను ఆర్య తొలి నివాసాలుగా, వేర్వేరుగా ప్రతిపాదించారు. ఐరోపావాదుల్లో కూడా, జర్మనీ అని, స్కాండినేవియా అని, బాల్టిక్ తీరమని, రష్యా అని విభిన్న అభిప్రాయాలున్నాయి. అయితే, ఈ సిద్ధాంతాలన్నీ కూడా ఇండో-ఐరోపీయుల వలస హేతువులను, పద్ధతులను సమగ్రంగా విశ్లేషించి, వివరణ చెయ్యలేదు. ఇటీవల గైల్స్, బ్రాన్‌డెన్‌స్టీన్ పండితులు, ఇండో-ఐరోపీయ భాషల్లో సమానాలైన శబ్దాలను పరిశీలించి, ఆర్యులు తొలుత హంగేరీ మైదానంలో నివసించి, తదుపరి ప్రపంచంలోని వేర్వేరు భాగాలకు వ్యాపించి ఉంటారని నిర్ణయించారు. ప్రస్తుతమీ సిద్ధాంతం బహుళ జనామోదాన్ని పొందింది.

షోడశ మహాజనపదాలంటే 16 రాజ్యాలు. ప్రజలే పాలకులను ఎన్నుకున్న ప్రాంతాలను మహాజనపదాలని పిలిచేవారు. అశ్మిక,(అస్సగ) పోదన (బోధన్ రాజధానిగా గల నిజామాబాద్ ఆంధ్ర ప్రాంతం) రాజ్యం. 15 మహాజనపదాలు వింధ్య పర్వతాలకు ఉత్తరంగా భారతావనివి పేర్కొన్నారు. వారికి ఇతర ప్రాంతాలతో సంబంధం, రవాణా సౌకర్యాలు తక్కువ అని ఇది తెలుపుతున్నది. దక్కన్ పీఠభూమిలో ఇంకా ఎన్నో మహాజనపదాలు, జనపదాలు, తెగలు బుద్ధుని కన్నా పూర్వం నుండి కొనసాగుతున్నాయి. ప్రపంచంలోనే భారతదేశం అద్భుతమైన నైసర్గిక, శీతోష్ణ స్థితి కలిగి వుంది. అందులో దక్కన్ పీఠభూమి మరింత ఉత్కృష్టమైన జీవావరణాన్ని, ప్రకృతి సంపదను, జంతు సంపదను, నీటి వనరులను కలిగి ఉంది. గత 300 సంవత్సరాలుగా ఆర్య జాతి సిద్ధాంతాన్ని దాని సంచార జీవితాన్ని, దాని ఆధిక్యతను యూరోపియన్‌లు, వారి తోకపట్టుకుని నడిచిన ఇతర చరిత్రకారులు ఆర్యజాతి సిద్ధాంతాన్ని తలకెత్తుకున్నారు. కొందరు ఆర్యులను, బ్రాహ్మణవాదాన్ని, వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాలను, నిర్మాణాలను వ్యతిరేకించే రూపంలో కూడా ఆర్యజాతి సిద్ధాంతానికి ఎనలేని ప్రాధాన్యతనిచ్చారు.

**అందువల్ల ఇరుపక్షాలు ఒకటే కోరుకోవడంవల్ల ఆర్యులు విదేశీయులు అనే విషయం ఇలా సర్వత్రా అంగీకరించారు. ఆర్యులు విదేశీయులైనా, స్వదేశీయులైనా ఆధునిక సామాజిక జీవితంలో వచ్చే మార్పులేమీ లేవు. ఇప్పటి అర్థంలో దేశాల, ప్రాంతాల విభజన, ద్వేషభావాల రీత్యా అర్థం చేసుకోకూడదు. పైగా ఆర్యులంటూ భారతదేశంలో ప్రస్తుతం ఎవరూ మిగిలిలేని కాలంలో ఆర్యుల సిద్ధాంతాలను, సంస్కృతిని స్వీకరించిన వారిపై ద్వేషం వెలిబుచ్చడం నేటి బ్రాహ్మణవాదులకు లేని ఆధిక్యతను ఆపాదించడమే.**

# సంపద సృష్టిక్రమ పరిణామ చరిత్ర

చెట్లు స్వయంపోషకాలు. మనుషులు, జంతువులు, పక్షులు, క్రిమికీటకాలు పరాన్న జీవులు. ఆది మానవులు ప్రకృతి నుండి ఆహారం సేకరించుకున్నారు. ఇప్పటికీ మానవులు ప్రకృతి వనరులపైనే ఆధారపడి సంపదలను సృష్టిస్తున్నారు. సంపద అంటే తొలినాటి అర్థం సేకరించిన ఆహారం, తోళ్ళు మొదలైనవి నిలువ చేసుకోవడం. నిలువ చేసుకోగలిగేది సంపద అని చెప్పవచ్చు. అర్థశాస్త్రం అనే పదబంధం చాలా తర్వాతి కాలానికి చెందిన మానవుల ఆర్థిక విశేషాలను తెలుపుతుంది. ముఖ్యంగా మారకం, నాణేల చలామణి ప్రారంభమైన కాలం నుండి అర్థ శాస్త్రంగా క్రోడీకరించారు. ఆహార సేకరణ, సొంతంగా తయారు చేసుకుని సొంతానికి వాడుకోవడాన్ని అర్థ శాస్త్రం తన పరిధిలోకి తీసుకోలేక పోతున్నది.

మానవుల జీవన కార్యకలాపాలు, ఆ క్రమంలో సృష్టించే సంపద, కళలు, ఆలోచనలు అన్నీ సంపద సృష్టి క్రమంలో తొలినాటి కార్యకలాపాలు. తొలి కాలంలో భాష ఉండేది కాదు. హావభావాలు, బాడీ లాంగ్వేజ్ భాషగా ఉండేది. ధ్వని వైవిధ్యాన్ని మానవులు ప్రకృతి అనుకరణతో నిరంతరం సాధన చేసి పదాలను, పదాల ద్వారా భావాలను తెలిపే సామర్థ్యాన్ని సాధించుకున్నారు. ఆ క్రమంలో భాషలు రూపొందించుకున్నారు. ఆలోచనలను తోటి వారికి, ఎదుటివారికి అందించడంలో భాష నిర్వహించిన పాత్ర మహోన్నతమైనది. నేటికీ భాష ఈ మహోన్నత కర్తవ్యానికి వాహికగా పనిచేస్తున్నది. భాషా సంపద భావజాల రంగంలో మానవులు సాధించిన మొట్టమొదటి సంపద సృష్టి క్రమం.

నాలుగు కాళ్ళ జంతువు నుండి రెండు కాళ్ళ జంతువుగా మారి ముందు కాళ్ళను చేతులుగా మార్చుకుని, చేతులను సాధనాలుగా మలుచుకుని ఆహారం, నిలువనీడ, రాతి పనిముట్లు వెతుక్కుంటూ గుంపు జీవనం సాధన చేశారు. దీనికి ప్రధానంగా తల్లులు నాయకత్వం అందించారు. దాన్నే తల్లి వ్యవస్థ అని, మాతృ వ్యవస్థ అని అంటారు. పిల్లలను ఎక్కువగా కనడం, వారి చేతుల్లో లేక పోయినప్పటికీ పిల్లల్ని కనడం మానవాళి తొలి సంపదగా భావించబడింది. ఇప్పటికీ తల్లిదండ్రులు, సమాజం పిల్లలను అమూల్య సంపదగా భావిస్తారు. పిల్లలు మానవాళి సంపద సృష్టిక్రమంలో



మొదటి సంపద. జీవన వ్యాపారంలో ఆహారం, తోళ్ళు, గుహలు, రాతిపనిముట్లు, కాళ్ళూ చేతులు మానవాళి సంపద సృష్టిక్రమంలో రెండవ సంపద. మెదడు, మనస్సు, భాష, ఆలోచనలు మానవాళి సంపద సృష్టిక్రమంలో మూడవ సంపద. సమిష్ఠి జీవితంలో ఉండే సంఘటిత శక్తి, ఉత్సాహం, ధైర్యం, రక్షణ, అనుకరణ శక్తి, సంస్కృతి మానవాళి సంపద సృష్టిక్రమంలో నాలుగవ సంపద. నిలువ చేసుకోవడం, తర్వాతి తరాలకు అందించడం, ఉన్నదాన్ని పెంచడం, విస్తరించడం సంపద సృష్టిక్రమంలో ఐదవది.

ఆలోచనలను నిలువ చేసుకోవడం జ్ఞానంగా భావించబడింది. ఆలోచనలను ఇతరులకు చేరవేయడం సమాచారంగా భావించబడింది. భావాలను చేరవేసే ధ్వనులు భాషగా నిర్వచించబడింది. ళయాత్మక కదలికలను నృత్యంగా, నాట్యంగా, లయాత్మక ధ్వనులను పాటగా, సంగీతంగా నిర్వచించడం జరిగింది. పనిముట్లను తయారుచేయడం, వేట, వంట, ఆహార సేకరణలో నైపుణ్యం, వ్యవసాయంలో నైపుణ్యం, గుహలు, ఇళ్ళు వెతుక్కోవడం, కట్టుకోవడంలో నైపుణ్యం తొలుత కళలుగా ప్రాచుర్యం పొంది తరాలు గడచిన కొద్దీ శాస్త్రాలుగా రూపొందాయి. ఈ శాస్త్ర విజ్ఞానమంతా మానవుల సంపద సృష్టిక్రమంలో ఆరవది.

మానవుల సంపద సృష్టిక్రమంలోని ఆరవదైన సంపద నుండి కొంత భాగాన్ని అర్థశాస్త్రం తన పరిధిలోకి తీసుకున్నది. అందువల్ల అర్థశాస్త్రం అనే పేరు మానవాళి మొత్తం సంపద సృష్టిక్రమాన్ని, వాటి పరిణామాలను, చరిత్రను తెలుపదు. చరిత్రలో ఆర్థిక పరిణామాలు చరిత్ర అని చర్చించడం అసమగ్రతకు, తప్పుడు అవగాహనకు దారితీస్తుంది. అందువల్ల చరిత్రలో సంపద సృష్టిక్రమం, వాటి పరిణామాల చరిత్ర అనే విస్తృత అర్థంలో చర్చించడం, విశ్లేషించడం అవసరం.

చరిత్ర రచనలో సంపద సృష్టి క్రమం, వాటి పరిణామాల విశ్లేషణ ఒక తంతుగా భావిస్తూ రాస్తున్న చరిత్రకారులు ఉన్నారు. రాజ్యాల, రాజుల చరిత్రను ప్రధానంచేసి రాసే క్రమంలో ఒక చిన్న అంశంగా, అనుబంధ అంశంగా మార్చి, కుదించి రాయడం చాలా మంది చరిత్రకారులకు అలవాటైంది. ఇది ఆధిపత్య వర్గాల, శ్రేణుల, ఆధిపత్య కులాల, ప్రాంతాల, రాజ్యాల ఆధిపత్యాన్ని, గెలుపు ఓటములకు అనువుగా సామాజిక చరిత్రను, ప్రజల చరిత్రను కుదించడం అవుతుంది. ఇలాంటి దృక్పథాలన్నీ సంపద సృష్టికర్తల ప్రాధాన్యతను వదలివేసి, ఆ సంపదను తరలించుకుని, దోపిడి చేసి, పరాయీకరించి, వాటిపై ఆధిపత్యం చెలాయించి, వాటిని వ్యవస్థలుగా, సంస్థలుగా, నిర్మాణాలుగా, విధానాలుగా మార్చి, స్థిరీకరించి తన ఆధిపత్యంలోకి తెచ్చుకుని వాటిని నిర్దేశించే, అణచివేసే, ప్రోత్సహించే ఆధిపత్య వర్గాల, దోపిడీ వర్గాల దృక్పథాల కనువుగా

చరిత్రను రాస్తుంటాయి. ఇలాంటి చరిత్రలో సంపద సృష్టి కర్తల ప్రాధాన్యత ఉండకపోగా వారిని కార్మికులుగా, వృత్తి పనివారుగా, మోటు కష్టం చేసేవారుగా మార్చి చూపబడుతుంటారు. ఇలాంటి వారి చరిత్ర రచనల్లో చరిత్ర అనే ఇంటిలో స్థానం ఇవ్వకుండా ఇంటి ముందటి వాకిట్లోనో, ఇంటి వెనుక పెరటి మొక్కలాగానో సృష్టికర్తల సంపదను, సంపద సృష్టి క్రమానికి స్థానం కల్పిస్తారు. ఆశ్చర్యకరమైన వాస్తవం ఏమంటే ఈ సకల సంపదల సృష్టి క్రమంలోనే రాజ్యాలు, రాజులు, యుద్ధాలు, వాటి గెలుపు ఓటములు, విస్తరణలు, సుస్థిర రాజ్య పరిపాలనలు సాధ్యమౌతాయి. ఇలా చరిత్ర రచనలో ముఖ్య భాగం సంపద సృష్టి క్రమమే.

సంపద సృష్టి క్రమమే చాలా మేరకు చరిత్రను చరిత్ర పరిణామాలను నిర్దేశిస్తుంది. అయితే సంపద అంటే కేవలం ఆర్థిక సంపద అనే నేటి అర్థంలో కాకుండా పైన పేర్కొన్న సమస్త సంపదలు అని అర్థం. రాజులు, రాజ్యాలు ఏర్పడ్డాయంటేనే జన పదాల నుండి సంపద ఉత్పత్తి పెరిగి శూద్రుల సంపద ఉత్పత్తి క్రమం విపరీతంగా అభివృద్ధి చెందింది అని అర్థం. అనగా శూద్రుల సంపద ఉత్పత్తి విపరీతంగా అభివృద్ధి చెందకుండా రాజ్యాలు, సామ్రాజ్యాలు పుట్టడం, విస్తరించడం అసాధ్యం. చరిత్రలో శూద్రుల ఉత్పత్తి, శూద్రుల వైజ్ఞానిక జ్ఞానం, ఉత్పత్తి నైపుణ్యం గురించి పట్టించుకోలేదు. వాటిని పట్టించుకున్నప్పుడే సరియైన విధంగా చరిత్ర నిర్మాణం అవుతుంది.

అందువల్ల చరిత్ర రచనలో శూద్రుల సంపద సృష్టి క్రమం, సంపద సృష్టికర్తల చరిత్ర, వారి పరిణామాలు, వారి నైపుణ్యం, సంపద పరాయీకరణ, దోపిడీ, సమాజంలో సామాజిక గౌరవాల్లో, సామాజిక వ్యవస్థలో వారికిచ్చిన స్థానం, ప్రోత్సాహం మొదలైనవి మౌలిక అంశాలుగా చరిత్రను తిరగ రాయడం అవసరం. చాలా మంది చరిత్రకారులు భిన్నభిన్న దృక్పథాలు కలిగి ఉన్నప్పటికీ ఈ సృష్టకర్తల చారిత్రక దృక్పథాన్ని అలవర్చుకోలేకపోయారు.

సృష్టికర్తల చారిత్రక దృక్పథంతో చరిత్రను తిరగ రాసే క్రమమే భారతీయ చారిత్రక భౌతికవాదం అవుతుంది. సృష్టికర్తల చారిత్రక దృక్పథంతో తిరిగరాసే క్రమమే బ్రాహ్మణీయ, హిందూ వర్ణవాద కులవ్యవస్థ దృక్పథానికి ప్రత్యామ్నాయ దృక్పథం కూడా అవుతుంది. ప్రస్తుతం చారిత్రక భౌతికవాదం ఈ మౌలిక చరిత్ర రచనా విధానాన్ని వెనక్కినెట్టి వర్గ దృక్పథాన్ని లేదా బ్రాహ్మణీయతకు వర్గ దృక్పథం కూడా జతచేసి బ్రాహ్మణీయతకు ప్రమాదంలేని మేరకు ఆచరిస్తున్నది. వీరు చారిత్రక భౌతిక వాదం పేరుతో, వర్గ దృక్పథాన్ని ప్రవేశపెట్టి సంపద సృష్టికర్తల చరిత్రను, పరిణామాలను పట్టించుకోకుండా వీటి పరాయీకరణలో భాగంగా ఉత్పన్నమయ్యే సంఘర్షణను, వర్గాలను మాత్రమే ప్రధానం చేసి చరిత్ర రచన చేస్తుంటారు.



మరో వైపు హిందూ వర్ణవాద కులవ్యవస్థ దృక్పథం పేరుతో బ్రాహ్మణీయ ఆధిపత్యానికి చరిత్రలో వారి ప్రాధాన్యతను నెలకొల్పడానికి చరిత్ర రచనా విధానాన్ని కొనసాగిస్తున్నారు. దీన్ని స్థూలంగా ఆర్.ఎస్.ఎస్. శక్తులు, బి.జె.పి., శక్తులు మొదలైనవారు అని చెప్పవచ్చు. వీరు సంపదల సృష్టికర్తల చారిత్రక దృక్పథంతో కాకుండా ఆ దృక్పథాన్ని అణచివేస్తూ భావజాల ఆధిక్యతను తద్వారా వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాలను బ్రాహ్మణ ఆధిపత్యాన్ని స్థిరీకరించడం కోసం చరిత్ర రచన విధానాన్ని చేపట్టారు. కోట వెంకటాచలం, శ్రీరామ్ సాఠే, పి.ఎన్.ఓక్, బి.ఎన్.శాస్త్రి, సి.హెచ్. దామోదరశాస్త్రి, ముదిగొండ శివప్రసాద్, ఎం.వి.ఆర్.శాస్త్రి మొదలైనవారు ఈ కోవలోని వారే. వీరు సమస్త సంపదల సృష్టికర్తల చరిత్రను కాకుండా దాన్ని పరాయీకరించే, అనుభవించే, దోపిడీ చేసే, ప్రోత్సహించే రాజుల, మంత్రుల, బ్రాహ్మణుల చరిత్రను ప్రధానం చేసి చరిత్ర రచన చేస్తారు.

ప్రతి వందేళ్ళ చరిత్ర క్రమాన్ని తీసుకుని సంపద సృష్టికర్తల క్రమాన్ని, సంపదల సృష్టిక్రమాన్ని, వాటి పరిణామాలను, అభివృద్ధిని, పరాయీకరణను, వినియోగించుకున్న తీరును, రాజ్యాలు, రాజులు, బౌద్ధులు, వర్ణవాద కులవ్యవస్థవాదులు, బ్రాహ్మణీయ శక్తులు, గుళ్ళు, శైవ, వైష్ణవవాదులు, ఇస్లాంవాదులు, ముస్లింవాదులు, ముస్లిం పాలకులు, క్రైస్తవవాదులు, క్రైస్తవ పాలకులు వీటిని ఎలా వాడుకున్నారో, దోపిడీ చేశారో, ప్రోత్సహించారో, అభివృద్ధి పరిచారో చరిత్ర రచన చేయడం అవసరం. అప్పుడే సమాజ పరిణామ క్రమం సరియైన చరిత్ర పరిణామక్రమం వెలికి వస్తుంది. అప్పుడే సకల సంపదల సృష్టికర్తల కృషికి, నైపుణ్యానికి చరిత్రలో సరియైన స్థానం లభిస్తుంది.

పూర్వం సంపదను కేవలం ఆర్థిక సంపదగానే కాకుండా పలు రకాల సంపదలను లెక్కలోకి తీసుకున్నారు. ముఖ్యంగా అవి. 1. పిల్లలు 2. ఎడ్లు, ఆవులు, బర్రెలు, దున్నపోతులు మొదలైన పశువులు, తోళ్ళు 3. మేకలు, గొర్రెలు, కోళ్ళు, బాతులు, పందులు 4. ఏనుగులు, గుర్రాలు, గాడిదలు, కంచర గాడిదలు, ఒంటెలు. 5. ధాన్యం, గాలి, నీరు, ప్రకృతి, వాతావరణం 6. కుండలు, గుహలు, ఇళ్ళు, తోలు వస్తువులు, ఉన్ని వస్తువులు, 7. రాతి, లోహ, కర్ర పనిముట్లు, ఉత్పత్తి సాధనాలు, ఆయుధాలు, రక్షణ కవచాలు, బల్లెం, ఈటె, బాణం 8. చాలా కాలం తర్వాత బంగారం, వెండి, వజ్రాలు, ఇత్తడి, కంచు, రాగి, ఇనుము, గవ్వలు, రంగురాళ్ళు మొదలైనవి. 9. నాణేలు 10. నూలు బట్టలు, పట్టు బట్టలు, చేపల వలలు, బుట్టలు, తట్టలు, పారలు, నాగలి, నగలు, అలంకరణలు 11. భాష 12. ఆలోచనలు, విద్య, జ్ఞానం 13. సంగీతం, కళలు, ఆటపాటలు 14. సాహిత్యం 15. అధికారం, రాజ్యం, రాజ్యాధికారం, రాజాస్థానాల్లో ఉద్యోగం 16. ఇండ్లు, వ్యవసాయ భూములు, బౌద్ధ విహారాలు, గుళ్ళు, ఎడ్ల బండ్లు, రథాలు, నౌకలు, పడవలు, రవాణా సాధనాలు 17. ధర్మం, సామాజిక

విలువలు, నైతిక విలువలు, నైతిక అధికారం, 18. వర్ణాధికారం, కులాధికారం 19.శ్లోకాలు, మంత్రాలు, పూజా విధానాలు 20. దేనిలోనైనా సరే నైపుణ్యం, సామర్థ్యం, ప్రతిభ, సాధన, 21.ఆరోగ్యం. 22.సంకల్పం, పట్టుదల, ఆత్మ విశ్వాసం, ఆత్మ గౌరవం, ఉన్నతాశయాలు, సమగ్ర సామాజిక దృక్పథం, త్యాగశీలత, వినయ సంపద.

ఇటీవల సంపద సృష్టిక్రమంలో మరికొన్ని సంపదగా సృష్టించబడ్డాయి. అవి 1. పెట్టుబడి 2. శ్రమశక్తి 3. మేథోశ్రమ 4. నిర్వహణ సామర్థ్యం 5.కమ్యూనికేషన్, సామర్థ్యం, నిర్వహణ, వార్త ప్రసార నిర్వహణ, సాధనాలు, వాటి నిర్వహణ 6.యుద్ధ సామగ్రి 7. రాజకీయ అధికారం, శాసన అధికారం 8. పరిపాలనా అధికారం 9.న్యాయ వివేచన అధికారం 10. గుడ్‌విల్, ప్రతిష్ట, ట్రేడ్‌మార్క్ విలువ, గ్లామర్ సౌందర్యం. 11.విద్యుత్తు, కంప్యూటర్, 12.సంఘటిత శక్తి, ఉద్యమాలు, ట్రేడ్ యూనియన్లు, సామాజిక శక్తులు, ఓటుహక్కు, మొదలైనవి.

అయితే పూర్వం కొందరు సంపదలను ఎనిమిది రకాలు అని వాటిని అష్ట ఐశ్వర్యాలు అని పిలిచేవారు. ఆధునిక యుగంలో ద్రవ్యరూపాలను, వాటికి సంబంధించిన ఆస్తులు, అంతస్తులు, విద్యలు, సంపదగా భావిస్తున్నారు. అర్థశాస్త్రం కేవలం పెట్టుబడి, లాభాలు, శ్రమశక్తి, అదనపు విలువ, మార్కెట్, మార్కెట్ ఎకానమీ, ఉపయోగపు విలువ మొదలైన వాటికే ప్రాధాన్యత ఇస్తూ వాటికే పరిమితమైపోయింది. ఈనాటి అర్థశాస్త్ర దృష్టి పరిమితమైనది. విశాలమైన అర్థంలో సంపదను, సంపద సృష్టి క్రమాన్ని, వాటి పరిణామాలను మొదలైనవాటిని చరిత్ర రచనలో విశ్లేషించడం జరిగినప్పుడే సరియైన, సత్యమైన, సమాజానికి మూలాధారమైన శక్తుల చరిత్ర రికార్డవుతుంది.

సింధూ నాగరికత కాలంలో సంపద సృష్టిక్రమం ఎలా ఉండేదో, వాటి పంపిణీ, వినియోగం, అభివృద్ధి ఎలా ఉండేదో చరిత్ర రచనలో ప్రధాన, మౌలిక అంశం. అలాగే సింధూ నాగరికత నుండి చరిత్రకు అందిన నందరాజుల దాకా సంపద సృష్టి క్రమం, సంపద సృష్టికర్తల నైపుణ్యాలు, వాటి వైవిధ్యాలు, భిన్నత్వం, ఆ భిన్నత్వంలో భాగంగా, సంపద సృష్టికర్తలు శ్రేణులుగా, శ్రేష్టులుగా, వర్ణాలుగా, కులాలుగా, వర్గాలుగా పరిణామం చెందిన తీరుతెన్నులు విశ్లేషించడం చరిత్ర రచనలో సంపద సృష్టికర్తల దృక్పథమౌతుంది.

సూద్ర నందరాజుల కాలంలో, సూద్ర మౌర్య వంశ కాలంలో, సూద్ర సాలివాహన రాజుల కాలంలో వారు సంపద సృష్టికర్తల తెగల నుండి, శ్రేణుల నుండి రాజులుగా ఎదిగినందున సంపద సృష్టికర్తలకు ఇచ్చిన ప్రోత్సాహం చేసిన అభివృద్ధి, అది బౌద్ధ ధర్మ విస్తరణకు వేసిన పునాది మహోన్నతమైనది. సంపద సృష్టికర్తల నైపుణ్యాలు, వాటి ప్రతిష్ట ప్రపంచానికి వెలుగునిచ్చింది. ప్రపంచంలోని మూలమూలలకు నైపుణ్యంగల



సంపద సృష్టికర్తలను ఇండియా నుండి తీసుకుని వెళ్ళేవారు. ఇలాంటి నైపుణ్యంగల సంపద సృష్టికర్తలను పంపమని రాజులు కోరినప్పుడు పంపకపోతే వారికోసం యుద్ధాలు చేసి వారిని పంపించే ఒప్పందాలు చేసుకుని రాజులకు తిరిగి రాజ్యాన్ని అప్పగించి వెళ్ళిపోయిన సంఘటనలు చరిత్రలో కనపడతాయి. ముఖ్యంగా బౌద్ధ గ్రంథాలలో ఇలాంటి విషయాలు ఎన్నో రికార్డు చేయబడ్డాయి. 7వ శతాబ్దంలో ప్రారంభమైన ముస్లింల దాడుల్లో బౌద్ధ గ్రంథాలు తగులపెట్టబడ్డాయి. తద్వారా సంపద సృష్టికర్తల, ఖనిజ లోహాలను కనుక్కున్న సూద్రులని పిలువబడిన శాస్త్రవేత్తల వివరాలు అందకుండా పోయాయి. టిబెట్టు, చైనా, సింహళ దేశాల్లో అనువాదమైన బౌద్ధ గ్రంథాల్లో కొద్ది మేరకు ఈ వివరాలు దొరుకుతున్నాయి. పోయినవి పోగా చైనా, టిబెట్, జపాన్ దేశాల్లో పాలి, టిబెట్, చైనా భాషల్లో 500ల బౌద్ధ గ్రంథాలు ఇప్పటికీ లభ్యమవుతున్నాయి.

నందరాజుల కాలంలో, మౌర్య రాజుల కాలంలో ఉత్పత్తులు బాగా పెరిగాయి. అవి రాజ్యవిస్తరణకు యుద్ధాల్లో సంపదగా సహకరించాయి. అలాగే బౌద్ధ జైన ధర్మాలకు, మతాలకు వాటి వ్యాప్తికి ఎంతగానో తోడ్పడ్డాయి. ఆయా సంపద సృష్టికర్తల నుండి ఎందరో మేధావులుగా, తత్వవేత్తలుగా, గ్రంథకర్తలుగా, కళాకారులుగా ఎదిగారు.

సంపద సృష్టికర్తలను బౌద్ధ విశ్వవిద్యాలయాలకు సహకరించవలసిందిగా కోరుతూ, ఆదేశిస్తూ కొన్ని గ్రామాలను దత్తత ఇవ్వడం ద్వారా బౌద్ధ విశ్వవిద్యాలయాలు, బౌద్ధ విహారాలు శతాబ్దాల తరబడి కొనసాగాయి. వాటిలో సంపద సృష్టికర్తలలో కొందరికి ప్రవేశం లభించింది.

ఈ విధానాన్నే కొనసాగిస్తూ వర్ణవాద, కులవాద, బ్రాహ్మణీయ దేవాలయ వ్యవస్థను ఏర్పాటుచేసుకుని రాజుల నుండి సంపద సృష్టికర్తలను తమకు సహకరించడానికి దత్తత పొందారు. అగ్రహారం అనే పదం దత్తత పొందిన వాటికి సంబంధించిన చాలా తర్వాతి కాలంనాటి పదం.

యుద్ధాల్లో రాజులు, విద్యాలయాలకు విద్యావేత్తలు, పూజలకు దేవాలయాలకు బ్రాహ్మణులు, వర్తక వ్యాపారాల్లో వైశ్యులు, వ్యాపారులు సంపద సృష్టికర్తల నుండి సేవలను, సరుకులను నయానా భయానా సేకరించి, స్వీకరించి, వసూలుచేసి, లాక్కుని తమ లక్ష్యాలను సాధించుకోవడానికి ఉపయోగించుకున్నారు.

యుద్ధాల్లో రాజులు వ్యవసాయదార్లను, వృత్తిదార్లను, లోహ ఖనిజ నిపుణులను, మొదలైనవారిని ఇంటికొకరు చొప్పున లేదా కులాలు, వర్గాలు, ఊరికి ఇంతమంది అని సైనికులుగా తీసుకునేవారు. లేదా నిర్బంధించేవారు. ఇలా యుద్ధాల్లో మానవసంపద అపారంగా నష్టపోయింది. కుటుంబ సంబంధాలు, భార్యాభర్తల సంబంధాలు బాగా దెబ్బతిన్నాయి. దంపతీ వ్యవస్థకు భిన్నంగా లైంగిక సంబంధాలు కొనసాగించాల్సిన

వలసలు, దాడులు, లైంగిక అసమ నిష్పత్తి, మొదలైనవి యుద్ధాలవల్ల అనివార్యం అయ్యాయి. అలా యుద్ధ నీతులు, రీతులు, యుద్ధ సంస్కృతి, శాంతియుత స్థిర జీవితానికి భిన్నంగా, ప్రత్యేకంగా కొనసాగుతూ వచ్చింది.

వర్తక వాణిజ్యాలు ఇండియా నుండి ప్రపంచ దేశాలకు విస్తరించాయి. దేశానికి ఎంతో పేరుప్రతిష్టలను తెచ్చిపెట్టాయి. కాని వాటి సృష్టికర్తలైన వృత్తిదార్లకు, నిపుణులకు ఇచ్చిన కూలీ, ప్రతిఫలం చాలా తక్కువ అని తెలుస్తున్నది. రాజోద్యోగులు, వర్తక వాణిజ్యవేత్తలు, దేవాలయాల ద్వారా సంపద సమకూర్చుకుని పూజారి వర్గాలు తాము ప్రతిపాదించిన సామాజిక జీవితానికి, విలువలకు భిన్నంగా జీవించే ప్రయత్నాలు చేసారు. అందులో భాగంగానే వేశ్యలు సంపన్నులయ్యారు. వారికి ఎంతో రక్షణ, గౌరవం కల్పించబడింది. సంపద కోసం సౌందర్యవతులు అన్ని కులాల నుండి, తెగల నుండి వేశ్యలుగా, కళాకారిణులుగా మారారు.

ఇలా సంపద సృష్టికర్తల నుండి సంపదను తరలించుకుని దోపిడీ చేయడంతోపాటు, వారి కుటుంబాలనుండి ఎదిగిన సౌందర్యవతులైన స్త్రీలు అదే సంపదను సంపాదించడానికి వేశ్యలుగా కుటుంబాలకు దూరమై కళాకారిణులుగా స్వతంత్ర జీవనాన్ని సాగించుకోవాల్సి వచ్చింది. ఇలాంటి పరిణామం క్రీ.శ.19వ శతాబ్దం చివరి దాకా కొనసాగింది.

ఆధునిక సమాజంగా మధ్యతరగతి పెరుగుతున్న క్రమంలో మధ్యతరగతి సామాజిక విలువలు ప్రాధాన్యత సంతరించుకొని వేశ్యావృత్తి చిన్నచూపు చూడబడింది. కళావంతులు, భోగంవాళ్లు మొదలైన కులాలు ఇతర కులాల్లో కలిసిపోయారు. ఇలాంటి మరికొన్ని కులాలు తమ కులాల పేర్లను మార్చుకున్నారు. అయితే క్లబ్బులు, సినిమా, టి.వి., మొదలైన ప్రక్రియలు సౌందర్యం, నటన ద్వారా మానవులను ఆకట్టుకుని సంపదను సేకరించే విధానం కొత్త రూపాల్లో కొనసాగుతున్నది.

ఇండియా నుండి ఎత్తుకుపోయిన సంపదతో ప్రపంచదేశాలు ఎంతో సంపన్నమైనాయి. ఆ సంపద సృష్టికర్తలను ఆ సంపద సృష్టికర్తలు మీరే, ఆ ఖ్యాతి మీదే అని సూద్రులకు చెప్పేవారు చరిత్రలో కరువయ్యారు.

బౌద్ధం కర్మ ద్వారా అనగా క్రియ ద్వారా ఫలితాన్ని నీవే అనుభవిస్తావు అని చెప్పింది. కాని సంపద విషయంలో మీరు సృష్టించే సంపద మీదే అనే మాటని చెప్పలేకపోయింది. పరాయికరణ క్రమాన్ని స్పష్టం చేయలేక పోయింది. చెప్పివుంటే మార్క్సిజం పుట్టుక బౌద్ధం రూపంలో ఆనాడే జరిగి ఉండేది. రాజులు, వేశ్యలు, వర్తక వాణిజ్య ప్రముఖులు, సామంతులు, ధనికులు బౌద్ధ ధర్మ ప్రచారానికి, బౌద్ధ విహారాలకు, బౌద్ధ విశ్వవిద్యాలయాలకు తమ సంపద నుండి కొంత భాగం విరాళాలుగా ఇచ్చి



వాటిని అభివృద్ధి పరిచారు. తద్వారా శతాబ్దాల తరబడి బౌద్ధం విస్తరిస్తూ కొనసాగింది. బౌద్ధం కోరికలను అదుపు చేసుకోవాలని నైతిక విలువలతో బౌద్ధ ధర్మాన్ని ప్రచారం చేయడంవల్ల సంపద సృష్టికర్తలు ఆ సంపదను పరోపకారం దృష్టితో తక్కువ రేటుకు లేదా ఉచితంగా తీసుకున్నప్పటికీ పరాయీకరించబడినప్పటికీ ఎంతగానో సంతోషించారు. ఇలా బౌద్ధంలోని కోరికలను అదుపు చేసుకోవడం అనే తాత్విక, నైతిక, సామాజిక సిద్ధాంతాల ఆచరణ సంపదను వాటి సృష్టికర్తలనుండి ఇతరులు తీసుకోవడానికి, దోపిడీ చేయడానికి, స్వచ్ఛందంగా ఇవ్వడానికి ఆర్థిక సిద్ధాంతంగా కూడా పనిచేసింది.

అయితే బౌద్ధం సంపద సృష్టికర్తలకు ఇతర రంగాల్లో ఎంతో సేవ చేసింది. ముఖ్యంగా మానసిక ప్రశాంతతను, తృప్తిగా ఉన్నదాంతో జీవిస్తూ ఆనందంగా గడపడాన్ని నేర్పింది. విద్య, వైద్యం అందించింది. మానసిక బానిసత్వం నుండి విముక్తం చేసి మానవుల ఆలోచనలకు స్వేచ్ఛను కలిగించింది. సత్యాన్ని సత్యంగా చూడగలిగే చూపును అందించింది. అందువల్లే సంపద సృష్టికర్తలు బౌద్ధ ధర్మాన్ని, బౌద్ధ విశ్వవిద్యాలయాలను, విహారాలను, అభివృద్ధి పరచడంలో, పెంచి పోషించడంలో ఇతోధికంగా పాల్గొన్నారు.

బ్రాహ్మణవాదం మధ్యయుగాలలో ముఖ్యంగా రాజపుత్రుల యుగంలో విదేశీ వర్తక వాణిజ్యాలు దెబ్బతినడంతో బౌద్ధానికి క్షీణదశ ప్రారంభమైనది. దాంతో వైదిక మత ఛాందసం వర్ణ కుల వ్యవస్థ రూపంలో బ్రాహ్మణ మతంగా ముందుకు రావడం సులభమైంది. ఈ వర్గం సృష్టించిన సాహిత్యం పురాణాలు తత్వశాస్త్రాలు గుప్తుల కాలంలో వేగం పుంజుకున్నాయి. అవి మానవ మేధస్సును ఎదగకుండా కులాలవారిగా కట్టడి చేసి కర్మ పునర్జన్మ సిద్ధాంతాలతో శూద్రుల సృష్టించిన సంపదను కైవసం చేసుకుంటూ సోమరిపోతు వర్గాలను పెంచి పోషించింది. ఈ సోమరిపోతు తనానికి పరిగెత్తి పాలు తాగే కంటే నిలబడి నీళ్ళు తాగడం మంచిది అని చెప్పడం. అనగా ఉద్యమాలు చేసి తిరుగుబాటు చేయకూడదని ప్రజలను కర్మ సిద్ధాంతానికి, దోపిడికి సిద్ధం చేసి పెట్టే సోమరిపోతుల సామెత ఇది. జీవితానికి, తాత్విక దృక్పధానికి పొంతన లేని భావజాలాన్ని ఈ బ్రాహ్మణ మతం ప్రచారం చేయడం ద్వారా చరిత్ర రచన పద్ధతులను మనం నేర్చుకోకపోవడం వల్ల పురాణాలే చరిత్రగా భావించడమో, పురాణాల్లో చారిత్రక అంశాలు వెతకడమో చేస్తూ వస్తున్నాము. బౌద్ధ గ్రంధాలు విదేశీయాత్రికులు భారత ఉపఖండ చరిత్రను ఎంతో విపులంగా గ్రంధస్తం చేశారు. వాటిని అందుబాటులో లేకుండా చేయడం జరుగుతున్నది. తద్వారా మత ప్రచారాన్ని చరిత్రగా ముందుకు తెచ్చింది బ్రాహ్మణీయ మతం.

బౌద్ధ ఆరామాలను, స్థూపాలను, విశ్వ విద్యాలయాలను అనుకరిస్తూ అదే పద్ధతిలో బ్రాహ్మణీయ మతం దేవాలయాల నిర్మాణం వేగవంతం చేసింది. విగ్రహారాధనను

ప్రోత్సహించింది. బౌద్ధానికి పోటీగా తొలి దశలో దేవాలయాల విద్యను కూడా అందించింది. ఆయుర్వేద వైద్యాన్ని వ్యతిరేకించిన బ్రాహ్మణ వాద శక్తులు తిరిగి ఆయుర్వేద శాస్త్రవేత్తలతో ఒక అవగాహనకు వచ్చి వారి సహకారంతో వైద్యాన్ని కూడా అందించే ప్రయత్నం చేసారు. అలా విద్య, ఆరోగ్య సంపద కోసం కొంత సహకరించారు.

అయితే దేవుడు, కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలను, స్వర్గం నరకం, పాపం పుణ్యం సిద్ధాంతాలను ముందుకు తెచ్చి వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతంలో సంశ్లేషించి మానవులను మానసికంగా బలహీనులుగా మార్చుతూ వారిని మానసిక బానిసలుగా మార్చే కృషి చేసారు. తద్వారా మానవుల్లో తీవ్రమైన భయ సంకోచాలు పెరిగిపోయాయి. ఆ భయాలను తమ శాస్త్రాల పేరుతో మళ్లీ సొమ్ము చేసుకున్నారు. అలా జ్యోతిష్యం, పంచాంగం మొదలైనవాటిని ఆనాటి శాస్త్ర అంశాలను వక్రీకరించి మనిషికి అన్వయించి, భయపెట్టి, ఆ భయాన్ని తొలగించడానికి దైవపూజల పేరిట స్వాహా చేయడం, పరిహారాలను స్వీకరించడం మొదలైనవి చేస్తూ సంపద సృష్టికర్తలను ఆర్థికంగా దోపిడీ చేస్తూ మానసికంగా కూడా పేదలుగా బలహీనులుగా మార్చే ప్రయత్నాలు చేసారు.

బౌద్ధం ముస్లింల దండయాత్రలతో నశించి తన ప్రాభవాన్ని కోల్పోయిన క్రమంలో వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలు, బ్రాహ్మణవాదం, వైదిక వాదం కొత్త రూపాలను తీసుకున్నాయి. సంపద వృత్తిదార్లను హీనజన్ములుగా ముద్రవేసే సాహసానికి కూడా ఒడిగట్టాయి. ఎవరి సంపదపై ఆధారపడి బతుకుతున్నారో వారినే నీచజన్ములుగా చెప్తూ మానసిక బానిసత్వానికి గురిచేసి తిరుగుబాటు జరగకుండా చూడాలనుకున్నారు. కాని చరిత్ర పొడవునా వర్ణవాద, కులవ్యవస్థ వాద, వైదిక సిద్ధాంతాలకు వ్యతిరేకంగా సమాజం తనదైన పరిణామాలను తీసుకుంటూనే వచ్చింది. సంపద సృష్టి పంపిణీ సిద్ధాంతాలు ఇలా వేరు వేరుగా కొనసాగాయి.

వీటి పర్యవసానంగా వీరి సిద్ధాంతాలకు దూరంగా బతుకుతున్న ఆదివాసీ తెగలు, జనపదాలు, జాతులు సంఘటిత శక్తితో ముందుకు సాగి రాజ్యాలను నిర్మిస్తూ, విస్తరిస్తూ స్థిరపడ్డారు. తిరిగి వారిని వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతంలోకి మార్చే పనిలో భాగంగా వారిని క్షత్రియులంటూ వంశవృక్షాలను తయారుచేసి సంస్కృత పేర్లను తగిలించి పలు రకాలుగా ప్రశంసించి, ప్రలోభ పెట్టి, వశపరచుకునే పని పెట్టుకున్నారు. తద్వారా వర్ణవాద సిద్ధాంతం ఆచరణలో నిరంతరం ఓడిపోతూ కొత్తవారిని అందులో కలుపుకొంటూ రావడం ద్వారా బతుక్కుంటూ వచ్చింది.



# ఆర్థిక దోపిడీ పద్ధతుల పరిణామాల చరిత్ర

ఉత్పత్తి సంబంధాల గురించి, వర్గాల గురించి మాట్లాడుతూ ఉత్పత్తి కులాలను దోపిడీ చేసిన ఆర్థిక దోపిడీని కొందరు వదిలేసి చరిత్ర రచన చేస్తుంటారు. దేవాలయాల ద్వారా బ్రాహ్మణవాదులు, పూజారులు చేసే ఆర్థిక దోపిడీని చాలామంది చరిత్రకారులు వదిలేస్తుంటారు. వర్ణవాద బ్రాహ్మణవాద చరిత్రకారులు, ముస్లింలు దండయాత్రలు చేస్తూ ఇండియాలోని దేవాలయాలను బౌద్ధ విహారాలను దోపిడీ చేసారని ద్వేషపూరితంగా చరిత్ర రచన చేస్తుంటారు. ఆర్థిక దోపిడి పద్ధతుల్లో వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలు, ఆధ్యాత్మికవాదం, దేవాలయాలు, పూజారులు కూడా ఒక భాగమని అర్థశాస్త్రవేత్తల అభిప్రాయం. చరిత్రకారులు ఇలాంటి దోపిడి పద్ధతులను సవివరంగా వెలికితీసి చెప్పడం అవసరం.

గుళ్ళల్లో పేరుకుపోయిన కోట్లాది సంపద, వర్తక వాణిజ్య ప్రముఖుల వద్ద పేరుకుపోయిన కోట్లాది సంపద, సంపదను సృష్టించే వృత్తి కులాల నుండి రకరకాల రూపాల్లో దోపిడీ చేసినవే. ముస్లింలు దండయాత్రల్లో, దాడుల్లో వాటిని కొల్లగొట్టారు. కొల్లగొట్టినందుకు వాళ్లు హిందూ ద్వేషులని కొందరు అంటారు. మరికొందరు దోపిడీ చేసిన సంపద వివరాలను మాత్రం ఇస్తారు.

కాని అదంతా 'ఎవరబ్బ సొమ్మని కులికేవు రామచంద్రా' అని భక్తరామదాసు బాధలో పాడినట్టుగా ఆ సంపదంతా అక్కడ ఎలా జమ అయింది? అది ఎవరి సొమ్ము? ఎవరినుండి సేకరించింది? లేదా దోపిడీ చేసింది? కులం, మతం, ఆధ్యాత్మికత పేరు చెప్పి నిర్మలంగా, నిరాడంబరంగా ఇతరులకు, సామాజానికి ఆదర్శంగా బతకాల్సిన బ్రాహ్మణులు, పూజారులు, వైశ్యులు కోట్లాది విలువైన సంపదను గుళ్లల్లో ఎలా దాచుకున్నారు? ఎందుకు దాచుకున్నారు? దాంతో ఏం చేయదలచుకున్నారు? చెరువులు కట్టించ దలచుకున్నారా? నీటి పారుదల సౌకర్యాలు, రవాణా సౌకర్యాలు, రోడ్లు వేయించదలచుకున్నారా? విశ్వవిద్యాలయాలు స్థాపించి ప్రజలకు విద్యను అందించదలచుకున్నారా? రాజులను కష్టాల్లో ఆదుకోవడానికి దాచిపెట్టారా? గుళ్లు

మరిన్ని కట్టడానికి దాచిపెట్టారా?

ఇవేమైనా చేసేదైతే రాజుల బొక్కసాలు ఖాళీ అయినట్టుగానే గుళ్లలోని, విహారాలలోని సంపద కూడా ఎప్పటికప్పుడు ఖాళీ అయి వుండేది. మధ్య యుగాల్లో ఉత్పత్తి కులాలు సృష్టించిన సంపద, ఉత్పత్తి శక్తుల నైపుణ్యం ఎంతగా వికసించిందో అదంతా వైశ్యుల వర్తకుల, బ్రాహ్మణుల పాలు ఎలా అయిందో అలా కూడబెట్టిన సొమ్ము దొంగలపాలు, దోపిడీల పాలు ఎలా అయిందో ముస్లింలు దండయాత్రల్లో దొరికిన సంపదను రికార్డు చేయడం ద్వారా స్పష్టం చేసారు. ముస్లిం చరిత్రకారులు, అల్‌బెరూని రికార్డుచేసిన వివరాలను కొమర్రాజు వేంకట లక్ష్మణరావు హిందూ మహాయుగం గ్రంథంలో క్రీ.శ.1907లో పేర్కొన్నారు.

ఇండియాలోని స్త్రీవాదులు, సూద్రవాదులు ఇండియా ప్రాచీన చరిత్ర నుండి వారి మూలాలను ప్రాధాన్యతను చరిత్ర నిర్మాణంలో వారి పాత్రను వెలికితీస్తూ వ్యాసాలు, గ్రంథాలు వెలువరిస్తున్నారు. కంచ ఐలయ్య, వై ఐయామ్ నాట్ ఏ హిందూ అనే గ్రంథంతో బాటు బఫెలో నేషనలిజం అనే గ్రంథాల్లో, వ్యాసాల్లో ఆర్.ఎస్.ఎస్., చరిత్ర రచనకు భిన్నంగా సంపద సృష్టికర్తల ప్రాధాన్యతను నిర్ధారిస్తూ వస్తున్నారు.

మతం పేరిట, ఆధ్యాత్మికత పేరిట, దేవాలయాల పేరిట, కులాల పేరిట, బ్రాహ్మణులు, వర్ణవాదులు, వైశ్యులు, ఉత్పత్తి కులాలను, ప్రజలను శతాబ్దాల తరబడి ఎలా దోపిడీ చేస్తూ వచ్చారని సబాల్టరన్ స్టడీస్‌ద్వారా అణగారిన వర్గాల, అణచివేయ బడిన జాతుల, వర్గాల చరిత్రను వెలికితీయడం వేగవంతమైంది.

సాలివాహన రాజులు క్రమక్రమంగా తమ ఆదివాసీ గిరిజన జనపద తెగల, జాతుల వారసత్వాన్ని కోల్పోయి బౌద్ధాన్ని, జైనాన్ని వదులుకుంటూ బ్రాహ్మణవాదుల వుచ్చులో చిక్కుకుపోయారు. శూద్రుల నుండి, ఉత్పత్తి కులాలనుండి యాదవ, ఎరుకలి, దొమ్మరి, సంచార గిరిజన, వడ్డెర, వ్యవసాయ, వృత్తి కులాల నుండి ఎదిగి రాజ్యాలను నిర్మించినవారు వారి ద్వారా కూడా వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతాలను తీసుకుని ఆశ్రయించిన బ్రాహ్మణవాదులు సకల సంపదలను పొందారు.

వీరి పరిపాలనలో బ్రాహ్మణులకు ఆదాయాలు లభించటానికి వేలకొలది గుడులను, దేవాలయాలను నిర్మించారు. వేలకొలది అగ్రహారాలను బ్రాహ్మణులకు దాన ధర్మాలు చేశారు. దేవుని పేరుతో శైవమతం, వైష్ణవ మతం పేరుతో అనేక ఉత్సవాలను నిర్వహించారు. అనేక బౌద్ధ దేవాలయాలను హిందూ దేవాలయాలుగా మార్చివేసారు. పల్లవరాజులు అనేక దేవాలయాలను కట్టించారు. భారీగా భూదానాలు బ్రాహ్మణులకి చేశారు. వైదిక మతాన్ని పోషించడమంటే యజ్ఞమంటేనే ధన-కనక-వస్తు వాహనాలతో కూడిన అపారమైన ధనం ఇవ్వటం. పైన పేర్కొన్న రాజులందరికి "ధర్మమహారాధిరాజ"



అనే బిరుదును కల్గియున్నారు. పూచికపుల్ల పని చేయకుండా పరాన్నభుక్కులుగా బతికే పూజారి వర్గానికి కుల వ్యవస్థ ఒక భూతల స్వర్గం.

క్రీ.శ.1024లో మహ్మద్ గజనీ 12వ సారి దాడికి బయలుదేరాడు. ఈ దాడిలో సౌరాష్ట్రమని పిలువబడిన గుజరాత్ వైపు సాగాడు. అక్కడ దక్షిణ వేపు సముద్రం ఒడ్డున ఉన్న సోమనాథ దేవాలయం 12 జ్యోతిర్లింగాలలో ఒకటని ప్రచారం చేయబడింది. ఏటా కోట్లకొద్ది ప్రజలు సముద్ర స్నానం కోసం ఆ దేవాలయ దర్శనం కోసం వచ్చేవారు. వెయ్యి మంది పూజారులు అక్కడ ఉండేవారు. గజనీ పట్టణానికి సోమనాథ దేవాలయం 1500 కిలోమీటర్ల దూరంలో ఉంటుంది.

గజనీ పట్టణం నుంచి సోమనాథ్‌కు రావడానికి రెండు మార్గాలు ఉండేవి. ఒకటి, బోలన్ గోజక్‌ల కనుమల గుండా సింధూ దేశం ద్వారా రావడం. రెండవది, కైబర్ కనుమల నుండి పెషావర్ ముల్తాన్ అజ్మీర్ మీదుగా రావడం. మహ్మద్ 30 వేల గుర్రపు సేనను, 30 వేల ఒంటెల సేనను, నీళ్లను కూడా మోసుకుంటూ బయలుదేరాడు. అతడు వస్తున్నాడని తెలిసి సోమనాథ రాజు పారిపోయాడు. అక్కణ్ణించి మహ్మద్ అనిహిల అనే పట్టణానికి బయలుదేరాడు. దాంతో ఆ రాజు కూడా పారిపోయాడు. తద్వారా దారి వెంట ఎలాంటి ప్రతిఘటన లేకుండా సోమనాథ దేవాలయానికి చేరాడు. దేవాలయం చుట్టూ పెద్ద కోటను కట్టుకున్నారు. దేవాలయానికి బలమైన కోట ఎందుకో తెలియదు. దేవాలయం పేరిట బ్యాంకును, ధనాగారాన్ని నిర్వహించడమే బ్రాహ్మణ పూజారుల రహస్య కార్యకలాపాలు అయి వుండవచ్చు అని చరిత్రకారుల అభిప్రాయం. గజనీ మహ్మద్‌కు ఈ దాడిలో దొరికిన కోట్లాది సంపద దీన్నే స్పష్టం చేస్తున్నది.

ఆ గుడి కోసం 10 వేల గ్రామాలు, వాటిలోని సంపద సృష్టికర్తల సంపదంతా దేవాయలయానికే సమర్పించాలని రాజుల నుండి కాకా పట్టు పరిశ్రమతో సాధించుకున్నారని మహ్మద్‌కు తెలిసింది.

ఈ గుడిలో వంద కిలోల బరువు గల బంగారు గొలుసు గల గంట వుండేది. 500 మంది దేవదాసిలు ఆడుతూ, పాడుతూ వుండేవారు. ఈ గుడి అనే కోశాగారం నుండి వేల కిలోల బంగారాన్ని, వెండిని, ఇతర విలువైన వస్తువులను, నగలను గజనీకి దాడిలో దొరికింది.

మహ్మద్‌గజనీ నాగర్‌కోట్ అనే దేవాలయం మీద దాడి చేసినప్పుడు బ్రాహ్మణ పూజారుల నుండి గజనీ 70 వేల బంగారపు దీనార్లను, 7 లక్షల బంగారపు, వెండి కడ్డీలను, 200 మణుగులకొద్దీ బరువుండే వెండి దిమ్మెలను, 200 బంగారపు దిమ్మెలను, 2000 శుభ్రపరచిన వెండి దిమ్మెలను స్వాధీనం చేసుకున్నాడు.

సోమనాథ దేవాలయంలో ఎంతమంది రాజులు, ఎన్ని రాజ్యాల పూజారులు,

వర్తకులు సంపద దాచుకున్నారో లోకానికి తెలియదు. కాని స్విస్ బ్యాంకు ఖాతాలమీద ఐక్యరాజ్యసమితి ఆధ్వర్యంలో దాడి చేస్తే దాచుకున్న దేశాల దోపిడీ దొంగలు గగ్గోలు పెట్టినట్లు చుట్టుపక్కల రాజ్యాలు అప్రమత్తమయ్యాయి. పరుగు పరుగున సైన్యాన్ని తీసుకుని సోమనాథ్‌కు పరిగెత్తారు. యుద్ధం తీవ్రమైనప్పటికీ వాళ్లు ఓడిపోయి మహ్మద్ సైనికులు గెలిచారు. గెలిస్తే సైనికులకు వాటా సంపద లభిస్తుందనే ఉత్తేజం వారికి గెలుపును సాధించడానికి పనికివచ్చింది. మహ్మద్ గజనీ ఎందుకో ఇండియాలో రాజ్యం స్థాపించాలని అనుకోలేదు. దూరం ఎక్కువ. ఇటు వస్తే అక్కడ తిరుగుబాట్లు జరిగాయి. దాంతో జంకాడని చరిత్రకారుల అభిప్రాయం.

సోమనాథ్ దేవాలయంలోని విగ్రహాలను లింగాలను పగులగొట్టేముందు పూజారులు కొందరు అది ముట్టుకోకుంటే మీకు గొప్ప బంగారం రాసులను ఇస్తామని చెప్పారట. దాంతో విగ్రహాలను అమ్ముకునేవాడు అని నేను అన్పించుకోవడం కన్నా విగ్రహాలను పగులగొట్టేవాడు అని అన్పించుకోవడం ముస్లింగా ఎక్కువ గౌరవం అని అన్నాడట. అలా అంటూ లింగాలను పగులగొట్టాడు.

ఆ లింగాలు పగులగొట్టిన తరువాత ఆ లింగాల లోంచి, వాటి కింద కోట్ల విలువైన రత్నరాసులు లభించాయి. మహ్మద్ దేవుడి పేరిట దేవుడి విగ్రహం కింద దాచుకున్న సంపద చూసి క్షణకాలం ఆశ్చర్యపోయాడు. గుళ్లు ఉన్నవి ఇందుకోసమా అని మొదటిసారిగా అర్థం చేసుకున్నాడు. గర్భగుడులన్నీ ఇలా కోట్లాది సంపదను దాచుకోవడానికి ఏర్పాటు చేసినవే అని ముస్లిం రాజులు, ఇండియా ప్రజలు భావించడం మొదలైంది.

దాంతో ఎక్కడికక్కడ గర్భగుళ్లల్లో విగ్రహాలను పడగొట్టి దానికింద దాచుకున్న సంపదను దోచుకుపోవడానికి ప్రజలు ఆదివాసీలు తండాలు తండాలుగా గుళ్లమీద దాడులు చేయడం ప్రారంభించారు. నేటికి కూడా ఈ దాడులు రకరకాల రూపాల్లో కొనసాగుతున్నాయి. అయినప్పటికీ నేటికి కూడా సోమనాథ్ దేవాలయంలో వలెనే కోట్లాది రూపాయలను ఇండియాలోని గుళ్లలో నగల పేరిట దాచిపెడుతున్నారు. అసలు నగలను మాయం చేసి నకిలీ నగలను పెడుతున్నారు అని చరిత్రలోని కొన్ని సంఘటనలు తెలుపుతున్నాయి.

సోమనాథ్ దేవాలయంలో లభించిన కవాటాలను గజనీ క్రీ.శ.1030లో డయాబెటిస్‌తో 66వ ఏట చనిపోయాక గజనీ మహ్మద్ కుమారుడు అతని సమాధికి అలంకరించి నిర్మించాడు. వాటిని క్రీ.శ.1842లో ఆనాటి గవర్నర్ జనరల్ ఎలింబరో ఇండియాకు తీసుకుని వచ్చాడు. తరువాత అది ఆగ్రా కోటలోని చీకటి కొట్టులో భద్రపరిచాడు.



మహ్మద్ గజనీ మధుర దేవాలయం నుండి 98,300 మిస్‌కల్స్‌ల బంగారాన్ని, 200 మిస్‌కల్స్‌ల వెండిని, లెక్క కట్టలేనంత ఇతర ఆభరణాలను దోచుకొని పోయాడు.

**చాలామంది రాజులు తమ రాజ్యాలను, ప్రాంతాలను, సంపదను గుడులకు దత్తత ఇచ్చేవారు. ఇది బ్రాహ్మణవాదులకు మాత్రమే ఉపయోగపడేది. ముస్లింలకు దాడుల్లో ఇతరత్రా లభించిన సంపద మొత్తం ముస్లింలకు "మాల్ ఎ గనీమత్"గా పంచబడేది. వాటా ఇవ్వబడేది. కాని గుళ్లకు ఇవ్వబడిన సంపద కేవలం బ్రాహ్మణులకు మాత్రమే మాల్ ఎ గనీమత్‌గా లభించేది. స్త్రీలను, సంపదను, బ్రాహ్మలు రాజుల నుండి ఇలా రాజ్యాలు విస్తరించినప్పుడల్లా మరింత ఎక్కువ వాటాను పొందేవారు.**

ఒక్క పూజారులు, బ్రాహ్మణులకే ఈ వాటా అందడం వల్ల ముస్లిం సైనికులకన్నా ఎన్నో రెట్లు ఉత్తేజంతో, బౌద్ధులపై, జైనులపై, ముస్లింలపై ద్వేషాన్ని రగుల్కొల్పి బౌద్ధ జైన ముస్లిం రాజ్యాలపై బ్రాహ్మణవాద రాజులను ఉసిగొల్పేవారు. చస్తే రాజులే చస్తారు. తామైతే గెలిచిన రాజును కాకా పట్టు పరిశ్రమతో తిరిగి కొత్త రాజుల వద్ద స్థానం సంపద సంపాదించుకుంటారు. ఇలా ఏ రాజు గెలిచినా బ్రాహ్మణులకు రెండు విధాలుగా లాభం జరిగేది. దీన్నించే ఏనుగు చచ్చినా పదివేలు, బతికినా పదివేలు అనే సామెతలు ప్రతీకాత్మకంగా ప్రజల్లో నిల్చిపోయాయని చరిత్రకారుల అభిప్రాయం. బ్రాహ్మణులు పూజారులుగా, మంత్రులుగా ఉన్న రాజ్యాల్లో విపరీతమైన కుట్రలు, హత్యలు జరగడానికి వెనక బ్రాహ్మణవాద సిద్ధాంతాలు, కౌటిల్యుని వ్యూహాలు ప్రధానపాత్ర వహించాయి.

క్రీ.శ.17వ శతాబ్దంలో ఔరంగజేబుతో ఎంతో పోరాడి సాధించుకున్న రాజ్యాన్ని శివాజీ తన బ్రాహ్మణ గురువైన రామదాసుకు అంకితమిచ్చాడు. ఆ తరువాత బ్రాహ్మణ పీష్వారాజ్యంగా మారి దేశంలో దళితుల అణచివేత తీవ్రం చేశారు. మధుర, పాండ్య, పల్లవ, విజయనగర, రాజ్‌పఠానాల, గుప్తులు మొదలైన రాజులు తమ రాజ్య సంపదలో కొంత వాటాను మాల్ ఎ గనీమత్ లాగా బ్రాహ్మణులకు ఇచ్చేవారు.

ఇలా గుడులు దేవాలయాలు ప్రజలను దోపిడీ చేయటానికి సంపదను బ్యాంకుల్లాగా దాచుకోవడానికి ప్రముఖమైన సాధనాలు. ఇవి పైకి సమాన్య ప్రజలను మభ్యపెట్టడానికి మత సంబంధం కలిగినవిగా, సాంఘిక విషయాలను బోధించేవిగా ప్రచారం చేయబడుతుంటాయి. ఇవి సంపద సృష్టికర్తలైన ప్రజలను క్రూరంగా దోపిడీ చేయటానికన్నది చారిత్రక సత్యం అని చరిత్రకారుల అభిప్రాయం.

ఇలా ప్రతి గ్రామంలో గుడులు వెలిసాయి. బడులు లేని చోట కూడా గుడులు వెలిసాయి. బౌద్ధ విహారాల్లో, ఆరామంలో విద్య అందించబడితే గుళ్ళకు దానాలు అందినా ప్రజలకు విద్య దూరం చేయబడింది. మూఢవిశ్వాసాలను జ్యోతిషం వాస్తు, గ్రహచారం, పంచాంగం మొదలైన వాటి పేరుతో ప్రజలను భయభ్రాంతులను చేసి

మానసికంగా బలహీనుల్ని చేసి లొంగదీసుకున్నారు. క్రీ.శ.200నాటికి కూడా ఇండియాలో ఈ విధానం కొనసాగుతున్నది. ఇలాంటి దోపిడి ఆధ్యాత్మిక రూపంలో దోపిడిని రాజకీయాలను చలాయిస్తూ అష్ట ఐశ్వర్యాలను పొందాలని ప్రయత్నించే వారే వాటికి గొప్ప ఆధ్యాత్మికతను, గౌరవాన్ని కలిగించే ప్రచారం చేస్తూ చరిత్ర రచన చేస్తుంటారు.

బ్రాహ్మణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంతవేత్తల దోపిడీని మరుగుపర్చి క్రీ.శ.1840 నుండి ప్రారంభమైన జాగీర్దారి, జమీందారి పన్నుల వసూలు విధానం ద్వారా ఏర్పడిన భూస్వాములను చూపి సకల దోపిడీలకు వీరే కారకులని కొందరు మార్క్సిస్టులు బ్రాహ్మణవాదాన్ని తగ్గించి చెప్పారు. గ్రామాల్లో నైతిక అధికారం, ధార్మిక అధికారం ద్వారా గుడిలోని పూజారి వర్గమే గ్రామాలను చివరికి భూస్వామి భావాలను కూడా పరిపాలిస్తుంటారు.

గుడులు, దేవాలయాల ఆధ్వర్యంలో జరపబడే జాతరలు, ఉత్సవాలు, యజ్ఞ యాగాలు, పూజలు అన్నీ కూడ సంపదను, ధాన్యాన్ని, ఆదాయాన్ని సమ కూర్చుకోవటానికి ఉద్దేశింపబడినవే అని గుడులన్ని దోపిడీ స్థావరాలు. పెట్టుబడిదారుల, భూస్వాముల దోపిడీ కంటే ఈ దోపిడీ చాలా ఘోరమైనవి అని భూస్వాములు, పెట్టుబడిదారులు శ్రామికులకు కొంతవరకైనా ప్రతిఫలాన్ని ఇస్తారు కాని బ్రాహ్మణులు ఎలాంటి ప్రతిఫలాన్ని ఇవ్వకుండానే నిలువుదోపిడీ చేశారు.

చరిత్ర రచనలో వెలికివస్తున్న ఇలాంటి వైవిధ్యపూరితమైన ఎన్నో అంశాలను ఒకచోట చేర్చి వాటి మధ్య ఉండే వైరుధ్యాలను, భిన్నాంశాలను, అసత్యాలను చర్చించి సత్యాలను విశ్లేషించవలసి ఉన్నది. బి.జె.పి. అధికారంలోకి రాగానే రాష్ట్రాల్లో, కేంద్రంలో ఆర్.ఎస్.ఎస్. వారు రాసిన చరిత్రనే అసలైన చరిత్రగా పాఠ్యపుస్తకాలను మార్చి వేశారు. ఈ విషయంలో చరిత్రకారులు వ్యక్తిగతంగానే స్పందించారు తప్ప వారు చర్చించిన కోణాలను తిరిగి కొత్త అన్వయాలతో పూర్వపక్షం చేస్తూ సత్యాలను నిర్ధారిస్తూ చరిత్ర రచన చేయలేకపోయారు. క్రీ.శ.2007 నాటికి ఇండియా చరిత్రలో ఈ స్థితి కొనసాగుతున్నది.

చాలా మంది చరిత్రకారులు, మేధావులు, విద్యావేత్తలు ఆంగ్లేయుల పరిపాలన చాలా కాలం కొనసాగిందనే భావనలో ఉన్నారు. క్రీ.శ.1857లో రాజులు బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన, వ్యవహారాలపై తిరుగుబాటు చేసిన తర్వాత ఇండియా ఇంగ్లాండు దేశం పరిపాలన కిందకు వచ్చింది. క్రీ.శ.1910 నుండి బ్రిటీష్ వాళ్ళు భారతీయులను పరిపాలనలో భాగస్తులను చేసుకుంటూ వస్తున్నారు. క్రీ.శ. 1935లో ఆయా ప్రావిన్స్‌లలో కాంగ్రెస్ ప్రభుత్వాలు ఏర్పడ్డాయి. అందువల్ల సుమారుగా



70 సంవత్సరాలు మాత్రమే ఇంగ్లాండ్ ప్రభుత్వం ఆధ్వర్యంలో ఇండియా పరిపాలన కొనసాగింది. ఔరంగజేబు మరణం తర్వాత కొంత కాలానికి బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ బలపడింది. చివరి మొఘల్‌రాజు బహదూర్‌షాను బ్రిటీష్‌వారు మాయ చేసి మభ్యపెట్టి చివరికి బందీని చేసి బర్మా జైలుకు పంపించారు. అప్పుడు అతని వారసులు అనదగిన దాదాపు 200 మందిని బ్రిటీష్‌వారు వెతికి వెతికి చంపివేశారు. క్రీ.శ.1947లో కేంద్ర ప్రభుత్వం నుండి కూడా ఇంగ్లాండ్ ప్రతినిధులు పూర్తిగా తప్పుకోవడం జరిగింది. ఇది కూడా కలిపితే 87 సంవత్సరాలు మాత్రమే ఇంగ్లాండ్ పరిపాలన సాగింది.

తన యుద్ధ ఖర్చుల కింద కొంత రాజ్య భాగాలను పొందుతూ తన రాజ్యాలను, ప్రాంతాలను విస్తరించుకుంది. యుద్ధాలకు సైన్యాన్ని సరఫరా చేసే సైనిక పటాలాలను పెంచి పోషించుకోవడానికి ఔరంగజేబు కూడా అనుమతించాడు. ఔరంగజేబు మరణం తర్వాత బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ బలపడింది. ఔరంగజేబు వంటి సమర్థుడైన రాజు ఇండియాలో అతని తర్వాత ఏ ఒక్కరున్నా ఇండియా యూరప్ వ్యాపారస్తుల సామంత రాజ్యంగా మారి ఉండేది కాదు.

వ్యాపార సంస్థలు యుద్ధాలకు సైన్యాలను అద్దెకు ఇచ్చే ఆలోచన కలగడం ఇండియా వాసులకు విచిత్రమైన విషయం. యూరోప్‌లో 10వ శతాబ్దం నుండి ఇలాంటి వ్యవస్థ ఉండేది. వారిని సామంతరాజులు అని కాకుండా యుద్ధ ప్రభువులని, ఫ్యూడల్ లార్డ్స్ అని పిలిచేవారు. వ్యవసాయ భూములు, కరువుల వల్ల జనాభా బాగా నశించిపోయి పాడుపెట్టబడ్డాయి. తర్వాత పశువుల పెంపకంతో తిరిగి యూరోప్ దేశాలు నిలదొక్కుకున్నాయి. ఈ వివరాలు మరో అధ్యాయంలో చూడవచ్చు.

ఈ ఫ్యూడల్ లార్డ్స్ ఇండియాలోని సామంత రాజుల వంటి వారు. అయితే వీరు ఇండియాలోని సామంత రాజులు సామ్రాజ్య అధినేతలకు కప్పం చెల్లించినట్లు కాకుండా వీళ్ళే రాజుల నుండి సైన్యాన్ని అద్దెకు ఇచ్చినందుకు కిరాయి వసూలు చేసేవారు. అలా నేటి టెంట్ హౌస్‌లు, ఫంక్షన్ హాల్స్‌ను కిరాయికి ఇచ్చినట్టుగా సైనికులను కిరాయికి ఇచ్చి కిరాయి వసూలు చేసుకునేవారు. సైనికులకు కూలి లేదా జీతం కట్టిచ్చేవారు.

ఒకసారి ఈ రాజుకు మరోసారి ఆ రాజుకు సైన్యాన్ని కిరాయికి ఇచ్చారు. దానివల్ల మొదట గెలిచిన రాజు ఓడిపోయేవారు. తర్వాత గెలిచిన రాజు యూరప్ వారి సైన్యాల మీద ఆధారపడ్డం అనివార్యమైంది. ఇలా రెండు పక్షాల రాజులు బలహీనపడ్డారు. రెండు పక్షాల రాజుల నుండి కిరాయి కింద ప్రాంతాలను తీసుకున్నారు. మొగల్ సామ్రాజ్యం బలహీన మయ్యాక విజృంభించిన మరాఠా, నిజాం, టిప్పుసుల్తాన్ రాజ్యాలు, రాజులు పరస్పరం యుద్ధాలు చేసుకున్నారు.

ఈ యుద్ధాలకు ఫ్రెంచ్ వ్యాపారస్తులు పెంచుకున్న కిరాయి సైన్యాలను ఒకరు, ఇంగ్లాండ్ వ్యాపారస్తులు పెంచుకున్న కిరాయి సైన్యాలను మరొకరు కిరాయికి తీసుకున్నారు. ఒకసారి గెలిచారు. ఒకసారి ఓడారు. మరోసారి సంధి కుదుర్చుకున్నారు. ఇలా ఈ మూడు ప్రాంతాల రాజుల యుద్ధాల వల్ల బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ లాభాలు పెరిగాయి. అవి వారి నుండి కిరాయి కింద తీసుకున్న ప్రాంతాలు పెరిగాయి.

ఈ మూడు మరాఠా, నిజం, టిప్పుసుల్తాన్ రాజ్యాలు పరస్పరం కొట్లాడుకోకుండా ఉండి ఉంటే బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ పరిపాలన విస్తరించేది కాదని స్పష్టమౌతున్నది. ఈ వివరాలన్నింటిని ఉస్మానియా యూనివర్సిటీలో చరిత్ర శాఖలో ప్రొఫెసర్‌గా పనిచేసిన సరోజనీ రేగాని రాసిన **"నిజాం బ్రిటీష్ సంబంధాలు"** అనే పరిశోధక గ్రంథంలో చూడవచ్చు.

ఈ విషయాలను మరుగుపరచి బ్రాహ్మణవాద చరిత్రకారులు యూరప్ నుండి వ్యాపారం కోసం వచ్చి రాజ్యాలు ఏర్పరచుకున్న క్రమాన్ని వేరే అర్థంలో ద్వేషపూరితంగా పేర్కొంటున్నారు. శివాజీని అతని వారసులను ఆశ్రయించిన బ్రాహ్మణ పీష్వాల అహంకారాల వల్ల వారి నిర్ణయాల వల్లనే నిరంతరం మరాఠా రాజ్యం, నైజాం రాజ్యం, టిప్పుసుల్తాన్ ప్రాంతం యుద్ధాల్లో మునిగిపోయింది.

అత్యాశకు పోయి బ్రాహ్మణ రాజ్యాన్ని శివాజీ వారసుల పేరిట బ్రాహ్మణ పీశ్వాలు విస్తరించాలని ఉజ్జయిని దాకా యుద్ధాలు చేసుకుంటూ మొత్తం సంపద సృష్టి కర్తలను సైనికులుగా నిర్భంధంగా తీసుకోవడం వల్ల అటు ఉత్పత్తి ఆగిపోవడంతో పాటు ఇటు జననష్టం జరిగింది. మరోవైపు సూద్రులను, అతిసూద్రులను చిత్రహింసలు పెట్టి మానసికంగా బలహీనులు చేశారు. పర్యవసానంగా మరాఠా సామ్రాజ్యం బలహీనపడింది. దాంతో బ్రిటీష్, ఫ్రెంచ్ కంపెనీలు లాభపడ్డాయి.

వీటిని మరుగున పెట్టి మరాఠా సామ్రాజ్యం చరిత్రలో గొప్ప పాత్రను నిర్వహించింది అని అసత్యాలు చరిత్ర రచనగా ప్రచారం చేస్తున్నారు. శివాజీ, అతని తదనంతరం శంభాజీ కాలం వరకే మరాఠా రాజ్యం కొంత ప్రగతిశీల పాత్ర నిర్వహించింది. అటు తర్వాత పూర్తిగా బ్రాహ్మణపీష్వాల వశమై ఇండియాలో ఏ ప్రాంతంలో లేనంత క్రూరంగా సూద్రులను, అతిసూద్రులను అణచి వేశారు. మనుధర్మాన్ని ఆచరించడానికి పూనుకున్నారు. పంచములుగా ముద్రవేయబడిన తెగలు, జాతులు అంటరాని వారంటూ మూతికి ముంత ముడ్డికి తాటాకు చీపురు కట్టుకోవాలని నిర్భంధం చేశారు. ఇలాంటి క్రూరమైన పీష్వాల పరిపాలనను మొఘల్ సామ్రాజ్యం తర్వాత విస్తరిల్లిన మహోన్నత హిందూ సామ్రాజ్యం మరాఠా సామ్రాజ్యం అని ప్రచారంలో పెడుతున్నారు.

మరాఠా రాజ్యం కన్నా నైజాం రాజ్యం ఎంతో సుసంపన్నమైనది. కాకతీయుల



కాలం నుండి బహమనీయుల కాలం నుండి, కుతుబ్‌షాహీల కాలం నుండి దక్కన్ ప్రాంతం సంపద సృష్టిలో, సంపద సృష్టి కర్తల నైపుణ్యంలో, నీటిపారుదల సౌకర్యాల్లో, రవాణా సౌకర్యాల్లో పంటల ఉత్పత్తిలో మహోన్నత అభివృద్ధిని సాధిస్తూ వస్తున్నారు.

ఈ అదనపు సంపద, మానవ సంపద ఉత్పత్తి సాధ్యం కావడం వల్లే దక్కన్ ప్రాంతం నుండి సాతవాహనుల రాజ వంశాలు మొదలుకొని దొమ్మరి, వడ్డెర, ఎరుకలి రాజ్యాలు వీరి వారసులైన కాకతీయ రాజ్యాలు, మహ్మదీయుల రాజ్యాలు నిజాం రాజ్యం దాకా సిరిసంపదలకు విలసిల్లాయి. సామ్రాజ్యాలుగా విస్తరించాయి.

బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ ఇండియాలోని ఆస్తుల కన్నా నిజాం రాజ్య సంపద ఎన్నో రెట్లు ఎక్కువ. అది గమనించిన బ్రిటీష్ ఈస్ట్ ఇండియా కంపెనీ వారు, అటు తర్వాత ఇంగ్లాండ్ ప్రభుత్వం వారు నిజాం నుండి నయానా భయానా రకరకాల ఎత్తుగడలతో ఎంతో సంపదను, ఎన్నో ప్రాంతాలను వశపర్చుకున్నారు. ఇంగ్లాండుకు తరలించారు. ఇంగ్లాండ్ వారు తరలించిన సంపద వివరాలను డా॥ బి.ఆర్. అంబేద్కర్ సైమన్ కమిషన్‌కు సమర్పించిన పత్రంలో 120 పేజీలకు పైగా పేర్కొన్నారు. ఇండియా పేద దేశం కాదని, యూరోప్ దేశాల వాళ్ళు ఇక్కడి శూద్ర కులాలు సృష్టించిన సంపదను దోపిడీ చేశారని, ఇక్కడి నిపుణులైన చేతి వృత్తులను ధ్వంసం చేశారని, అక్కడ పారిశ్రామిక విప్లవం ఇండియాలోని శూద్రుల, అతిశూద్రుల రక్తమాంసాలతో నిర్మించుకున్నారని విశ్లేషించి చూపారు.

క్రీ.శ. 1932లో బ్రిటీష్ ప్రభుత్వం వారు రిజర్వేషన్లను ఏదో దయదలచి ఇచ్చారని కొంతమంది చరిత్రకారులు కూడా ప్రచారం చేయడం జరుగుతున్నది. కాని డా॥బి.ఆర్. అంబేద్కర్ ఇండియా నుండి ఇంగ్లాండ్‌కు తరలించిన సంపదను వారి రికార్డుల ప్రకారమే వారి ముందు ఉంచి ఎలా ఇక్కడి వారిని అణచివేసి పేదలుగా మార్చారో నిలదీసి స్పష్టం చేశారు. క్రీ.పూ. ఎన్నో శతాబ్దాల నుండి క్రీ.శ. 1810 దాకా ఇండియా నుండే యూరోప్ దేశాలకు సరకులు ఎగుమతి అయ్యేవి. ఇలా వేల ఏళ్ళుగా అలెగ్జాండరు మొదలుకొని ఘోరీ, మహ్మద్, షేర్షా, యూరోప్ వ్యాపారస్తులు, ప్రభుత్వాలు ఎంత తరలించినప్పటికీ, దోపిడీ చేసినప్పటికి ఇండియాలోని సంపద సృష్టికర్తలైన ఉత్పత్తి కులాలు, తెగలు మహోన్నత నైపుణ్యంతో నిరంతరం ప్రపంచం గర్వించదగిన సంపదను సృష్టిస్తూనే వస్తున్నాయని స్పష్టమౌతున్నది. చరిత్రలో వేల ఏళ్ళుగా జరుగుతున్న ఈ సంపద సృష్టి క్రమాన్ని, సంపద సృష్టి కర్తల కష్టసుఖాలను, నైపుణ్యాన్ని పట్టించుకోకుండా ఏదేదో చరిత్రగా రాయడం జరుగుతున్నది. అలా రాస్తున్న చరిత్ర ప్రజల చరిత్రగాని, సామాజిక చరిత్రగాని కాదు. అది ప్రజలను, సమాజాన్ని దోపిడీ చేసి, అణచివేసి, ఆధిపత్యం చెలాయించిన వారి దృక్పథాన్ని తెలుపుతుంది.

# రాజకీయ, సామాజిక పరిణామాల్లో భాగంగా భక్తి ఉద్యమాలు

నేడు శూద్రులుగా పిలువబడే ప్రజలు క్రీ.పూ. 6వ శతాబ్దంలో చార్వాక, లోకాయత, సాంఖ్య, వైశేషిక, ఆజీవక మొదలైన దాదాపు 100 రకాల శ్రమణుల సిద్ధాంతాలకు ఆకర్షితులై వారి తార్కిక, తాత్విక భావజాలాన్ని అనుసరిస్తూ ఆ తరువాత వచ్చిన బౌద్ధ, జైన ఉద్యమాలలో చేరి ఆయా మతాలను, సంస్కృతిని, భావజాలాన్ని స్వీకరించి క్రీ.శ. 6వ శతాబ్దం దాకా కొనసాగారు. నంద రాజుల నుండి సముద్ర గుప్తుని కాలం దాకా శూద్రుల స్థితి ఉన్నతంగానే ఉండేది. హర్షవర్ధనుని కాలంలో కూడా శూద్రుల, పంచముల స్థితి ఉన్నతంగా ఉండేది. అయితే సముద్ర గుప్తుని కాలంలో వర్ణ వ్యవస్థ ప్రజల మీద బలవంతంగా రుద్దబడింది. ఆచరించడానికి నిర్బంధించారు. శిక్షలు విధించారు. పురాణాలు, ఉపనిషత్తులు, పునర్ నిర్మించారు. రామాయణ భారతాలను విపులీకరించారు. పెంచారు. వేదాల్లో భగవత్‌గీతలో కులాల సృష్టిని దైవ భావంగా ఎక్కించారు.

భారతీయ సమాజంలో ఉత్పత్తి చోదక శక్తులైన శూద్రులు రాజరికాల కాలంలో తమకు జరిగిన అవమానాలను, గౌరవాలను అనుసరించి అనేక విధాలుగా స్పందించారు. సామాజిక గౌరవం కోసం ఆత్మవిశ్వాసం కోసం, పనిలో శ్రద్ధకోసం, నిబద్ధత కోసం యోగాధ్యానం, పూజా, భక్తి, జాతరలు, నూతన భావజాల సృష్టి, సమాజంపట్ల, వర్ణ వ్యవస్థ పట్ల తమదైన ఆధిక్యతా దృష్టితో జీవించడం, ఉద్యమించడం కనబడుతుంది. అందుకు భక్తి ఉద్యమాలు ప్రధాన వాహికగా పనిచేశాయి. బ్రాహ్మణవాద వర్ణ వ్యవస్థ విధించే కుల వివక్షతను వీరు వ్యతిరేకిస్తూ వచ్చారు.

వీటన్నిటికి వ్యతిరేకంగా బౌద్ధం సన్నగిల్లిన తరువాత పెరిగిన నిర్బంధాలను మానసిక, శారీరక, ఆర్థిక, సాంఘిక అణచివేతను ఎదిరిస్తూ భక్తి ఉద్యమాలు మొదలయ్యాయి. తంత్రవాదం, యోగ, ధ్యానం, పూజ, సంచార భక్తి ఇందుకు సాధనాలయ్యాయి. ఆదిశంకరాచార్య ప్రచార కాలంలో క్షీణదశకు చేరిన బౌద్ధంపై



మరో దెబ్బపడి శూద్రులు, బౌద్ధులు, పంచములు మరింత అణచివేతకు, దోపిడీకి గురియయ్యారు. బౌద్ధం జైనం క్రీ.శ. 13వ శతాబ్దిదాకా కొనసాగినప్పటికీ వర్ణ వ్యవస్థ బ్రాహ్మణిజం బలంగా రాజుల ద్వారా ముందుకు తేబడింది. రాజులను ఆశ్రయించిన బ్రాహ్మణులు పరస్పర ప్రయోజనాల కోసం వర్ణ వ్యవస్థను రాజుల చేత ఒప్పించి ప్రజలపై రుద్దారు. రాజులపై తిరుగుబాటు లేకుండా దొంగతనాలు లేకుండా వుండాలంటే దైవభక్తి పెంచితే అది రాజులకు ప్రజలపై కూడా ఆధిపత్యం పెరగడానికి ఉపయోగపడుతుందని భావించి మానసికంగా ప్రజలను అణచివేయడానికి వర్ణ కుల వ్యవస్థ అవసరమని బోధించి ఒప్పించారు. అలా బ్రాహ్మణీయ వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థ, కర్మ, పునర్‌జన్మ సిద్ధాంతాలను సృష్టించి ఆచరణలో పెట్టించారు. శాతవాహనులు ఆ తదనంతరం వచ్చిన రాజులు ముఖ్యంగా విష్ణు కుండినులు మొదలైనవారి కాలంలో బౌద్ధం, జైనం నుండి బ్రాహ్మణిజానికి మలుపు తీసుకున్నట్టు కనబడుతుంది. అలాగే ఇక్ష్వాకులు, చాళుక్యులు, కాకతీయులు, విజయనగర రాజులు కూడా ఇలా వర్ణ వ్యవస్థ సిద్ధాంతానికి ఆమోదం తెలిపి ఆచరించే శాసనాలను కొన్ని ప్రవేశపెట్టారు. బ్రాహ్మణుల స్వార్థం కోసం గుళ్ళను, వాటికి వేల ఎకరాల భూములను, గ్రామాలను దానాలుగా, అగ్రహారాలుగా పొందారు. ఇలా వారు సుస్థిర జీవితంతో నిరంతరం వర్ణ వ్యవస్థ సిద్ధాంతాలను ప్రచారం చేస్తూ అందుకు పంచాంగం, జ్యోతిష్యం, వాస్తు, రామాయణ, భారతాలు, వేదాలు, పురాణాలు మొదలైన వాటిని సాధనాలుగా మార్చుకున్నారు. వాటిని ప్రశ్నించకుండా వుండేందుకు శూద్రులు వీటిని చదవకూడదని కట్టడి చేశారు.

వీటిని వ్యతిరేకిస్తూ శూద్రులు బౌద్ధం ప్రభావం తగ్గి వర్ణ కుల సమాజంగా మారిన తరువాత భక్తి ఉద్యమాలను ఆశ్రయించారు. తమ ఆధిక్యత కోసం 7వ శతాబ్దం నుండి కుల వ్యవస్థలోనే తమదైన కుల పురాణాలను సృష్టించుకున్నారు. క్రీ.శ. 7వ శతాబ్దంలో దళితులు ఆది జాంబవ పురాణం, దక్కలి పురాణం మొదలైవి సృజించి బ్రాహ్మణవాదానికి సవాల్ విసిరారు. బ్రహ్మణులు తమ పూర్వీకుల నుండే పుట్టారని పురాణాల నుండి అరుంధతీ, వశిష్ఠుల కథను, ఆది జాంబవ కథను ప్రచారం చేశారు. ఇందుకు వారిలో వందలాది కళాకారులు తయారయ్యారు. అది ఒక ఉప కులంగా రూపొందింది. వాళ్ళు ఇప్పటికీ కొనసాగుతున్నారు. ఇలా ప్రతి కులానికి వారి కుల పురాణాలను ప్రచారం చేసే ఉప కులాల కళాకారులు ఏర్పడ్డారు. కాకతీయుల కాలం నాటికి సమాజంలో సుమారు 11 నుండి 18 కులాల దాకా ఏర్పడ్డాయని శాసనాల ద్వారా తెలుస్తున్నది. ఈ కులాలన్నీ కుల పురాణాలను రూపొందించుకోవడమే కాకుండా తమలోంచి కొంత మంది కళాకారులను తయారు చేసుకుని ఉప కులాలుగా రూపొందించడం, వారిని ఆదరించడం జరిగింది. వీరు ఆయా కులాల వంశ వృక్షాలను

ఆయా కుటుంబాల మూల పురుషులను కూడా చెప్పేబాధ్యత స్వీకరించారు. అలా ఇటీవలి దాకా ప్రతి కులానికి, కుటుంబానికి వారి పూర్వ చరిత్ర, వంశమూల పురుషులను చెప్పే ప్రత్యేక చరిత్ర కారులు ఈ ఉప కులాల్లో వుండేవారు. ఈ చరిత్ర పరిణామం ప్రాధాన్యత తెలియక వారిని ఆదరించడం తగ్గడంతో ఆయా ఉప కులాల వాళ్ళు తిండికి లేక పేదలుగా మారి కూలీలై చెల్లా చెదరై శిథిలమైపోయారు. గౌడ పురాణం, పద్మపురాణం, కొలుపుల కథ, శారద కాళ్ళు కథ, పటం కథలు మొదలైనవి ఇప్పటికీ అక్కడక్కడా లభ్యమవుతున్నాయి. కొన్ని పుస్తకాల రూపంలో కూడా వెలువడ్డాయి.

తెలుగులో భక్తి భావనను 'శివతత్వ సారం' గ్రంథంతో మల్లికార్జున పండితారాధ్యుడు వెలువరించారు. పాలకుర్కి సోమనాధుడు 'బసవ పురాణం' మొదలైన గ్రంథాల ద్వారా వీరశైవ మతానికి విస్తృత ప్రచారం కల్పించాడు. వీర శైవ, వీర వైష్ణవ మతాల ప్రచారంలో భాగంగా నన్నెచోడుడు, నన్నయ్య, తిక్కన, ఎర్రాప్రగ్గడ, అన్నమాచార్య, క్షేత్రయ్య, రామదాసు, త్యాగయ్య, కృష్ణమాచార్య మొదలైన వారు విశేష కృషి చేశారు.

పాశ్చాత్యులు 19వ శతాబ్దంలో భారత చరిత్రను ప్రాచ్యవాద సిద్ధాంతమని, పరిపాలకుల దృక్పథమని, క్రైస్తవ మిషనరీల దృక్పథమని మూడుగా వర్గీకరించారు. భారతదేశంలోని సామాజిక సంస్కృతిక అంశాలపై గ్రామీణ సమాజంపై మార్క్స్ వెలువరించిన అభిప్రాయాలను భారతీయులు అంగీకరించడం లేదు. ఆయనకు ఆనాటికి అందుబాటులో వున్న సమాచారం తక్కువ కనుక తప్పుడు అభిప్రాయాలకు రావడం జరిగింది. భారతీయ సమాజాన్ని తాత్విక సిద్ధాంతాల కంటే మతాలే అధికంగా ప్రభావితం చేసాయని ఒక అభిప్రాయం వుంది. అయితే తాత్విక సిద్ధాంతాలే ఆచరణ రూపంలో స్థిరంగా సంస్కృతిగా ఆచరించినప్పుడే వాటిని మతాలుగా చెప్పడం జరుగుతున్నది. అందువల్ల భక్తి ఉద్యమాలు కూడా తాత్విక సిద్ధాంతాల సంఘర్షణలో భాగంగానే శూద్ర భక్తి ఉద్యమాలు, బ్రాహ్మణ భక్తి ఉద్యమాలు వేర్వేరు సిద్ధాంతాలను ముందుకు తెచ్చి పరస్పరం ఘర్షించుకున్నాయి. వ్యతిరేకించుకున్నాయి. బ్రాహ్మణులు శూద్ర కులాల నుండి ఎదిగిన భక్త కవులను, ఉద్యమకారులను అనేక విధాలుగా హింసించారు. అవమానాల పాలు చేశారు. గురు రవిదాసు, కబీరు, త్యాగయ్య, భక్తతుకారం, నామ్‌దేవ్ మొదలైన వారు ఎన్నో అవమానాలను, హింసను ఎదుర్కొన్నారు. ఆల్వార్లు వైష్ణవ మతాన్ని ప్రచారం చేశారు.

ఒక దేశ సామాజిక చరిత్రను అవగాహన చేసుకోవడమంటే ఆ దేశంలోని ఉత్పత్తి శోధక శక్తులను మానవ సంబంధాలను, ఉత్పత్తి సంబంధాలను క్రమపద్ధతిలో పరిశీలించడం అని డి.డి. కోశాంబి అభిప్రాయం. వేటూరి ప్రభాకర శాస్త్రి, చిలుకూరి నారాయణరావు, బండారు తమ్మయ్య, నిడదవోలు వెంకటరావు, వీరశైవ సాహిత్యాన్ని గురించి విశేష పరిశోధన చేశారు. వైష్ణవ సాహిత్యంపై ప్రభాకరశాస్త్రి, కాశీనాథుని



నాగేశ్వర రావు అనేక విషయాలను వెలికి తెచ్చారు.

శూద్రులను వర్ణ వ్యవస్థలో అణచివేయడానికి, సముదాయించడానికి రెండు విధాలుగానూ ఈ క్రింది మూడు శ్లోకాలను విస్తృతంగా బ్రహ్మణవాదులు ఉపయోగించు కున్నారు.

### కులాలను ఎలా స్థిరీకరించారు ?

"బ్రాహ్మణోస్య ముఖమాసిత్, బహూరాజన్యకృతః
ఊరూతదస్య యొద్వైః పద్భ్యామ్ శూద్రో అజాయత" (ఋగ్వేదం, 10-90)
'చాతుర్వర్ణ్యం మయాసృష్టం గుణకర్మ విభాగశః
తస్యకర్తారమపిమాం విద్ధ్యకర్తారమవ్యయమ్" (భగవద్గీత. 4-13)
జన్మనా జాయతే శూద్ర...

అని భగవద్గీతలో పేర్కొన్నారు. క్రీ.శ. 6వ శతాబ్దంలో బౌద్ధం నుండి ఇతర సిద్ధాంతాల నుండి తీసుకొని భగవద్గీత హర్షుని కాలంలో విపులీకరించారు. 6వ శతాబ్ధం నాటికి బౌద్ధం, జైనం స్థాయిలోకి వైదికం విస్తరిస్తూ ఆత్మవిశ్వాసం పెంచుకున్న క్రమంలో రండి రండి అందరూ తిరిగి బ్రాహ్మణ మతంలో చేరండి పుట్టుకతో అందరూ శూద్రులే అంటూ బౌద్ధ, జైన, ఆదివాసీ ప్రజల నుండి ఓటు బ్యాంకును పెంచుకున్నారు. అలా ఓటు బ్యాంకు పెంచుకోవడానికి భగవద్గీత ద్వారా ఈ రెండు శ్లోకాలు ప్రచారం చేయబడ్డాయి. వారి లక్ష్యం నెరవేరింది. లక్షలాది ప్రజలు తిరిగి వైదిక మతంలో చేరారు. కులాలు మార్చుకున్నారు. లక్షలాది శూద్రులు బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య కులాలుగా మారిపోయారు. అలా తిరిగి వైదిక మతం పునరుద్ధరించడానికి ఈ రెండు శ్లోకాల ప్రచారం ఎనలేని ప్రభావాన్ని కలిగించింది.

కులం 6వ శతాబ్దం నుండి ఉత్పత్తి రంగానికి మాత్రమే పరిమితం కాకుండా భావజాలంలో ఒక బలమైన అంశంగా వుండటం వల్ల భక్తి ఉద్యమాల రూపంలో వాటిని ప్రశ్నించడం, తమ గౌరవాన్ని ఆత్మవిశ్వాసాన్ని పొందడం చేశారు. అందుకే భక్తి ఉద్యమాల్లో శూద్రులు, అతిశూద్రులు కవులుగా, ఉద్యమకారులుగా వినుతికెక్కారు. అయితే 12వ శతాబ్దం దాకా 13-20 వరకే కులాలు వుండేవి. క్రమంగా కులాలు రక్త సంబంధాలుగా స్థిరపడ్డాయి. వృత్తినైపుణ్యం అవసరం రీత్యా సొంత కుల వృత్తిగల వారి నుంచే రక్తసంబంధాలు అనివార్యం చేసుకున్నారు. అలా కులం ఒక తెగగా, జాతిగా, వంశంగా, ఉత్పత్తి యూనిట్‌గా కొనసాగుతూ వచ్చింది. భక్తిని సామాజిక అంశంగా గుర్తించడం డి.డి. కోశాంబితో ప్రారంభమైందని కొందరి అభిప్రాయం. అయితే మహాత్మా జ్యోతిబా పూలే, డాక్టర్ బి.ఆర్. అంబేద్కర్ వందేళ్ళ ముందే భక్తిని,

మతాన్ని సామాజిక, రాజకీయ కోణాల్లో విశ్లేషించి వాటి చారిత్రక మూలాలను కూడా గ్రంథస్తం చేశారు.

శ్రీశైలం గుడి మొదట మల్లమ్మ గుడిగా ఉండేది. స్త్రీల ఆరాధన ఉండేది. అక్కమాంబ కర్నాటక ప్రాంతం నుండి శ్రీశైలానికి చేరి భక్తురాలిగా 10వ శతాబ్దంలో జీవించింది.

భక్తి అంటే పూర్తిగా సరెండర్ కావడం, దాసుడు కావడం. దైవానికి పూర్తిగా అంకితం కావడం. తద్వారా బ్రాహ్మణ పూజారులకు, రాజులకు కూడా పూర్తిగా దాసులుగా అంకితమై ఉంటారు. శైవ, వైష్ణవులకు జరిగిన పోరాటాల్లో ఇరుపక్షాలూ నష్టపోయారు. ఇస్లాం మతానికి ఆదరణ పెరిగింది. దాంతో శైవ, వైష్ణవ మత బ్రాహ్మణులు కలిసి ఉందామని హరి హర మతం పేరిట శివకేశవులను కలిపారు. అంతకు ముందు ఇలాంటి వైరుధ్యం ఏర్పడినప్పుడు త్రిమూర్తులని, వాళ్ళు బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులని ప్రతిపాదించి కలిపారు. దశావతారాలు విష్ణువుకు ప్రతిపాదిస్తూ వచ్చారు. కొన్ని అవతారాలను వదిలేసి మరి కొన్ని చేర్చారు. శివుడిని విష్ణువు అవతారంగా చేర్చలేదంటే శైవం వైష్ణవంతో సమానంగా కొనసాగుతూనే ఉందని అర్థం.

భక్తి అనేది కౌలుదారు భూస్వామిపై ఆధారపడటానికి ఉపయోగపడిందని కోసాంబి, ఆర్.ఎస్ శర్మ, ఆర్.ఎన్. నంది అభిప్రాయ పడ్డారు. ఇందుకు భిన్నంగా ఇర్ఫాన్ హబీబ్ భక్తి ఉద్యమాలను వ్యవసాయ రంగంలో, ఉత్పత్తి రంగంలో, పట్టణ జీవితంలో వచ్చిన ఆర్థికాభివృద్ధి ఫలితంగా ఉత్పాదక వర్గాలు తమ సామాజిక గౌరవం కోసం, స్థాయి కోసం చేసిన ప్రయత్నమని విశ్లేషించారు. అయితే జైనం, బౌద్ధం శిథిలమయ్యాక సామాజిక గౌరవం కోసమే కాకుండా మానసిక ప్రశాంతత కోసం యోగ, ధ్యాన, పూజ ప్రక్రియలను భక్తిని సాధనంగా మలచుకోవడానికి యుద్ధాలు, యుద్ధాల్లో నిర్బంధంగా సైనికులుగా చేర్చుకోవడం, సంచార రహదారి వ్యాపారం కోసం కుల వృత్తి ఉత్పత్తుల సంచార వ్యాపారం స్వయంగా జరపడం కోసం జరిగిన సంఘర్షణలో భక్తి ఉద్యమాలు పుట్టి పెరిగాయి. ముఖ్యంగా శూద్రుల నుండి, ఆదివాసుల నుండి రాజులుగా మారిన వాళ్ళు తమ మూలాలను వదిలివేసి వర్ణ వ్యవస్థను ఆశ్రయించి తమ మూలాలను ఇంద్ర వంశానికి, చంద్రవంశానికి, సూర్యవంశానికి అంటగట్టించు కోవడం కోసం బ్రాహ్మణుల సంస్కృత భాష మీద, భావాల మీద ఆధారపడం వల్ల శూద్రులు తమదైన సొంత సిద్ధాంతాలను రూపొందించుకోవడంలో భాగంగానే భక్తి ఉద్యమాలు, కుల పురాణాలు మొదలైనవి వ్యాపించాయి. భారతదేశంలోని భక్తి ఉద్యమాలకు యూరప్‌లోని 16వ శతాబ్దంలో ప్రారంభమైన ప్రొటెస్టంట్ ఉద్యమాలకు అనేక పోలికలు వున్నాయి. భక్తి ఉద్యమాలు 8వ శతాబ్దం నుండి ప్రారంభమైతే



యూరప్‌లో పునర్‌జీవన ఉద్యమాలు 16వ శతాబ్దంలో ప్రారంభమయ్యాయి. ముస్లింల దండయాత్రలు, రాజ్యాల ఏర్పాటు, భక్తి ఉద్యమాలు శైవ, వైష్ణవ, వీరశైవ, వీర వైష్ణవ ఉద్యమాలుగా రూపొందడానికి మరో ప్రధాన కారణం. వీర శైవం, వీర వైష్ణవం ఉద్యమాలు స్పష్టంగా ఇస్లాం లోని మిలిటెన్సీని, ఏకేశ్వ రోపాసనను స్వీకరించి నూటికి నూరుపాళ్ళు ఇస్లామ్ మతాన్ని అనుసరించినవే. అందుకే అందులో సూఫీ ఉద్యమ దశ, సైనిక వీర రస దశలతో పాటు తాంత్రిక, జోగిని, దేవదాసి, కృష్ణ, వేశ్య వ్యవస్థలను భక్తి ఉద్యమాల్లో ప్రవేశపెట్టారు. రాజ్యాధికార విస్తరణలో, స్థిరీకరణలో భక్తి ఉద్యమాలు రాజులచేత, రాజ ఉద్యోగుల చేత, వర్ణ వ్యవస్థ చేత ప్రోత్సహించబడ్డాయి. గుళ్ళను విస్తారంగా కట్టించారు. శూద్రులు గుళ్ళ సంస్కృతిని వ్యతిరేకించారు. దేవుడు అంతటా వున్నాడని ప్రతి మనిషిలో దైవత్వమే వుందని సిద్ధాంతీకరించారు. గుడిలోకి వేశ్యను చొప్పించారు. తమ సుఖానికి, భోగలాలసతకు వేశ్యను వేదికగా చేసుకొని అంగరంగ భోగాలను అనుభవించారు. అందుకే 15,16వ శతాబ్ధాలకు చెందిన కవి చౌడప్ప ఇలా రాసారు.

"లంజలు రాకుండిన గుడి రంజిల్లదు ప్రజల మనసు రంజిల్లదు
లంజల నేల సృజించెనో కంజబోడిల కుందవరపు కవి చౌడప్పా"

ఇలా దేవాలయాల్లో బ్రాహ్మణ వర్ణం అనుభవించిన సౌఖ్యాల్ని వర్ణించారు. "వెళ్ళిన ప్రతి ఊళ్ళోను స్వామి వారిని దర్శించి సానివాడను హర్షించి వేడుకతో నడుచుకొన్న విటరాయుళ్ళమని గర్వంగా" సిగ్గు విడిచి చెప్పుకున్నారు సంకీర్తనా రాయుళ్ళు. సింహాచల దేవస్థానంలోనూ, తిరుపతి దేవస్థానంలోనూ సాగిన వేశ్యా వృత్తిని గూర్చి ఆ దేవాలయాల శాసనాలే సాక్ష్యం. సింహాచలం దేవాలయంలో ఒక ప్రత్యేకమైన వ్యవస్థను దేవదాసీల గూర్చి ఏర్పాటు చేసిన విషయం శాసనాల్లో విపులంగా వివరించబడింది. కృష్ణ దేవరాయల కాలంలో వేశ్యల మీద వేసే పన్ను ద్వారా 40 శాతం ప్రభుత్వ ఆదాయం చేకూరేదని చరిత్ర తెలుపుతున్నది.

ఉత్తర భారతదేశంలో భక్త జయదేవుడు 12వ శతాబ్దంలో బెంగాల్‌లో గీత గోవిందం రాసి రాధాకృష్ణుల పచ్చి శృంగారాన్ని భక్తిగా ప్రచారం చేశారు. ఇలా బ్రాహ్మణుల ఆధిపత్యం కోసం బౌద్ధం వంటి ఇతర మతాల నుండి ఆకర్షించడానికి వ్యభిచారాన్ని ప్రోత్సహించారు. తాపీ ధర్మారావు, ఆరుద్ర, దేవాలయాలపై బూతు బొమ్మలు ఎందుకున్నాయో గుళ్ళు వ్యభిచార కేంద్రాలుగా ఎలా మార్చారో సవివరంగా పేర్కొన్నారు. చైతన్య ప్రభు బెంగాల్ నుండే విస్తారంగా కృష్ణ భక్తిని ప్రాచుర్యంలోకి తెచ్చారు. అంతకు ముందు కృష్ణుడు దేవుడు కాదు. అతనికి గుళ్ళు లేవు. 11వ శతాబ్దం నుండే కృష్ణుడు దేవుడుగా ప్రాచుర్యంలోకి వచ్చాడు. 13వ శతాబ్దం నుండి

17వ శతాబ్దం వరకూ సాగిన భక్తి ఉద్యమాలు ఉత్తర దక్షిణ భారతదేశంలో భిన్నంగా సాగాయి. సంత్ కవులు ముస్లింల ఆధిపత్యానికి వ్యతిరేకంగా వర్ణ వ్యవస్థకు వ్యతిరేకంగా తీవ్రంగా ప్రచారం చేశారు. బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని ప్రశ్నించారు.

ఉత్తర భారతదేశంపై 9వ శతాబ్దం నుండి ముస్లిమ్‌లు అనేక సార్లు దాడులు చేస్తూ రావడం వల్ల గ్రామాలు, సమాజం అల్లకల్లోలమయ్యాయి. 1112లో పృథ్విరాజ్ ఓడిపోవడంతో మహ్మదీయుల రాజరికాలు స్థిరపడ్డాయి. 1206లో ఢిల్లీ రాజధానిగా కుతుబుద్దీన్ హైబక్ రాజ్యం చేశాడు. హిందూ రాజులు ముస్లిం రాజులకు కప్పం చెల్లిస్తూ సామంత రాజులుగా కొనసాగారు.

ఉత్తర భారతదేశంలో "తీర్థయాత్ర వర్కరీ భక్తి సంప్రదాయం" విస్తరించింది. మహారాష్ట్రలో "మహానుభావ సంప్రదాయం" ఒక ప్రత్యేక శాఖగా చక్రధర్ 13వ శతాబ్దంలో స్థాపించాడు. బ్రాహ్మణుల ఆధిపత్యాన్ని వేదాల ప్రమాణాన్ని తిరస్కరించి కృష్ణుని కొలవడం వీరు తెచ్చిన సిద్ధాంతం. చక్రధర్‌ను బ్రాహ్మణులు హత్య చేశారు. జ్ఞానదేవుడు 13వ శతాబ్దంలో "వర్కరీ తీర్థయాత్రికుల విఠల సంప్రదాయాన్ని" ప్రారంభించారు. నామదేవ్, చొక్కమేల, తుకారాంలు ఈ సాంప్రదాయాన్ని బాగా ప్రచారం చేశారు. కృష్ణ అనే పేరుతో దేవాలయాల్లో వేశ్యలను ఒక వ్యవస్థగా శూద్ర కులాల నుండి పంచముల నుండి ఈ కాలంలోనే రూపొందించారు. అలా బ్రాహ్మణులు మరొక వైపు నుండి శూద్రుల ఆత్మ విశ్వాసాన్ని దెబ్బతీసే దేవదాసీ, కృష్ణ బసవి, జోగిని మొదలైన వ్యవస్థలను గుళ్ళకు అనుబంధంగా ఏర్పరచి శూద్ర, అతిశూద్ర కులాల స్త్రీలను బలవంతంగా ఊరి వేశ్యలుగా, దేవుని భార్యలుగా మార్చబడ్డారు. ఈ రెండు భక్తి ఉద్యమాలు పరస్పరం వ్యతిరేకంగా పనిచేశాయి. కానీ చరిత్ర కారులు రాజా స్థానాల్లో లాభం పొందినవాళ్ళు ఈ రెండు భక్తి ఉద్యమాలు వేరు వేరు అని వర్గీకరించలేక పోయారు. గ్రామీణ పెత్తందారులుగా మారుతున్న కులాలు శూద్రుల నుండి వారి ఆత్మవిశ్వాసం, గౌరవం నేలరాయడం కోసం ఈ వ్యవస్థలను వారిపై బలవంతంగా రుద్దారు. కలలో దేవుడు కనపడ్డాడని నీ కూతుర్ని తనకు ఇచ్చి పెళ్ళి చేయాలని దేవుడు కోరాడని బ్రాహ్మణులు, ఊరి పెత్తందారులు కథలు అల్లారు. క్రమంగా దీనావస్థలో అతిశూద్రులు తామే తమ కూతుళ్ళను దేవునికి అర్పించే దుస్థితి ఏర్పడింది. కాకతీయుల కాలంలో లక్ష మంది వేశ్యలు ఒక వృత్తిగా జీవించారని "క్రీడాభిరామం" అనే గ్రంథంలో పేర్కొన్నారు. అయితే కనీసం ఓరుగల్లులో 13వేల వేశ్యలు జీవించేవారని పలువురి అభిప్రాయం. ఈ వేశ్యలకు ఆర్థిక సంపత్తి ఎక్కువ. గుళ్ళలోని దేవదాసీ, జోగినులకు ఆర్థిక సంపత్తి తక్కువ. బిచ్చగత్తెలుగా బతికిన దుస్థితి నేటికి కూడా చూడవచ్చు.



జ్ఞానదేవుడు ఆత్మహత్య చేసుకున్నాడు. నామదేవ్ వర్కరీ సాంప్రదాయానికి స్పష్టమైన కొత్త దృక్పథం ఇచ్చాడు. గుళ్ళలో దేవుడున్నాడనే భావాన్ని పూర్తిగా ఖండించాడు. నామదేవ్‌తో ప్రభావితుడైన అతిశూద్రుడు చొకమేల 14వ శతాబ్దంలో భక్త కవిగా ప్రసిద్ధుడయ్యాడు. అంటరాని తనాన్ని తీవ్రంగా నిరసించాడు. 17వ శతాబ్దంలో భక్తతుకారం తన భావాలకు భక్తి ఉద్యమాన్ని సాధనంగా మార్చుకున్నాడు.

రామనందుని 12 మంది ప్రధాన శిష్యుల్లో 8 మంది శూద్ర, అతిశూద్రులే. కబీరు శూద్రుడైతే, గురు రవిదాస్ అతిశూద్రుడు. కబీరు, గురు రవిదాస్ రామానంద శిష్యుల్లో ప్రముఖులు. గురు రవిదాస్‌కు ఉత్తర భారతదేశంలో వందలాది గుళ్ళు కట్టించారు. పార్లమెంట్ వీధుల్లో ఒక వీధికి 'గురు రవిదాస్ మార్గ్' పేరు పెట్టారు. గురు రవిదాస్, కబీర్ నిరాకారుడైన దైవాన్ని, దేవుడు ఒక్కడే అని ప్రచారం చేశారు. అందరిలో వున్న జీవుడు ఒక్కడే అని అందరినీ సమానమైన దైవత్వంతో గౌరవించాలని వీరు ప్రచారం చేశారు. అలా "సామాజిక సామ్యవాదాన్ని" భక్త కవులు శతాబ్దాల తరబడి సూఫీ ఉద్యమ, ఇస్లామ్ సిద్ధాంతాల స్ఫూర్తితో ప్రచారం చేశారు. బ్రాహ్మణవాదం దీనిని నిరంతరం వ్యతిరేకిస్తూ వర్ణ వ్యవస్థను, కుల వ్యవస్థను మళ్ళీ మళ్ళీ ప్రతిపాదిస్తూ అవసరమైనప్పుడల్లా ఎవరైనా బ్రాహ్మణుడు కావచ్చు అంటూ జన్మనా జాయతే శూద్ర శ్లోకాన్ని వల్లించేవారు.

క్రీ.శ. 1398-1518ల మధ్య కబీరు, గురు రవిదాస్ జీవించారు. గురు రవిదాస్ భక్తమీరాబాయికి గురువు. ఢిల్లీ చక్రవర్తి అయిన సికిందర్‌లోడీ గురు రవిదాస్ వద్ద జ్ఞాన బోధ పొంది కాశీలో దానికి గుర్తుగా "జ్ఞానవాపి మసీదు" నిర్మించారు. అలా ఆ కాలంలో శూద్ర, అతిశూద్ర భక్తి ఉద్యమ కారులు రాజుల చేత కూడా విశేష గౌరవాలు పొందారు. గురు రవిదాస్ భక్త మీరాబాయికి గురువు కావడం సహించలేని రాజపుత్రులు అతన్ని 130వ ఏట హత్య చేశారని నానుడి. కబీరు, గురు రవిదాస్ ఇద్దరూ మంచి స్నేహితులు. కాశీ సమీపంలోని గ్రామాలు వారి జన్మస్థానాలు.

గురు రవిదాస్, కబీర్, సూఫీ, ఇస్లామ్ ఉద్యమాలతో ప్రభావితమైన గురునానక్ శిక్కు పంథాను ప్రారంభించారు. గురునానక్ 1469-1539 మధ్య జీవించారు. 1526లో బాబర్ పానిపట్ యుద్ధంలో గెలిచిన తరువాత మొగల్ సామ్రాజ్యం ప్రాభవం ప్రారంభమైంది. గురునానక్ శిక్కు పంథాను హిందూ ముస్లిమ్‌ల సఖ్యత కోసం ప్రారంభించారు.

11, 12 శతాబ్దాల మధ్య కాలంలో దక్కన్ పీఠభూమిలో కాకతీయులు రాజ్యం ఏలుతున్నప్పటికీ పలు ప్రాంతాల్లో చిన్న చిన్న రాజ్యాలు కొనసాగాయి. క్రీ.శ. 1336లో విజయనగర సామ్రాజ్యం ప్రారంభమైంది. కాకతీయులు వీర శైవ మతాన్ని ఆదరిస్తూ

జైనులను క్రమంగా వెనక్కి నెట్టారు. కాకతీయుల సహాయంతో ఏర్పరచిన విజయనగర సామ్రాజ్యంలో వీర వైష్ణవ మతాన్ని వ్యాప్తి చేశారు.

బౌద్ధుల కాలంలో చర్మకారులు కూడా బౌద్ధ నిర్మాణాలను చేపట్టారు. దానాలు ఇచ్చారు. గుంటూరు జిల్లాలోని అమరావతి బౌద్ధ చైత్యం. దాన్ని శివాలయంగా తరువాత మార్చారు. అమరావతి బౌద్ధ చైత్యంలోనే ఇటీవల దలైలామ ప్రపంచ కాలచక్ర ఉత్సవాలను నిర్వహించారు. ***అమరావతిలో లభించిన బౌద్ధ కలశం ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర చిహ్నంగా స్వీకరించబడింది. ఈ కలశాన్ని నిర్మించి ఇచ్చింది చర్మకారుడైన... అతిశూద్రుడు.*** అలాగే కాకతీయుల కాలంలో కూడా శూద్రులు, అతి శూద్రులు దేవాలయాలకు అనేక దానాలు ఇచ్చారని శాసనాలు తెలుపుతున్నాయి. తిరుపతి దేవాలయానికి సమీపంలోని పద్మావతి గుడిని పద్మశాలీలు నిర్మించి నట్లు తామ్ర శాసనం పేర్కొంటున్నది. కాకతీయ గణపతి దేవుడు కాలంలో 13వ శతాబ్దిలో నేతగాంద్రు దేవాలయాలకు దానాలు ఇస్తున్నట్టు వరంగల్‌లోని గిర్మాజీపేట శాసనం పేర్కొంటున్నది. నేతగాళ్ళు ధర్మశాలీలు, శాలీలు అనే పేరుతో ఒకే కులంగా రూపొందుతూ 'సాలీశ్వరుడ'నే దేవుడ్ని స్థాపించినట్లు గిర్మాజీపేట శాసనం వివరిస్తున్నది.

ద్రాక్షారామ ప్రాంతంలోని బోయలు క్రీ.శ. 11 శతాబ్ది నుండి 14వ శతాబ్ది కాలంలో దేవాలయాలకు వేల రూపాయల విలువ చేసే పశుసంపదను దానం చేశారు. 882 మంది బోయలు దేవాలయాల నిర్వాహణతో సంబంధం వుండేది. 179 మంది సైనిక నాయకులుగా పనిచేశారు. దేవాలయాలు నగరీకరణకు పనికి వచ్చాయని కొందరి చరిత్ర కారుల అభిప్రాయం. అవి వ్యాపార కేంద్రాలుగా, వ్యభిచార కేంద్రాలుగా, బ్యాంక్‌లుగా, గూఢచారుల కేంద్రాలుగా పనిచేశాయి. దానికి భక్తి ముసుగు ఎంతగానో ఉపయోగపడింది. ఉత్తరాంధ్రలోని కొన్ని గుళ్ళల్లో ఇప్పటికీ సంభోగ శిల్పాలు ఎన్నో కనపడతాయి. ఉత్పత్తి కులాల వాళ్ళు 11-16 శతాబ్దాల్లో తమ సాంఘిక గౌరవం కోసం ఎన్నో సిద్ధాంతాలను ఉద్యమాలను ముందుకు తెచ్చారు. దానాలు ఇవ్వడం, కుల పురాణాలను ఆదరించడం అందులో కొన్ని.

"క్రీ.శ. 12వ శతాబ్ది నుండి ఆంధ్రప్రదేశంలో రెండు ప్రయోగాలు జరుగుతూ వచ్చాయి. ఒక వైపు బ్రాహ్మణ ఆధిపత్యాన్ని స్థాపించడానికి ప్రయత్నం జరుగుతూ ఉండగా, దానిని వ్యతిరేకించి నూతన భావాలను, విశ్వాసాలను ప్రచారం చేసే మతాలు ప్రారంభమయ్యాయి. దీనివల్ల ఆధిపత్య వర్గాలను వ్యతిరేకించే సంప్రదాయం ఆంధ్రదేశంలో మధ్య యుగాల నుండి కొనసాగుతుండినట్లు గుర్తించగలం. వీర శైవులు, వైష్ణవులు కుల విధానాన్ని స్పష్టంగా ఖండించారు. బ్రాహ్మణాధిపత్యాన్ని నిరాకరించి తమ మతానుయాయులను కులాతీతులుగా పరిగణించారు. అన్నమయ్య రాజులనూ



నిరసించాడు. ఈ లక్షణాలన్నీ ఉత్తర భారతంలోని భక్త కవుల భావాలకు తుల్యమైనవే. కాని, ఉత్తర భారతంలోని భక్త కవులలో లేని అనేక తాత్త్వికాంశాల చర్చ ఆంధ్రదేశంలోని వీరశైవ, వైష్ణవ మతాల్లో కనిపిస్తుంది.". (తెలుగులో భక్తి కవిత్వం, సామాజిక విశ్లేషణ - డా॥ పిల్లల మర్రి రాములు - 1999 పేజీ77)

12వ శతాబ్దిలో తిరుపతిలోని బాలాదేవి అనే జైన దేవాలయాన్ని వెంకటేశ్వరుని గుడిగా రామానుజాచార్యులు మార్పించారు. కాకతీయుల కాలంలో పద్మాక్షి, వేములవాడ గుళ్ళను ఇంకా పడమటి దిక్కు, దక్షిణం దిక్కు చూసే గుళ్ళన్నీ జైన దేవాలయాలను శివాలయాలుగా మార్చినవే. కన్నడలో బసవడి వీరశైవం కుల వ్యవస్థను, వేదాలను, బ్రహ్మణులను వ్యతిరేకించారు. బ్రహ్మనాయుడు వీర వైష్ణవాన్ని ప్రచారం చేశాడు. బసవుడు బ్రహ్మనాయుడు, నాగమ్మ, పాలకురికి సోమన, కాకతీయులు విజయనగర రాజులు, ముస్లింరాజులు చాళుక్యులు మొదలైన రాజులు సామ్రాజ్య విస్తరణకు రాజకీయ అవసరాలకు భక్తి ఉద్యమాలను గుళ్ళను, బ్రాహ్మణులను వర్ణ వ్యవస్థను పెంచి పోషించారు. ***ప్రజలు వీటికి భిన్నంగా సామ్యవాద భక్తి ఉద్యమాలను ఏకేశ్వరోపాసనను అందరిలో దైవత్వం వుందని ప్రకృతి అంతా దైవం నిండి వున్నదని గుళ్ళల్లో ఏమీ లేదని విస్తారంగా ప్రచారం చేస్తూ వైదిక బ్రాహ్మణ పురాణాలను, కులాలను వ్యతిరేకించారు.***

ఇలా భక్తి ఉద్యమాలు స్థానిక భాషలను తెలుగు, కన్నడ, మళయాల, మరాఠీ, బెంగాలీ, గుజరాతీ, హిందూస్తానీ, ఉర్దూ, కొంకణి మొదలైన భాషలుగా విస్తరించడానికి కృషి చేశాయి. ఇప్పుడు భారతదేశంలో రాష్ట్ర భాషలుగా కొనసాగుతున్న భాషా రూపాలు వాటి స్వభావం అభివ్యక్తి 11-16 శతాబ్దాల మధ్య కాలంలో భక్తి ఉద్యమాలు శూద్రులు, అతిశూద్రులు రూపొందించిన భాషలే. బ్రాహ్మణులు వీటిలో సంస్కృత పదాలు చేర్చుతూ వచ్చారు. సంస్కృతం నుంచి అనువాదాలు చేశారు.

12వ శతాబ్దంలో తంత్ర వాదం, వజ్రయానం ఒకే తీరున సాగడంతో బౌద్ధానికి, బ్రాహ్మణ మతానికి మధ్య గీత చెదిరిపోయింది. భక్తి పేరిట గుళ్ళు అంగ,రంగ వైభోగాలకు, వేశ్యాసుఖాలకు నిలయం కావడంతో ముస్లింల దండయాత్రలను ఎదుర్కోలేక పోయారు. బౌద్ధాన్ని ముస్లింలు, శైవులు, వైష్ణవులు క్రూరంగా అణచివేశారు. దాంతో బౌద్ధులు అందించే విద్య, వైద్యం, చైతన్యం, విహారాలు, ఆరామ వ్యవస్థలన్నీ చిన్నాభిన్నమై పోయాయి. బౌద్ధులు వేలాది మంది చంపబడ్డారు. అంటరానితనం పెరిగింది. మంత్ర తంత్రాలు, మూఢ విశ్వాసాలు, సంకీర్తన, భజన, క్షుద్ర విద్యలు పెరిగాయి. తంత్రం, శాక్తేయం, పంచమకారాలు విజృంభించాయి. లక్షలాది మంది ఇస్లాం మతంలో చేరారు. మరోవైపు భక్తి ఉద్యమాలు సంస్కరణ వాదాలుగా ముందుకు వచ్చాయి. అధిక ఉత్పత్తి చేసిన శూద్రుల సంపదను రాజరికాలకు, గుళ్ళకు, గుళ్ళల్లో దాచుకోవడానికి, యుద్ధాలకు ఖర్చు చేశారు.

# నిప్పు, నీరు, తోలు, రాయి, రోలు, చక్రం కుండ, వంట మానవ జీవితంలో ప్రవేశించిన తీరు

ఆదిమానవులు కాలక్రమంలో నూతన రాతియుగంలో (నియోలిథిక్ ఏజ్) ప్రవేశించారు. ఆ కాలంలో ఆదిమానవులు తమ జీవన విధానాన్ని మార్చుకున్నారు. ఆహారాన్ని వేటాడి కాల్చుకుని తినడం, కాయ కసరు, ఆకులు, దుంపలు, ఇలా దొరికినవి నమిలితినడం, దంచుకుని తినడం నుండి ఉడికించి వంట చేసుకుని తినడం మానవచరిత్రలో ఒక మౌలిక పరిణామం.

వంట చేసుకుని తినడానికి పాత్రలు కావాలి. పొయ్యి కావాలి. పొయ్యిలో కట్టెలు కావాలి. నీళ్లు కావాలి. ఆ తరువాత క్రమంలో వాటికి కారం, ఉప్పు, నూనె, ఉల్లిగడ్డ, ఎల్లిగడ్డ, అల్లం, కూడా కావాలి అని తెలుసుకున్నారు. అలా వాటిని వేసి వండడంద్వారా రుచి పెరుగుతుందని కనుక్కున్నారు. ఇలా వంట చేసుకుని తినడంద్వారా రుచి పెరుగుతుందని కనుక్కోవడం చరిత్రలో ఒక గొప్ప పరిణామానికి దారితీసింది. ఈ పరిణామాన్ని చరిత్రకారులు ఎక్కువగా పట్టించుకోలేదు. యూరోపియన్ చరిత్రకారులు, ప్రజలు ఇప్పటికీ కాల్చుకుని తినే వంట విధానానికే ప్రాధాన్యతనివ్వడం వల్ల వారికి ఈ విషయం యొక్క ప్రాధాన్యత గుర్తించలేకపోయారు.

కర్రదుంగలను దొర్లిస్తున్న క్రమంలో వాగుల్లో, నదుల్లో గుండ్రంగా తిరుగుతూ అవి కొట్టుకుపోతున్న క్రమంలో చక్రాన్ని కనుక్కోవడం ఒక మలుపు. అంతే ప్రాధాన్యత కలిగిన విషయం ఏమంటే వంటను, అందుకు అవసరమైన కుండను కనిపెట్టడం కూడా మానవ సమాజంలో ఒక గొప్ప మలుపు. వంటను, కుండను కనిపెట్టిన ఘనత ఆసియా దేశాల ఆదివాసీ జాతులకు ముఖ్యంగా ఇండియా ఉపఖండంలోని జాతులకు దక్కుతుంది.

వంటను ముందు కనుక్కున్నారా? కుండను ముందు కనుక్కున్నారా? అనేది



ఆసక్తికరమైన విషయం. చక్రం కనుక్కున్నాకే కుండను కనుక్కున్నారని చెప్పడం బ్రాహ్మణవాదులు ఉత్పత్తి విధానానికి దూరంగా వున్న అమాయకత్వాన్ని తెలుపుతుంది. ఆంధ్రప్రదేశ్ రాష్ట్రంలోని ఆదిలాబాద్ జిల్లాలో క్రీ.శ. 2005లో కూడా చక్రం లేకుండా చల్లని నీటికోసం రంజన్‌లను చేతితో జొన్నరొట్టెలు తయారుచేసినట్టుగా పచ్చిమట్టితో రొట్టెలుగా సాగదీసి వరుసపై వరుస అతికించి రంజన్‌లను తయారుచేస్తుంటారు. ఇది చక్రం అవసరంలేకుండా కుండను తయారుచేసే పద్ధతిని తెలుపుతుంది. అందువల్ల కుండను చక్రం కనుక్కున్నాకే తయారుచేసారు అన్న వాదానికి ఆధారం లేదు.

కుండను కనుక్కోవడం కాళ్లకు అంటిన బురద అచ్చులు ఎండిపోయిన తరువాత అదే ఆకారంలో చూసిన తరువాత జరిగివుంటుంది. అలాగే జంతువుల, మనుషుల పాదాల అచ్చులు బురదలో ఎండిన తరువాత కనపడ్డం కూడా వారిని ఆలోచనలో నెట్టివేసింది. బురద అంటిన కాయలు బురద ఎండిన తరువాత గుండ్రంగా రావడాన్ని చూసి కుండలు తయారుచేయాలని అన్పించి వుండవచ్చు. అప్పటికే రోలు రోకలిని కనుక్కున్నారు. అన్నట్టు రోలు రోకలిని కనుక్కోవడం కూడా మానవ సమాజంలో ఒక మహోన్నతమైన మలుపు.

రోలు రోకలిని రాయితో తయారుచేసేవారు. మానవ సమాజం తన సంస్కృతిలో, సెంటిమెంట్స్‌లో తన చరిత్రను నిక్షిప్తం చేసుకుంది. ఇంటినిండా బంగారం వుండే సంపన్నులు కూడా రాతి రోలు, రోకలినే వాడతారు. రోలు రోకలికి నేటి గ్రైండర్లు, మిక్సర్లు వచ్చేదాకా అపారమైన గౌరవం ఉండేది. ఇప్పటికీ కొన్ని జాతులలో చనిపోయినవారిని దహనం, ఖననం చేసి ఇంటికి వచ్చినతరువాత ఇంటిముందు రోకలిని ఉంచేవారు. ఆ రోకలిని దాటి వాకిట్లోకి, ఇంట్లోకి వెళ్లిన తరువాతే వాళ్లు తిరిగి తమ ఇళ్లల్లోకి చెప్పకుండా వెళ్లిపోతుంటారు. విషాదమైన విషయం కాబట్టి మళ్లీ వస్తానని చెప్పకూడదు. అలా చెప్పకుండా వెళ్లిపోతారు. రోకలిబండ మీదుగా దాటి చనిపోయివారి జ్ఞాపకాల జ్యోతిగా వెలిగించే దీపాన్ని చూసి నమస్కరించిన తరువాత ఎవరి ఇళ్లకు వారు వెళ్తారు.

ఇలా రోకలికి ఆహారాన్ని నోరు, దంతాలు చేయలేని పనిని చేసి మరెన్నో గట్టి గింజలను కాయలను ఆహారంగా మార్చుకోవడానికి సహకరించడంవల్ల ఈ ప్రాధాన్యత ఏర్పడివుంటుంది. రోలు తొలుత గుంతలాగా వుండకుండా చదరపు రాతిమీద రాతితో దంచడంగా వుండేది.

ఇలా రోకలిని చూసి అది గుండ్రంగా దొర్లడం చూసి కూడా చక్రాన్ని కనుక్కుని వుండవచ్చు. వంట అంటే పెద్ద వస్తువును చిన్న ముక్కలు చేసి ఉడికించి తినడం. చిన్న వస్తువులను కూడా ఉడికించి తినడం. కుండ మొట్టమొదటి వంటపాత్ర.

కుండను కనుక్కున్న ఆదివాసీ, నాగజాతి ప్రజలు వంటను ప్రపంచంలో మొదటిసారిగా ప్రారంభించారని కొందరి చరిత్రకారుల అభిప్రాయం. కుండ అనే పదం సంస్కృతంలో ప్రాచీన పదంగా మిగిలిపోయింది. సంస్కృత భాషలో కుండ అనే పదాన్ని తర్వాత కుంభ అనే పదంగా మార్చుకున్నారు. కుండ అనే పదం అలాగే సంస్కృతంలో ఉండిపోయింది. విశాల తెలంగాణ ప్రాంతాల్లో అందరూ కుండ అనే పదాన్ని వాడుతుంటారు. అందువల్ల దేశీయ భాషలనుండి సంస్కృతం పుట్టింది అని చెప్పవచ్చు. దేశీయ భాషల, ఆదివాసీ, నాగజాతి తదితర జాతుల, తెగల భాషలన్నిటినీ కలిపి సంస్కరించి పర్యాయపదాలుగా మార్చి సంస్కృతాన్ని తయారుచేసారు.

ఇండియాలో తోలు విప్లవం మొదటి ఉత్పత్తి విధానాల్లో తొట్టతొలి పారిశ్రామిక విప్లవం. తోలును చదునుచేసి మన్నిక చేసే విద్య ప్రపంచంలో తొట్టతొలి పారిశ్రామిక విప్లవానికి దారితీసింది. తోలును బట్టగా, కుండగా, సంగీత వాయిద్యమైన డప్పుగా డమరుకంగా, మద్దెలగా, డోలుగా మార్చుకున్నారు. డప్పు అనే పదం సుమారు క్రీ.పూ.2000 ఏళ్ల నాటిది. ఋగ్వేద వేదకాలంనాటి పర్షియన్‌ల జెండ్ అవెస్తాలో కూడా డాప్, డప్పు అనే పదాలను డప్పు అనే అర్థంలో ఉపయోగించిన విషయాన్ని అంబేద్కర్ పేర్కొన్నారు.

తోలును, డప్పును, తోలు విప్లవాన్ని సాధ్యం చేసింది తెలుగుభాషలో మాదిగలు అని పిలుస్తుంటారు. అందువల్ల ప్రపంచంలోని తొలి పారిశ్రామిక విప్లవకారులు, మాదిగలు అని స్పష్టమౌతున్నది.

అటుతర్వాత రోలు, రోకలి, కుండ, వంట కనుక్కున్న జాతులు, తెగలు మానవ సమాజంలో గొప్ప మలుపుకు కారణమయ్యాయి. ఆర్యులు అని పిలువబడే ఆదివాసీ తెగలు, జాతులు కాల్చుకుని తినడానికి పరిమితమయ్యారని యజ్ఞం, యజ్ఞ కర్మకాండ స్పష్టం చేస్తున్నది. వాళ్లు ఎడ్లను, ఆవులను, గుర్రాలను యజ్ఞాల్లో తాళ్లతో కట్టి నెట్టేసి కాల్చిన మాంసాన్ని ఎవరు తొడమాంసం, ఎవరు నడుము మాంసం, ఎవరు తల మాంసం తినాలో ఋగ్వేదంలోని శ్లోకాలు స్పష్టంగా తెలుపుతాయి. అందువల్ల ఆర్యులు కాల్చుకుని తినే వంటకే పరిమితమయ్యారు.

ఎరుకలు, దొమ్మరులు పందులను ఇలాగే కాల్చుకుని ఆ తరువాత వండుకుని తింటారు. పూర్వం పందులనే కాకుండా ఎడ్లను, ఆవులను, గుర్రాలను కూడా మంటల్లో వేసి కాల్చిన తరువాతే కోసుకుని తినేవారని ఋగ్వేదం ద్వారా తెలుస్తున్నది.

వంటలో మొదట రాతి ఉప్పు వాడేవారని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. కాని కొత్త చారిత్రక ఆధారాల వల్ల భూఖండాలు కలిసే వుండేవని తెలుస్తున్నది. అందువల్ల నేటి సముద్ర తీర ప్రాంతాల ప్రజలు ఉప్పు తయారుచేయడం నేర్చుకుని



ఇతర ప్రాంతాలకు వర్తక వాణిజ్యాలు నిర్వహించారని స్పష్టం అవుతున్నది. ఉప్పు తిన్నవారి మేలు మరువకూడదు. ఉప్పు తిన్నవారికి చెడు తలపెట్టకూడదు. అని పలు భాషల్లో సామెతలు ఉన్నాయి. నమ్మక్ హరాం అనేది అరబీలో ఉర్దూలో ఒక పెద్ద తిట్టు. ఉప్పుకు ఒకప్పుడు బంగారం కన్నా గొప్ప విలువ వుండేదని వారి ఉప్పు తిన్న శరీరం ఇది అని పలు భాషల్లో చెప్పడంద్వారా స్పష్టమౌతున్నది.

కుండ, వంట, ఉప్పు, నిప్పు, నీరు, చెప్పు, తోలు మానవ జీవితంలో పెనవేసుకుపోయాయి. చెప్పు తయారుచేసిన తరువాత దట్టమైన అడవుల్లో ముళ్లనుండి, తేళ్ల నుండి రక్షణ లభించింది. ప్రయాణం సులభమైంది. అరణ్యాలు దాటి సంచారం చేయడానికి చెప్పు, తాము ఎక్కడ వున్నామో, ఎక్కడ తప్పిపోయామో తెలుసుకోవడానికి జంతువులను భయపెట్టడానికి డప్పు ఎంతో ఉపయోగపడింది. అందువల్ల మొట్టమొదటి మానవ సంచార జాతులు వారి సంస్కృతి తోలు విప్లవాన్ని సాధించిన మాదిగలదే అని చరిత్రకారుల అభిప్రాయం. అందువల్లే వేదాల్లో, పురాణాల్లో మాదిగలు, మాలలు, మాతంగలు ఉన్నత దశలో ఉన్న క్రమాన్ని, వారిని కలుపుకొని సహజీవనం చేయాలనే విశ్వామిత్రుని కలలు, హరిశ్చంద్రుడు అందుకు నిరాకరించడం మొదలైన కథలు చోటుచేసుకున్నాయి. ఆర్యులు డప్పు నాదం విని ప్రళయం వస్తుందని భయపడిపోయేవారని అంటారు. పైగా మాతంగులు ఏనుగులను మచ్చిక చేసుకుని వాటిమీద అడవులు, కొండలు దాటేవారు. కొండంత ఏనుగులు ఆర్యుల గుడారాలను ఛిన్నాభిన్నం చేసేవి. ఈ బాధలన్ని ఎందుకని సప్తరుషులు కొందరు మాతంగులతో వియ్యమందుకుని ప్రసన్నం చేసుకోవాలని భావించారు.

కుండ ధాన్యాన్ని దాచిపెట్టుకోవడంలో, నీరు నిలువ వుంచుకోవడంలో నిర్వహించిన పాత్రతో పాటు వంటలో నిర్వహించిన పాత్ర వల్ల కుండను వేల యేళ్లుగా అన్ని తెగలు, జాతులు రకరకాల రూపాల్లో గౌరవిస్తున్నాయి. నమస్కరిస్తున్నాయి. ఇలా డప్పు, తోలు, రోలు, రోకలి, కుండ, వంట, ఉప్పు, చెప్పు, బల్లెం, ఈటె, బాణం, మానవ సమాజంలో నిర్వహించిన మహత్తరమైన పాత్రను ఆదిమానవులు ఎంతగానో గౌరవించారు. అవే ఆదివాసీ తెగల, జాతుల జీవితం నుండి మైదాన ప్రాంత, నగర, పట్టణ ప్రజలుగా మారిన తరువాత కూడా సంస్కృతిలో భాగంగా కొనసాగుతున్నాయి.

ఆదివాసీ తెగల్లో పెళ్లి చేయగానే కొత్త దంపతులకు అనువుగా వుండడానికి పెళ్లికి ముందే అందరూ కలిసి కొత్త గుడిసె వేసేవారు. అదే ప్రస్తుతం కొత్త పెళ్లి పందిరిగా ఇప్పటికీ కొనసాగుతున్నది. పదహారు రోజుల పెళ్లి పండుగ అనేది కూడా వెన్నెల రాత్రులకు సంబంధించిన పెళ్లి సంబరాల అవశేషమే. పెళ్లి తరువాత నాగవెల్లి

అని నాగపెళ్లి చేస్తారు. నాగవెల్లి అనేది నాగజాతి పెళ్లి విధానం ఇంకా సంస్కృతిలో భాగంగా మిగిలిపోయిన అవశేషం.

ఆదిమానవులు వేట, ఆహార సేకరణ దశ నుండి ఆహారాన్ని నిలువ చేసుకుని తినే అవకాశం పెరిగిన తరువాత కళలు విస్తరించాయి. ఆటపాటలు పెరిగాయి. వంట చేసుకునే పద్ధతి పెరిగింది. వేటకు, యుద్ధానికి సంబంధించిన సాధనాలను తయారుచేయడంలో మరింత నైపుణ్యం పెరిగింది. ఇల్లు కట్టడంలో, చెట్లను పడగొట్టడంలో, దూలాన్ని చెక్కి సానపట్టడంలో గొడ్డలితోపాటు, పెద్దబాడిస, ఉలి, సుత్తె నిర్వహించిన పాత్ర మహోన్నతమైనది. గొడ్డలి, ఉలి, సుత్తె కనుక్కున్న తర్వాత మరింత నైపుణ్యం గల పెద్ద బాడిసను తయారుచేసారు. పెద్దబాడిసను తయారుచేసాక కర్రతో పడవలను తయారుచేయడం సులువైంది. ఇంటి వాసాలు, దూలాలు, మంచాలు మొదలైనవి తయారుచేసుకోవడంతో పాటు సాహిసికులు అయిన కొందరు దుంగలను తోలు తాళ్లతో, నార తాళ్లతో కట్టి తోలు పరదాలతో నదుల్లో, సరస్సుల్లో నౌకాయానాన్ని చేయడాన్ని ప్రయోగాలు చేసారు. చివరకు నౌకాయానాన్ని తెలుసుకున్నారు. ఇలా క్రీ.పూ. 9000 సంవత్సరంనాటికే ఇండియా ఉపఖండం నుండి నదీతీరాలనుండి సముద్రయానాన్ని చేసినట్టుగా భావించబడుతున్నది.

మానవులు వ్యవసాయానికి కనుక్కున్న తరువాత కొన్ని గడ్డి జాతులనుండి వరి, గోధుమ, యవలు, జొన్న, రాగులు మొదలైన విత్తనాలను పండించడం ప్రారంభించారు. ఇది సుమారు క్రీ.పూ. 9000 సంవత్సరం నాటికి మానవ సమాజం వ్యవసాయ నాగరిక సమాజంలో మారడానికి సహకరించింది. దీనిని కొందరు నూతన రాతియుగంగానే వర్ణించారు.

"ప్రపంచ వ్యాప్తంగా నూతన రాతియుగం క్రీ.పూ. 9000 నాడే ప్రారంభమైనా దక్షిణాసియాలో మాత్రం నూతన రాతియుగం నాటి తొలి నివాసాలు పాకిస్తాన్‌లో బెలూచిస్తాన్‌లోని మెహ్రగర్‌లో కనబడతాయి. ఈ కాలంనాటి నివాసాలు కొన్ని వింధ్యపర్వత ఉత్తర ప్రాంతాలలో లభించినవి క్రీ.పూ. 5000కు చెందినవి కావచ్చు. భారతదేశంలో దక్షిణ ప్రాంతాలలోని నివాసాలు మాత్రం క్రీ.పూ. 2500 కంటే పూర్వపువి కావు. దక్షిణ తూర్పుప్రాంతాలలోని కొన్ని నివాసాలు క్రీ.పూ. 1000 ప్రాంతానికి చెందినవి. ఈ యుగంనాటి ప్రజలు బాగా పదునుపెట్టిన రాతి ఆయుధాలను ఉపయోగించారు. వారు ఎక్కువగా రాతిగొడ్డళ్లను ఉపయోగించారని తెలుస్తుంది. మన దేశంలోని పర్వత ప్రాంతాల్లో ఈ గొడ్డళ్లు ఎక్కువగా లభించాయి. రాతిపరికరాలు,ఆయుధాల మీద ఆధారపడడంతో ఈ కాలంనాటి ప్రజలకెక్కువగా కొండ ప్రాంతాలను దాటి విస్తరించలేదు. నిత్యజీవనానికి అవసరమైనంత మేరకే ఆహారాన్ని ఉత్పత్తి చేసుకునేవారు. కానీ వీరు



వరి, గోధుమ, బార్లీ వంటి ముఖ్యమైన పంటలను పండించారు. ఈ విధమైన వ్యవసాయం, జంతువుల్ని మచ్చిక చేసుకోవడం వారి జీవనశైలిలో ఎంతో మార్పును తెచ్చాయి." (ప్రాచీన భారతదేశం – డిఎన్ ఝా – పేజి 14) అయితే డి.ఎన్.ఝాతోపాటు చాలామంది ప్రపంచ చరిత్రకారుల అంచనాలను మార్చే పురావస్తు, ప్రాచీన నాగరికతలు బయల్పడ్డాయి.

కుండ కనుక్కోవడం ధాన్యాన్ని, నీరును నిలువ వుంచుకోవడానికి, ఎలుకల బారిన పడకుండా దాచుకోవడానికి ఎంతో గొప్పగా సహకరించింది. వంటలో కుండ పాత్ర ఎనలేనిది. అందువల్ల కుండకు ఇప్పటికీ అపారమైన గౌరవం కొనసాగుతున్నది. కొత్త ఇంటిలోకి వెళ్లినప్పుడు కొత్తకుండల పూజచేసి అందులో నీరు నింపుతారు. పెళ్లిలో కొత్తకుండల పూజచేసి అలంకరిస్తారు. చావులో కొత్తకుండలో నీరు తెచ్చి శవదహనానికి, ఖననానికి ముందు మూడు ప్రదక్షిణలు చేసి నీటి ధార వదులుతారు. విశాల తెలంగాణ ప్రాంత ప్రజలు, చాంద్రమానం పాటించే ప్రజలు ఉగాదినాడు కొత్తకుండలో ఉగాదిపచ్చడి చేసుకుని తాగుతారు. ఇలా కొత్తకుండ ప్రాధాన్యతను వేలఏళ్లుగా ఇప్పటికీ కొనసాగుతున్నది.

# ఇండియా ఉపఖండ మూలవాసులు నాగ, ద్రావిడ, తెలంగ జాతులు మాదిగ, మాల రాజులు

మాతంగరాజుల చిహ్నం ఏనుగు. బలవంతులైన ఈ రాజులను ఓడించడానికి గుర్రాల మీద బయల్దేరిన ఆర్య తెగలు జయించినట్లుగా ప్రాచీన సాహిత్యం తెలుపుతున్నది. వినాయకుడికి ఏనుగు తల అతికించడం, శివునికి అతనిని కుమారుడిగా కథ కల్పించడం స్థానిక ప్రజలను, తెగలను గౌరవించి తమ భాషలో, సంస్కృతిలో, చరిత్రలో ఆర్యులు ఇముడ్చుకోవడంగా కొందరు చరిత్రకారుల అభిప్రాయం. మాతంగులు అంటే నేటి దళితులు ముఖ్యంగా మాలలు, మాదిగలు. మాతంగ మహర్షులు, మాతంగరాజులు, వీరబాహు మొదలైన రాజులు వీరినుండి ఎదిగారు. అవి నందరాజుల కన్నా పూర్వపుకాలానికి సంబంధించిన ఆనవాళ్ళు. క్రీ.పూ. 15వ శతాబ్దం నుండి క్రీ.పూ. 7వ శతాబ్దం కాలానికి సంబంధించిన కథలు, గాథలుగా భావించవచ్చు. అటుతర్వాత పెద్ద సామ్రాజ్యంగా నందరాజ్యం విలసిల్లింది.

మహాభారతంలోని కథ మొదట 5 వేల లేదా 9 వేల శ్లోకాలతో జయా అనే పేరుతో ఉండేది. దాన్ని పెంచి భారతం చేశారు. ఆ తర్వాత ఇంకా పెంచి లక్ష శ్లోకాలు చేసి మహాభారతం చేశారు. అందుకే ఎవరైనా చిలువలుపలవలుగా పెంచి విషయాన్ని చెప్తుంటే చాట భారతం మొదలుపెట్టాడు అని అంటారు. 9 వేల శ్లోకాల మొదటి జయిలోని శ్లోకాలను కూడా ఎన్నిరకాలుగా మార్చి పడేశారో తెలియదు. 9 వేల శ్లోకాలు అలాగే వున్నాయని భావించినా నేటి మహాభారతంలో మొదటి కథ 9 శాతం మాత్రమే ఉందని అర్థం. 91 వేల శ్లోకాలు తర్వాత రాయబడ్డ కథనాలు. మహాభారత కథ ఆఫ్ఘనిస్తాన్‌గా పిలువబడుతున్న గాంధార ప్రాంతంనుండి పంజాబ్, హర్యానాల మీదుగా ఢిల్లీ, ఉత్తరప్రదేశ్‌లోని కొంత ప్రాంతం, మధ్యప్రదేశ్‌లోని కొంత ప్రాంతం వరకు సీమితమైన కథగా కనపడుతుంది. తర్వాత కల్పించిన అర్జునుని తీర్థయాత్రలతో దక్షిణాదిని ఒరిస్సా ప్రాంతాన్ని, బీహార్ ప్రాంతాన్ని అనుసంధా



నించినట్లుగా తెలుస్తున్నది. ఇప్పటికీ ద్రౌపదివలె బహు భర్తృత్వం గల తెగలు ఆఫ్ఘనిస్తాన్‌లోను, నేటి పాకిస్తాన్, పంజాబ్, హర్యానా, ఉత్తరప్రదేశ్ ప్రాంతాల్లో కొనసాగుతున్నట్లు సాక్ష్యాలు లభిస్తున్నాయి.

కృష్ణుని మరణంతో కలియుగం ప్రారంభమైనట్లుగా కలియుగ శతాబ్దం లెక్కించబడుతున్నట్లుగా ప్రాచుర్యంలో ఉంది. అది సుమారు క్రీ.పూ. 3,500 సంవత్సరాల పూర్వం. కనుక భారతంలోని గిరిజన తెగల మూలకథ క్రీ.పూ. 3,600 ప్రాంతంలో జరిగినట్లుగా ఊహించవచ్చు. సింధు నాగరికత క్రీ.పూ. 9000 సంవత్సరాల నుండి క్రీ.పూ. 1500 సంవత్సరాల దాకా కొనసాగినట్లు ఆధారాలు లభ్యమౌతున్నాయి. ఈ ఆధారాలను కృష్ణుని ద్వారకగా కూడా బ్రాహ్మణవాదులు కొందరు ప్రచారం చేస్తున్నారు. వర్ణ వ్యవస్థ సిద్ధాంతానికి అనువుగా మహాభారతాన్ని అందులోని సంఘటనలను, పాత్రలను, స్వభావాలను మార్చడానికి బ్రాహ్మణవాదులు 91 వేల శ్లోకాల ద్వారా ప్రయత్నించారని మిగతా 9 వేల శ్లోకాల్లోంచి మిగిలిపోయిన కొన్ని ఆధారాలు తెలుపుతున్నాయి.

మాతంగ మహర్షి సంతానమైన అరుంధతిని వశిష్ఠుడు పెళ్ళి చేసుకున్నాడు. అతని కుమారుడు అనగా అరుంధతి కుమారుడు శక్తి. శక్తి కుమారుడు పరాశరుడు. పరాశరుని భార్య గంగపుత్రి అనగా బెస్త కన్య సత్యవతి. వీరి సంతానం వేదవ్యాసుడు . వేదవ్యాసుడు అంబిక, అంబాలికలతో కలవడం వల్ల ధృతరాష్ట్రుడు, పాండురాజు పుట్టారు. భీష్ముని తండ్రి శంతనుడు. ఎవరినో ఇష్టపడ్డందుకు వారిని భీష్ముడు ఒప్పించి తండ్రికి భార్యలుగా తనకు తల్లులుగా కుదురుస్తాడు. కురువంశీయులు, కౌరవ వంశీయులు పాండవులు, పాండవుల్లో అభిమన్యుని కుమారుడు పరీక్షిత్తు. పరీక్షిత్తు కుమారుడు జనమేజేయుడు. జనమేజేయుడు సర్పయాగం చేస్తూ కాలక్షేపం కోసం జయి అని ప్రాచుర్యంలో ఉన్న భారతాన్ని వినిపించమని తద్వారా తమ పూర్వీకుల చరిత్ర తెలుస్తుందని కోరారు. అలా విన్పించినదే జయి. అదే 9 వేల శ్లోకాల నుండి లక్ష శ్లోకాలకు పెరుగుతూ పోయింది. మహాభారతం అయ్యింది.

ఈ వంశ వృక్షంలో మాతంగ రాజులు, బెస్త రాజులు, యాదవ రాజులు కనపడతారు. ఆయా తెగలను కులాలుగా వర్ణవ్యవస్థ ప్రకారం వర్గీకరించడానికి బ్రాహ్మణవాదులు పడిన తంటాలు మహాభారత పాత్రల్లోని వంశవృక్షాల్లో కనపడతాయి. రాజులు అనే పదం ఇప్పటి అర్థంలో తీసుకోకూడదు. గ్రామ పెద్దలను రాజులని పిలిచేవారు అని గుర్తుంచుకోవడం అవసరం. తొలిదశలో జయి ఆటవిక తెగల యుద్ధంగా ఉండింది. ఈ ఆటవిక తెగల యుద్ధంగా మహాభారతం తొలిదశలో ఎలా వుండేదో ఇంగ్లాండులో చాలా కాలం నాటకంగా ప్రదర్శించారు.

తెలుగు అనే పేరు తెలంగాణ అనే పేరు తెలివాహ నది అయిన గోదావరి నది పేరు మీదుగా తెలుగు అని, తెలాంగ అని, తెలంగాణ అని, తెలిమన్ అని స్పష్టమవుతున్నది. గోదావరి నది ఇప్పుడున్న పరిమాణంలో కన్నా రెండు రెట్లు, మూడు రెట్లు విస్తారంగా అప్పుడప్పుడు ప్రవహించేదని గోదావరి ఒడ్డుకు ఎంతో దూరంగా తవ్వుతున్న బోరుబావుల్లో ఇసుక రావడం ద్వారా తెలుస్తున్నది. అందక, అసక, ఆంధ్ర అనే పదాలు 2000 ఏళ్ళనాటివి. తెలి, తెలిమన్, తెలివాహ, తెలాంగ అనే పదాలు 4000 ఏళ్ళకు పూర్వానివి.

అందువల్ల తొమ్మిది వేల శ్లోకాల జయిని, లక్ష శ్లోకాల మహాభారతాన్ని చిలువలు పలవలు చేర్చి రాసిన మహాభారతంలో ఆంధ్రులు కౌరవుల పక్షం వహించారని రాయబడింది. చరిత్ర ఆధారాలు కౌరవులు, పాండవులు ఒక చిన్న ప్రాంతానికి రాజులని తెలివాహ ప్రాంత రాజులు విస్తారమైన ప్రాంతాలకు రాజులని తెలుపుతున్నాయి. అందువల్ల కౌరవ, పాండవులకు దక్షిణాది రాజులు కొంత సైన్యాన్ని సహాయంగా పంపించి ఉంటారు అని అనుకోవచ్చు. అంతేగాని వారే స్వయంగా సామంతరాజులలాగా కౌరవ, పాండవుల కోసం వారి వెంట యుద్ధాలకు తరలి వెళ్ళి ఉండకపోవచ్చు. పరీక్షిత్తు చేస్తున్న యజ్ఞంలో భాగంగా చెప్పబడిన కథ కనుక వారి ఆధిక్యతను ప్రదర్శించి సహాయం అందించినవారిని తక్కువ చేసి చెప్పి ఉంటారు.

మధ్య భారతం నుండి దక్షిణ భారతందాకా ఉన్న గిరిజన తెగలలో చాలా మంది తాము హిడంబ, ఘటోత్కచుని వారసులమని ఇప్పటికీ భావిస్తున్నారు. అల్లుడుకోసం అత్తమామలు మద్దతు ఇచ్చినట్టుగా తమ కూతురైన హిడంబిని పెళ్ళిచేసుకున్న అల్లుడు భీమునికోసం గిరిజన తెగలు తమ అల్లుడుగా యుద్ధంలో పాండవులకు సహకారం అందించడం సహజం. అంతేగాని వారు కౌరవులకుగాని, పాండవులకుగాని సామంతులు కారు అని గమనించవచ్చు.

మౌలికంగా తెలాంగులు, తెలంగాణ పూర్వీకులు తెలిమన్‌లు నాగజాతి వారిని, నాగజాతిలో ఒక తెగ అని చెప్పవచ్చు. మహాభారతంలో 91 వేల శ్లోకాల్లో ఇరికించి పేర్కొన్న జాతులకు, తెగలకు మధ్య, దక్షిణ భారతదేశం నిలయం. తాము ఎక్కడ వెనుకబడిపోతామో అని ఇక్కడివారు, తమకు సామంతులే అని చెప్పుకోవడానికి అక్కడివారు ఒకేరకంగా ఆలోచించి మహాభారతంలో వీటిని ఇరికించి ఉంటారు. పాండవులకు, కౌరవులకు గొప్ప సామ్రాజ్యం ఉండే అంత సీన్ ఏమీ ఆకాలంలో లేదు. వాసాలు, దూలాలు వంటి గదలతో కొట్టుకొని యుద్ధంచేసే ఆటవిక యుద్ధం మహాభారతం.

"అమెరికా విశ్వవిద్యాలయాలు, పాకిస్తాన్ విశ్వవిద్యాలయాలు కలిసి 1995 నుండి 1998 వరకు ఉమ్మడిగా కొనసాగించిన హెచ్.ఎ.ఆర్.పి అన్న హరప్పా ప్రాజెక్ట్ నూతన విషయాలను ఆవిష్కరిస్తూవుంది. ఈ నాగరికతను నాశనం చేసింది ఋగ్వేద ఆర్యులేనని, ఋగ్వేదంలోని "హరియుపియ" అన్నమాట హరప్పకు సంబంధించి దాన్ని నాశనం చేసిన ఇంద్రున్ని పొగిడిన సందర్భంలో ఋగ్వేదంలో వాడారు. ఇప్పుడు ఈ నాగరికత విస్తీర్ణాన్ని సెటలైట్ ఇమేజ్ ద్వారా వీరు ఏ యే దేశాలతో వాణిజ్యం చేశారో రూట్స్ ఏవి అన్న విషయాలను పరిశీలిస్తున్నారు. ఆనాటి లిపిని పరిశీలించి వివరించే ప్రయత్నం చేస్తున్నారు. అది బహుశ ద్రావిడ భాషే అయి వుంటుందని ఒక ఊహ."

ఆహార సేకరణను కాదని, ఆహార ఉత్పత్తిని చేపట్టకపోవటంతో ఈ దేశంలో దళితులు వెనుకబడివున్నారని సూత్రీకరించిన కోశాంబి గతంలోనూ ఇప్పుడూ బ్రాహ్మణులు మాత్రం ఎప్పుడు ఉత్పత్తి విధానంలో లేకపోయినా అధికులుగా, అన్ని భోగభాగ్యాలు అధికారాలు ఎలా పొందుతున్నారో చెప్పలేదు. వేదమంత్రాలను, చదువును తమ ఆధీనంలో వుంచుకోవటం ద్వారా బ్రాహ్మణులు ఆధిక్యతను పొందారని చెప్పటం ఉత్పత్తి విధానం క్రింద రాదు.

నేపాల్‌లో బౌద్ధం వున్నంతకాలం కులాలు రాలేదు. క్రీ.శ. 12–14 శతాబ్దాలలో హిందూ రాజులు వచ్చిన తరువాత కులాలు ఏర్పడ్డాయి. అలాగే శ్రీలంకలో కూడా కులాల వంటి వ్యత్యాసం ఇప్పటికీ కొనసాగుతోంది. థాయిలాండ్, బర్మా వంటి దేశాల్లో బౌద్ధంలో కులాలు రాలేదు. ద్విజకులాలు తాము ఆర్య సంతతివారమని భావిస్తుంటారు. ఈ దేశంలోని అధిక సంఖ్యాకులైన శూద్ర, దళిత, ఆదివాసి కులాలు ఈ దేశ మూల వాసుల నాగరికతకు వారసులు.

ద్రావిడ ప్రజలకు ముందునుండి ఈ దేశవాసులుగా వున్న చెంచు, యానాది, సవర, సంతాల్, ముండా వంటి తెగల నిజమైన వారసత్వాన్ని ఇంకా అధ్యయనం చేయవలసివుంది. వాళ్ళే మొదటి మూలవాసులు. ముఖ్యంగా మహానది, గోదావరి మధ్యనున్న తూర్పుకనుమలు, దండకారణ్యంలో నివసించే అనేక ఆదివాసి తెగల జీవితం గూర్చి సజీవ సాక్ష్యాలు ద్వారా లభ్యమవుతున్న చారిత్రక ఆధారాలకోసం పురాతత్వ, మానవీయ శాస్త్రాల ఆధారంగా పరిశోధనలు చేసినప్పుడు ఈ దేశమూలవాసుల చరిత్ర మరింత వెల్లడవుతుంది. వారి సంస్కృతి పరిశీలిస్తే అనేక చారిత్రక అంశాలు వెలికివస్తాయి.

# చరిత్రలో గుర్రాల ప్రాధాన్యత

చరిత్రలో గుర్రాలు వేల ఏళ్లు చారిత్రకంగా ప్రధాన పాత్ర నిర్వహించాయి. గుర్రం మధ్య ఆసియాలో, యూరప్‌లో వ్యవసాయానికి, రవాణాకు, యుద్ధాలకు ఎంతగానో ఉపయోగపడింది. రైళ్ళు, బస్సులు, విమానాలు వచ్చేదాకా వేగంగా ప్రయాణించడానికి ఏకైక సాధనంగా గుర్రం మానవ చరిత్రలో నిలిచిపోయింది. యుద్ధాల్లో గుర్రం గెలుపు, ఓటములను నిర్ణయించడంలో ప్రధాన పాత్ర వహించింది.

మధ్యాసియాలో ఇస్లాం పుట్టక ముందు నుండి కూడా అక్కడి అరబ్బు తెగలు, జాతులు గొప్ప గొప్ప గుర్రపు జాతులను పెంచి పోషించేవారు. అక్కడి గుర్రాలు ప్రపంచ ప్రఖ్యాతి చెందాయి. ఆర్యులని పిలువబడిన గిరిజన తెగలు, జాతులు కూడా ఇండియాలోని ఇతర గిరిజన తెగలు, జాతులను గెలువడంలో గుర్రం ప్రధాన పాత్ర నిర్వహించింది. సుమారుగా నాలుగు వేల ఏళ్ళు లేదా కొందరి ప్రకారం తొమ్మిది వేల ఏళ్ళు గుర్రం ప్రపంచ చరిత్రలో కీలక పాత్ర వహించింది.

ఆర్యులని పిలువబడిన గిరిజన తెగలు, జాతులు మొదలుకొని, ఇస్లాం, ముస్లిం, ఆదివాసి గిరిజన తెగలు, జాతులు ఆసియాలో విస్తరించడానికి గుర్రం మహోన్నత కృషి, త్యాగం ఉంది. అందువల్ల ఆయా మతాల్లో గుర్రానికి తగు ప్రాధాన్యతను కూడా ఇచ్చారు.

ఇండియాలో గుర్రాలతో కాకుండా ఎడ్లతో, దున్నపోతులతో వ్యవసాయం చేసేవారు. అందువల్ల పశువుల పెంపకానికి ప్రాధాన్యతను ఇచ్చారు. ఇవి పాలతో పాటు మాంసంగా కూడా ఉపయోగపడేవి. పేడ ఎరువుగా ఉపయోగపడేది. ప్రపంచంలో ఏ రాజ్యంలో లేనంత పశు సంపద ఇండియాలో ఉత్పత్తి కులాలు గొప్ప సంపదగా అభివృద్ధి పరిచారు.

అయితే యుద్ధాల్లో ఈ పశుసంపద ఉపయోగపడేది కాదు. గుర్రాలు యుద్ధాలకు ఎంతో అవసరం. వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలు వృత్తులను కులాల వారీగా విభజించాయి. పశువులను అన్ని కులాలు పెంచాయి. వ్యవసాయాన్ని అన్ని కులాలు చేశాయి. ఉన్ని తయారీని ఉన్నిదారాన్ని, పత్తి తయారీని, నూలు తయారీని అన్ని కులాలు చేశాయి. కర్ర పని, ఇళ్ళ నిర్మాణం, గొడ్డలి, పార, గడ్డపార, కత్తి, ఇనుప



పనిముట్లు అన్ని కులాలు వాడారు.

గుర్రాల పెంపకం ఇండియాలో అన్ని కులాలు చేపట్టలేదు. రవాణా సౌకర్యాలకు దున్నపోతులు, ఎడ్లు, ఎడ్లబండ్లు చాలనుకున్నారు. కనుక గుర్రాలు ఇండియాలో కేవలం ప్రయాణ సాధనంగానే మిగిలిపోయింది. గ్రామాల్లో జీవించేవారికి ప్రయాణాలతో పెద్దగా పనిలేదు. గ్రామాలు స్వయంపోషకంగా సమస్త సరకుల ఉత్పత్తి కేంద్రాలుగా కొనసాగేవి. పెళ్ళి సంబంధాలు నడిచిపోగలిగే దూరం నుండి, ఎడ్లబండితో పోగలిగే దూరం నుండి కుదుర్చుకునే వారు.

అందువల్ల గుర్రం పోషణ గ్రామీణ జీవితంలో అదనపు ఖర్చు, భారం తప్ప నిత్య జీవితంలో ఉపయోగపడే ఖర్చు కాదు. పైగా గుర్రం ఉంటే రాజులు యుద్ధం మొదలుకాగానే గుర్రం తీసుకుని యుద్ధానికి రమ్మని బలవంతం చేస్తారని గ్రామీణ ప్రజలు భయపడ్డారు. గుర్రం ఉంటే గుర్రం వెంట చావుతప్పదని సామెతలు సృష్టించుకున్నారు.

గుర్రాల పెంపకాన్ని రాజులు కూడా పెద్ద ఎత్తున ఒక పరిశ్రమగా అభివృద్ధి చెందించాలని కోరుకోలేదు. గుర్రాలు పెంచే వారు ఆ గుర్రాలతో దాడులకు దిగి రాజ్యాన్ని ఏర్పరచుకుంటారని, తన రాజ్యాన్ని విచ్ఛిన్నం చేస్తారని భయపడ్డారు. బ్రాహ్మణవాదులు సూద్ర ఉత్పత్తి కులాలకు విద్య నేర్పితే వారు ఎదిగిపోతారని భయపడి నేర్పడాన్ని ఎలా నిరాకరించారో మను ధర్మ సూత్రాల్లో రాసుకున్నారో అలాంటి కారణాల రీత్యానే బ్రాహ్మణులు, రాజులు ఇండియాలో గుర్రాల పెంపకాన్ని గొప్ప పరిశ్రమగా అభివృద్ధి చెందడాన్ని కోరుకోలేదు.

గుర్రాల పరిశ్రమ ఇండియాలోని పశువుల పరిశ్రమ స్థాయిలో అభివృద్ధి చెందివుంటే వర్ణవాద సిద్ధాంతాలు కొనసాగినప్పటికీ ఇండియా ఇతర ప్రాంతాల దాడులను తిప్పికొట్టి ఓడించగలిగి ఉండేది. గుర్రాల పెంపకాన్ని అన్ని కులాలు చేయకపోవడానికి ఇలా వ్యవసాయక, సామాజిక, రాజకీయ, సిద్ధాంత, యుద్ధభయ కారణాలు ప్రధానం. దాంతో మధ్యాసియాలో అరబ్బు గిరిజన తెగలు, ముస్లిములు ఒక పరిశ్రమగా పెంచుతున్న గుర్రాలను కొనుక్కోవడానికి ఇండియా నుండి వెళ్ళేవారు. వారు చెల్లించే సంపదను చూసి అరబ్బులు ఆశ్చర్యపోయేవారు.

దాంతో అరబ్బుల అవగాహన పెరిగింది. ఈ గుర్రాలను అమ్ముకుని బతికే బదులుగా ఈ గుర్రాల మీద వెళ్ళి వారు దోపిడీచేసి ఇస్తున్న సంపదను తామే దోపిడీ చేసి తెచ్చుకోవచ్చు కదా అని భావించారు. అలా గుర్రాల మీద గుంపులు గుంపులుగా బయలుదేరి పెషావర్, కందహార్, కాబూల్, లాహోర్ మీదుగా ఇండియాలోని పలు ప్రాంతాలకు దాడులకు వెళ్ళేవారు. అందినంత తీసుకుపోయేవారు.

కొన్ని శతాబ్దాలు ఇలా గడిచిన తర్వాత వారికి మరో అభిప్రాయం కలిగింది. ఆ సంపదను ఇక్కడికి తెచ్చుకుని ఖర్చు చేయడం, పోవడం, రావడం, దారిలో చావడం ఎందుకు అక్కడే స్థిరపడిపోతే మంచిది అనుకున్నారు. అలా మహమ్మద్ గజనీ ఇండియా నుండి సంపదను తరలించుకుపోతే అతని తర్వాతి వాళ్ళు దాడికి వచ్చి ఇండియాలో రాజ్యాలను స్థాపించుకున్నారు. గుర్రాలు రవాణా సౌకర్యంగా ఉండడం వల్ల 1500 కి.మీ. దూరం నుండి వారు వచ్చి స్థిరపడడం సాధ్యపడింది.

క్రీ.శ.2005 నాటికి కూడా సామాన్య ప్రజలు 300 కి.మీ. దాటి పోలేదు. పోవాల్సిన అవసరాలు ఉండకపోవడమే కారణం. లేదా అలాంటి అవసరాలను పెంచుకోకపోవడమే కారణం.

ఇండియాలోని ఇతర ప్రాంతాలను చూసిన వారు ఇండియాలో పది శాతం కూడా ఉండరు. ఇన్ని రవాణా సౌకర్యాలు, ప్రసార సాధనాలు ఏర్పడిన తర్వాత కూడా 90 శాతం ప్రజలు స్థానికంగానే ప్రయాణాలను పరిమితి చేసుకుంటున్నారు. అనగా ఇండియాలోని ప్రజలు శతాబ్దాల తరబడి ప్రయాణాలకు, ఉన్న ఊరు, ఉన్న రాజ్యం వదిలి దూరంగా వెళ్ళడానికి ఇష్టపడలేదు. ఆ అవసరం కూడా వారికి కలుగలేదు. చుట్టూతా ఉన్న పది, ఇరవై గ్రామాల్లో వారికి కావాల్సిన సమస్త సరకులు, అవసరాలు తీరేవి.

ఇలా గుర్రం ప్రాధాన్యతను ప్రజలు నిరాకరించారు. ఇతర కారణాలతో బ్రాహ్మణులు, రాజులు కూడా ప్రజలు గుర్రాలు కలిగి ఉండడాన్ని నిరాకరించారు. పర్యవసానంగా ఇండియా శతాబ్దాల తరబడి దోపిడీలకు, దండయాత్రలకు నెలవైంది.

గుర్రాల పెంపకం విస్తృతంగా చేపట్టినా, వర్ణవాద, కులవ్యవస్థ సిద్ధాంతాలను ఖండిస్తూ ఇస్లాం వలె మరో కొత్త మతం ఇండియాలో స్థాపించే మేధావులు, నాయకులు ఎదిగినా, కనీసం యుద్ధాల్లో సూద్రులని పిలువబడిన సంపద సృష్టికర్తలకు సమాన గౌరవం ఇచ్చినా, దాడిలో దొరికిన వాటిలో వాటా ఇచ్చినా ఇండియా శతాబ్దాల తరబడి దాడులకు గురి అయి ఉండేది కాదు. దక్షిణ ఇండియా చరిత్రయే దీనికి నిదర్శనం.

దక్షిణ ఇండియాలో ఆదివాసి గిరిజన తెగల నుండి జాతుల నుండి, సంపద సృష్టికర్తలైన ఉత్పత్తి కులాల నుండి, వృత్తిదారుల నుండి ఎదిగి రాజులై రాజ్యాలు నిర్మించి సుస్థిర పరిపాలన అందించి వారి రాజ వంశాలను తరాలతరబడి కొనసాగించారు. ఉత్తర ఇండియా చరిత్రకు దక్షిణ ఇండియా చరిత్రకు మధ్య చాలా తేడా ఉంది. దక్షిణ ఇండియాపై ఉత్తర ఇండియాలోని బ్రాహ్మణులు, రాజులు చేసిన పొరపాట్ల వల్ల, నేరాల వల్ల ముస్లింలు దండయాత్రలు చేసి రాజ్యాలు గెలుచుకున్నాక



దక్షిణ ఇండియాపై కూడా దాని భారం పడింది.

ఇలా ఉత్తర ఇండియా సిద్ధాంతవేత్తలు, బ్రాహ్మణులు, రాజులు చేసే నేరాలకు, పొరపాట్లకు దక్షిణ ఇండియా శతాబ్దాల తరబడి బలి అయిపోవడం జరిగింది. దాంతో ఉత్తర ఇండియాలో ఇస్లాం వ్యతిరేకంగా పుట్టాల్సిన కొత్త మతాలు దక్షిణ ఇండియా నుంచి ప్రారంభం కావాల్సి వచ్చింది. అవే శైవ, వైష్ణవ సిద్ధాంతాలు, ఉద్యమాలు. ఇవి మొదటే ఉత్తర ఇండియాలో ప్రారంభమై ఉంటే కూడా వేరుగా ఉండేది.

దక్షిణ ఇండియాలో ప్రారంభమైన శైవ, వైష్ణవ ఉద్యమాలు ప్రజలను, జైన, బౌద్ధులను ఎంతగా చంపి చిత్రహింసలు పెట్టినప్పటికీ సూద్ర, పంచమ కులాల నుండి దేవదాసీ వ్యవస్థను ఏర్పాటు చేసి అణచివేసినప్పటికీ దక్షిణ ఇండియాలో సుస్థిర రాజ్యాలు, సుస్థిర పరిపాలన ఏర్పడడానికి దోహదపడ్డాయి అనే విషయం కూడా గుర్తుంచుకోక తప్పదు. నిజానికి ఈ మాటను తిరగేసి చెప్పినప్పుడే చారిత్రక సత్యమౌతుంది.

దక్షిణ ఇండియా రాజ్యాల విస్తరణ, సుస్థిరత్వంలో భాగంగానే, ఇస్లాం సైద్ధాంతిక భౌతిక దాడులను తిప్పికొట్టడంలో భాగంగానే ఇస్లాం నుండే స్వీకరించి ఇస్లాంకు వ్యతిరేకంగా శైవ, వైష్ణవ మతాలను సృష్టించి వ్యాప్తి చేశారు. అంతకు ముందున్న శైవ, వైష్ణవ ఆలోచనా ధారలు వేరు. తర్వాత పుట్టిన భక్తి ఉద్యమాలు వేరు. భక్తి ఉద్యమాలు ఆనాటి రాజకీయ సామాజిక అవసరాల్లో భాగంగా పుట్టాయి. ప్రజలు వాటిని ఆదరించారు.

అయితే కొందరు శైవ వైష్ణవ భక్తి ఉద్యమాల సిద్ధాంతవేత్తలు వర్ణవాద కులవ్యవస్థ సిద్ధాంతాల్లోంచి ప్రజలు ఇస్లాం తీసుకోకుండా చేసిన తాత్కాలిక ఎత్తుగడ అని ఇవి చరిత్రలో కౌంటర్ రెవెల్యూషన్స్ అని కొందరు చరిత్రకారుల అభిప్రాయం. భక్తి ఉద్యమాల ద్వారా ప్రజలు స్థానిక భాషలను బాగా అభివృద్ధి పరిచారు. ఇలా వ్యవసాయం, పశువుల పెంపకానికి, స్వయంపోషక ఆర్థిక వ్యవస్థను నిర్మించిన కులవ్యవస్థకు, గుర్రాలకు, ముస్లిం రాజ్యాలకు, బ్రాహ్మణవాద సిద్ధాంతాలకు, వీర శైవ, వీర వైష్ణవ, తాంత్రిక ఉద్యమాలకు, సిద్ధాంతాలకు మధ్య పరస్పర సంబంధం ఉంది.

# చరిత్రలో పంది నిర్వహించిన పాత్ర

భారతీయ చరిత్రలో కొందరు ప్రస్తుతం బ్రహ్మ తాలూకు శ్వేత వరాహ కల్పం 51వ సంవత్సరం 1వ రోజు నడుస్తున్నది అని పంచాంగాల్లో రాస్తుంటారు. బ్రహ్మ ప్రకారం 1రోజు అంటే 864 కోట్ల సంవత్సరాలు. ఇప్పుడు నడుస్తున్నది వారి ప్రకారం కూడా తెల్ల పంది యుగం అని అర్థం. ఇలా వేల ఏళ్ళ నుండి పందిని ప్రాధాన్యత లోకి తీసుకున్నారు. పంది తన మూతి ద్వారా భూమిలోని గడ్డలను పెల్లగిస్తుంది. పసికడుతుంది. ఆ గడ్డల ద్వారా నీరు అందుతుంది. ఆహారంగా కూడా ఉపయోగపడుతుంది. ఇలా పందులు సైంటిస్టులుగా పని చేయడం వల్ల మానవులు పందుల పెంపకానికి ప్రాధాన్యత ఇచ్చారు. పందులు భూమిని పెల్లగించడం వల్ల పోడు వ్యవసాయం చేయడం, దున్నడం సులువైంది. అలాగే మాంసం కోసం కూడా పందులను పెంచారు. ఇలా కుక్కలాగే మానవ సమాజంలో పంది ఆహార సేకరణ దశలో, వేట దశలో గొప్ప పాత్ర నిర్వహించింది.

ప్రకృతి మీద ఆధారపడి జీవిస్తున్న మానవులు కాస్త స్వతంత్రంగా బతకడానికి ప్రకృతిలోని వనరులను తనకనుకూలంగా మచ్చిక చేసుకుని, పెంచుకుని వాటితో సహజీవనం చేసారు. వాటి పట్ల అనుబంధాన్ని, గౌరవాన్ని పెంచుకున్నారు. అలా ప్రకృతిలో మొదట తమ స్వాధీనంలోకి తెచ్చుకున్న వాటి పట్ల గౌరవాన్ని తర్వాతి తరాలకు సంస్కృతి రూపంలో, విశ్వాసాల రూపంలో అందిస్తూ వచ్చారు. చరిత్ర రికార్డు చేసే దృష్టి లేని ప్రాచీన చరిత్రకాలంలో చరిత్ర పరిణామాలు ఇలా సంస్కృతి రూపంలో, విశ్వాసాల రూపంలో రికార్డవుతూ వచ్చాయి. అవి కాలక్రమంలో మార్పులను కూడా పొందాయి. అయినప్పటికీ కొన్ని విశ్వాసాలు, సంస్కృతి అవశేషాలు ప్రాచీనతను తెలుపుతున్నాయి. అలాంటి చారిత్రక ప్రాధాన్యత గల విశ్వాసాలను, సంస్కృతిని ప్రజల జీవితాల్లో ఇప్పటికీ సజీవంగా కొనసాగుతున్న వాటిని పరిశీలించడం అవసరం. అవి చరిత్రలో భాగమే. ఆధునిక, చారిత్రక దృక్పథాలను అనుసరించి, చారిత్రక పరిణామాలను అనుసరించి ఆ విశ్వాసాల్లో ఏ మేరకు చరిత్ర నిర్మాణానికి ఆధారాలవుతాయో తేల్చుకోవడం, మిగతా వాటిని వదిలివేయడం అంత కష్టమేమీ కాదు.

శాతవాహనులు రాజముద్రికలో పందిబొమ్మను ముద్రించారు. బ్రాహ్మణ భావజాల



చరిత్రకారులు పందిని సంస్కృతీకరించి వరాహం అని వ్యాఖ్యానిస్తూ, వరాహం విష్ణు అవతారమని విష్ణు దేవుడు శాతవాహనులకు ఇష్టదైవమని వక్రీకరించారు. శాతవాహనుల కాలం నాటికి దశావతారాల రూపకల్పన జరగలేదు. శాతవాహన రాజ్యం తరువాత రెండు శతాబ్దాలకు దశావతారాల రూపకల్పన జరిగింది. కృష్ణావతారం 10వ శతాబ్దం దాకా ప్రాచుర్యంలోనే లేదు. దశావతారాలలో కొన్ని అవతారాలను ఆయా శతాబ్దాల్లో తీసివేస్తూ, కొన్ని కలుపుతూ వచ్చారు. అందువల్ల అవతారాలు 21 అని కూడా కొందరు పేర్కొన్నారు. పంది బొమ్మకు దశావతారాలకు, విష్ణువుకు సంబంధం లేదు. అది చరిత్ర పరిణామంలో భాగంగా రూపొందిన పంది బొమ్మ. శాతవాహనుల కాలం నుండి ఇటీవలి వరకు అనేక రాజ్యాలు, రాజ వంశాలు పంది బొమ్మ గల బంగారు నాణాలను వరహాలుగా అత్యంత విలువైన నాణాలుగా లెక్కించారు. కాకతీయ పూర్వ రాజులు, చాళుక్యులు, పల్లవులు, కాకతీయులు, విజయనగర రాజులు ఇలా ఎందరో పందిబొమ్మను నాణాలపై, జెండాలపై ముద్రించారు.

దక్షిణ ఇండియాలో బోనం, బోనాలు, వోనం అనే పండుగ జరుగుతుంది. ఇవి పెసర్లు వంటి తొందరగా పండే మొదటి పంట చేతికొచ్చే శ్రావణమాసంలో జరుగుతుంది. మొదటి పంట చేతికొచ్చే ముందు ఈ పండుగ చేస్తుంటారు. ఈ పండుగలో బోనాలు, బలి, పొలి ఇస్తారు. ఇవి గ్రామదేవతలకు అర్పిస్తారు. గ్రామ దేవతలు ఆయా ఊళ్ళలో రకరకాల పేర్లతో కొనసాగుతున్నారు. పోచమ్మ, ఎల్లమ్మ, మైసమ్మ, ముత్యాలమ్మ అలాగే కాటమయ్య వంటి దేవతలకు ఇవి అర్పిస్తారు. పోచమ్మ గుడి వద్ద కోడిని, గొర్రెను, మేకను, దున్నపోతును బలి ఇస్తారు. ఒక కాలును లేదా కోడి రెక్కను అక్కడ ఉన్న చెట్టు కొమ్మకు గాని, మరేదైనా ఆసరాకు గాని కడతారు. కుమ్మరి, మున్నూరు కాపు మొదలైన కులాలకు చెందిన వారు ఈ పండుగల్లో పూజ నిర్వహిస్తుంటారు. అయితే ఈ గుళ్ళకు పూజారులు ఉండరు. స్వయంగా ప్రజలే పూజిస్తారు. అలాగే పొలి అంటే పంట పొలంలో పంట కోసిన తర్వాత కుప్ప చేసి కుప్ప నూర్చే ముందు కోడిని కోసి భార్యాభర్తలు ఆ పొలం చుట్టూ ఆ రక్తాన్ని చల్లుతారు. కేరళలో ఈ పండుగను వోనం పేరుతో ప్రభుత్వం తరఫున కూడా వారోత్సవాలు నిర్వహిస్తారు. తెలుగు నేలలో గ్రామీణ ప్రాంత పండగగా, జానపదుల పండుగగా కొనసాగుతున్నది.

ఎడ్లు, దున్నపోతులను పొలాల అమావాస్య రోజున కడిగి అలంకరిస్తారు. గౌరవిస్తారు. ఈ గౌరవం ఆవును పూజించడానికి సంబంధించినది కాదు. ఇందులో పూజించడం కన్నా ఇంట్లో పిల్లలకు కొత్త బట్టలు కుట్టించడం వంటి వాత్సల్యం, గౌరవం ఎక్కువ కనపడుతున్నది. అందువల్ల ఇది గోపూజకు నిదర్శనం కాదు. ఈ ఎడ్లను గౌరవించే సంస్కృతి వ్యవసాయానికి అవి అందిస్తున్న సేవలకు సంబంధించినది.

అలాగే వాటి ఆరోగ్యాన్ని కాపాడ్డానికి సంబంధించినది.

క్రీ.పూ. మూడు వేల ఏళ్ళ నాటి సింధూ నాగరికత లేదా కొందరు ఇటీవల లేవనెత్తిన చర్చ ప్రకారం సరస్వతీ నాగరికతలో కూడా ఎద్దుల బొమ్మలను చూడవచ్చు. ఈ ఎద్దు బొమ్మలు వ్యవసాయానికి ఎద్దులు సహకరించినందుకు, అలాగే బహుశా మాంసంగా, తోలుగా ఉపయోగపడుతున్నందుకు గౌరవంగా వాటి బొమ్మలను చిత్రించారు. అంతేగాని అక్కడ వైదిక సాహిత్యంలో పూజించినట్టుగా గోవులను పూజించిన బొమ్మలుగానే పురావస్తు ఆధారాలు గాని లభ్యంకాలేదు. అందువల్ల ప్రజల జీవితంలో ఇప్పటికీ కొనసాగుతున్న ఎడ్ల పండుగ సింధూ నాగరికత, సరస్వతీ నాగరికత కాలం నుండి పశు పోషకులు, వ్యవసాయదారులైన యాదవులు, కాపులు, జాట్లు మొదలైన ఉత్పత్తి కులాలుగా తర్వాతి కాలంలో రూపొందిన వారి పూర్వీకుల నాగరికత అది అని చెప్పవచ్చు. అంతే కాకుండా ఉత్పత్తిలో భాగంగా, రవాణా సౌకర్యాల్లో భాగంగా ఎడ్లను, దున్నపోతులను కలిగి ఉండే అన్ని కులాల వారు సింధూ నాగరికతలోని ఎద్దు బొమ్మకు వారసులే అని చెప్పవచ్చు.

అంతేగాని ఆ నాగరికతకు ఆర్యుల నాగరికత అని ఆర్య పేరుకు పెద్దగా సంబంధం లేదు. ఆర్య అనే పదం తాలూకు తెగల లేదా జాతుల లేదా భాషల లేదా గౌరవాలను రికార్డు చేసిన వైదిక సాహిత్యంలో, బ్రాహ్మణవాద పౌరాణిక సాహిత్యంలో ఉన్న గోపూజకు సింధూ నాగరికతలోని ఎద్దు బొమ్మకు సంబంధం లేదు.

వైదిక సాహిత్యంలో ఎద్దులను కోసుకుని తిన్న అంశాలు, యజ్ఞాల సందర్భంగా ఎద్దులను కోసుకుని తిన్న సంఘటనలు ఉన్నాయి. నేటి వైదిక సాహిత్య ప్రచారకుల్లో ఇతిహాస సంకలన సమితి వారు ఆర్.ఎస్.ఎస్. పరివారం ఈ విషయాన్ని అంగీకరించడానికి సిద్ధంగా లేరు. కాని సింధూ నాగరికతలోని ఎద్దు బొమ్మను వేదాలలోని ఎద్దుకు సంబంధించినదే అని వారు క్రీ.శ. 1980 నుండి పుస్తకాలు అచ్చు వేస్తున్నారు. వీటిని పాయింట్ వారీగా ఖండించే కృషిని ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్ చరిత్రకారులు చేయడం అవసరం.

దానివల్ల మౌనాన్ని అంగీకారంగా తీసుకుని బి.జె.పి. నాయకత్వంలో నేషనల్ డెమోక్రటిక్ అలయన్స్ ఇండియన్ యూనియన్ తాలుకు కేంద్ర ప్రభుత్వంలో అధికారంలోకి రాగానే ఎన్.సి.ఇ.ఆర్.టి. సిలబస్‌ను, సి.బి.ఎస్.ఇ. సిలబస్‌ను, పాఠ్య పుస్తకాలను రాశారు. అంతకు ముందే మధ్యప్రదేశ్ తదితర రాష్ట్రాల్లో బి.జె.పి. అధికారంలోకి రాగానే పాఠ్య పుస్తకాలను ఇతిహాస సంకలన సమితి, ఆర్.ఎస్.ఎస్. పరివారం రాసిన వాటినే పాఠ్యాంశాలుగా చేర్చి పాఠ్య పుస్తకాలను రాశారు. అప్పుడు కూడా ఇండియన్ హిస్టరీ కాంగ్రెస్, దాని రాష్ట్ర శాఖలు వాటిని చర్చిస్తూ సత్యాలను తిరిగి నిర్ధారించే కృషి చేయడం అవసరం.



హిస్టరీ కాంగ్రెస్ చరిత్ర లేఖన గాథను దాని పరిణామాన్ని ఎప్పటికప్పుడు అందించడంలేదు. కనీసం క్రీ.శ. 1800ల నుండి చరిత్ర రచన కోసం ఏ ఆధారాలు ఎప్పుడు ఎలా లభించాయి, వాటి ఆధారంగా చరిత్రను నిర్మించే ప్రయత్నం ఎవరు ఎలా చేశారు, ఆ తరువాత దొరికిన ఆధారాలు ఆ చరిత్రను తిరిగి మార్చుకోవడానికి ఎలా ఉపయోగపడ్డాయి, కొన్ని దొరికిన ఆధారాలను ఎలా క్రమక్రమంగా వదిలి వేస్తూ వస్తున్నారు, ఎందుకు వదిలి వేస్తూ వస్తున్నారు, వాటి వెనుక ఉన్న రాజకీయ, సామాజిక దృక్పథాలేమిటి అనే విషయాలను, పరిణామాలను తెలిపే గ్రంథాలు ప్రజల్లో ప్రాచుర్యంలోకి తీసుకువచ్చే కృషి జరుగలేదు. చరిత్రను రాసే వారి దృక్పథాన్ని అనుసరించి రాసిన చరిత్ర మాత్రమే అందించబడుతున్నది. అనగా చెట్టును, ఆకులను, పువ్వులను, కాయలను చూపిస్తున్నారు. కాని ధాని వేర్లను, విత్తనాలను చూపించడం లేదు. తద్వారా చరిత్రకారులు తాము చెప్పింది నమ్మాలని కోరే వారుగానే మిగిలిపోతున్నారు తప్ప ప్రజలే చరిత్ర పరిణామాన్ని దాన్ని రూపొందించడంలో జరుగుతున్న మార్పులు, చేర్పులను గమనించే, విశ్లేషించే అవకాశాన్ని వారు ఇవ్వడం లేదు. ప్రజలకు ఈ అవకాశం ఇచ్చే విధంగా చరిత్రలేఖన గాథ పరిణామాన్ని, చారిత్రక ఆధారాలు దొరికిన తేదీలను, వాటి ప్రకారంగా ఎవరెవరు ఎలా చరిత్రను పలు కోణాల్లో రాసుకుంటూ వచ్చారో పరిచయం చేసే గ్రంథాలు వస్తే ప్రజలే తమ చరిత్రను రాసుకునే అవకాశం, ఆత్మ విశ్వాసం, విశ్లేషణ పద్ధతి అలవర్చుకుంటారు.

నేను గమనించిన మేరకు చరిత్రకారులు తొలుత దొరికిన పురావస్తు ఆధారాల్లోంచి చాలా విషయాలను వదిలేస్తూ వస్తున్నారు. వర్ణవాద, కుల వ్యవస్థవాద, బ్రాహ్మణ వాద సిద్ధాంతాలకు అనువుగా చరిత్రను వక్రీకరిస్తున్నారు. ఇలా వక్రీకరించడానికి లోబడని పురావస్తు ఆధారాలను, సాహిత్య ఆధారాలను, వాటి విశ్లేషణ, సంశ్లేషణను వదిలి వేస్తున్నారు.

ఉదా॥కు మానవ జీవితంలో మొదట కుక్కను మచ్చిక చేసుకున్నారని ఒక అభిప్రాయం కొనసాగుతున్నది. అటు తర్వాత ఎడ్లను, బర్లను, పందులను, ఏనుగులను, గాడిదలను, కోళ్ళను, మేకలను, గొర్రెలను, గుర్రాలను, ఒంటెలను, బాతులను, పిల్లులను మొదలైన వాటిని మచ్చిక చేసుకున్నారు. మచ్చిక చేసుకున్న వాటిలో సింధూ నాగరికతలో కొమ్ములు తిరిగిన మగ మేక బొమ్మ కూడా ఉంది. ఇది కొమ్ములున్న దుప్పి వలె కనపడుతున్నది. పెద్ద మేకలు క్రీ.శ. 1960 వరకు కూడా అడవి మేకలుగా దుప్పి కన్నా కాస్త పెద్దగా కూడా ఉండేవి. అవి అడవి మేకలుగా అడవుల్లోనే సంచరించేవి. ఇప్పటికీ కొన్ని చోట్ల గాడిద కన్నా కాస్త చిన్నవిగా దుప్పి అంత పెద్దదిగా ఉండే మగ మేకలు విత్తనం మేకలుగా కొనసాగుతున్నాయి. అయితే వైదిక సాహిత్యంలో గల గుర్రం చర్చను అనుసరించి కొందరు సింధూ నాగరికతను వైదిక సాహిత్యం యొక్క

నాగరికతగా నిరూపించడానికి రకరకాల ప్రయత్నాలు చేస్తున్నారు. కంప్యూటర్ల ద్వారా సింధూ నాగరికతలో దొరికిన మేక బొమ్మను, గుర్రం బొమ్మ అని మార్పులు చేర్పులు చేసి ప్రకటించారు. దుప్పిని, అడవి మేకలను జీవితంలో చూడనివారే సింధూ నాగరికతలో దొరికిన మేక బొమ్మను గుర్రం బొమ్మ అని చెప్పడం సాధ్యపడుతుంది.

సింధూ నాగరికతలోని ఎద్దు బొమ్మ, కొమ్ములు దాల్చిన మనిషి బొమ్మ నేటికీ ఇండియాలోని ఆదివాసి తెగల్లో, జాతుల్లో కొనసాగుతున్న కొమ్ముల ఆభరణాలను సూచించే బొమ్మ మాత్రమే. కొమ్ములను ఆభరణాలుగా తల మీద ధరించే సంప్రదాయం నుండే రాజన్ వ్యవస్థలో, జనపదాల వ్యవస్థలో, రాజ్యాల వ్యవస్థలో క్రమంగా కిరీటాలుగా పరిణామం చెందుతూ వచ్చింది. అంతేగాని అది పశుపతి అని పిలుస్తూ అది శివుని బొమ్మగా చెప్పడానికి అవకాశం లేదు. ఒక వేళ శివుని బొమ్మగా భావించదల్చుకుంటే ఆ శివుడు ఆదివాసి తెగల, జాతులకు సంబంధించిన మనిషే తప్ప వైదిక సాహిత్యంలో, పౌరాణిక సాహిత్యంలో తిరగ రాయబడిన బ్రహ్మ, విష్ణు, శివ మూర్తిత్రయం భావం తాలుకు శివుని బొమ్మ కాదు. సింధూ నాగరికతలోని కొమ్ములు ధరించిన మనిషి బొమ్మ ఆదివాసి తెగల, జాతుల రాజన్ వ్యవస్థలో రాజన్‌గా అనగా తెగ పెద్దగా లేదా ఈనాటి సర్పంచ్‌గా ఉన్న మనిషి బొమ్మ అది. అందువల్లే అతని చుట్టూ మానవులు మచ్చిక చేసుకున్న, మచ్చిక చేసుకోదల్చుకున్న, తనకు ఇష్టమైన జంతువులను, పక్షులను, చెట్లను ఆ బొమ్మ చుట్టూతా చిత్రించుకున్నారు. సింధూ నాగరికత లోని ఒక బొమ్మ పూజారిగా కొందరు చరిత్రకారులు భావించారు. కాని అది పూజారిదే కానవసరం లేదు. అతని భుజం మీద నడుం చుట్టూ ఉన్న వస్త్రం చూస్తే అది స్పష్టంగా పత్తి నూలుతో నేసిన బట్ట అని స్పష్టమౌతున్నది. అది తోలు బట్ట కాదని, దాని ముడుతలు తెలుపుతున్నాయి. కనుక సింధూ నాగరికత కాలంనాటికే చేనేత బట్టలు ఉత్పత్తి చేయడం, ధరించడం కొనసాగుతున్నదని స్పష్టమౌతున్నది. వీటి ప్రాధాన్యతను చర్చించడం జరుగలేదు.

అలాగే రెండు వేల ఏళ్లుగా రకరకాలుగా పంది బొమ్మ కనపడుతూ వస్తున్నది. క్రీ.పూ. 3వ శతాబ్దం నుండి శాతవాహనులు మొదలుకొని చాళుక్యులు, కాకతీయ రాజులు, విజయనగర రాజులు, కృష్ణదేవరాయలు నాణేలపై పంది బొమ్మ ముద్రించారు. పంది బొమ్మ శతాబ్దాలుగా సుప్రసిద్ధ రాజ్యాల్లో నాణేల్లో చలామణి అయిన విషయం యొక్క ప్రాధాన్యతను చరిత్రకారులు పట్టించుకోలేదు. ఎద్దు ప్రాధాన్యతను, ఆవు ప్రాధాన్యతను, గుర్రం ప్రాధాన్యతను పట్టించుకున్నారు. క్రీ.శ. 1995 నుండి కంచ ఐలయ్య అనే ఇండాలజీ సంస్కృతి శాస్త్రవేత్త గేదెను లేదా బర్రెను జాతీయ చిహ్నంగా తీసుకోవాలని వ్యాసాలు రాస్తూ బఫెలో నేషనలిజమ్ అనే గ్రంథాన్ని వెలువరించారు. కాని పంది బొమ్మ ప్రాధాన్యత గురించి ఎవరూ పట్టించికోలేదు. శాతవాహనులు



మొదలుకొని కాకతీయ పూర్వరాజులు మొదలుకొని కాకతీయులు, విజయనగరరాజుల దాకా సుమారు రెండు వేల ఏళ్ళ ఇండియా చరిత్రలో పంది బొమ్మ నాణేల మీద కొనసాగింది.

మానవ నాగరికతలో పంది నిర్వహించిన పాత్ర కూడా ఎద్దు, గుర్రం, బర్రె, గాడిద నిర్వహించిన పాత్ర వలనే మౌలికమైనది. ఎడ్లు, బర్లు, గాడిదల వలననే పందులు కూడా పంటల్ని తింటాయి. ఆహార సేకరణ దశలో పందులు భూమిలోని దుంపలను మూతితో పెళ్ళగించి తీసుకొని తినేవి. అలా పందుల ద్వారా మానవులు కంద మూలాలు వంటి దుంపలను తెలుసుకోవడం, కనుక్కోవడం సాధ్యపడింది. పందులను మాంసం కోసం మచ్చిక చేసుకున్నారు.

అడవి పందులు ఇప్పటికి గుంపులు గుంపులుగా వచ్చి పంటలను ధ్వంసం చేస్తుంటాయి. అలాంటి పందులను మచ్చిక చేసుకుని దాని మాంసాన్ని ఆహారంగా మార్చుకున్నారు. పంది ఎరువును పంటలకు వాడారు. పంది కొవ్వును వంటకు, దీపాలకు వాడుకున్నారు. పంది కొవ్వుతో పంది నెయ్యి చేసి నొప్పులకు ఎముకలు విరిగినప్పుడు కట్టిన కట్లతో పాటు పంది నెయ్యితో ఫిజియోథెరఫీ ఇప్పటికీ చేస్తుంటారు. అలాగే గాయాలైనప్పుడు నొప్పులున్నప్పుడు పంది యొక్క పచ్చి రక్తం తాగుతారు. దాని వల్ల నొప్పి తగ్గిపోతాయి. ఇలా యుద్ధాల్లో అయ్యే గాయాలకు చికిత్సగా కూడా పంది ఎన్నో రకాలుగా ఉపయోగపడింది.

పందికి ఇలా ఒకప్పుడు సామాజికంగా ఎద్దు, ఆవు, గుర్రం, బర్రె, దున్నపోతులకు ఉండే గౌరవం చాలా ప్రాంతాల్లో వేల ఏళ్ళుగా కొనసాగింది అని స్పష్టమౌతున్నది. ఈ చారిత్రక అంశాలను, పురావస్తు ఆధారాలను చరిత్ర నిర్మాణంలో చరిత్ర పరిణామంలో భాగంగా ఇమిడే వాటిని కూడా క్రమక్రమంగా ఎందుకు వదలివేస్తున్నారో తెలియదు.

పందికి పురాణాల్లో కూడా ఒక అవతారంగా గౌరవించారు. వరాహపురాణం కూడా రాశారు. చేపలు వేటాడి తినే క్రమంలో చేపను ఒక దేవుడిచ్చిన వరంగా ఆనాటి ప్రజలు భావించారు. చేపపై గల గౌరవంతో చేపను ఒక దేవత అవతారంగా గౌరవించారు. అలాగే తాబేళ్లను తినే ఆహారంగా అలవాటయ్యాక తాబేలును ఒక అవతారంగా భావించారు. తరువాత పందిని మచ్చిక చేసుకుని ఒక అవతారంగా భావించారు.

అయితే మూడవ అవతారంగా పంది అవతారంతో పాటు నంది లేదా ఎద్దు అవతారం రావాల్సి ఉండింది. అయితే ఎద్దును శివుని నందిగా అప్పటికే గౌరవిస్తున్నందున విష్ణువు అవతారాల్లో ఒకటిగా ఎద్దును గాని, ఆవును గాని చెప్పలేకపోయారు. శివునికి అవతారాలను కల్పించే క్రమం ఎందుకు తీసుకోలేదో

చరిత్రలోకి వెళ్లి పరిశీలించవలసి వుంది.

పంది అవతారం కూడా విష్ణువు కన్నా శివుడి స్వభావానికే ఎక్కువ సన్నిహితంగా వుంటుంది. ఎద్దును, ఆవును ఒక విష్ణువు అవతారంగా మార్చుకోలేకపోవడంవల్ల సింధు నాగరికతను తమదిగా చెప్పుకునే అర్వత వర్ణవాద, కులవాద, బ్రాహ్మణవాద సిద్ధాంతవేత్తలకు అవకాశం లేకుండాపోయింది. బుద్ధుని అనంతరం, బౌద్ధం బాగా విస్తరించాక గోపూజను ప్రారంభించిన నయాబ్రాహ్మణ వాదం ప్రాచీన బ్రాహ్మణవాదానికి తానే వారసురాలనని చెప్పుకోవడంవల్ల పురాణ ఇతిహాసాల్లో వారి పరిష్కరించుకోలేని వైరుధ్యాల్లో చిక్కుకుపోయారు. నంది పూజ వేరు. అది వ్యవసాయానికి సహకరించిన క్రమానికి సంబంధించినది. ఆవు పూజ వేరు. అది నయాబ్రాహ్మణ వాద సిద్ధాంతానికి సంబంధించినది. సింధు నాగరికత చరిత్రను ఆర్య బ్రాహ్మణవాద నాగరికతగా మార్చిచూపే ప్రయత్నంలో పలు పరిష్కరించుకోలేని వైరుధ్యాలను తమకు తామే సృష్టించుకుంటున్నారు.



# దేవదాసీ వ్యవస్థ

## రాజ్యవిస్తరణ - రసికత - సౌందర్య ఆరాధన

## వేశ్యావాటికలు - కుటుంబ వ్యవస్థ

పెద్ద రాజ్యాల ఏర్పాటుకు, రసికతకు, వేశ్యావాటికలకు, వర్తక వాణిజ్యా అభివృద్ధికి, ఉత్పత్తి అభివృద్ధికి, గుళ్ల అభివృద్ధికి, గుళ్ల పేరిట జరిపే జాతరలకు మధ్య సంబంధం ఉంది. ఉత్పత్తి సాధనాలు మెరుగు పడడంవల్ల సంపద పెరిగింది. ఆ సంపద, ఉత్పత్తి ఆధారంతో రాజులు యుద్ధాలు చేయడానికి, రాజ్యవిస్తరణకు అవకాశం కలిగింది. రాజ్యవిస్తరణ జరిగిన తర్వాత పన్నుల వ్యవస్థ పెరిగింది.

పూర్వం తొలి రాజ్యాల కాలంలో ధాన్యమే పన్నుగా తీసుకునేవారు. శ్రమదానం, యుద్ధంలో పనిచేయడం కూడా పన్నులాగా పని తీసుకునేవారు. రాజ్యాలు విస్తరించిన తరువాత వ్యాపారం పెరిగింది. వ్యాపారులపై పన్నులు వేసారు. ఇవి నగదు రూపంలో వసూలయ్యే అవకాశం ఎక్కువ. నగరాలు పల్లెల నుండి సంపదను సౌందర్యాన్ని రాజోద్యోగులను వ్యాపారాన్ని కేంద్రీకృతం చేసింది. దానివల్ల ప్రజలు రాజధానులకు పనులమీద వచ్చేవారు. దాంతోపాటు టూరిజం అభివృద్ధి చెందింది. ఆనాటి టూరిజంలో గుళ్లు, వేశ్యావాటికలు, జాతరలు ప్రధానమైనవి. అలా రాజ్యవిస్తరణకు, వ్యాపారానికి, ఉత్పత్తికి, వేశ్యావాటికలకు, రసికతకు, సౌందర్య ఆరాధనకు అంతర్గత సంబంధం వుంది.

### భక్తి ఉద్యమాలు - ఆర్థిక దోపిడి

భక్తి ఉద్యమాలు అధ్యాయంలో చెప్పినట్లు "లంజలు రాకుండిన గుడి రంజిల్లదు, ప్రజల మనస్సు రంజిల్లదు. లంజలనేల సృజించెనో, కందజూడిల కుందవరం కలిసోడప్ప" అనే పద్యం కవి చౌడప్ప చాలా కాలం క్రితమే రచించి గుడులకు - లంజలకు ఉన్న సంబంధాన్ని బహిర్గతం చేశాడు. అనేక దేవాలయాలలో దేవదాసీ పేరిట వ్యభిచారాన్ని నిర్వహించి బ్రాహ్మణవర్గం తాము సంతృప్తి పడడమే కాకుండా ఇతరులకు వ్యభిచార

నిలయాలుగా జనాకర్షణ కేంద్రాలుగా రూపొందించారు. రూపొందించి దేవాలయాలకు ఆర్థిక పుష్టిని కలిగించారు. జాతరలు కూడా అలా రూపొందించినవే. ఆంధ్రప్రదేశ్‌లో దేవాలయాల్లో జరిగిన వ్యభిచారానికి సాక్ష్యాలుగా సింహాచలం, తిరుపతి దేవాలయాలలో వేసిన శాసనాలే సాక్ష్యం. కాకతీయుల కాలంలో మట్టెవాడ ప్రాంతంలో లక్ష మంది వ్యభిచార గృహాలు నిర్వహించారని క్రీడాభిరామంలో అనేక పద్యాల్లో వాటిని వర్ణించారు. బ్రిటీష్ వాళ్ళు వచ్చి ఈసడించుకొనేవరకు దేవాలయాలలో వ్యభిచారాన్ని నిరాటంకంగా కొనసాగిస్తూ వచ్చింది. బౌద్ధ విశ్వ విద్యాలయాలు, ఆరామాలు విద్యను, వైద్యాన్ని, సంస్కారాన్ని అందించడం ద్వారా ప్రజలను ఆకర్షించాయి. ఇందుకు భిన్నంగా బ్రాహ్మణ వాదులు విద్యను, వైద్యాన్ని నిరాకరించి వ్యభిచారాన్ని ప్రోత్సహించి ప్రజలను ఆకర్షించారు. తంత్రవాదం, పంచమకారాలు మొదలైనవి క్రీ.శ 7వ శతాబ్దంలో ప్రారంభించి 11వ శతాబ్దానికి ఉచ్ఛస్థితికి తీసుకు వచ్చి వ్యభిచారాన్ని ప్రోత్సహించారు. ఏడవ శతాబ్దంలో ఖజురహో లైంగిక ప్రక్రియల కామశాస్త్ర శిల్పాలు అలా ప్రాచుర్యంలోకి వచ్చాయి. దేవాలయాలలో బూతు బొమ్మలు ఎందుకు ఉన్నాయో తాపీ ధర్మారావు, ఆరుద్ర అనేక కోణాల్లో విశ్లేషించి గుళ్ళు వ్యభిచార కేంద్రాలుగా ఎలా కొనసాగాయో నిర్ధారించారు. దేవాలయాలలో శృంగార క్రీడను నిర్వహించి భక్తి, మత, ప్రచార ముసుగులో స్వర్గం ఆశను చూపించి స్వర్గంలోనూ ఇలాంటి సుఖ లాలసత్వం లభిస్తుందని బోధించారు. నైతిక పతనానికి, జీవిత భ్రష్టాచారానికి సాహిత్యానికి కోకొల్లలుగా సృష్టించి, విజ్ఞానం వైపు అడుగులు వేయకుండా నిరోధించారు. సంపద కేంద్రీకరణ చేసుకుంటూ బతుకుతున్న బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, వర్గాల వైపు దృష్టి పెట్టకుండా ఇలా పక్కదారి పట్టించారు. ఇందుకు శైవ మతం, వైష్ణవ మతం పోటా పోటీగా దేవదాసి, కృష్ణ, బసివినీ, జోగినీ వ్యవస్థలను ప్రవేశపెట్టారు. వైష్ణవం మొదట దీనిని ప్రారంభించింది. శైవం దాన్ని అనుసరించింది. వ్యభిచారాన్ని వ్యవస్థీకృతం చేసి సామాజిక గౌరవాన్ని సాధించడానికి కృష్ణ భక్తిని, 16వేల గోపికలను మొదలైన వారిని ముందుకు తీసుకువచ్చి ప్రచారం చేయడం జరిగింది. బసవన, పాలకుర్కి సోమనాథుడు వీర శైవంలో ప్రతిపాదించిన వ్యభిచారం విస్తృతంగా ప్రాచుర్యం పొందింది. బౌద్ధులను, జైనులను చంపడం ఒక వైపు చేస్తూ మరొక వైపు వ్యభిచారంలోకి ఆకర్షిస్తూ బౌద్ధ, జైనాలను అడ్డుకున్నారు. అడ్డు తొలగించుకున్నారు.

శాతవాహన రాజులు తల్లి పేరును తమ పేరుతో కలిపి పెట్టుకోవడం కొందరు తల్లి సంస్కృతిలో భాగం అన్నారు. మరికొందరు అదేమీ కాదు రాజులకు చాలా మంది భార్యలు ఉండేవారు ఏ భార్య కొడుకో తెలియడం కోసం తల్లి పేరుతో వారిని సంబోధించేవారు అని అన్నారు. ఈ రెండు క్రమాలు వాస్తవమే. రాముడికి, కృష్ణుడికి, చాలా మంది రాజులకు వందలాది మంది భార్యలు ఉండేవారు. వారిని ఉంపుడుకత్తెలు



అని పిలువడానికి వీలులేదు. వారిని భార్యలుగానే పూర్తి స్థాయిలో స్వీకరించారు. షాజహానుకు ముంతాజ్ రాణితో పాటు 350 మంది భార్యలు ఉండేవారని చరిత్ర చెబుతున్నది. విశాల తెలంగాణా ప్రాంతంలో రాజుల పరిపాలన చేసిన నైజాం రాజుకు 450 మంది భార్యలు ఉండేవారని, వారి సంతానం క్రీ.శ. 2005నాటికి కూడా ఆస్తుల కోసం కీచులాడుకుంటున్నారని తెలుస్తున్నది.

రాజులకు ఎక్కువ మంది భార్యలు ఉండడంలో అనేక అంశాలు ఉన్నాయి. రాజ్య విస్తరణలో భాగంగా రాజ్యాలను జయించినప్పుడు కనబడ్డ అందమైన స్త్రీలను సౌందర్యాధనలో భాగంగా భార్యలుగా స్వీకరించడం ఒకటి. రాజ్య విస్తరణలో భాగంగా తాను కలుపుకున్న ప్రాంతాల తెగల, జాతుల స్త్రీలను భార్యలుగా స్వీకరించడం ద్వారా ఆ తెగలను రాజు స్థాయికి గౌరవించడంలో భాగంగా పెళ్ళి చేసుకోవడం రెండోది. ఓడిన రాజులు తమ కూతుళ్ళను గెలిచిన రాజుకు ఇచ్చి పెళ్ళి చేసి మామగా రాజుల చేత గౌరవం పొందుతూ తిరిగి సామంతరాజుగా హుందాగా బతకడం మూడవది. రాజును పెళ్ళాడాలని స్త్రీలు కోరుకోవడం నాల్గవది.

కాకతీయ రాజుల కాలంలో సౌందర్య ఆరాధన ప్రచారంలో ఉండేది. సౌందర్య ఆరాధన నంద రాజుల కాలంలోను, మౌర్య చంద్రగుప్తుల కాలంలోను, కనిష్కుని కాలంలోను, హర్షవర్ధనుని కాలంలోను ప్రాచుర్యంలో ఉండేది. ఆమ్రపాలి అనే ఒక సంపన్నురాలైన వేశ్య బుద్ధుని కాలంలో బౌద్ధంలో చేరిందని చరిత్ర తెలుపుతున్నది. శరీర సౌందర్యాన్ని ఒక పరిశ్రమగా అభివృద్ధి పరచుకున్నారని దీని వల్ల తెలుస్తున్నది. క్రీ.శ. 7వ శతాబ్దంలో నిర్మించిన ఖజురహో శిల్పాలు సౌందర్య ఆరాధనను, వాత్సాయన కామసూత్రాలను తెలుపుతాయి. వాత్సాయన కామసూత్రాలు సౌందర్య ఆరాధనలో భాగంగా నీతులెన్ని చెప్పినా లైంగిక పరిశ్రమ అభివృద్ధికోసం రాయబడినవే. పూర్వం లైంగిక పరిశ్రమకు విస్తారంగా గౌరవం ఉండేది. కుటుంబ వ్యవస్థతో పాటు, సౌందర్య ఆరాధన, సౌందర్య ఆరాధనలో భాగంగా లైంగిక కుటీర పరిశ్రమ విరివిగా కొనసాగేది. నేటి వేశ్యలతో, సెక్స్ వర్కర్లతో ఆనాటి లైంగిక పరిశ్రమను, గుళ్ళలోని దేవదాసి, బసివి, కృష్ణ, జోగినిలను పోల్చడానికి వీలుకాదు. దేవదాసీలు వేరు సౌందర్య ఆరాధనలో భాగంగా కొనసాగిన లైంగిక కుటీర పరిశ్రమ వేరు.

క్రీ.పూ. 6వ శతాబ్దంలో ఏర్పడిన నందరాజుల కాలంలో సౌందర్య ఆరాధన, లైంగిక పరిశ్రమ కొనసాగేది. చేత్తో పనిచేయడం లాగే మొత్తం శరీరంతో పనిచేస్తూ ఆనందాన్ని ఇస్తూ, ఆనందాన్ని పొందే పరిశ్రమగా లైంగిక పరిశ్రమ అభివృద్ధి చెందింది. వీరికి సమాజం యొక్క, రాజుల యొక్క రక్షణ కూడా ఉండేది. అందువల్లే వాళ్ళు స్వేచ్ఛగా జీవిస్తూ సంగీతం, సాహిత్యం కళల్లో ప్రావీణ్యం సంపాదిస్తూ భార్యలు ఇవ్వలేని

ఆనందాన్ని, వాత్సాయన కామసూత్రాల్లో పేర్కొన్న భంగిమల్లో ఆనందాన్ని అందించి వారి హృదయాలను చూరగొని గొప్ప సంపన్నులు అయ్యేవారు. రాజులు కూడా వీరిని ఎంతో గౌరవించేవారు. వీరి సంపాదనపై ఆదాయపు పన్ను వేసేవారు.

లైంగిక పరిశ్రమను రాజులు రక్షిస్తూ ప్రోత్సహించడంలో కుటుంబ వ్యవస్థకు రక్షణ కల్పిస్తూ కాస్త వెసలుబాటు కలిగించారు. దాంతో పాటు లైంగిక పరిశ్రమ ద్వారా నగదు రూపంలో ఆదాయం పన్ను లభించేది. పూర్వం నగదు రూపంలో ప్రభుత్వానికి ఆదాయం నాలుగు వర్గాల నుండి మాత్రమే అందేది. ఒకటి వ్యాపార వర్గాల నుండి, రెండు గుడి గోపురాల నుండి, మూడు సామంత రాజుల నుండి, తాను నియమించిన అధికారుల నుండి, నాలుగు లైంగిక పరిశ్రమ నుండి. అందువల్ల ఈ వర్గాలకు రక్షణ ఏర్పాట్లను కూడా రాజులు చూసేవారు. అందువల్ల ఇప్పటి కిడ్నాప్, సాముహిక మానభంగాలు, హత్యల భయం లేకుండా స్వేచ్ఛగా రాజోద్యోగులతో సమానంగా గౌరవంతో లైంగిక పరిశ్రమలోని స్త్రీలు జీవించేవారు.

లైంగిక పరిశ్రమ చేసే స్త్రీల ఇళ్ళు సంగీత, నృత్య కళలతో గృహాలంకరణతో ఎంతో ఆకర్షణీయంగా ఉండేవి. ఈ లైంగిక పరిశ్రమ ఇటీవల దాకా కొనసాగింది. క్రీ.పూ. 2వ శతాబ్దం నుండి క్రీ.శ. 2వ శతాబ్దం మధ్య కాలంలో శూద్రక రాసిన మృచ్ఛకటికం అనే సంస్కృత నాటకంలో వసంతసేన అనే వేశ్య ప్రధానపాత్ర ఉంది. ఆమెకు రాజరిక వర్గాల్లో గొప్ప గౌరవం ఉన్నట్లుగా స్పష్టమౌతుంది. ఈ నాటకాన్ని అనుసరిస్తూ తెలుగు భాషలో క్రీ.శ. 1909లో గురజాడ అప్పారావు అనే రచయిత ఉత్తరాంధ్ర ప్రాంతం నుండి రాసిన కన్యాశుల్కం అనే నాటకంలో మధురవాణి అనే వేశ్య పాత్ర ఉంది. ఆమె గుణగణాలు, తెలివితేటలు మొత్తం నాటకంలోని పాత్రల కన్నా ఎంతో ఉన్నతమైనవి.

బట్టలు నేయడం, పశువులను పెంచి పోషించడం, వ్యవసాయం చేయడం, వెదురు, ఈత నారతో బుట్టలు అల్లడం, కర్ర ఆధారంగా వృత్తులు చేయడం, కుండలు చేయడం, లోహాలతో సామగ్రి, ఆయుధాలు, నగలు చేయడం వృత్తుల వలెనే లైంగిక పరిశ్రమ కూడా కుటీర పరిశ్రమగా కొనసాగింది. దొమ్మరి విద్యలు, దొమ్మరి కళలు దొమ్మరి రాజులు ఉచ్ఛస్థితిలో ఉన్నప్పుడు వారి ప్రోత్సాహం వల్ల గొప్పగా అభివృద్ధి చెందాయి. దొమ్మరి రాజుల రాజ్య విస్తరణలో దొమ్మరి కళలు, దొమ్మరి వారి లైంగిక పరిశ్రమ ఎంతగానో తోడ్పాటునందించింది. వీరు దొమ్మరి రాజులకు రాయబారులుగాను, గూఢచారులుగాను కూడా పనిచేశారు. అందుకు వారి సంచార జీవితం కూడా సహకరించింది.

దొమ్మరి కళలు, దొమ్మరి విద్యలు క్రీ.శ.20వ శతాబ్దం దాకా ప్రజల్లో ఎంతో



ఆదరణ పొందాయి. ఆ ఆదరణ తగ్గుతున్న క్రమంలో లైంగిక పరిశ్రమకు పరిమితం అయ్యారు. మధ్యలో కుటుంబ వ్యవస్థ సిద్ధాంతం బలోపేతం కావడం వల్ల లైంగిక పరిశ్రమ పట్ల సామాజికులు ముఖ్యంగా స్త్రీలు, ఇల్లాళ్ళు వ్యతిరేకతను, అసహ్యాన్ని ప్రచారం చేశారు. అది కొంత కాలమే ప్రభావం వేసింది. నగరాలు, పట్టణాలు ఆధునిక సమాజం విస్తరిస్తున్న కొద్దీ తిరిగి లైంగిక పరిశ్రమ కొత్త రూపాల్లో పుట్టి పెరిగింది. కేబరే డ్యాన్సర్లు, మోడల్స్, సినిమా తారలు మొదలైనవారు లైంగిక పరిశ్రమ తాలుకు కొన్ని అవసరాలను తీర్చుతున్నాయి. అలా అని వీరు సెక్స్ వర్కర్లుగా పని చేస్తున్నారని భావించనవసరం లేదు. కాని నాటి ఆమ్రపాలి, వసంతసేన, మధురవాణి వంటి సామాజిక గౌరవాన్ని వీరికి సమాజం, ప్రభుత్వాలు ఇచ్చి గౌరవిస్తున్నాయి. వీరి గ్లామర్, సౌందర్యం, సౌందర్య ప్రదర్శన మగవారు సౌందర్యాధన రూపంలో చేసే మానసిక వ్యభిచారం కోసమే అనేది అందరూ అంగీకరించే విషయమే.

తెగ, తండా, జనపదాల దశ నుండి పట్టణాలు, నగరాలు ఎదుగుతున్న క్రమంలో కుటుంబ వ్యవస్థ స్థిరపడుతూ వచ్చింది. కుటీర పరిశ్రమలు కుటుంబ వ్యవస్థను తీర్చి దిద్దాయి. కుటుంబ వ్యవస్థ వల్ల, కులవృత్తుల స్థిరీకరణ వల్ల కళలు, సంగీతం మొదలైన వాటికి కుటుంబ వ్యవస్థలో స్కూల్లో వీటికి ఒక పీరియడ్ లేనట్టుగా ప్రత్యేక పీరియడ్, శ్రద్ధ లేకుండా పోయింది. వాటిని పెంచి పోషించే కులాలు, వర్గాలు, 'వ్యక్తులు' ఎదగడం అవసరమైంది. కొంతమంది రాజాస్థానాల్లో చేరారు. కొంతమంది సంచార జీవితం జీవిస్తూ ప్రజలమీద ఆధారపడి బతికారు.

మరికొంత మంది లైంగిక పరిశ్రమ నిర్వహిస్తూ స్వతంత్రంగా జీవిస్తూ సంగీతం, సాహిత్యం, కళలల్లో నైపుణ్యం సాధిస్తూ అభివృద్ధి పరిచారు. అటు తర్వాత గుళ్ళు, గుళ్ళలో ఈ కళలకు ఆశ్రయం లభించింది. దైవారాధన పేరిట ఇవి వికసించాయి. లైంగిక పరిశ్రమ వల్ల వచ్చే లాభాలు గుడి పూజారులు, రాజులు పంచుకొని తినడం వల్ల ఇక్కడ లైంగిక పరిశ్రమ చేసే వారికి స్వాతంత్రం లేకుండా పోయింది. వారు పేదవారిగా మార్చబడ్డారు. చివరకు దేవదాసీలుగా మార్చి వ్యభిచారాన్ని నిర్బంధం చేశారు. వాత్సాయన కామసూత్రాలను ఈ లైంగిక పరిశ్రమ ద్వారానే పురుషులు అనుభవం సంపాదించేవారు.

ఈ లైంగిక పరిశ్రమలో రాజు ఎంతో మంది రాణులను ప్రేమించినట్టుగానే స్త్రీలు ఎంతో మంది పురుషులను ప్రేమించేవారు. గౌరవించేవారు. ఈ విషయంలో రాజులు రాణుల పట్ల చూపే ప్రేమ కన్నా ఎన్నో రెట్లు ఎక్కువగా లైంగిక పరిశ్రమలోని స్త్రీలు పురుషుల పట్ల చూపేవారు. రాజుల ప్రేమ నేను పెంచిపోషిస్తున్నాను అనే ఆధిక్యతకు సంబంధించింది. లైంగిక పరిశ్రమలోని స్త్రీల ప్రేమ మగవారు స్వచ్ఛందంగా

ప్రతిఫలం నచ్చి ఇచ్చే విధంగా ప్రేమించడం, గౌరవించడం అనివార్యతకు సంబంధించినవి.

అందువల్ల లైంగిక పరిశ్రమలోని స్త్రీలు అంత పురంలోని రాణులు రాజుల ప్రేమ కన్నా ఎంతో ఉదాత్తంగా ఉన్నతంగా ఉండేది. అందువల్ల మగవారు కుటుంబానికి కూడా మిగలకుండా ఉన్న ఆస్తులన్నీ అమ్మి సౌందర్య ఆరాధన కోసం లైంగిక పరిశ్రమలోని స్త్రీలకు ఖర్చు పెట్టేవారు. ఇల్లాళ్ళకు ఇది భరించలేని విషయం. అందువల్ల వ్యభిచారం పట్ల తీవ్రమైన ద్వేషాన్ని ప్రచారం చేశారు. ఈ నేపథ్యంలో చూస్తే ఏకపత్నీ వ్రతం ఆచరించాలనేది ఇల్లాళ్ళ దృష్టి నుండి పుట్టిన ఒక సిద్ధాంతం అని చెప్పవచ్చు. తనకే పుట్టిన సంతానానికి తన ఆస్తిని, రాజ్యాన్ని, వంశప్రతిష్టను, వర్ణాన్ని, కులాన్ని వారసత్వంగా అందించడం కోసం ఏకపత్నీ వ్యవస్థ సిద్ధాంతం పుట్టింది అని అంటారు. తొలి దశలో ఇదే జరిగి ఉంటుంది. మలి దశలో ఇలా ఇల్లాళ్లకే అది ఎంతో అవసరమైంది.

కనుక ఒక భర్తకు ఒకే భార్య, ఒక భార్యకు ఒకే భర్త అనే సిద్ధాంతం వెనుకటి కాలంలోని ఫెమినిజంలో భాగంగా పుట్టిన తొలి సిద్ధాంత అని చెప్పవచ్చు. స్పష్టంగా చెప్పాలంటే దంపతి వ్యవస్థ సిద్ధాంతం పురుషులది కాదు. అది తల్లి ద్వారా గుర్తించే వ్యవస్థ సంస్కృతి ఛాయలు మిగుల్చుకున్న చైతన్యంతో పితృస్వామిక, పురుషాధిపత్య వ్యవస్థలో స్త్రీలు, ఇల్లాళ్ళు ఒక ఉద్యమంగా బయలుదేరి సృష్టించిన తొలి ఫెమినిస్టు సిద్ధాంతం. అందువల్లే రామాయణం అనే ఇండియాలోని ఒక కావ్యంలో శ్రీరామ అనే నాయక పాత్రకు వాల్మీకి అనే కవి సీత అనే భార్యతో పాటు ఎంతో మంది భార్యలు ఉన్నారని రాసినప్పటికీ రాముణ్ణి ఏకపత్నీవ్రతుడుగా ప్రచారం చేస్తే ఎంతో సంతోషించింది స్త్రీలే.



# విద్యావిధానాల చరిత్ర ప్రాధాన్యత

నేటి అసమానతలకు కారణమైన విద్యావిధానాల చరిత్ర, పరిణామాలు పరిశీలించడం అవసరం. రాజరిక వ్యవస్థకు, పరిపాలనకు మతప్రచారానికి, వ్యాపారానికి అవసరమైన విద్యావిధానాలు. కొంత చరిత్రకెక్కాయి. సమస్త విద్యలను బోధించే ఉపాధ్యాయులు, ప్రొఫెసర్లు అందరికీ విద్యా విధానాల చరిత్ర పట్ల అవగాహన ఉండడం అవసరం. ఈ అవసరాన్ని స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత ఇండియా ప్రభుత్వం, రాష్ట్ర ప్రభుత్వాలు, వాటిలో పనిచేస్తున్న అధికారులు, ప్రభుత్వాధినేతలు, విద్యావేత్తలు గుర్తించినట్లు కనపడదు.

## ఎప్పుడు? ఏది విద్య? ఏది కళ? ఏది వృత్తిగా నిర్వచించారు?

పూర్వం దేన్ని విద్యగా భావించారు, ఎవరు భావించారు, రాజ్య పరిపాలన, వర్తక, వాణిజ్యాల నిర్వహణ, సిద్ధాంత, మత, భావజాల విద్య, లేఖన, బోధన విద్య ఎవరికి అందించబడింది. ఏయే వర్గాలు, తెగలు, జాతులు, కులాలు, వర్ణాలు, ప్రాంతాలు వీటిలో స్థానం సంపాదించుకున్నాయి? ఎవరికి అవి నిరాకరించబడ్డాయి. వృత్తి విద్యలు, లోహ, ఖనిజ, ఖగోళ విద్యలు, చెరువులు, ఇళ్ళ, రాజ ప్రాసాదాల నిర్మాణాల విద్యలు, శిల్ప కళలు, విద్యలు ఎవరు ఎలా ఏ విద్యా విధానం ద్వారా నేర్చుకున్నారు? కళలు, సాహిత్యం, సంగీతం ఏ విద్యా విధానం ద్వారా నేర్చుకున్నారు? యుద్ధ విద్యలు ఎవరు ఎలా ఏ విద్యా విధానం ద్వారా నేర్చుకున్నారు. ఎవరికి ఏది అబ్బింది, ఎవరికి ఏది అందించబడింది, ఎవరికి ఏది నిరాకరించబడింది, ఎవరు ఏది స్వయంగా స్వీకరించి అభివృద్ధి పర్చుకున్నారు మొదలైనవి విద్యా విధానాల చరిత్రలో భాగంగా తెలుసుకున్నప్పుడే నేటి అసమానతలకు చారిత్రక మూలాలు అవగతం అవుతాయి.

## మూడు వర్ణాల విద్యలే విద్యలన్నారు

శూద్రులు వైజ్ఞానిక ఆవిష్కరణలను, ఖనిజ లోహాల వెలికితీతను వాటితో సాధించే ఉత్పత్తిని, ప్రకృతి సంపదను వినియోగంలోకి తేవడం, సకల ఉత్పత్తులను సృష్టించడం చేస్తుంటే దాన్ని సామాజిక శాస్త్రాల్లో, సామాజిక పరివర్తనలో, సామాజిక న్యాయంలో అనువర్తింపజేసి సామాజిక సిద్ధాంతాలను, మతాల దృక్పథాలను, మత సంస్కృతిని

మార్చుకోవలసి ఉండింది. దాన్ని మార్చకుండా వర్ణ కుల సిద్ధాంతాలను ఆర్య త్రైవర్ణికా అంటూ మూడు వర్ణాలకు, **వారి తాలూకు విద్యలను మాత్రమే విద్యలుగా ప్రకటించి శూద్రుల విద్యలను కళలుగా, కేవలం ఉత్పత్తులుగా, వృత్తులుగా వర్గీకరించారు. వారి నుండి పుట్టిన జ్ఞానాన్ని విద్యలుగా వైజ్ఞానిక శాస్త్రాలుగా, సామాజిక శాస్త్రాలుగా మలచడాన్ని వ్యతిరేకించారు.** బ్రాహ్మణవాదులు విద్య అనుకున్నదాన్ని శూద్రులకు అందకుండా చేశారు. బౌద్ధకాలంలో విద్య అందరికీ అందింది. విద్య అందకుండా చేయడం ద్వారా బ్రాహ్మణీయ మత సామాజిక సిద్ధాంత వేత్తలుగా శూద్ర కులాల నుండి ఎదిగేవారిని నిరోధించారు. అక్కడ జరిగింది అసలు పొరపాటు. దాని వల్ల ఎంత ఉత్పత్తి పెరిగినా సామాజిక వర్ణ, కుల వ్యవస్థ మారలేదు. ఫలితంగా సామ్రాజ్యాల విస్తరణ భారత దేశం నుండి ప్రపంచానికి విస్తరించలేక పోయింది. సంపదను వర్తక వాణిజ్యాలతో, విదేశాలతో సంపర్కం పెట్టుకోవడం వల్ల వాళ్లకు కన్ను కుట్టి భారత దేశంపైకి దోచుకోవడానికి బయలు దేరారు. క్రమంగా దండయాత్రలు చేశారు. ఆ తరువాత రాజ్యాలు ఏర్పర్చుకున్నారు.

## సామాజిక న్యాయం - సామాజిక మార్పు పట్టించుకోకపోవడమే అనగా వర్ణ, కుల, సిద్ధాంతాలే దేశం విదేశీయుల పరం కావడానికి కారణం

ఇలా వర్ణ, కుల సిద్ధాంతాల వల్ల భారతదేశంలో సామ్రాజ్యాల విస్తరణ ఆగిపోయింది. ఇతరుల దాడులు, దోపిడీలు పెరిగాయి. తద్వారా ఇతరులకు బానిసలుగా మారే సంపదగా ఉపయోగపడింది. మూడు వర్ణాలు తమ సుఖభోగాలకు పరిమితమై ఆలోచిస్తూ రాజ్యవిస్తరణ గురించి సామాజిక న్యాయం, సామాజిక మార్పు గురించి ఆలోచించక పోవడం వల్ల ఇలా జరిగింది. ఇస్లాం యుద్ధాల్లో లభించిన సంపదను 5వ వంతు సైనికులు హక్కుగా పొందే అవకాశం ఇచ్చింది. దీంతో ప్రపంచ రాజ్యాల రూపు రేఖలే మారిపోయాయి. భారతీయ రాజ్యాధికార సిద్ధాంతాలు, మత సిద్ధాంతాలు శూద్ర కులాలకు ఈ వాటాను ఇవ్వడాన్ని నిరాకరించడమే కాకుండా కుల వ్యవస్థ పేరిట కర్మ, పునర్జన్మ పేరిట నిరంతరం తరాల తరబడి, శతాబ్ధాల తరబడి దోపిడీ చేస్తూనే వచ్చారు. తమ సంపద, తమ సుఖాలకు, తమ పిల్లల అభివృద్ధికి ఉపయోగపడకపోవడం వల్ల ఒక నిరాశాపూరితమైన మనస్తత్వం ప్రజల్లో ప్రబలింది. దానికి కర్మ పునర్జన్మ సిద్ధాంతాలు ప్రధాన కారణాలు. ఉత్సాహం చాలా మేరకు తగ్గింది. అయినా ప్రపంచంలో వీరు పేరెన్నిక గన్న నిపుణులు.

ఒక వేళ **శూద్రులకే ఆత్మగౌరవం, సామాజిక న్యాయం, రాజ్యాధికారంలో వాటా (జన్మనా జాయతే శూద్ర సిద్ధాంతంతో) ఇచ్చి బ్రాహ్మణీయ సిద్ధాంతాలను ఇందుకు అనువుగా మార్చి ఉంటే భారతదేశం అంతటా రాజ్యాలు విస్తరించడంతో**



**పాటు అవి ప్రపంచ సామ్రాజ్యాలుగా భారతీయ వర్తక వాణిజ్యాలు ఏ మేరకు విస్తరించాయో ఆ మేరకు విస్తరించి ఉండేవి.** ఈ విషయాలను కప్పిపెట్టి భారతీయులకు రాజ్యాధికార వాంఛ లేదని బ్రాహ్మణవాదులు, ఆర్ఎస్ఎస్ వాదులు అసత్యాలు ప్రచారం చేస్తున్నారు. భారత దేశంలో రాజులు నిరంతరం రాజ్యాధికార వాంఛతో పరస్పరం యుద్ధాలు చేసుకున్నారు. అత్యున్నత సామ్రాజ్యాల విస్తరణ సిద్ధాంతాలు అరిస్టాటిల్ వలె బౌద్ధంలో గానీ, బ్రాహ్మణ మత శాఖల్లో కానీ, శూద్రుల సిద్ధాంతాల్లో కానీ బలంగా ముందుకు వచ్చి ఉంటే ప్రపంచమంతా భారతీయుల సామ్రాజ్యమే విస్తరించి ఉండేది. ఇది రాయకుండా భారతీయ రాజుల చరిత్రను మాత్రమే పట్టించుకొని అసలు విషయాలను వదిలేస్తున్నారు. తమకు అనుకూలంగా ఉన్న మేరకు, తాము విభేదించే సత్యాలు చెప్పడానికి అంగీకరించిన పరిమితి మేరకు పాఠ్య పుస్తకాల్లో చేర్చబడతాయి. ప్రభుత్వాలు, ప్రభుత్వ విధానాలు, దృక్పథాలు మారినప్పుడల్లా పాఠ్య పుస్తకాలు మార్చబడుతుంటాయి. తిరగ రాయబడుతుంటాయి.

అందువల్ల పాఠ్య పుస్తకాలు చారిత్రక సత్యాలకు వెనకబడిపోతూ ఉంటాయి. తల్లి వెంట దూడ నడిచినట్టుగా ప్రభుత్వాల ననుసరించి పాఠ్య పుస్తకాలు నడుస్తుంటాయి. పాఠ్య పుస్తక రచయితలు సంకలన కర్తల వలె పనిచేస్తుంటారు. చరిత్ర గురించిన పాఠ్య పుస్తకాలు మాత్రమే ప్రజలకు, విద్యార్థులకు ఎక్కువ అందుబాటులో ఉంటాయి. ఉదా॥కు ఒకటవ తరగతి పాఠ్య పుస్తకం ఇండియాలో వివిధ భాషలలో ఏటా పదిహేను, ఇరవై కోట్ల ప్రతులు అచ్చవుతుంటాయి. పదవ తరగతి పాఠ్య పుస్తకాలు ఏటా ఐదు కోట్ల ప్రతుల చొప్పున అచ్చవుతుంటాయి.

విద్యా విధానం ద్వారా మనుషులను మార్చుతుంటారు. పాలకవర్గాలు, పాలక కులాలు, ఆధిపత్య జాతులు, రాజులు, రాజరికాలు, వర్ణ వ్యవస్థవాదులు వారి ప్రయోజనాలకు అనువుగా, అనగా వారి వర్ణవాద, రాజరికవాద సిద్ధాంతాలకు అనువుగా కొనసాగిస్తారు. అందువల్ల ఏ వర్గాలను పైకి తీసుకురావాలి, ఏ వర్గాలను ఎక్కడ ఉంచాలి, ఏ వర్గాలు అధికారంలోకి రావాలి, ఏ వర్గాలకు గౌరవం ఉండాలి, ఏ వర్గాలు పనిచేస్తూ, యుద్ధాల్లో సైనికులుగా పోరాడుతూ బతకాలి అనేవి విద్యా విధానంలో భాగంగా అందించబడతాయి. రాజ్యం వీర భోజ్యం. గెలిచిన వారే రాజులు. అందువల్ల రాజరికానికి కులం, మతం, జాతి, భాష సిద్ధాంతాలు అతీతమైనవి. ఎవరైనా రాజు కావచ్చు. కాని శాంతియుత పరివర్తన సాగిన చారిత్రక కాలమంతా విద్యా విధానమే ప్రజలను అలాంటి రాజులకు, వర్ణవాదులకు మార్చబడింది.

బౌద్ధ విద్యా విధానంగాని, జైన విద్యా విధానంగాని, యూదు విద్యా విధానంగాని, క్రైస్తవ విద్యా విధానంగాని, ప్రాచీన గ్రీకు, చైనా, ఈజిప్టు నాగరికతల విద్యా విధానంగాని

ఇలాగే కొనసాగింది. ఇస్లాం విద్యా విధానం ఒక్కటే రాజ్యం వీర భోజ్యం అని అనకపోయినా ఇస్లాంను వ్యాపింపచేయాలి అనే దృష్టితో దాన్నే ఆచరించింది. రాజరిక, ప్రజాస్వామిక, సోషలిస్టు విద్యా విధానాలు ఇలా ఆయా మతాల విద్యా విధానంలో భాగంగ్గాను, అనుకూలంగాను, అవసరమైన మేరకు వాటికి వ్యతిరేకంగాను కొనసాగాయి. కొనసాగుతున్నాయి. అందువల్ల నాగరికత, పౌర సమాజాల పరిశీలన అంటే విద్యా విధానాల చరిత్ర పరిశీలనే.

ఎంతో ప్రాధాన్యత గల ఈ విషయాన్ని చరిత్రలో భాగంగా 'విద్యా విధానాల చరిత్ర, పరిణామాలు' అంటూ ఏ రాజు కాలంలో, ఏయే చారిత్రక దశల్లో విద్యా విధానాలు ఎలా ఉండేవి అని పరిశీలించిన చరిత్రకారులు చాలా తక్కువ. తద్వారా విద్యను అందుకొనే అవకాశాలు ఎవరికి ఉండేవి, ఎవరికి విద్య నిరాకరించబడింది, ఆయా విద్యా విధానాలు ఎలాంటి సమాజాల నిర్మాణానికి పునాది అయ్యాయి, ఎవరు ఉన్నత శ్రేణిలోకి వచ్చారు, ఎవరు నిర్లక్ష్యం చేయబడ్డారో తెలిపే ముఖ్యమైన విషయాన్ని వదిలేసిన వారయ్యారు. చరిత్రకారుల్లో ఇప్పటికీ ఈ లోపం కొనసాగుతున్నది.

ప్రముఖ చరిత్రకారులు, ఇండియాలోని విద్యా విధానాల రూపకల్పనలో ప్రధాన పాత్ర నిర్వహించే యూనివర్శిటీ గ్రాంట్స్ కమిషన్ మాజీ ఛైర్మన్ అయిన ప్రొఫెసర్ సతీష్‌చంద్ర చరిత్రలో భాగంగా 'విద్యా విధానాల చరిత్ర - పరిణామాలను' తన చరిత్ర రచనలో భాగంగా చర్చించక పోవడం ఆశ్చర్యం కలిగిస్తున్నది. ఆయన ఆ యా కులాల తీరుతెన్నులను, వారి జీవన విధానాలను, ఉత్పత్తులను, సేవలను అవి ఆయా చారిత్రక దశల్లో పొందిన పరిణామాలను కొంత చర్చించారు. ఇండియాలోని విద్యా విధానాల గురించి గాని, వర్ణవాద, కులవ్యవస్థ వాద సిద్ధాంత కర్తల స్వార్థం గురించి గాని, బ్రాహ్మణులు ఇండియా ఇతర దేశాల దాడులకు గురికావడానికి దారితీసిన కుట్రల గురించి గాని, 'మధ్యయుగాల భారతదేశం' అనే తన గ్రంథంలో వదిలివేసారు. యు.జి.సి. ఛైర్మన్ అయి వుండి కూడా విద్యా విధానాల చరిత్ర గురించి గాని, అంతర్గత వైరుధ్యాల వల్ల ఇండియాలో ఇతర ప్రాంతాలవారు రాజ్యాలు ఏలడం సాధ్యపడిందని గాని, చెప్పకపోవడం శోచనీయం.

ఆయా రాజ్యాలు, సమాజాలు, సిద్ధాంతాలు, మతాలు, పరిపాలన, ఉత్పత్తి విధానాలు, వృత్తులు, కళలు, సాహిత్యాలు ఎలా తర్వాతి తరాలకు కొనసాగుతూ వచ్చాయి. లేదా నశించిపోతూ వచ్చాయి అనే విషయాలు విద్యావిధానాల చరిత్ర ద్వారా తెలుస్తాయి. నేడు అసమానతలను, ఇన్‌ఫీరియారిటీ కాంప్లెక్స్‌ను, పెంచి పోషిస్తూ సామాజిక అభివృద్ధికి ఆటంకంగా మారిన తెగ, జాతి, ప్రాంత, భాష, కుల, మత వ్యత్యాసాల విశ్వాసాలకు, ఆచరణకు గల మూలం ఏమిటో తెలుసుకోవడంతో



పాటు వాటికి పరిహారాలు, పరిష్కారాలు కనుక్కోడానికి కూడా విద్యా విధానాల చరిత్ర పరిణామాల పరిశీలన, విశ్లేషణ అవసరం అవుతుంది.

## శూద్రుల విద్యా విధానాల చరిత్రను వదిలేసిన చరిత్రకారులు

ఇప్పుడున్న చరిత్ర రచనా పద్ధతిలో ఈ సమగ్రత లేకపోవడం వల్ల, ఉత్పత్తి కులాల, వృత్తి కులాల, వారి విద్యా విధానాల చరిత్ర పరిణామాలు లేక పోవడం వల్ల, రాజరిక, పరిపాలన, మత, సిద్ధాంత, భావజాల, వర్ణవాద, కులవ్యవస్థ వాద, వర్గవాద, వర్తక శ్రేణులకు పరిమితమైన చరిత్రను, పరిణామాలను మాత్రమే చరిత్రగా చెప్పడం జరుగుతున్నది. ఇది వర్ణవాద, కులవ్యవస్థవాద సిద్ధాంతాల వల్ల లాభం పొందిన వారి ఆధిపత్యాన్ని సమాజంలో కొనసాగించడానికి సైద్ధాంతిక, చారిత్రక, మానసిక పునాదులను వేస్తున్నాయి. అందరికీ సమాన విద్య పేరిట జరుగుతున్నది కూడా ఆధిపత్య వర్గాల ప్రయోజనాలకు అనువుగా వారు మాత్రమే అన్ని రంగాల్లో ఎదగడానికి అనువుగా పాఠ్య ప్రణాళికలు, పాఠ్యాంశాలు, విద్యా విధానాల అవగాహన పత్రాలు రూపొందుతున్నాయి. వీటిని సమూలంగా మార్చడం అవసరం. అందుకు చరిత్ర అధ్యయనంలో జరిగిన, జరుగుతున్న పొరపాట్లను, కొందరి ఆధిక్యతను నిలబెట్టే, కొనసాగించే దృక్పథాలను సమూలంగా మార్చవలసి ఉన్నది.

వర్ణ, కులవ్యవస్థవాద సిద్ధాంతవాదులు యుద్ధ విద్యలను, వర్తక, వాణిజ్య విద్యలను, లేఖన, భావజాల సిద్ధాంత విద్యలను, పూజారి విద్యలను కొన్ని కులాలకు పరిమితం చేశారు. యుద్ధ విద్యలను స్వయంగా నేర్చుకున్న తెగలు, జాతులు ఒక సంఘటిత శక్తిగా ఎదిగి రాజ్యాలను నిర్మించాయి. వారే వర్తక, వాణిజ్యాల్లో కూడా ప్రవేశించారు. వారే రాజ్యాధికార ఆధిపత్యం వల్ల, సంపద వల్ల సామాజిక గౌరవం వల్ల, భావజాల సిద్ధాంత, సాహిత్య, కళారంగాల్లో కూడా ఎదిగారు.

ఇలా ఎదిగిన తెగల, జాతుల, కులాల, వృత్తుల వారిని రెండవ, మూడవ తరంలో బ్రాహ్మణ వర్ణంలోకి ప్రమోట్ చేశారు. ఇది గ్రూప్ 1 ఆఫీసర్లను ప్రమోషన్‌తో ఐ.ఏ.ఎస్.గా కన్ఫర్మ్ చేయడం వంటిదే. గుమస్తా నుండి అంచెలంచెలుగా ప్రమోషన్లు ఇచ్చి ఆర్.డి.ఓ.గా, డిప్యూటీ కలెక్టర్‌గా ప్రమోట్ చేసినట్లుగా ఆయా తెగల, జాతుల, వృత్తుల, కులాల, భాషల నుండి బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య వర్ణాలుగా ప్రమోట్ చేయడం జరిగింది. ఏ ప్రాంత ప్రజలు ఆ ప్రాంత ప్రజలుగానే కనపడుతున్నారు. కాశ్మీర్‌లోని బ్రాహ్మణులకు, కేరళలోని బ్రాహ్మణులకు ఆకృతిలో ఆంత్రోపాలజీలో పోలికలు లేవు. కేరళలోని అందరిలాగే బ్రాహ్మణులు, వైశ్యులు, సూద్రులు, ఉత్పత్తి కులాలు, వృత్తి కులాలు కనపడుతుంటారు.

అయినప్పటికీ ఒకే ప్రాంతంలో ఉన్నప్పటికీ **వర్ణ, కులవ్యవస్థవాద సిద్ధాంత**

**ధారులు** బస్సు ఎక్కిన తర్వాత నెక్ట్స్ స్టేజీలో బస్సు ఎక్కేవారిని స్థలంలేదు నెక్ట్స్ బస్సులో ఎక్కండి అంటూ కాళ్ళు జాపుకుని కూర్చునే విధానాలను అనుసరిస్తూ యుద్ధ విద్యలను, వర్తక, లేఖన, భావజాల సిద్ధాంత పూజారి విద్యలను తోటి ప్రజానీకానికి అందించడానికి నిరాకరిస్తూ వచ్చారు. ఇప్పటికీ వ్యాపారం ఎలా చేయాలో, ఎలా చేశారో పదవ తరగతి వరకు పాఠ్యాంశాల్లో నేర్పడంలేదు.

ఇలా వర్ణవాద, కులవ్యవస్థవాద సిద్ధాంతాలు కొందరికి కొన్ని విద్యలు, వృత్తులే ఉండాలని, అవే నేర్చుకోవాలని, ఇతరులు వాటిని నేర్చుకోకూడదని ప్రతిపాదించాయి. వీటి ప్రభావం ఇండియా సమాజంపై తక్కువేమీ లేదు. నేటికీ ఈ సిద్ధాంతాల ప్రభావం కొనసాగుతున్నది. ఈ సిద్ధాంతాలను అవి ప్రతిపాదించే వ్యత్యాసాలను, వివక్షను ఖండించి ఆధునిక సమాజ నిర్మాణానికి పూనుకోవలసిన అవసరం బ్రాహ్మణవాద, హిందూ మతతత్త్వవాద, వర్ణవాద, కుల వ్యవస్థవాద సిద్ధాంతాలను ప్రాచీన భారతీయ సిద్ధాంతాలుగా గర్వించే హిందూ వాదులపై ఉంది. వారు ఇండియాలో ఆర్.ఎస్.ఎస్., శివసేన, బి.జె.పి. వంటి సామాజిక, రాజకీయ, సాంస్కృతిక శక్తులుగా ఉన్నాయి. వారు ముందుగా ఈ వ్యత్యాసాలను, వివక్షను ఖండిస్తూ ఆయా ప్రాచీన గ్రంథాలను వాటి పరిమితులను స్పష్టంగా చెప్పడం అవసరం. అప్పుడే వారు చెప్పే హిందూ సమాజం వర్ణవివక్ష, కులవివక్ష లేని హిందూ సమాజంగా, హిందూ మతంగా ఎదగడం సాధ్యపడుతుంది.

ఇండియన్ యూనియన్‌గా ఇండియా సెక్యులర్, సోషలిస్టు, రిపబ్లిక్‌గా తనను తాను ప్రకటించుకున్నది. విద్యా విధానం కూడా స్వేచ్ఛా సమానత్వం, సౌభ్రాతృత్వం, శాంతియుత సహజీవన విధానానికి తోడ్పడే విధంగా ఉండడం అవసరం. అందుకు గడచిపోయిన దశలలోని అణచివేతను, వ్యత్యాసాలను నేటి వ్యత్యాసాలుగా, అణచివేతగా కొనసాగించ కుండా ఉండే విధంగా పాఠ్య ప్రణాళికల్లో చేర్చడం అవసరం. అందుకు ఇప్పటిదాకా అణచివేతకు, వ్యత్యాసాలకు గురి అయిన తెగల, వర్గాల, జాతుల, ప్రాంతాల, భాషల, కులాల, మతాల, వృత్తుల ప్రాధాన్యతను అవి చరిత్రలో మానవసమాజంలో నిర్వహించిన మహోన్నతమైన పాత్రను వెలికితీసి విశ్లేషించి పాఠ్యాంశాల్లో చేర్చడం అవసరం. కనుక చరిత్ర అధ్యయనంలో భాగంగా విద్యా విధానాల చరిత్ర పరిణామాలను, సామాజిక పరిణామాల నేపథ్యంలో ఉత్పత్తి చోదక శక్తులైన శూద్రుల ఉత్పత్తి నైపుణ్యం పునాదిగా వెలికి తీసి విద్యార్థులకు, ప్రజలకు, మిగతా ప్రపంచానికి తెలపడం అవసరం. అలాగే సంగీత, సాహిత్య కళల విద్యా విధానాలకు, గణ, తెగ, జనపద, జానపద, గ్రామీణ ప్రజల జీవనం నుండి ఎదిగిన సామూహిక గానాలు, నృత్యాలు, ప్రకృతి, పశు పక్షాదుల అనుకరణ ఎలా పునాదిగా కొనసాగుతూ మార్పులు చెందుతూ అభివృద్ధి చెందాయో విశ్లేషించడం అవసరం.



1. పాత రాతియుగంలో
2. కొత్త రాతియుగంలో
3. తల్లినుండి గుర్తించే వ్యవస్థలో
4. పురుష స్వామ్య వ్యవస్థలో
5. గణ, తెగల వ్యవస్థలో,
6. సింధూ నాగరికత కాలంలో, వేద ఆర్యుల కాలంలో
7. వర్ణ, జాతి, వ్యవస్థలో
8. కుల వ్యవస్థలో
9. బౌద్ధకాలంలో, జైన కాలంలో
10. చంద్రగుప్తుని కాలంలో
11. అశోకుని కాలంలో
12. శాతవాహనుల కాలంలో
13. కనిష్కుని కాలంలో
14. గుప్తుల కాలంలో
15 విష్ణుశర్మ – పంచతంత్రం నేర్పిన విద్యావిధానం
16 గుణాఢ్యుడు – శాతవాహనుల సంస్కృత విద్యాభ్యాసం
17 బౌద్ధుల నలందా, తక్షశిల విశ్వవిద్యాలయాలు
18 బ్రాహ్మణుల గురుకుల విద్యావిధానాలు
19 బ్రాహ్మణహిందువుల ప్రైవేటు విద్యావిధానం
20 బౌద్ధుల సామాజిక విద్యావిధానం
21. చరకసంహిత – వనమూలికల వైద్యవిద్యావిధానం
22. కులాల కథలు, కళాకారుల కులాలు – సాహిత్యం
23. బ్రాహ్మణవాద హిందూ వ్యవస్థలో విద్యావిధానం
24. మనువు, కౌటిల్యుడు ఉపనిషత్తులు చెప్పిన విద్యావిధానం
25. గ్రీకుల విద్యావిధానాలు – రోమ్, ఈజిప్టు విద్యావిధానాలు
26. ప్లేటో విద్యావిధానం – అకాడమి
27. క్రైస్తవ విద్యావిధానాలు
28. ఇస్లాం విద్యావిధానాలు
29. భక్తి ఉద్యమాల కాలంలో విద్యావిధానాలు
30. ముస్లిం పాలకుల కాలంలో విద్యావిధానాలు
31. నాగజాతి వారి విద్యావిధానాలు
32. గోండు రాజుల విద్యావిధానాలు

33. చాళుక్యుల విద్యావిధానాలు
34. కాకతీయుల విద్యావిధానాలు
35. కృష్ణదేవరాయుల కాలంలో విద్యావిధానాలు
36. కళింగరాజ్య విద్యావిధానాలు
37. అక్బర్ కాలం నుండి విద్యావిధానాలు
38. ఔరంగజేబు కాలంలో విద్యావిధానాలు
39. యూరోపియన్ల ఇండియాలోని వ్యాపారాలు – ఉద్యోగాలు
40. క్రైస్తవ మిషనరీలు – వారి విద్యావిధానాలు
41. విజ్ఞాన శాస్త్రాల అభివృద్ధి – పరిశ్రమలు – కొత్తవృత్తులు వాటిలో వృత్తినైపుణ్యం దాన్ని అందుకొనే విద్యావిధానాలు
42. పరిపాలనా వ్యవస్థకోసం విద్యావిధానాలు
43. విద్య అందించడంకోసం విద్యావిధానాలు
44. కొత్తవృత్తులు, వృత్తి విద్యలు
45. యూరోపియన్ విద్యావిధానాలు
46. అమెరికా విద్యావిధానాలు
47. జపాన్ విద్యావిధానాలు
48. చైనా విద్యావిధానాలు
49. రష్యా విద్యావిధానాలు
51. సోషలిస్టు చైనాలో విద్యావిధానాలు
52. ముస్లిం దేశాల విద్యావిధానాలు
53. ఇండియా విద్యావిధానాలు

ప్రస్తుతం ప్రాచీన విద్య, వైద్య విధానాలు ఎలా మారుతూ వచ్చాయో, భాష ఎలా పరిణామం చెందుతూ వచ్చిందో ఒకటి రెండు ఉదాహరణలు ఇస్తాను. జీవకుని చరిత్ర ద్వారా క్రీ.పూ. ఆరవ శతాబ్ది నాటికి తక్షశిల నగరానికి వైద్య విశ్వ విద్యాలయంలో వైద్యవిద్య నేర్చుకోవడానికి 7ఏళ్లు పట్టింది. వైద్యుడు చికిత్స ప్రారంభించడానికి పూర్వం రోగ నిదానం చేయుటానికి తగిన పరీక్షలు చేయడంతోపాటు ఔషధ విజ్ఞానం ఎక్కువగా అభివృద్ధిలో ఉండేది. పెద్ద పట్టణాల్లో ప్రసిద్ధ వైద్యులకు నేటి కంటే ఎక్కువ ప్రతిఫలం ఇచ్చేవారని, కడుపు, తల ఎముక తొలవడం, (కఫాలఛేదనం Trephenating) మొదలైనశస్త్ర చికిత్సల్లో నేర్పు కలిగి ఉండేవారని తెలుస్తున్నది. సంజ్ఞా హారాలు, వ్రణదోషాలు, పూయ నిరోధకాలు మొదలైన మందులను ఉపయోగించేవారు. జీవకుని వలె ప్రసిద్ధ వైద్యులు ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి చికిత్స చేయడానికి వెళ్ళి వచ్చేవారు. (Arciant Indian Educations. R.K. Mukharajee. pp.468–470) బౌద్ధ మతగ్రంథాలలో రోగులకు సేవ చేయవలసిన విధులు వివరించారు. బౌద్ధారామాలలో ఉండే భిక్షులు రోగులకు పరిచర్య చేయడం ఒక కర్తవ్యంగా నిర్ణయించారు. బుద్ధుడు రోగులకు స్వయంగా పరిచర్య చేశాడు. ఒకనాడు బుద్ధుడు బౌద్ధవిహారాన్ని తన నిత్య విధులలో ఒకటిగా పరివేక్షిస్తుండగా ఒక భిక్షువు విషూచీ వ్యాధి పీడితుడై విరేచనాలు వాంతులతో పడి దొర్లుతున్నాడు. ఇతరులెవరూ అతనిని పట్టించుకోని స్థితిలో అతన్ని చూసి వెంటనే ఆనందుణ్ని నీళ్ళు తెమ్మని చెప్పి ఆ నీళ్ళతో బుద్ధుడు ఆ భిక్షువు శరీరం కడిగాడు. ఆనందుడు పొడిగుడ్డతో అతని శరీరాన్ని తుడిచి పడుకోబెట్టాడు. అనాడు భిక్షువులనుద్దేశించి రోగుల సంరక్షణ కొరకు తీసుకోవలసిన చర్యలను బుద్ధుడు వివరించాడు.

క్రీ.పూ. రెండవ శతాబ్ది గ్రంథమైన 'మిళింద ప్రశ్న'లో అనేక మంది ఆయుర్వేద వైద్యులను స్తుతించారు. వారిలో నారదుడు, ధన్వంతరి, అంగీరసుడు, కపిలుడు, ఇంద్రుడు, అగ్ని సోములు, అతులుడు, పచ్చిక ఛ్చాయనుడు మొదలైన వారున్నారు.

క్రీ.పూ. 6వ శతాబ్ది వాడైన జీవకుడు ఆనాటి సాంఘిక సామాజిక పరిస్థితుల ననుసరించి వైద్యుల వేష భాషలను విపులంగా వర్ణించాడు. కొందరు వైద్యులు ఔషధ మూలికల సంచులను వీపులపై తగిలించుకొని మోసుకొని వెళ్ళేవారని దారిలో దొరికిన మూలికలన్నీ సేకరించేవారని, వ్యాధుల నివారణకు ప్రత్యేక మంత్రాలు ఉచ్ఛరించేవారని తెలియజేశాడు.

బౌద్ధ కాలీన సాహిత్యంలో వైద్య విషయాలను తెలిపే ముఖ్య గ్రంథం 'వినయ పిటక'. ఇందు భైషజ్య స్కంధం జీవన చరిత్ర ప్రధానమైనవి. భైషజ్య స్కంధంలో నానా రకాలైన ఔషధాలు, వాటిని తయారు చేసే విధానాలు, (భేషజకల్పము) స్వేదకర్మలు రక్త మోక్షణ విధం, ఇంట్లో పెంచి పోషించవలసి ఔషధులు, గోరస ఫల రసాదులు తయారుచేసే విధానాలు తెలిపారు.

బుద్ధుడు రోగులకు చేయవలసిన కర్తవ్యాలను, పరిచర్యలను పేర్కొన్న విధంగానే 'చరక సంహిత'లో ఇలా వివరించాడు.

"స్మృతేర్నిర్దేశ కారిత్వం అభీరుత్వ మధాపిచ
జ్ఞాపకత్వంచ రోగాణాం అతురస్య గుణాః స్మృతాః
ఉపచారజ్ఞాతా దాక్ష్యమను రాగాశ్చ భర్తరి
శౌచంచేతి చతుష్కోయం గుణాః పరిచరేజనే".

క్రీ.పూ. శృంగ వంశానికి చెందిన పుష్యమిత్రుని రాజ్య కాలంలో శూద్ర కులాలను, ముఖ్యంగా చర్మకారులు వైద్యులైనట్లు ఈ క్రింది శ్లోకంలో చూడవచ్చు.

"మూలా కారశ్చర్మకారో నాసితో రజకస్తధా
వృద్దాంరండా విశేషణకలౌ పంచ చికిత్సకాంః"

తోలు పనివాళ్ళు, చర్మకారులు చికిత్సకులుగా ఉండేవారు. బ్రాహ్మణాధిపత్యం ప్రారంభమైన తర్వాత ఆయుర్వేదంలో చర్మకారులను నిరసిస్తూ శస్త్ర చికిత్సలను తగ్గించి మందులతో వాడే వైద్యం పెంచారు. ఇలా బ్రాహ్మణవాదం విస్తరించిన తరువాత సర్జెన్ వైద్య విధానాలు చేసే మంగళి, చర్మకారులు మొదలైనవారి ప్రాధాన్యత తగ్గుతూ వచ్చింది. వారిని అంటరానివారుగా చూడడానికి వాళ్ళు వైద్యులుగా ప్రసిద్ధులు కావడం కూడా ఒక అసూయ కారణమైంది. తరువాతి కాలంలో తెనుగువారు, నేత సాలీలు, గొల్లలు మొదలైనవారు యుద్ధ విద్యల్లోనే కాకుండా ఆయుర్వేద వైద్యంలో కూడా ప్రఖ్యాతి గాంచారు.

ప్రాచీన కాలం నుండి బ్రాహ్మణుల్లోనూ, శూద్రుల్లోనూ, పంచముల్లోనూ విద్యా విధానం మౌఖికంగా సాగేది. అక్షరాస్యతకు ప్రాధాన్యత ఉండేది కాదు. అక్షరాల్లో రాయడానికి ప్రత్యేకంగా రాయసకాళ్ళు నేటి టైపిస్టుల వలె ఉండేవారు. భక్తి ఉద్యమాల కాలంలో కూడా విద్య మౌఖిక విద్యా విధానం ద్వారానే కొనసాగింది. కుల విద్యలు, సంగీతం, నాట్యం, కళలు మొదలైనవన్నీ చూసి నేర్చుకునేవారు. అనుకరణ ద్వారానే 90 శాతం విద్యలు కళలు అభ్యసించేవారు. కుల వృత్తులు, వాటి ఉత్పత్తులు ప్రపంచంలో అందరికన్నా నాణ్యమైనవిగా తయారు కావడానికి చిన్నప్పటి నుండి ఇంట్లో తల్లిదండ్రులు, బంధుమిత్రులు చేసే పనిని, పని విధానాన్ని పిల్లలు గమనించి మెలకువలు నేర్చుకోవడం ప్రధాన కారణం. ఇలా విద్యలు అన్నీ శతాబ్దాల తరబడి మౌఖికంగానే, అనుకరణగానే కొనసాగాయి. కొందరు విద్యను నిరాకరించారు అనే మాట కొన్ని మతవిద్యలకు పరిమితమైన విషయమే తప్ప అన్ని శాస్త్రాలకు, కళలకు విద్యలకు సంబంధించిన విషయం కాదు.

బౌద్ధుల కాలంలో వైద్య శాస్త్రం ప్రపంచమంతటా విస్తరించింది. అందుకు ఒక ఉదాహరణ ఇవ్వ వచ్చు. చైనా ప్రాచీన జాతులలో ఒకటైన 'కూచ' జాతి భాషలో సంస్కృత భాషలో రచించబడిన ఆయుర్వేద ఔషధ శబ్దాలు ఎలా ఇప్పటికీ కొనసాగుతున్నాయో చూడవచ్చు.

| **కూచ భాష** | **సంస్కృత భాష** |
|---|---|
| మంచష్ఠ | మంజిష్ఠా |
| శాలివర్ణ | శాలపర్ణీ |
| కరంచపీజ | కరంజబీజ |
| కిరోత | గిలోద |



| | |
|---|---|
| అపమార్క | అపామార్గ |
| సారిప | శారివా |
| కుంతర్క | గుంద్రక |
| చిపక | జీవక |
| మర్గీ | మార్గీ |
| శంచపో | శింశపా |
| కించేల | కింజల్క |
| పిప్పాల | పిప్పలీ |
| తకరు | తగరు |
| అశ్వకాంతా | అశ్వగంధా |
| పృంకరచ | భంగరాజ |
| తచవతీ | తేజోవతీ |
| కరుణసారి | కాలానుసారీ |
| మేత | మేదా |
| పతరీ | విదారీ |
| ఖాదిర | ఖదిర |
| సుక్ష్మేలా | సూక్ష్మేలా |
| మోతరై | అజమోరా |
| కోరోశా | గోరోచన |
| సుమాం | సోమ |
| ప్రియంకు | ప్రియంగు |
| విరంక | విడంగ |

(జర్నల్ ఆఫ్ రాయల్ ఆసియాటిక్ సొసైటీ పేజి.623)

కూచ జాతివారు క్రీ.శ. 2,3 శతాబ్ది కాలంలో బౌద్ధ ధర్మ ప్రచారానికై వచ్చిన భారతీయ బౌద్ధ భిక్షువుల వద్ద వైద్య శాస్త్రాన్ని అభ్యసించడం వల్ల వైద్య పారిభాషిక పదాలు నేటికి వారి భాషలో నిలబడి ఉన్నాయి. ప్రస్తుతం వారు గిరిజనులయ్యారు.

అశోకుడు వేయించిన రెండవ శిలా శాసనమైన 'శాహనాజ్ గడ్' శాసనంలో

"సర్వత్ర విజేతే దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞో యేచాన్తా యధాచోడా, పాండ్యాః సత్యపుత్రః, కేరళ పుత్రః, తామ్రపర్ణీ అంతియోకోనామ యవనరాజో యేచాన్యే తస్యాంతి య్రోకస్య సామంతా రాజానః సర్వత్ర దేవానాం ప్రియస్య ప్రియదర్శినో రాజ్ఞోద్వే చికిత్సే కృతే మనుష్య చికిత్సా, పశు చికిత్సాచ ఔషధానిచ, మనుష్యోపయోగాని, పశూపయోగానిచ యత్ర యత్రన సంతి సర్వత్ర హరితానిచ, రోపితానిచ మార్గేషు వృక్షాః రోపితాని ఉదసానానిచ భానితోని ప్రతిభోగాయ మనుష్యాణాం ఇతి".

ఈ శిలా శాసనం ద్వారా భారతదేశంలోని వివిధ ప్రాంతాలే గాక, బయటి దేశాలైన అంతి యోకను యవన(గ్రీకు)రాజు, అతని సామంత రాజుల దేశాల్లో, మనుష్యులకు పశువులకు చికిత్స చేయటానికి రెండు విధాలైన చికిత్సా సంస్థలు (Seperate departments of Medicine one for human beings and another for animals) ఉండాలన్నారు. వానితో పాటు మనుష్యులకు పశువులకు అవసరమగు ఔషధాలను వేరు వేరుగా తయారు చేయటానికి ఏర్పాట్లు చేశాడు.

భారతీయ పదాలు సుమేరియన్ భాషలోనూ కనపడుతున్నాయి. దానికి ఆనాడు భాషల మధ్య ఆదాన ప్రధానాలు, సంస్కృతుల మధ్య అదాన ప్రధానాలు, విజ్ఞాన వీచికలు ఇరు ప్రక్కల వీయడం ప్రధాన కారాణమని తెలుస్తున్నది. ఉదాహరణకు

| **సుమేరియన్** | **సంస్కృత భాష** |
|---|---|
| వృగు | భృగు |
| పర్గవ | భార్గవ |
| గుర్గ | గర్గ |
| హదక | జనక |
| సఖ | శక్ర |
| ఇందుర | ఇంద్ర |
| అస్సి | అశ్వి |
| గల్వా | గాలవ |
| గదియా | గాది |
| సుసిన్ | సుహేణ |
| ఎమద్గల | ముద్గల |
| ఊర్వస | హర్యశ్వ |

సుమేరియన్ భాష పదాలు పాకృత భాష పద రూపాలకు దగ్గరగా ఉండటం



గమనార్హం. హిబ్రూ, బైబిల్‌లో అనేక తెలుగు పదాలున్నాయి. సంయుక్త కూనియ్య అనేక పరిశోధనలు చేసి వెలికి తెచ్చారు. తెలిమన్, తెలివాహ నాగరికత, సంస్కృతి సుమేరియన్‌లో కనపడుతుంది. తెలుగు పదాలు, సంస్కృతి సుమేరులో అనేకం ఉన్నాయి. సుమేరు నాగరికత తెలుగువారి పూర్వీకులే నిర్మించారని తెలుస్తున్నది. ఇలా ప్రపంచవ్యాప్తంగా ప్రజలు అనేక తెగలు, జాతులు, కులాలు పరస్పరం కలుసుకోవడం, స్వీకరించడం, స్థిరపడడం, వలస సాగడం, తిరిగి స్థిరపడడం సంస్కృతి, భాష, ఆచార వ్యవహారాల్లో సామీప్యత నిరంతరంగా కొనసాగుతూ వస్తున్నది.

## ప్రాచీన భారత బౌద్ధ విశ్వ విద్యాలయాలు

ప్రాచీన విశ్వ విద్యాలయాలు ఇండియాలో రూపుదిద్దుకుని మహోన్నతంగా విస్తరించాయి. నలంద విశ్వ విద్యాలయం బిహార్‌లో మగధ సామ్రాజ్యంలో ప్రఖ్యాతిగాంచింది. తక్షశిల విశ్వ విద్యాలయం ప్రపంచ ప్రఖ్యాతి పొందింది. ఇది ప్రస్తుతం ఆఫ్ఘనిస్తాన్‌గా పిలువబడుతున్న గాంధార, కందహార ప్రాంతంలో ఉంది. ఆ ప్రాంతం ఇటు ప్రస్తుత ఇండియాతో పాటు సోవియట్ రష్యాలోని తూర్పు యూరోప్ దేశాలకు మధ్యాసియాలోని ఇరాన్, ఇరాక్, ప్రష్యా మొదలైన దేశాలకు కేంద్ర స్థానంలో ఉండేది. అందువల్ల ప్రపంచం నలుమూలల నుండి విద్యార్థులు అక్కడికి వచ్చి చదువుకునే వారు. ఆఫ్ఘనిస్తాన్‌లోని కనుమలు ఇండియాలోకి భూమార్గానికి కేంద్రం. మధ్యాసియా నుండి వచ్చిన వారి దండయాత్రలు, వలసలు అన్నీ ఈ మార్గం గుండానే సాగాయి. అలా అది ప్రపంచాన్ని కలిపే మహాకూడలి కేంద్రం అయ్యింది. ఈ పాత్రను అరబ్బు ప్రజలకు, యూరప్ ప్రజలకు మధ్య కాన్‌స్టాంట్ నోపుల్ అనే ప్రాంతం, నగరం క్రీ.శ. 10వ శతాబ్దం నుండి నిర్వహించింది. అయితే గాంధార ప్రాంత ప్రాధాన్యత ఏమీ తగ్గలేదు. గాంధార ప్రాంత కేంద్ర స్థానంతో పాటు ప్రపంచంలో కాన్‌స్టాంట్ నోపుల్ రెండవ ప్రపంచ కేంద్ర స్థానంగా ఎదిగింది. ఈ రెండు కేంద్ర స్థానాలతో పాటు చైనా మార్గాన్ని కూడా అందుకుని మూడు కేంద్రాలకు అరబ్బు తెగలు, ఇస్లాం విస్తరించాక, ఇస్లాం విస్తరణలో భాగంగాను, తెగల సమాఖ్య రాజ్య విస్తరణలో భాగంగాను విస్తరించారు. అలా ప్రపంచంలోని మూడు కేంద్రాలు అరబ్బుల లేదా ఇస్లాం స్వీకరించిన మధ్యాసియా తెగల నుండి రాజులుగా ఎదిగిన వారి వశమయ్యాయి. అలా శతాబ్దాల తరబడి వారి పరిపాలనలో లేదా ఆధిపత్యంలో ఇవి కొనసాగాయి. కాన్‌స్టాంట్ నోపుల్, ఆఫ్ఘనిస్తాన్ రెండూ వారి ఆధిపత్యంలో ఉండడం వల్ల ఇండియాతో రాకపోకలకు, వాణిజ్యానికి కొత్తదారులను వెతుక్కోవడంలో భాగంగా సముద్రమార్గాన యూరప్ దేశస్థులు అమెరికాను, ఆస్ట్రేలియాను, ఆఫ్రికాను అటు తర్వాత ఇండియాను కూడా సముద్ర మార్గాన కనుక్కున్నారు.

తక్షశిల, కాన్‌స్టాంటెంట్ నోపుల్ ప్రపంచ చరిత్ర చిత్రపటాన్ని ఇలా మార్చి వేయడానికి సాక్ష్యాలయ్యాయి. కారణాలయ్యాయి. వాటిపై ఆధిపత్యం చెలాయించే వారి ఇష్టాఇష్టాల కారణంగా ప్రపంచ చరిత్ర మొత్తం మలుపు తిరిగింది. కాన్‌స్టాంటెంట్ నోపుల్‌పై అధికారం సాధించిన ఇస్లాం స్వీకరించిన తెగల రాజులు క్రైస్తవ రాజ్యాల రాకపోకలను, ఆధిపత్యాన్ని అనుమతించకపోవడం వల్ల యూరప్ వాళ్ళు మొదట ఎన్నో కష్టాల పాలైనా చివరకు మొత్తం నాలుగు ఖండాలను ఆక్రమించి విస్తరించే అవకాశం ఇచ్చినవారైయ్యారు.

తక్షశిల క్రీ.పూ. 5వ శతాబ్దం నుండి వేలాది విద్యార్థులను తీర్చి దిద్దింది. బౌద్ధ భిక్షువులు, బౌద్ధ విద్యావేత్తలు ప్రపంచంలోని జ్ఞానాన్నంతటిని గ్రంథాల్లోకి లేఖన ప్రక్రియలో రాసి రికార్డు చేసింది. వాటిని ఆధునిక విశ్వ విద్యాలయాల విద్యా బోధన పద్ధతుల వలెనే విద్యను అందించారు. పలు భాషల నుండి అక్కడికి రావడం వల్ల పలు భాషల గ్రంథాలు పరస్పరం అనువాదాలు అయ్యాయి. పలు భాషల పదాలు చేరి భాషలు అభివృద్ధి చెందాయి. భావాలు విస్తరించాయి. ఇలా రష్యా, చైనా, ఇరాన్, ఇరాక్, ఈజిప్టు, మగధ, ఉక్రెయిన్ మొదలైన ప్రాంతాల భాషలు, భావాలు కలగలసి పోయాయి. చాలా పదాలు ఉచ్చారణలు పర్యాయపదాలుగా స్వీకరించబడ్డాయి. అలా ఇతర దేశాల భాషల్లో ఇప్పటికీ కనపడే పదాలు తక్షశిల విశ్వ విద్యాలయ సంపర్కంతో చేరినవే అని చెప్పవచ్చు. ముఖ్యంగా వైద్య, భావజాల, సిద్ధాంత, మత, ఆహార, వరుసల పేర్లు, పదాలు, భావాలు ఇలా ప్రపంచ భాషల్లోకి తక్షశిల విశ్వ విద్యాలయంలో సాగిన అనువాదాలు, విద్యాభ్యాసం వల్ల చేరిపోయాయి. వీటిని కొందరు వర్ణవాదులు, బ్రాహ్మణవాదులు ఆర్యవాదులు, ఆర్య సంస్కృతి, హిందూ వర్ణవాద సంస్కృతి విస్తరణకు ఆధారంగా చూపిస్తున్నారు. అయితే అది బౌద్ధం ద్వారా జరిగిందని చెప్పడాన్ని వదిలేస్తున్నారు. తద్వారా తమ హిందూ మతతత్వ భావాలకు అనుకూలంగా మార్చుకుంటున్నారు.

క్రీ.శ. 2వ శతాబ్దంలో ఇండియాలోని తెలంగాణా ప్రాంతంలోని నల్గొండ, ఇప్పటి గుంటూరు జిల్లా ప్రాంతాల్లో నాగార్జున కొండ శ్రీ పర్వత విశ్వ విద్యాలయం కొనసాగింది. తార్కిక రసాయనిక పరిశోధనలు జరిపి ప్రపంచ ప్రఖ్యాతి గాంచిన ఆచార్య నాగార్జున విశ్వ విద్యాలయంలో బోధించారు. ఆయన వందకు పైగా గ్రంథాలను రాశారు.

శ్రీపర్వత విశ్వ విద్యాలయానికి శాతవాహన రాజులు ధన సంపత్తిని అందించారు. వ్యాపార శ్రేణులు, సామంత రాజులు కూడా విరాళాలు ఇచ్చేవారు. నాగార్జునుని పేరుతో పాటు శాతవాహన రాజుల పేర్లు నాగార్జునుని పేరంత విస్తారంగా ఎందుకు ప్రపంచమంతటా ఖ్యాతి చేరలేదో తెలుసుకోవడం కూడా ఎంతో అవసరం. నాగార్జునుని పేరుతో పాటు శాతవాహన రాజుల చరిత్ర పరిణామాలు, పేర్లు ఏ మేరకు రికార్డు



అయ్యాయో చైనా, శ్రీలంక, బర్మా, జపాన్‌లలోని నాగార్జునుని గ్రంథాల అనువాదాలలో, వాటి వ్యాఖ్యానాలలో పరిశీలిస్తే దొరకవచ్చు. అప్పుడు శాతవాహన రాజుల చరిత్రలో మరికొన్ని విశేషాలు సాహిత్య ఆధారాలతో తెలియవచ్చు. ఆసక్తికరమైన విషయం ఏమంటే శాతవాహనుల కాలంలో సంకలనం చేసిన గుణాఢ్యుని బృహత్‌కథ, కథా సరిత్సాగరం, హాలుని గాథా సప్తశతి శాతవాహన రాజుల, శాతవాహన రాజ్య ప్రాంత ప్రజల కీర్తిని, జీవన విధానాలను ప్రపంచవ్యాప్తంగా విస్తరింపజేసాయి. కానీ నాగార్జునుని రచనల్లో ఇది ఏ మేరకు జరిగిందో తెలియదు. శ్రీపర్వత, శాతవాహన రాజ్య ప్రాంత భావజాలాలు, సిద్ధాంతాలు, జీవన విధానాలు నాగార్జునుని భావాల్లో, సిద్ధాంతాల్లో, గ్రంథాల్లో ఏ మేరకు రికార్డు అయ్యాయో విశ్లేషించడం అవసరం. ప్రస్తుతం లభిస్తున్న గ్రంథాల్లో నాగార్జునుడు రాసిన సుహృల్లేఖ అనే గ్రంథం ఒక్కటే శాతవాహన రాజును ఉద్దేశించి రాసిందని నిర్ధారణ అయ్యింది.

విక్రమ శిల విహార చరిత్ర పూర్తి వివరాలు దొరకడం లేదు. టిబెట్టు దేశంలో విద్యను అందించిన విద్యావేత్తలు, బౌద్ధ గురువులు, విక్రమశిల విద్య స్నాతకులని తెలుస్తున్నది. వైస్ ఛాన్సలర్ జ్ఞానపాద సింహభద్రుని శిష్యుడు, ధర్మపాలుని రాజ పురోహితుడు కూడా. జ్ఞానపాద రాసిన తొమ్మిది గ్రంథాలు టిబెట్టు భాషలో ఇప్పటికీ లభిస్తున్నాయి. వైరోచన రక్షిత, పద్మ సంభవని శిష్యుడు. పద్మ సంభవ టిబెట్టుకు వెళ్ళాక వైరోచన విద్య శిల విహారంలో ఆ లోటును పూరించారు. బోధిసత్వ చర్యావతార, పంజిక, రత్నవాద చక్రము మొదలైన గ్రంథాలను సంస్కృతంలో రాసాడు. వినయ సంగ్రహ శుక్లవజ్రయోగినీ సాధన లేక ప్రజ్ఞాపారమిక ప్రదేశాలను మొదలైన సంస్కృత గ్రంథాలను వైరోచన టిబెట్టు భాషలోకి అనువదించాడు. క్రీ.శ. 750 ప్రాంతంలో అతడు టిబెట్టుకు క్రీ-స్రోన్-ఐదెబ్సన్ రాజు కాలంలో టిబెట్టుకు వెళ్ళాడు.

అప్పటికి గౌడ కులస్థులు లేదా గౌడ వృత్తి వారు రాజులుగా ఎదిగి బెంగాల్, ఒరిస్సా, మహారాష్ట్ర, మధ్యప్రదేశ్ ప్రాంతాల మధ్యనుండే ప్రాంతంలో రాజ్యాన్ని ఏలుతున్నారు. పల్లవులు, యాదవులు, గౌడ రాజులు, దొమ్మరి, ఎరుకలి, వడ్డెర రాజులు ఇండియాను పరిపాలిస్తున్న కాలం అది. కాకతీయ పూర్వ రాజులు, పల్లవులు, యాదవ రాజులు, గౌడ రాజులు, చాళుక్య రాజులు, వేంగి రాజులు, దొమ్మరి, ఎరుకలి, వడ్డెర రాజులు ఒకే చారిత్రక దశలో రాజ్యాలను స్థాపించి పరిపాలించి రాజ్యాలను విస్తరించారు.

విక్రమ శిల విహారం ఒక విశ్వ విద్యాలయంగా వర్ధిల్లేదని తారానాథ్ రచనల వల్ల తెలుస్తున్నది. ఉత్తర మగధలో గంగాతీరంలో 108 విహారాలు, ఎందరో బౌద్ధ ఆచార్యులు విద్యావేత్తలుగా విద్యను బోధించేవారు. విద్యా పరిషత్ ఈ విద్యా విధానాల

కరికులమ్‌ను పరిశీలిస్తుండేది. ధర్మపాల అను అతడు దీన్ని నిర్మించినట్లు తెలుస్తున్నది. ఈ విశ్వవిద్యాలయ అధ్యక్షుడిని కులపతి అని పిలిచేవారని తెలుస్తున్నది. ధర్మపాల కాలంలో బుద్ధజ్ఞాన పాద అనునతడు వైస్ ఛాన్సలర్‌గా అనగా కులపతిగా ఉండేవాడు. క్రీ.శ. 1034-1038లో దీపాంకుర జ్ఞానా అతీష అను అతడు వైస్ ఛాన్సలర్‌గా ఉండేవాడు. స్థవిర రత్నాకర అనునతడు ఇతనికి అనుయాయుడుగా ఆ విహారాన్ని నిర్వహించేవారు.

క్రీ.శ. 955-983 వరకు పరిపాలించిన చణకరాజు కాలంలో ద్వారపాలకులుగా ఉన్న ఆరుగురు తర్కవేత్తల పేర్లు దొరికాయి. 1. రత్నాకర శాంతి 2. వాగీశ్వర కీర్తి (కాశీ పండితుడు) 3. నరోపుడు 4. ప్రజ్ఞాకరమతి 5. రత్నవజ్ర (కాశ్మీర పండితుడు) 6. జ్ఞానశ్రీమిత్ర (గౌడదేశ పండితుడు). ద్వారపాలకులు అనే పదాన్ని విశ్వ విద్యాలయ పీఠాలు అనే అర్థంలో వాడారని చరిత్రకారుల అభిప్రాయం.

సనాతన రాజు కంచుకి అయిన గర్భపాద అను విప్రుని కొడుకు క్రీ.శ.890-940 సంవత్సరం మధ్య వంగ రాజ్యాన్ని పాలించిన మహాపాలచే పండిత బిరుదాన్ని పొంది విక్రమశిల విహారంలో ఆచార్య పీఠాన్ని అధిష్ఠించాడు. క్రీ.శ.983 ప్రాంతంలో రత్నాకర శాంతి, అతీష అనే తర్కవేత్తలు అతని విద్యార్థులుగా విద్యను అభ్యసించినట్లు తెలుస్తున్నది. ప్రజ్ఞాకరమతి రచించిన రెండు గ్రంథాలు టిబెట్టు భాషలో ఇప్పటికీ దొరుకుతున్నాయి. రత్నాకరశాంతి మొదట ఒదంతపురి విహారంలో సర్వాస్తివాదంలో నిష్ణాతుడై విక్రమశిలా విహారంలో చేరాడు. కొంతకాలం విక్రమ శిల విహారంలోని జేతారి వద్ద విద్యను అభ్యసించాడు. సింహళరాజు ఆహ్వానంపై అక్కడికి వెళ్ళి బౌద్ధాని ప్రబోధించాడు. రత్నాకర శాంతి 13 గ్రంథాలను సంస్కృత భాషలో రాశాడు. అందులో వజ్రభైరవ, గణచక్రనామ, శ్రీసర్వ రహస్య నిబంధ, రహస్య ప్రదీప నామ గ్రంథాలు ముఖ్యమైనవి.

జ్ఞానశ్రీమిత్రుడు విక్రమ శిల విశ్వవిద్యాలయంలో మరొక పీఠాధిపతి. అతడు మొదట శ్రమణకవాదాన్ని అభ్యసించి తరువాత మాహాయానాన్ని స్వీకరించాడు. జ్ఞానశ్రీమిత్ర చాలా గ్రంథాలు రాశాడు. అందులో ప్రమాణ వినిశ్చయ టీక-తర్కభాష అనే గ్రంథాలు ముఖ్యమైనవి. ప్రమాణ వినిశ్చయ టీక గ్రంథం టిబెట్టు భాషలోకి అనువదించబడింది.

రత్నవజ్రుడు కాశ్మీర పండితుడు. విక్రమ శిల విశ్వ విద్యాలయంలో ఒక పీఠాన్ని నిర్వహించాడు. తన 36 ఏట వరకు కాశ్మీర్‌లో సూత్రాలను, శాస్త్రాలను అభ్యసించి వజ్రాసనాన్ని దర్శించి విక్రమ శిల విహారంలో విద్యాభ్యాసం చేసి ద్వారపాలక అని పిలిచే పీఠానికి అధిపతి అయ్యాడు. తర్వాత కాశ్మీర్‌కు వెళ్ళి కొంత కాలం అక్కడ విద్య నేర్పి టిబెట్టు వెళ్ళాడు. టిబెట్టు భాషను నేర్చుకుని 13 గ్రంథాలను టిబెట్టులోకి



అనువదించాడు. అందులో మహామాయా సాధన అనేది ఒకటి. వాగీశ్వరుడు కాశీ ప్రాంతపు నివాసి. తారాదేవి భక్తుడు. సంస్కృతంలో మృత్యువంచన అనే గ్రంథాన్ని రచించాడు.

దీపాంకుర శ్రీజ్ఞానునికి ఆచార్య యతీశుడు అనే మరో పేరు కూడా ఉంది. విదేశాల్లో భారత సంస్కృతిని వ్యాప్తి చేసిన రచయితల్లో చిరస్మరణీయుడని అంటారు. క్రీ.శ. 980లో ఇతడు గౌడ రాజుల వంశంలో జన్మించాడు. గౌడ రాజ్యాన్ని, రాజ భోగాలను వదిలి బౌద్ధ బిక్షువు అయ్యాడు. ఇతడు కృష్ణగిరి విహారంలో రాహులగుప్త వద్ద బిక్షువుగా బౌద్ధ దీక్ష స్వీకరించాడు. తన పందొమ్మిదవ ఏట ఒదంతపురి విహారంలో మహాసాంఘిక శాఖలో ఆచార్యుడైన శీలరక్షితుని వద్ద దీక్షను పొంది దీపాంకుర శ్రీజ్ఞాన అనే పేరును పెట్టుకోవడం జరిగింది. 31వ ఏట ఆచార్య ధర్మరక్షిత వద్ద మరికొన్ని శాస్త్రాలను అభ్యసించాడు. గౌడ దీపాంకురుడు హీనయాన, మహాయాన, వైశేషిక, తంత్రలలో నిష్ణాతుడు. విద్య పూర్తి కాగానే ప్రస్తుత పెగూలోని తాంటన్ అయిన సూరనద్వీపానికి నౌకాయానంలో చేరి ఆచర్యచంద్రకీర్తి వద్ద బౌద్ధ విశేషాలను తెలుసుకున్నాడు. అక్కడ 12 ఏళ్ళు విద్య అభ్యసించి సింహళం మీదుగా భారతదేశానికి తిరిగివచ్చాడు.

## విద్య నిర్వచనాలు - పరిణామాలు తెలుసుకోవాలి

విద్య అంటే ఏమిటో నిర్వచనాలను మార్చుకోవడం కూడా అవసరం. ప్రస్తుత విద్యా నిర్వచనాన్ని సమగ్రం చేసుకోవడం అవసరం. అసలు విద్యావిధానం అంటే ఏమిటి? విద్య ఎందుకు? ఎవరికి? విద్య - లిపి - అక్షరాస్యత, ఏయే వర్గాలకు ఏఏ విద్య అందించారు? చరిత్ర పొడవునా పైన పేరొన్నట్టు కనీసం వంద సంవత్సరాల కాలం కోసారి పరిశీలించి విశ్లేషించడం అవసరం.

ఇలా విద్యావిధానాల చరిత్రను ప్రణాళికా బద్ధంగా అధ్యయనం చేయడం ద్వారా ఏకాలంలో ఏవి కళలుగా ఏవి వృత్తులుగా ఏవి విద్యగా, ఏవి జ్ఞానంగా భావించబడ్డాయో చర్చించాలి. అవి ఇవాళ ఎలా ఉన్నాయో, ఇవాళ విద్య అనుకునేవి ఆయా కాలాల్లో ఏయే వర్గీకరణలకు లోనయ్యాయో వెలికి తీయడం అవసరం.

ఆ రోజుల్లో బట్టలు నేయడం, కుండలు చేయడం, తోలు పరిశ్రమ నైపుణ్యం, ఖనిజ పరిశ్రమ నైపుణ్యం, వైద్య నైపుణ్యం, వ్యవసాయం మొదలైనవి విద్యగా భావించబడలేదు. ఈనాడు ఇవి విద్యగా ప్రత్యేక కోర్సులు, డిగ్రీలు నిర్వహించ బడుతున్నాయి.

ఈనాడు వీటికున్న విద్యా గౌరవం ఆ రోజుల్లో లేక పోవడం వల్ల వీటి నిపుణులు కుల వ్యవస్థ పేరిట ఎంతగా అణచివేయబడ్డారో, దోపిడి చేయబడ్డారో, సాంఘికంగా

నిరాదరణకు గురయ్యారో మొదలైనవన్నీ చరిత్ర రచనా క్రమంలో వెలికితీయడం అవసరం. తద్వారా ఈ సమాజ సకల సంపదల సృష్టికర్తలు శూద్రులే అని చరిత్ర పొడుగునా సమాజాలుశూద్రుల ఉత్పత్తి, సంపద, సేవల ద్వారానే విస్తరిస్తూ పరిణామం చెందుతూ వస్తున్నది అనే విషయం తేట తెల్లం అవుతుంది.

అందుకోసం శూద్ర దృక్పథంతో ఉత్పత్తి కులాల, సేవా కులాల దృక్పథంతో చరిత్రలో విద్యా విధానాల చరిత్రను వివరంగా రాయడం అవసరం. అప్పుడే చరిత్రలో వీరికి జరిగిన అన్యాయం సరిచేసి వారి కృషికి సరియైన ప్రాధాన్యత చరిత్రను సత్యాలపై నిలబెట్టడం సాధ్యపడుతుంది. దీన్ని ప్రత్యేకంగా అధ్యయనం చేసి పుస్తకం రాసాను.



# ఆయా చారిత్రక దశల్లో విద్య, కళలు, శాస్త్రాలు

ఆయా చారిత్రక దశల్లో భాగంగా విద్య, కళలు, శాస్త్రాలు వికసించాయి. మార్పులు చెందాయి. వాటి నిర్వచనాలు కూడా అనేక మార్పులకు లోనయ్యాయి. విద్య, ఎడుకేషన్ అనే పదాలు ఈనాడు ఉపయోగిస్తున్న అర్థంలో పూర్వం లేవు. మత ప్రచారమే విద్యగా భావించబడింది. నేడు విద్యగా భావిస్తున్న అనేక శాస్త్రాలు శతాబ్దాల తరబడి కళలుగా పిలువబడ్డాయి. కొన్ని శాస్త్రాలుగా పిలవడానికి నిరాకరించబడ్డాయి. నేటికి కూడా 'ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీ' అని పిలుస్తుంటారు. సామాజిక శాస్త్రాలను, భాషాధ్యయనాన్ని కళలుగా ఇప్పటికీ లెక్కిస్తుంటారు. ఫిజిక్స్, కెమిస్ట్రీ, బాటనీ మొదలైనవి సైన్స్‌గా భావిస్తుంటారు.

చరిత్ర, పరిపాలన, సంగీతం, సాహిత్యం, చిత్రలేఖనం, సాంఘిక శాస్త్రం, తెలుగు, హిందీ, ఇంగ్లీషు, న్యాయ, అర్థ శాస్త్రాలు మొదలైనవన్నీ ఆర్ట్స్ అండ్ సైన్స్ కాలేజీలో ఆర్ట్స్‌గా భావించబడ్డాయి. ఇంజనీరింగ్, మెడికల్ కోర్సులు సైన్స్‌గా భావించబడ్డాయి. ప్రస్తుతం వీటన్నిటినీ కలిపి విద్య అని పిలుస్తున్నారు. మనుధర్మం, వర్ణ వ్యవస్థ, బ్రాహ్మణీయ వ్యవస్థ శూద్రులకు విద్యను నిరాకరించాలని చెప్పిన విషయం ప్రధానంగా మత విద్య, తత్వ, తర్క శాస్త్రాలకు పరిమితమైనవి. నేడు విద్యగా పేర్కొంటున్న ఎన్నో శాస్త్రాలు కళలుగా, కుల వృత్తులుగా, వ్యక్తిగత, సామూహిక, సాంఘిక సృజనగా, సంస్కృతిగా భావించబడ్డాయి. **'శుక్రనీతి'** గ్రంథంలో ఏది ఎప్పుడు విద్యగా, కళలుగా భావించబడ్డాయో అనేక వివరాలు లభిస్తాయి.

బౌద్ధులు, బౌద్ధ విద్యా విధానంలో తత్వ శాస్త్రాలను, తర్క శాస్త్రాలను, వైద్య శాస్త్రాలను, బౌద్ధ బిక్కు, శ్రమణ జీవన విధానాలను, అష్టాంగ మార్గాలను, యోగా, ధ్యాన విధానాలను, సంస్కారాన్ని, సంస్కృతిని ప్రజాస్వామ్య సంఘ జీవన విధానాన్ని విద్యగా భావించారు. బోధించారు. వైదిక మతం వైద్యాన్ని శాస్త్రంగా, విద్యగా అంగీకరించడానికి నిరాకరించింది. కర్మ, పునర్జన్మ సిద్ధాంతాలకు వైద్యం భిన్నంగా

వుందని వైద్యాన్ని వ్యతిరేకించారు. అందరికీ ఒక రోగానికి ఒకే మందు పనిచేయడం వర్ణ, కుల, కర్మ పునర్జన్మ సిద్ధాంతాలకు వ్యతిరేకమని, ఉన్నత జీవనం, నీచ జీవనం రోగాలు మొదలైనవి కర్మ పునర్జర్మ పుణ్య పాపం ద్వారా ఏర్పడతాయని చెపుతూ ఆయుర్వేద వైద్యాన్ని వ్యతిరేకించారు. వైద్యం అందరినీ సమానంగా పరిగణించింది. భావ వాదానికి బ్రాహ్మనిజానికి, వైదిక మతానికి వ్యతిరేకంగా బౌద్ధం, వైద్య శాస్త్రవేత్తలు తీవ్రంగా సైద్ధాంతిక పోరాటం చేశారు. చివరకు బౌద్ధం బాగా విస్తరించాక వెనుకబడిపోయిన బ్రాహ్మనిజం వైద్యాన్ని వేదాలతో సమానంగా ఆయుర్వేదం అనే ప్రతిపత్తిని ఇచ్చి స్వీకరించి తమ వర్ణ కుల, దైవ భక్తి సిద్ధాంతాలకు అనుకూలంగా అందులో మార్పులు చేర్పులు చేశారు.

"శతం తేరాజన్‌భిషజః సహస్ర ముర్వీగభీరాసుమస్తేస్తు" (రుగ్వేదం 1-24-9) అని పేర్కొనడాన్ని బట్టి ప్రజలకు, పాలకులకు ప్రభువులు వందల వేల వైద్యులను కలిగి తమ రాజ్యాల్లో ప్రతిష్ట పొందాలని భావం. దీన్ని బట్టి సింధూ నాగరికత నుండి రుగ్వేద కాలం నాటికి ఉన్న వైద్యశాస్త్రం స్థానిక దేశీయ వైద్య విధానాలు అభివృద్ధి చెందుతూ బౌద్ధం ద్వారా క్రీ.పూ. 6వ శతాబ్దం నుండి క్రీ.శ. 13వ శతాబ్దం దాకా ప్రపంచ వ్యాప్తంగా విస్తరించాయి. తక్షశిల, నలంద, శ్రీపర్వత నందికొండ, విక్రమ శిల, విశ్వ విద్యాలయాల ద్వారా ప్రపంచంలోని నలు మూలలకు భారతీయ విద్య, వైద్యం శాస్త్రాలు, కళలు, భాషా, సంస్కృతి విస్తరించాయి. ప్రాకృత, పాలీ భాషలు స్థానిక భాషలు ఇతర దేశాల భాషలకు అనేక పదాలను, భావాలను, నుడికారాలను అందించాయి. ఇప్పటికీ ఇతర దేశాల భాషల్లో ఇవి కొనసాగుతున్నాయి. సంస్కృతం ద్వారా ఆ పదాలు ఆయా భాషల్లో చేరాయని కొందరు అభిప్రాయపడ్డారు. అది సరికాదు. బ్రాహ్మణులు, వైదిక మతం విశ్వ విద్యాలయాలను నడపలేదు. ఘటికాస్థానాలను, గోళామఠాలను మాత్రమే నడిపారు. గురుకుల విద్య పేరిట గురువు ఇంటి వద్ద శిష్యులను పోగేసుకుని చదువు చెప్పేవారు. దీనిని గురు శిష్య పరం పరగా పేర్కొనేవారు. విద్యను రహస్య విద్యగా కొందరికే పరిమితం చేయడానికి గురుశిష్య పరంపర విద్యా విధానం ఉపయోగపడింది. అవి ప్రధానంగా మత, తర్క శాస్త్రాలకు సంబంధించినవే. బ్రాహ్మణులు లిపిని వ్యతిరేకించారు. బౌద్ధులు, శూద్రులు లిపిని అభివృద్ధి పరిచారు. లిపి, శృతి రెండూ పరస్పరం చాలా కాలం వ్యతిరేకంగా పనిచేశాయి. వైదికులు లిపిని వ్యతిరేకించారు. శృతిని ప్రధానం చేశారు.

రాజ్యపాలన విద్య వృత్తివిద్యలు లోహ ఖనిజ వృత్తులు, వేట, వ్యవసాయం, చెరువుల నిర్మాణం, కుల వృత్తులు, కళలు సంగీతం, మొదలైనవన్నీ స్వయంగా ఆయా రాజులు వర్గాలు నిపుణులు అనుభవం మీద నేర్చుకున్నారు. వాటిని తర్వాతి కాలంలో కొందరు గ్రంథస్తం చేశారు. గ్రంథస్తం చేసే క్రమంలో బ్రాహ్మణులు చాతుర్వర్ణ



సిద్ధాంతాలను వాటిలో చొప్పించారు. బౌద్ధులు ప్రజలందరినీ ఎలాంటి విభజన లేకుండా వీటిని ప్రజలకు అందించే కృషి చేశారు. బ్రాహ్మణ బౌద్ధ జైన విద్యా విధానంలోనే ప్రజాస్వామిక స్వభావం, కుల స్వభావం చొప్పించబడింది. బ్రాహ్మణులు కుల స్వభావాన్ని ఆచరిస్తూ మనుధర్మాన్ని ప్రచారం చేస్తూ గురు శిష్య పరంపర, గురుకుల విద్యా విధానం ద్వారా విద్యను కొందరికే పరిమితం చేశారు. బౌద్ధులు, జైనులు ప్రజాస్వామిక స్వభావంతో దేశ దేశాల ప్రజలకు అందరికీ ఒకే విధంగా విద్యను సంస్కారాన్ని, భాషను బౌద్ధ సిద్ధాంతాలను, జీవన విధానాన్ని తత్వ శాస్త్రాలను అష్టాంగ మార్గాలను వైద్య విధానాన్ని నేర్పారు. తద్వారా బౌద్ధం, బౌద్ధం ద్వారా భారతీయ భాషలు, భావాలు, సంస్కృతి, దేశదేశాలు వ్యాపించాయి. వర్తకం, సామ్రాజ్యాల విస్తరణ, రాజుల పోషణ, ప్రజల ఆదరణ విస్తృతంగా లభించడం వల్ల ఇది సాధ్యపడింది. గుప్త రాజులు బ్రాహ్మణ మతాన్ని వర్ణ వ్యవస్థను, వైదిక, పౌరాణిక సాహిత్యాన్ని విస్తృతంగా సంస్కృతంలో తిరగ రాయిస్తూ ప్రచారం చేశారు. చాలా మంది ముందుగా వైదిక శాస్త్రాలను నేర్చుకొని తరువాత బౌద్ధులుగా మారటం వల్ల సంస్కృతాన్నే వాళ్ళు శాస్త్ర భాషగా ఉపయోగించారు. ముఖ్యంగా నాగార్జునుడు, వసుబంధు, ధర్మకీర్తి, ఆర్య దేవుడు, దిగ్నాగుడు మొదలైన వాళ్ళు ముందు వైదిక పండితులుగా ఉండి ఆ తరువాత బౌద్ధంలోకి మారారు. అందువల్ల వైదిక ఛందస్సు అయిన "అనుష్టుప్పు"ను వారు ఎక్కువగా వాడారు.

సంస్కృతంలోకి బౌద్ధవిద్యా విధానం మారాక బ్రాహ్మణులు ఎక్కువ మంది చేరడం జరిగింది. మిగతా ప్రజలు సంస్కృతం నేర్చుకోవడం కొంత కష్టంగా వుండేది. పాళీ, పాకృత పైశాచి, తెలుగు, ద్రావిడ భాషలు ప్రజల భాషలకు దగ్గరగా వుండేవి. అలా బౌద్ధం వారికి చేరువైంది. సంస్కృతంలోకి బౌద్ధ విద్యా విధానం మీడియం మారిన తరువాత బ్రాహ్మణులకు అటు వైదిక మతంలోనూ, బౌద్ధ మతంలోనూ ఎటు చేరినా వారికి సులువైపోయింది. వారు అటు ఇటూ మారుతూ శతాబ్దాల తరువాత బౌద్ధానికి, బ్రాహ్మణిజానికి మధ్య తేడాలేని దశ 13వ శతాబ్దం నాటికి ఏర్పడింది. ఆచార్య నాగార్జునుడు, అశ్వఘోషుడు, బౌద్ధ సాహిత్యాన్ని సంస్కృతంలో వ్యాప్తి చేశారు. బ్రాహ్మణులు చేరిన క్రమంలో బౌద్ధంలో సంస్కృతం పెరిగింది. సంస్కృతం పెరిగిన క్రమంలో బ్రాహ్మణులు బౌద్ధంలో పెరిగారు. అదే క్రమంలో ఇతర ప్రజలు తగ్గుతూ వచ్చారు. తద్వారా బౌద్ధ, జైన బ్రాహ్మణీయ విద్యా విధానంలో మూడింటిలోనూ బ్రాహ్మణుల వ్యాప్తి పెరిగింది. సమాజంపై దీని ప్రభావం పడుతూ వచ్చింది. రాజులు మారుతూ వచ్చారు. బ్రాహ్మణులు నిరంతరాయంగా కొనసాగుతూ వచ్చారు. దాంతో రాజులు బ్రాహ్మణుల ప్రభావానికి లోను కాక తప్పలేదు. ఏ గణతెగల నుండి, కులాల నుండి వచ్చిన రాజులైనప్పటికీ బ్రాహ్మణులు చెప్పే వర్ణ వ్యవస్థలో ఇమిడి

పోవలసిన అవసరం సృష్టించబడింది. ఇలా నాల్గవ శతాబ్దం నుండి వర్ణ వ్యవస్థ బ్రాహ్మణాధిక్యత సముద్ర గుప్తుని (335-376) కాలం నుండి రాజాదరణతో విస్తరించింది.

విలు విద్యలు, యుద్ధ విద్యలు బ్రాహ్మణులు నేర్పినట్లుగా రామాయణ భారతాల్లో ద్రోణుడు వంటి పాత్రల ద్వారా కనబడుతుంది. కానీ యుద్ధ విద్యలు నేర్చుకోవడం బ్రాహ్మణులకు తలకు మించిన పని. వారికి పఠనం, గానం మాత్రమే ఎక్కువ ఇష్టం. అది కూడా వేదాలను, ఉపనిషత్తులను, మంత్రాలుగా వల్లివేయడం ఎక్కువ జరిగింది. అందులోని అర్థం వెంట వెల్లడం గాని, దాన్ని జీవితంలోని సమకాలిక అంశాలకు అన్వయించడం గాని తక్కువ. వల్లెవేసేవారు అన్వయించుకోవడం సాధారణంగా జరగదు. అన్వయించుకుంటే వల్లెవేసే ధారణశక్తి తగ్గిపోతుంది. ధారణశక్తి ఎక్కువున్నవారికి సృజనశక్తి, అన్వయశక్తి బాగా తక్కువగా వుంటుంది. అందువల్ల వాళ్ళు టేప్ రికార్డర్‌లాగా వల్లించడం చేస్తారు. వారిని పండితులు అని పిలిచారు. అందుకే పండిత పుత్రులు పరమ శుంఠలు అనే నుడికారం పుట్టింది. సృజన శక్తుల వికాసం లేకపోవడం వల్ల తండ్రి నుంచి పండిత పుత్రులు నేర్చుకోగలిగే దేమీ లేకపోవడం వల్ల వల్లెవేయలేకపోతే పరమశుంఠలుగా వర్గీకరింపబడ్డారు. అందువల్ల బ్రాహ్మణులు, వర్ణ ఆధిక్యత వాదులు సంస్కృతాన్ని ఇతర దేశాలకు అందించడం జరగలేదు. పాలి, ప్రాకృత, ద్రావిడ, తెలుగు, పైశాచి, మాగధి భాషల ద్వారా పలు పదాలు, సిద్ధాంతాలు, భావాలు ఇతర దేశాలకు చేరాయి. బౌద్ధ విద్యాలయాలలో భాగంగానే 2వ శతాబ్దం నుండి సంస్కృతం కూడా కాలక్రమంలో ఇతర దేశాలకు చేరింది. ఇలా విద్యా వ్యవస్థ బౌద్ధం ద్వారా ప్రపంచ వ్యాప్తంగా విస్తరించింది. గ్రీకు, చైనా, ఈజిప్టు, మధ్యయాసియా దేశాల్లో బౌద్ధ విద్య విస్తరించి పరస్పర ప్రభావాలకు లోనయ్యాయి. సముద్ర గుప్తుని కాలం నుండి బ్రాహ్మణీయ సాహిత్యం కూడా ఇతర దేశాలకు వ్యాప్తి చెందింది.

సంస్కృతంలో క్లాసిక్స్ అని చెప్పదగినవి 220 గ్రంథాలు వుంటాయి. అయితే బ్రాహ్మణులు, ముస్లింలు నాశనం చేసినవి, కాల్చి వేసినవి పోగా మిగిలిన బౌద్ధ క్లాసిక్ గ్రంథాలు సుమారు 5వందల దాకా ఇప్పటికీ అచ్చు అవుతున్నాయి. మార్క్సిజం పేరిట, హిందూమతం పేరిట బ్రాహ్మణవాదులు బ్రాహ్మణీయ విద్యా విధానానికి ప్రాధాన్యతను ఇస్తూ రాసిన చరిత్ర గ్రంథాలే వీరివన్నీ. హిందూ బ్రాహ్మణీయ అనుకూల విద్యావిధాన చరిత్రను, సురేష్ సి. ఘోష్ తన 'హిస్టరీ ఆఫ్ ఎడుకేషన్ ఇన్ ఇండియా' గ్రంథంలో వివరించారు. బౌద్ధ విశ్వ విద్యాలయాల్లో సాగిన విద్యా విధానం 4వ శతాబ్దానికే శిథిలమౌతూ వచ్చిందని ఆయన అభిప్రాయ పడ్డారు. కానీ 13వ శతాబ్దంలో



కూడా బౌద్ధ విశ్వ విద్యాలయంగా విక్రమ శిల విశ్వ విద్యాలయం ప్రపంచ వ్యాప్తంగా ప్రసిద్ధి చెందింది.

1953లో ఎ. నమ్మళ్వార్ **'ప్రాచీన బౌద్ధ విశ్వ విద్యాలయాలు'** అనే గ్రంథంలో బౌద్ధ విశ్వ విద్యాలయాల గురించి వివరంగా రాశారు. ఇటీవల అది పునర్ ముద్రణ పొందింది. అందులో అనేక విశేషాలు తెలుస్తాయి. నేటి విశ్వ విద్యాలయాలలో ఉన్న పీఠాలు, శాఖలు క్రీ.పూ. నుండి బౌద్ధ విశ్వ విద్యాలయాలలో వున్నాయని వాటిని ద్వారాలు అని, పీఠాధిపతులను ద్వార పాలకులు అని పిలిచేవారు. ఒకొక్క స్కూల్ ఆఫ్ థాట్‌కు ఒక పీఠాధిపతి (శాఖాధిపతి) వుండేవాడు. అతనితో పాటు మరికొంత మంది ఆచార్యులు వారితోపాటు వుండేవారు. ఇలా తర్క తత్వ వ్యాకరణ, వైద్య, రస విద్య మాధ్యమిక, శూన్య, వజ్ర మొదలైన ద్వారాలు వుండేవి. ఈ పద్ధతి ద్వారా శిష్యులకు ఒక భావం, సిద్ధాంతం ఎలా పుట్టి పెరిగిందో స్పష్టంగా అర్థం అవుతుంది. కానీ బ్రాహ్మణీయ విద్యా విషయక విద్య భారతీయ పౌరాణిక చరిత్రకు భిన్నమైనదనే చిత్రాన్ని ఇవ్వలేక పోయింది. అది గురు శిష్య పరంపరకు, గురుకుల విద్యా విధానానికి, వర్ణ వ్యవస్థకు, కుల వివక్షకు సంబంధించినదే. అందువల్ల గురు శిష్య పరంపరలో సామాజిక పరిణామాల పరిశీలన సూత్రీకరణ సాధ్యం కాలేదు. మనుధర్మాన్ని ఆదర్శంగా ప్రవచించారు.

## వేల ఏళ్ళ తరువాత 1947 స్వాతంత్ర్యం నుండి మొదటిసారిగా బ్రాహ్మణవాదం భారతదేశ వ్యాప్తంగా అధికారంలోకి వచ్చింది

బౌద్ధ వాఙ్మయం చదివినప్పుడు సంస్కృతంలోని 220 క్లాసిక్ గ్రంథాలకు బౌద్ధం, గ్రీకు సాహిత్యం సిద్ధాంతాలు ఎలా మాతృకగా పనిచేశాయో వాటిని అనుకరిస్తూ సొంత సిద్ధాంతాలుగా ఎలా చెప్పుకున్నారో తెలుస్తుంది. మార్క్సిస్టులు, ఆర్ఎస్ఎస్ చరిత్ర కారులు వీటిని చూడటానికి, పరిశీలించడానికి సిద్ధంగా లేరు. వారు బ్రాహ్మణ కుల, బ్రాహ్మణ వర్ణ వ్యవస్థ ఆధిక్యతను ఏదో రూపంలో శతాబ్దాల తరబడి కొనసాగిందనే సైద్ధాంతిక, మానసిక, శాసనీయ, సామాజిక ఆధిపత్యాన్ని ప్రజల మీద రుద్దడానికి పరిమితమవుతారు. వేల ఏళ్ళు బౌద్ధం లాగే బ్రాహ్మణవాదం, వర్ణ, కుల వ్యవస్థలు పడుతూ లేస్తూ అనేక పరిణామాలు పొందుతూ ముస్లింల కాలంలో బౌద్ధం, జైనం లాగే చావు తప్పి కన్ను లొట్టపోయి ఇస్లామ్‌కు వ్యతిరేకంగా, సమాంతరంగా శైవ, వైష్ణవ సిద్ధాంతాలను, ఉద్యమాలను, అవతారాలను, భక్తి సిద్ధాంతాలను ముందుకు తెచ్చారని అలా నిలదొక్కుకునే ప్రయత్నం చేశారని బ్రాహ్మణవాదులు చెప్పడానికి వెనుకాడుతున్నారు. బౌద్ధం లాగే బ్రాహ్మణిజం కూడా అనేక దశలుగా దిశలుగా పడుతూ లేస్తూ కొనసాగింది. హిందూమతంగా పిలిచే వర్ణ వ్యవస్థ, కుల వ్యవస్థ

నిరంతరాయంగా కొనసాగలేదు. అది పతనమౌవుతూ తిరిగి నిలదొక్కుకుంటూ వచ్చింది. పూర్తిగా ఏదీ అదృశ్యం కాలేదు. కానీ స్వాతంత్రం వచ్చాక 1947 ఆగస్టు 15వ తేదీ నుండి మాత్రమే బ్రాహ్మణులు, బ్రాహ్మణవాదం పూర్తిస్థాయిలో శతాబ్దాల తరువాత దేశవ్యాప్తంగా అమలులోకి వచ్చింది. అంతకు ముందు ఎప్పుడూ దేశవ్యాప్తంగా అమలులో లేదు. గుప్తుల కాలంలో జైనం, బౌద్ధం, వైదిక, బ్రాహ్మణ, హిందూ, మను ధర్మ మతాలు సమాంతరంగా ఏకకాలంలో కొనసాగాయి. నేటి హిందూ మతానికి ఆ కాలంలోనే పునాదులు పడ్డాయి. అయిప్పటికీ 13వ శతాబ్దం దాకా బౌద్ధం కొనసాగింది. నేటికీ జైనులు, బౌద్ధులు భారతదేశంలో కొనసాగుతున్నారు.

కనిష్కుని నిర్వహణలో క్రీ.శ. 72వ సం॥లో 3వ బౌద్ధ సంగీతి పేరుతో బౌద్ధ సమ్మేళనం జరిగింది. హర్షవర్ధుని కాలంలో (క్రీ.శ. 606-647) బౌద్ధుల 4వ సమ్మేళనం బౌద్ధ సంగీతి పేరుతో జరిగింది. 1935లో స్టాలిన్ కాలంలో రష్యా తత్వవేత్త, సంపాదకుడు స్టేర్‌బాట్స్కీ భారతీయ గ్రంథాలను రష్యన్‌లోకి అనువదిస్తూ బౌద్ధ తర్కాన్ని రెండు సంపుటాలుగా వెలువరించారు. ఈ గ్రంథంలో బౌద్ధ తర్కంలో ప్రతీ 500 సంవత్సరాలకు ఒక దశగా పేర్కొంటూ 1500 సంవత్సరాల కాలాన్ని మూడు యుగాలుగా వర్గీకరించాడు. అందులో వచ్చిన మార్పులను గ్రీకు తత్వ శాస్త్రాలతో పోల్చి తులనాత్మకంగా పాఠకుల ముందుంచారు. ఎంతో ప్రాచుర్యం పొందిన ఈ గ్రంథాన్ని కూడా చదివీ చదవనట్టు మార్క్సిస్టులు, బ్రాహ్మణవాదులు వదిలేస్తుంటారు. ఇలా బౌద్ధ వాఙ్మయం నుండి తీసుకుని సొంత భాషలో రాసుకున్నవే న్యాయ, వైశేషిక దర్శనాలు అని బౌద్ధ వాఙ్మయ నిపుణులు పేర్కొన్నారు.

బౌద్ధంలో లాగా విశ్వ విద్యాలయాలు నిర్వహించక పోవడం వల్ల బ్రాహ్మణ విద్యార్థులు తమకు ఇష్టమైన సబ్జెక్టు నేర్చుకోవడానికి దేశమంతటా ఎక్కడెక్కడో వున్న గురువులను గురించి విని వెదుక్కుంటూ వెళ్ళవలసి వచ్చేది. అయితే అక్కడకు చేరిన తరువాత విన్నది వేరు అతను చెప్పేది వేరు, అతని జీవనం వేరు, శిష్యులుగా చేరదలచుకున్న వారి జీవనం సంస్కృతి వేరుగా వుండటంతో ఒక నమస్కారం పెట్టి తిరుగు ప్రయాణం పట్టేవారు. ఒకాయన వేదంలోని ఒక భాగం చెప్పడానికే పరిమితం. మరొక ఆయన మీమాంస మాత్రమే చెపుతాడు. ఇంకొక ఆయన కొన్ని ఉపనిషత్తులకే పరిమితం. మరొకాయన తర్కానికే పరిమితం, వేరొకాయన వ్యాకరణానికే పరిమితం. ఇంత మంది చుట్టూతా దేశ వ్యాప్తంగా ఎక్కడెక్కడో గురువులు వున్నారని వెతుకునే సరికి పుణ్యకాలం గడిచిపోయేది. పైగా 12 సంవత్సరాలు గురుసుశ్రూష చేస్తే తప్ప అందులో నిపుణులు కారు. 18 ఏళ్ళు నిండటం జరిగిపోయేది. ఇలా గురువుల వేటలో జీవితాలు ఖర్చయిపోయేవి. బౌద్ధులు ఎదురైనప్పుడు వారితో గెలవడం అసాధ్యమయ్యేది. తత్వం గురించి మాట్లాడితే బ్రాహ్మణులు వ్యాకరణం అలా చెప్పడం



లేదని చర్చలు చేస్తూ నవ్వులపాలయ్యారు. శతాబ్దాల తరబడి బౌద్ధుల తత్వానికి, తర్కానికి పోటీనివ్వలేక సంస్కృత వ్యాకరణాన్ని, వ్యాకరణ కర్త అయిన పాణిని ఉటంకించేవారు. ఇలా శతాబ్దాల తరబడి బ్రాహ్మణ పండితులు తమ అజ్ఞానాన్ని జ్ఞానంగా భ్రమించారు. దాన్ని అజ్ఞానంగా నిరూపించిన బౌద్ధులను చూస్తే అరికాలి మంట నెత్తికెక్కేది. దాంతో సంచారులైన బౌద్ధ బిక్కులను స్థానికుల చేత కొట్టించి చంపించేవారు.

బెంగాల్‌లో, కేరళలో బ్రాహ్మణులు చక్కగా చేపలు తింటారు. శాఖారులైన బ్రాహ్మణ శిష్యులు గురువును వెతుక్కుంటూ అక్కడికి వెళ్ళేసరికి చాపలు కడుక్కుంటూ అసలు గురువు కనపడే సరికి అతడేగురువని తెలుసుకున్నాక వెనక్కి తిరిగి చూడకుండా పారిపోయారు. ఇలా గురువును చేరిన తరువాత జీవన విధానాలు తెలిసేవి. దాంతో విద్యార్థులు విద్యను అభ్యసిచడంలో చాలా కష్టపడవలసి వచ్చింది. మార్గ మధ్యంలో దొంగలు, పులులు, సింహాలు, పాములు, తేళ్ళు, వానలు, వరదలు, ఆహారం దొరకక అవస్థలు, నీళ్ళతో రోగాలు ఇలా బ్రాహ్మణ విద్యార్థులు నీరసించిపోయేవారు. దీన్ని గమనించి తర్వాతికాలంలో బ్రాహ్మణ విద్యార్థులకు సత్రాలను ఏర్పాటు చేయడానికి బ్రాహ్మణపేదలకు రాజులు వందలాది ఎకరాలను కేటాయించి పండించుకుని వారికి పెట్టమని పన్ను మినహాయించారు. అలా ముస్లింల కాలంలో బ్రాహ్మణ సత్రాలు వెలిసాయి. ఇప్పటికీ ఇవి కొనసాగుతున్నాయి. వీటికి గుళ్ళకు పెద్ద సంబంధం లేదు. గుళ్ళకోసం ఇచ్చిన భూములను పూజారులే అనుభవించేవారు. వారి సుఖాలు వారివే. వారి పటాటోపం రాజు కన్నా తక్కువ కాదు. ***గుళ్ళల్లో విద్య అందించాలని రాజులు ఉద్దేశించినప్పటికీ గుళ్ళు గానా భజానాలకు, వేశ్యలకు, సంగీతం కళలు పేరుతో, దేవదాసి, జోగిని పేరుతో ఇహలోక సుఖాలన్నిటినీ ప్రశాంతంగా అనుభవించారు. పరలోక సుఖాలను మాత్రం మందికి చెప్పారు.*** విద్యా వ్యాప్తికి వారు చేసిన కృషి తక్కువ. ప్రజలను హింసించి దోపిడీ చేసింది ఎక్కువ. గుళ్ళను ఆదాయ కేంద్రాలుగా, అధికార కేంద్రాలుగా మలుచుకున్న ఘనత వీరిది.

కులాలు స్థిరీకరణ పొందడం సామ్రాజ్యాలు పతనమై చిన్న చిన్న రాజ్యాలుగా చీలిపోయిన తరువాత పెరిగింది. ప్రతి చిన్న రాజ్యం స్వయం పోషకంగా వుండటం కోసం నిపుణులను తయారుచేసింది. అందులో భాగంగా ప్రతి చిన్న రాజ్యంలో వందలాది నిపుణులు ఎదిగారు. రాజ్యానికి పరిమితమైన ఈ నిపుణులు ఆ రాజ్యం పరిమితిలో క్రమంగా కులాలుగా రక్త సంబంధాలు పెంచుకున్నారు.

అందువల్ల ఒక రాజ్యంలోని కులాలకు, పేర్లకు మరో రాజ్యంలోని కులాలకు, పేర్లకు పోలిక లేకుండా పోయింది. కానీ వారి వృత్తులన్నీ 40-50 రకాల వైవిధ్యానికి చెందినవే. అందుకే ఆయా రాజ్యాల్లో నగరాల్లో, పట్టణాల్లో, గ్రామాల్లో అన్ని కలసి

40, 50 రకాల వృత్తులే కనపడతాయి.

ఒకే కులం వారు అనేక వృత్తులు చేసేవారు. ఉదాహరణకు మాదిగ కులస్థులు 14 రకాల వృత్తులు, ఉత్పత్తులు, సేవలు అందించేవారు. వారు 7వ శతాబ్దంలో రూపొందించుకున్న జాంబవ పురాణంలో ఈ 14 రకాల ఉత్పత్తులను, సేవలను పేర్కొన్నారు కూడా. బ్రాహ్మణులతో సంవాదం చేస్తూ మేము లేని ఇళ్ళు అంటూ లేదు. ప్రతి ఇంట్లో చీపురై వున్నాము. మోట తొండానైమో వున్నాము. బండి నడిపే ఎడ్ల, గుర్రాల వార్నై వున్నాము. దప్పునై వున్నాము. చెప్పునై వున్నాము అంటూ ఇలా వారు అందించే సేవలు ఉత్పత్తులు అన్నీ పేర్కొని మీ బ్రాహ్మణులు లేకపోయినా ఈ సమాజానికి ఏ నష్టం లేదు. కానీ మేము లేకపోతే ఒక్కరోజు కూడా ఈ సమాజం ముందుకు సాగదు అని తర్కిస్తారు. జాంబవ పురాణం తప్పకుండా అందరూ ఒకసారి వినవలసిందే.

అతిశూద్రులు ఎంతగొప్ప తర్కం, సాహిత్యం, తత్వం సృష్టించారో జాంబవ పురాణం, ఆచార్య చండాల ఆదిశంకరాచార్యను ఓడించడం మొదలైనవి స్పష్టం చేస్తాయి. క్రీ.శ. 8వ శతాబ్దానికి చెందిన శంకరాచార్యను ఓడించిన చండాలుడు కేవలం పంచముడుగా వర్ణించడం బ్రాహ్మణవాదులు చేసిన కుట్ర. బ్రాహ్మణవాదాన్ని విమర్శించిన వేమనను కూడా నగ్నంగా తిరిగాడని పిచ్చివాడని ప్రచారం చేసినట్టుగానే చండాల ఆచార్యున్ని ప్రచారం చేశారు. ఆచార్య చండాల ధర్మకీర్తి అశ్వఘోశ, వజ్ర సూచి, మొదలైనవి గురుకుల విద్యా విధానంతో నేర్పుతున్న బౌద్ధ ఆచార్యుడు. బొనిగల రామారావు చారిత్రక శకలాల నుండి దీన్ని వెలికి తీసి చరిత్రను పునర్ లిఖించారు. బాణుడు రాసిన కాదంబరి సంస్కృత వచన కావ్యంలో చండాల కన్య అపూర్వ సౌందర్య రాశిగా పేర్కొన్నారు. కాదంబరి కావ్యం ..... లో ....... రాజుల కాలంలో రాయబడింది.

**వర్ణ వ్యవస్థలో, కుల వ్యవస్థలో, బౌద్ధ, జైన, ముస్లిం వ్యవస్థల్లో, మతాల్లో, దశల్లో విద్యా విధానాలు ప్రధానంగా ఈ క్రింది విధంగా వుండేవి. సబ్జెక్టుల వారీగా ఇలా వర్గీకరించుకోవచ్చు.**

1. మత విద్య, భాష, వ్యాకరణ విద్య - బ్రాహ్మణులు
2. రాజ విద్య, పరిపాలన విద్య, యుద్ధ విద్యలు - రాజులు
3. అర్థ, వ్యాపార విద్యలు - వైశ్యులు
4. కుల విద్యలు - శూద్రులు, అతిశూద్రులు
5. గణ, తెగ జాతుల విద్యా సంస్కృతి, కళలు
6. యోగ, ధ్యానం
7. వైద్యం, వనమూలికలు, రసాలు, ప్రకృతి నుండి మందుల తయారీ
8. సంగీతం, నృత్యం, కళలు
9. శృంగారం, లైంగిక విద్య -వేశ్యలు, పై మూడు వర్ణాలు
10. దైవం, ఆధ్యాత్మికం పేరిట, ఖర్మపాకం పేరిట అణచివేత
11. వాస్తు, జ్యోతిష్యం, పంచాంగం, శకునాలు పేరిట అణచివేత
12. తాత్కాలిక బ్రహ్మచర్యం, గురు సుశ్రూశ

**బౌద్ధ విద్యా విధానంలో విద్య ఇలా కొనసాగింది**

1. బౌద్ధ బోధనలు - అందరికీ
2. వైద్య విద్య - అందరికీ
3. తర్కతత్వ విద్య - అందరికీ
4. బిక్కు శ్రమణ, సమ్యక్ కరుణ ప్రజ్ఞ - అందరికీ
5. శాశ్వత బ్రహ్మచర్యం - బిక్కు, బిక్షువులు
6. వృత్తి విద్యలు, రసాయనిక శాస్త్రాలు, కుల విద్యలు - అందరికీ
7. భాషా శాస్త్రాలు, వ్యాకరణం - అందరికీ
8. యుద్ధ విద్యలు, పరిపాలన విద్యలు - అందరికీ
9. అర్థ వ్యాపారాలు - అందరికీ

వర్ణ కుల సిద్ధాంతంలో విద్యా లక్ష్యం మనుష్యుల విభజన. మానసికంగా శ్రామికుల కుల విభజన. మానసిక న్యూనత, ఆధిక్యత. వర్ణాధిక్యత స్థాపన. బ్రాహ్మణ, రాజ, వైశ్య వర్ణాలకు ఆధిక్యత, గౌరవం. శూద్రులు సేవా కులాలుగా మించి ఆలోచించకుండా, ఆశించకుండా తాత్వికంగా అణచివేయడం.

గురుకుల వర్ణ కుల విద్యా విధానం వల్లెవేసే పద్ధతి. తద్వారా సృజన నిరాకరణ. కులానికి పరిమితం చేయడం. రాజులు వీటిని ఎందుకు ప్రోత్సహించారంటే వీటి ద్వారా రాజరిక స్థిరత ఏర్పడుతుంది. బ్రాహ్మణ క్షత్రియ వైశ్య ఆధిక్యత, దోపిడీ అణచివేత సజావుగా స్థిరంగా కొనసాగుతుంది. శూద్రుల నుండి ఉత్పత్తిని వాటి విలువను కైంకర్యం చేయడం సులభం. పంచములను దూరంగా వుంచి నిరంతరం మసోసిజంతో కొట్టుమిట్టాడేటట్టు చేయడం. బ్రాహ్మణులు శాడిజంతో శతాబ్దాల తరబడి ఘనీభవించిపోయారు. కుల వివక్షతలో వున్నవి శాడిజమే.

లిపి, శృతి రెండూ క్రమంగా పరిణామం చెందాయి. వైదిక మతం శృతి మీద ఆధారపడింది. పఠనం, పాఠనం, ధారణ దీని విద్యా బోధన పద్ధతి. లిపిని వైదిక

మతం నిరాకరించింది. మొదటిలో లిపి లేదు. తరువాతి కాలంలో లిపి వచ్చాక వర్ణ వ్యవస్థలో ఇతరులకు అందకూడదు అని కొంత, లిపిలో వేదాల్లోని ఉదాత్త, అనుదాత్త 18 స్వర బేధాలు ఒకే అక్షరం లిపిలో పలకడం సాధ్యం కాదని కొంత వేదాలు లిపిబద్ధం కావడాన్ని వ్యతిరేకించారు.

లిపి మూడు పద్ధతుల్లో అభివృద్ధి చెందింది. పై నుండి కిందికి లెక్కలు రాస్తున్నట్లుగా ఒక లిపి అభివృద్ధి చెందింది. కుడి నుండి ఎడమకు మరొక లిపి అభివృద్ధి చెందింది. దీన్ని ఖరోష్టి లిపిని పిలిచారు. అరబ్బీ, ఉర్దూ, మొదలైనవి ఇప్పటికీ కుడి నుండి ఎడమకు రాస్తారు. చదువుతారు. ఎడమనుండి కుడికి రాసే లిపి విధానం ప్రపంచ వ్యాప్తమైంది. తెలుగు, పాలి, పాకృతం, సంస్కృతం, హిందీ, ఇంగ్లీషు, ఫ్రెంచ్ ఎడమ నుండి కుడికి రాస్తారు.

కుడి నుండి ఎడమకు రాసిన పద్ధతి నుండి కొన్ని భాషలు ఎడమ నుండి కుడికి మారాయి. కానీ పలకడంలో కుడి నుండి ఎడమకు పలికే పద్ధతి ఇప్పటికీ కొన్నిటిల్లో అవశేషాలుగా కొనసాగడం చూడవచ్చు. పద్దెనిమిది అని తెలుగులో పలుకుతాము. రాయడం కూడా పది కోసం ఒకటి వేసి తరువాత ఎనిమిది అంకె రాస్తాము. కానీ సంస్కృతంలో దీనికి భిన్నంగా కుడి నుండి ఎడమకు పలుకుతారు. అష్టాదశ పురాణాలు అని అంటారు. దీన్ని తెలుగులో ఎడమ నుండి కుడి పద్ధతి ప్రకారం పలికేదైతే ఎనిమిదున్ను పది అని పలకాల్సి వుంటుంది. చతుష్షష్ఠి కళలు అంటారు. అనగా నాలుగున్ను అరవై కళలు. తెలుగులో అరవై నాలుగు కళలు అని పలుకుతాము. సంస్కృతంలో, హిందీలో, ఉర్దూలో, అరబ్బీలో కుడి నుండి ఎడమకు సంఖ్యలు పలుకడం ఇప్పటికీ కొనసాగుతున్నది. ఇంగ్లీషులో, తెలుగులో ఎడమ నుండి కుడికి పలకడం చూడవచ్చు. తర్టీఫైవ్ అంటే తెలుగులో ముప్పది అయిదు. హిందీలో పాంచ్ అవుర్ తీస్ కలసి ఫైంతీస్ అని పలుకుతారు.

ఇలా కుడి నుండి ఎడమకు పలికే కరోష్టి లిపి రాతలోనే కాకుండా పలుకులో కూడా కొనసాగుతున్నది. కానీ ఎప్పుడూ దేవనాగరి లిపి కరోష్టి పద్ధతి నుండి ఎడమ నుండి కుడికి మారిందో గానీ సంఖ్యా వాచకాలు మాత్రం పాత పద్ధతిలోనే కొనసాగుతున్నాయి. వాళ్ళు పలికే పద్ధతిలో అష్టాదశ పురాణాలు అనే పదాన్ని రాస్తే **'లుణారావు శదష్టాఅ'81** అని 18 అనే సంఖ్య లిపిలో అవుతుంది. పైగా అక్షరాలను కుడి నుండి ఎడమకు రాసినా అక్షరం ప్రారంభించడం ఎడమ నుండి కుడికి ప్రారంభించిన అక్షరాలే. కనుక అక్షరాలు కూడా తొలి దశలో కుడి నుండి ఎడమకు రాసిన పద్ధతిలో ఉండేవి. అవి కాలక్రమంలో ఎడమ నుండి కుడికి రాసేవాటిగా మార్చబడ్డాయి అని ఊహించవచ్చు. ఈ రీత్యా చూస్తే దశాంశ పద్ధతి, సంఖ్యల్లో సున్నా విలువను కనుక్కొని సున్నాను ప్రపంచానికి అందించింది తెలుగువారే అని చెప్పవచ్చు. ఎందుకంటే



తెలుగు సంఖ్యా వాచకాలు దశాంశ పద్ధతి ప్రకారం పలకడం జరుగుతున్నది.

పదాలు ఆయా గణ తెగలు జనపదాలు తమ చుట్టూ వున్న ప్రకృతి నుంచి, ధ్వని అనుకరణ నుంచి, పశుపక్షాదుల అనుకరణ నుంచి రూపొందించుకున్నారు. ఇతరులు కలసి నప్పుడు రెండు రకాల పదాలు కలిశాయి. కొత్త పదాలు కూడా చేర్చుకున్నారు. తెలుగులో సంస్కృత పదాలు బాగా చేర్చబడ్డాయి. వైదిక, బ్రాహ్మణ మతం తన మత విద్య కోసం వేలాది పదాలను ప్రాంతీయ భాషల్లో చొప్పించింది. చివరకు సంస్కృతం నుంచే తెలుగు పుట్టింది అనే దాకా సాహసించారు. అయితే ఇప్పటికీ తెలుగు ప్రజలు అయిదేళ్ళ వయస్సుదాకా నేర్చుకునే పదాలన్నీ తెలుగు పదాలే.

అమ్మ, అవ్వ, అత్త, మామ, నాన్న, అయ్య, అన్న, తమ్ముడు, చెల్లెలు, అక్క తాత, అమ్మమ్మ, నానమ్మ, కోడలు, అల్లుడు, బిడ్డ, కొడుకు, మనవడు, మనవరాలు, మునిమనవరాలు, మునిమనవలు, చుట్టం మొదలైన రక్తసంబంధ పదాలన్నీ తెలుగుపదాలే. అలాగే పిల్లలకు భావాలకు, వస్తువులకు నేర్పే పదాలు కూడా తెలుగు పదాలే. లాల, జేజ, ఇస్సి, బువ్వ, చేయి, కాలు, నోరు, నాలుక, కండ్లు, ముక్కు, నోరు, వేళ్ళు, బట్టలు, నిద్ర, ఆట, పాట మొదలైనవి. అలాగే చుట్టూతా వున్న పరిసరాల పదాలు కూడా తెలుగువే. వేపచెట్టు, కోడి, గంప, ఎద్దు, బర్రె, ఆవు, దున్నపోతు, గుడ్లు, మాంసం, చేపలు, వేట, కత్తి, కొడవలి, పీట, వాకిలి, ఇల్లు, అరుగు, మామిడి, జామ, కంది, పెసరు, వరి, బియ్యం, పప్పులు, అనుప, నూనె, నువ్వులు, పసుపు, జొన్నలు, మొక్కలు, బీరకాయలు, ఆనపకాయలు, బెండ, చిక్కుడు, పుంటికూర, గోంగూర, అలిచెంతలు, బబ్బెరలు, గుడాలు, ఉడుకుడు, ఉరుకుడు, లేసుడు, పండుడు, తన్నుడు, కొట్టుడు, చంపుడు, మాట, గుడిసె, తిరుగుడు, తిట్టుడు, బతుకుడు, గంజి, అంబలి, కూర, నార, రోలు, రోకలి, దంచుడు, మంచం, బట్టలు, కంచం, నీళ్ళు, పాలు, పెరుగు, వెన్న, నెయ్యి, కాగు, కుండ, బొత్త, కడుపు, మొదలైనవి. మొక్కజొన్నలు, కారం, మిర్చి, పల్లీలు మొదలైనవి ఇతర భాషల నుండి తెలుగులో కలసిపోయాయి. నిత్య జీవితంలో సంస్కృత పదాలు లేకుండా హాయిగా బతక వచ్చు.

మత విద్య ద్వారా తెలుగులో పాలి, పాకృత, సంస్కృత పదాలు ఎన్నో చేరాయి. పరిపాలన పదాలు అరబ్బీ, ఉర్దూ, ఇంగ్లీషు నుండి చేరాయి. శాస్త్ర విజ్ఞానానికి సంబంధించిన పదాలు అవి సృష్టించిన యంత్రాలు మొదలైనవాటికి సంబంధించిన పదాలు ఇంగ్లీషు నుండి తెలుగులో వందలాదిగా చేరాయి. బస్సు, కారు, జీపు, ట్రాక్టరు, కరెంటు, మోటరు మొదలైనవి. అదృష్టం, ఆత్మ, కర్మ, శక్తి, భక్తి, సృష్టి, స్థితి, లయలు, వరం, శాపం, దేవాలయం, పుణ్యం, స్వర్గం, నరకం, ప్రసాదం, నైవేద్యం, శ్రీకారం చుట్టడం, ఓనమాలు దిద్దడం, రాంరాం, జాతకం, స్వాహా, కైంకర్యం, బ్రహ్మజ్ఞానం, బ్రహ్మ విద్య, కైలాసం, వైకుంఠం, సంధ్యవార్చుడు, నమస్కారం, తాపత్రయం, నోచు

కోవడం, పూజ మొదలైన పదాలు అలాగే వ్యాపార పదాలు – లాభం, నష్టం, లక్ష్మి (సంపద) సరస్వతి (తెలివి), లౌక్యం, శుభం, లాభం మొదలైనవి. మత విద్యా విధానంలో భాగంగా తెలుగులో వచ్చి చేరాయి. మౌలిక పదాలు, వాక్య నిర్మాణం తెలుగు భాషలో స్వతంత్రంగా కొనసాగుతున్నాయి. తెలుగులోని వేపచెట్టు, మామిడిచెట్టుకు పర్యాయపదం లేదు. పర్యాయ పదాలు సాధారణంగా ఇతర భాషల నుండి వచ్చినప్పుడు పలు భాషలు కలిసి ఒకే భాషగా మారుతున్నప్పుడు ఆయా భాషా పదాలు పర్యాయపదాలుగా చెలామణిలోకి వస్తాయి. తెలుగు భాష సంస్కృతం కన్నా చాలా ప్రాచీనమైంది. క్రీ.పూ. 2000 సంవత్సరా లకు ముందు తెలిమన్, తెలివాహ, సుమేరు, మెసపుటోమియా నాగరికతల్లో తెలుగు, ప్రాచీన రూపాలు చూడవచ్చు. తెలుగు, ద్రావిడ, ప్రాకృత, పాలి, వైదిక, భాషల నుండి సంస్కృత భాష రూపుదిద్దు కున్నది.

సంగీతం నేడు విద్యగా చెప్పబడుతున్నది. పూర్వం సంగీతం, కళలు, నాట్యం, వాయిద్యాలు విద్యగా కాకుండా కళలుగా భావించారు. వీటిని గణ తెగ జనపదాలు తమ సంస్కృతిలో భాగంగా సృష్టించుకున్నాయి. రాజ్యం రూపొందాక రాజస్థానాల్లో వీటిని ప్రదర్శించడం జరిగింది. అందుకు గ్రామాల నుండి రాజా స్థానానికి వెళ్ళేవారు. క్రమంగా రాజా స్థానాల్లో ఇతరులు నేర్చుకుంటూ ఒక వర్గంగా కులంగా స్థిరపడ్డారు. అలా రాజస్థానాల సంగీతం, కళలు, నాట్యం, ప్రత్యేకంగా అనేక గణ తెగల సంస్కృతుల నుండి సమ్మేళనం చేసి మెరుగులు దిద్దారు. సామూహికత నుండి వ్యక్తిగత కృషిగా మారడానికి సాధన అవసరం. పరిశీలన, పరిశోధన, విశ్లేషణ అవసరం. నూతనంగా కనిపించడానికి సంశ్లేషణ, ఊహ, ప్రయోగాలు, సృజన, సాధన కూడా అవసరం. ఆ క్రమంలో సామూహికత నుండి ఇవి వ్యక్తిగత కృషిగా, నైపుణ్యంగా మారడం జరిగింది. ఈ వ్యక్తిగత కృషి భాషకు వ్యాకరణం వంటిది. వ్యాకరణం తెలియకుండానే మాతృభాషలో మాట్లాడతారు. కానీ కొత్తవారు నేర్చుకోవడానికి వ్యాకరణం భాషా నిర్మాణం ఎలాంటిదో నేర్చుకోవాల్సి వస్తుంది. అలాగే జానపదుల సంగీతం, నృత్యం, కళలు, వాటి వ్యాకరణం తెలియకుండానే అనుకరణ ద్వారా అభ్యసిస్తారు. ఇతరులు అభ్యసించడానికి దాని వ్యాకరణం, నిర్మాణం తెలుసుకోవాల్సి వస్తుంది. అలా కళలు, సంగీతం, వాయిద్యాల విద్య, మొదలైనవి నేర్చుకోవాల్సిన విద్య అయ్యాయి. అలా రాజ్యంలో, రాజా స్థానాల్లో, వేశ్య గృహాల్లో, గుళ్ళల్లో, విహారాల్లో నృత్యం, సంగీతం, కళలు, వాయిద్యాలు ప్రత్యేక విద్యలుగా, కళలుగా అభివృద్ధి చెందాయి. వాటిని అభ్యసించడం ప్రత్యేక శాస్త్రాలుగా రూపొందాయి. నిపుణులు వాటిని సూత్రీకరించడం ద్వారా రాగాలుగా, నాట్య శాస్త్రాలుగా రూపొందాయి. రాళ్ళు చెక్కడం, శిల్పాలు చెక్కడం, శరీర అలంకరణ, రాజభవనాల నిర్మాణం, విహారాల నిర్మాణం, గుళ్ళ నిర్మాణం మొదలైనవన్నీ ప్రత్యేక శాస్త్రాలుగా విద్యలుగా అభివృద్ధి చెందాయి.



**సింహావలోకనం :**

# శూద్ర వారసత్వం

ప్రభుత్వసూత్రీకరణ ప్రకారం నేడు బీసీలుగా పిలవబడుతున్న వారు చరిత్రలో శూద్రులుగా పిలవబడ్డారు. వీరిలో అత్యధికులు వ్యవసాయం, పశుపోషణ, చేతివృత్తుల వారు చేతి వృత్తులుగా పిలువబడేవన్నీ గొప్ప కళలే. ఒక కుండను చేయడం గొప్పకళ. ఒక కర్రును చేయడం గొప్ప సైన్సు. చెప్పులు కుట్టడం, బట్టలు నేయడం, లోహవస్తువులు చేయడం ఒక గొప్ప కళ. అదే సమయంలో అదొక గొప్ప శాస్త్ర విజ్ఞానం. ఇలా కళలు, శాస్త్రవిజ్ఞానం రెండూ కల్సి ఆయా కులాల వృత్తుల్లో కొనసాగేవి. విశ్వ బ్రాహ్మణ, నేత కులాల ఉత్పత్తులు రెండున్నరవేల ఏళ్ళు – పారిశ్రామిక విప్లవం వచ్చే దాకా సమాజం సంస్కృతి, నాగరికతలను, ఆనాటికి అందుకున్న సైన్సు స్థాయిని స్పష్టం చేస్తాయి. వ్యవసాయంలో, వాటి పరికరాల్లో వచ్చే మార్పులకు విశ్వబ్రాహ్మణ కులవృత్తులు సైంటిస్టులుగా, ఇంజినీర్లుగా ఎంతో ఉపయోగపడ్డాయి. విశ్రాంతి వర్గాలు కులాలు, వర్ణాధిక్య కులాలు ఈ కళలన్నిటిని అప్లయిడ్ ఆర్ట్సుగా కుదించారు. చతుష్షష్టి (అరవైనాలుగు) కళలుగా పేర్కొన్న సంప్రదాయం బహుజన దృక్పథానికి సంబంధించినదే. వీటిని ఆ తర్వాత లలిత కళలుగా ఆరు కళలకు సంఖ్యను కుదించడంలో వర్ణ వాదం ఉంది. వారు తమ విశ్రాంతి వర్గాలకు అనుగుణంగా ఉన్న కళల్నే లలిత కళలుగా వర్గీకరించి మిగతా కులాల కళల్ని వర్గీకరణకు వెలుపలే ఉంచేసి శ్రామిక కులాల వృత్తుల కింద, వారి కర్తవ్యంగా వ్యాఖ్యానించారు. సమస్త కులాల వృత్తుల్లోని అప్లయిడ్ సైన్సుల్లో ఉన్న కళాత్మకతను కళలుగా పరిగణనలోకి తీసుకోకుండా కళల్ని లలిత కళలుగా ఆరింటికి కుదించడంలో పాలక వర్గాల, బ్రాహ్మణీయ వర్ణవాదుల కుట్ర వున్నది. శ్రామిక కుల వృత్తులన్నీ కళలే అదే సమయంలో శాస్త్రాలే. ఈ రోజు డిజైన్స్, ఇంజినీర్స్ అనే వాళ్ళు నాడు శూద్రుల కులవృత్తి పనినే పారిశ్రామిక యుగంలో కొనసాగిస్తున్నారు.

ఈనాటి ఇంజినీర్లు గొప్ప కళాకారులు, మనం వేసుకునే బట్టల్లో మనం వాడే ఫ్యానుల్లో, రేడియోలో, కుర్చీలో, మోటారు బండ్లలో స్కూటర్లలో ప్రతి రంగంలో డిజైనింగ్ కళ అభివృద్ధి చెందింది. దాన్ని ఇంజనీర్లు రూపొందిస్తున్నారు. ఈ పనిని కళల్ని భారతదేశంలో 1810 దాకా ప్రపంచం గర్వించే స్థాయిలో రూపుదిద్దిన కళాకారులు, ఇంజనీర్లు శ్రామిక కులాలే, గిరిజనులే. ప్రకృతి సంపదకు తోడుగా

ఇంత గొప్ప కళల్ని, పనుల్ని, సంపద, సైన్సుని అభివృద్ధి పరిచిన శూద్రులను అవిద్యావంతులని ఎవరో అనేస్తే నమ్మడం సరికాదు. వేల ఏళ్ళుగా సైన్సు టెక్నాలజీ కళలు శూద్రుల చేతుల మీదుగానే అభివృద్ధి చెందాయి. లోహయుగ పూర్వ చరిత్ర అందరు కల్సి నిర్మించిన చరిత్రయితే లోహయుగం నుండి నిర్మించిన చరిత్రంతా శూద్రులు నిర్మించిన చరిత్రే.

పని నుండి అనుభవం పుడుతుంది. పని నుంచే కళపుడుతుంది. పని నుంచే ఆలోచన పుద్తుంది. పని నుండి ఫలితం పుడుతుంది. ఫలితం కాకుండా అదనంగా అనుభవం ఆలోచన పుడుతుంది. పనితీరును, రూపును కళ అన్నాం. పని నుండిపుట్టిన అనుభవం సైన్సుగా ఎదిగింది. పని నుండి పుట్టిన ఆలోచన తత్వశాస్త్రంగా ఎదిగింది. ప్రకృతి లయలో, పనిలోని ఉచ్ఛ్వాస నిశ్వాసాల్లో, పని కదలికల్లో భాష, కళలు ఆవిర్భవించాయి. ప్రకృతి రూపం, పనిరూపం, పనిఫలితం రూపం కళగా రూపుదిద్దు కున్నాయి. ఇలా పని నుండి పని ఫలితం, అనుభవం, ఆలోచన, సైన్సు, కళ, ఏకకాలంలో పుట్టున్నాయి.

పనితో సంబంధంలేని తాత్విక చర్చలు విశ్రాంతి వర్గాల పరాన్న భుక్కుల వాగుడే, ప్రపంచ తత్వశాస్త్రాల్లో పాలక వర్గ చరిత్రలో ఈ వాగుడు విస్తారంగా కనబడుతుంది. నిజమైన శాస్త్రీయ ఆలోచన, కళలు, సైన్సు భారతదేశంలో లోహ యుగం నుండి పనిలో ఆనందం పొందే శ్రామిక కులాలు రూపొందించాయి. జనపదాలు, గణతెగలు కళలకు, శాస్త్రాలకు, పుట్టినిల్లు. వీటిని కొనసాగిస్తూ అభివృద్ధి పరుస్తూ తరం నుండి తరానికి అందించిన మహోన్నత శాస్త్రవేత్తలు, కళాకారులు, ఇంజినీర్లు, శ్రామిక కులాల వారే. శూద్రుల నుండి తమ తీరిక కనువుగా మలుచుకోగలిగిన కళల్నే వర్ణవాదులు, పాలకవర్గాలు లలిత కళలంటూ కుదించారు. సమస్త కళల్ని, శాస్త్రాల్ని శూద్రులు నిరంతరం ఉత్పత్తిలో సామాజిక సంబంధాల్లో, యుద్ధాల్లో పాల్గొంటూ ఆచరించారు. పాలక వర్గాలు, వర్ణవాదులు శూద్రుల చరిత్రను వారి చరిత్రగా రాసుకున్నారు. ఒక్కటి గుర్తించుకోవాలి. లిఖిత సాహిత్యాన్ని పట్టుకుని అది సమాజ సాహిత్యంగా, చరిత్రగా, కళలుగా రుద్దుతున్నారు. అది తప్పు. శూద్ర చరిత్ర అందులో లేదు.

శూద్రుల భాషలో, శూద్రుల సామెతల్లో, నుడికారంలో, భాషా పరిమాణంలో, పాటల్లో, పదాల్లో శూద్రుల చరిత్ర పరిణామం ఉంది. ఆయా కుల వృత్తుల పరికరాల్లో టెక్నికల్ పదబంధాలున్నాయి. పారిశ్రామిక ఇంగ్లీషు టెక్నాలజీని, సైన్సును శ్రామిక కులాల పదాలతో సంబంధం లేని వాళ్ళు అనువదించడంతో ఆయా పదాలన్నీ కృత్రిమంగా సంస్కృత భూయిష్టమై పోయాయి. వాటన్నిటినీ శ్రామికకుల వృత్తుల్లోని పరికరాల పదబంధాల్లోకి తిరగరాయాల్సి ఉంది.



శూద్రుల భాషను, చరిత్రను గతకొంత కాలంగా జానపద సాహిత్యం అని, గిరిజన సాహిత్యం అని అంటున్నారు. ఇది సాహిత్య వర్గీకరణ రూపంలో కొనసాగుతున్న వర్ణవాద వర్గీకరణే. అశేష ప్రజల సాహిత్యం ఒక శాఖగా మారడం అశేష ప్రజల్ని శూద్రులుగా అతి శూద్రులుగా వర్గీకరించడం రెండూ ఒకటే. బ్రాహ్మణీయ అగ్ర వర్ణాలే సమస్త సమాజం అనే వర్ణవాద దృక్పథమే వారి శిష్ట సాహిత్యమే మొత్తం సమాజ సాహిత్యం అని ముద్రవేసికొనే కుట్ర యిది.

వందల ఏళ్ళు సాగిన భక్తి ఉద్యమాలు, వాటి సాహిత్యం కళలు శ్రామిక కులాల ద్వారానే బహుళ ప్రాచుర్యం పొందాయి. దాని నుంచి స్వీకరించి సొంతం చేసికొని తాటాకుల్లో పద్యాలుగా మార్చుకున్న సాహిత్యాన్ని శిష్ట సాహిత్యంగా బ్రాహ్మణ వాదులు ముద్ర వేసుకున్నారు. భక్తి ఉద్యమాల కన్నాకొంచెం ముందుకు వెళ్ళితే తాంత్రిక వాద, మాతృస్వామిక ఉద్యమాలు, ఇంకొంచెం ముందుకు వెళితే బౌద్ధ ఉద్యమాలు, అవి తీసుకొచ్చిన మార్పులు నాగార్జునుడు, బుద్ధుడు, మహావీరుడు, అసితకేశకంబళి, ఇంకాముందుకు వెళితే చార్వాకులు – ఇది శూద్రుల చరిత్ర సంస్కృతి వారసత్వం.

గ్రామ గ్రామాన నిన్నటి దాకా ఒక ఉపకులంలా కళాకారుల కులాలు ఉండేవి. గొల్ల సుద్దులు, ఒగ్గు కథ, ఎల్లమ్మ కథలు, శారదకారులు, పాండవులోల్లు చిందుమాదిగలు, పిచ్చకుంట్లు, దొమ్మరులు, కోయలు, గోండులు, సాధన శూరులు పంబాలులు, మొదలైన ప్రత్యేకకులాలు, తెగలు కళాకారులు ఉండేవారు.

బౌద్ధం సమాజంలో ఒక గొప్ప విప్లవం తెచ్చింది. ప్రజల కోసం, సమాజం కోసం సేవ చేసే తత్వాన్ని ప్రపంచానికి అందించింది, తొలుత బౌద్ధమే. వైద్యాన్ని విద్యాదానాన్ని చేతబూని తత్వ శాస్త్రాన్ని ఆచరణ శాస్త్రంగా మార్చుకుని దేశదేశాలు పర్యటించారు బౌద్ధులు. బౌద్ధ గతితర్కం, ప్రాపంచిక దృక్పథం ఆ కాలానికి ప్రపంచానికే వెలుగు. ఇక్కన్నించి కళలు శాస్త్రాలు గ్రీకు వెళ్ళిన తర్వాత అక్కడి కళలు, తత్వ శాస్త్రాలు చాలా మార్కులు పొందాయి. అక్కడి రాజకీయ అర్థశాస్త్రాలు రూపుదిద్దుకోవడం మొదలైంది. అక్కడివి ఇక్కడ ప్రభావం వేశాయి.

బౌద్ధం క్రీ.పూ. ఆరవ శతాబ్దం నుండి క్రీ.శ. పదో శతాబ్దం దాకా సార్వత్రిక విద్యను కొనసాగిస్తూ వచ్చింది. బహుజన భక్తి ఉద్యమాలలో కూడా సార్వత్రిక విద్యను ప్రవేశ పెట్టారు. అయితే అవి లిపి బద్ధం కాకపోవడం వల్ల అందలేదు.

బౌద్ధ సామాజిక విప్లవం వెయ్యేళ్ళు విరాజిల్లింది. ప్రజల భాషల్ని అభివృద్ధి పరిచింది. ప్రజల విభిన్న ప్రాంతాల భాషలు కల్పి పాళీ భాషగా రూపొందింది. పాళీ సాహిత్యం కళలు, ప్రపంచమంతటా విస్తరించాయి. ఇపుడవి చరిత్ర తవ్వకునే గనులయ్యాయి. పాళీ ప్రాకృతం నుండి సంస్కృతం రూపొందిందని చరిత్రకారులు,

భాషాశాస్త్రవేత్తలు అభిప్రాయపడుతున్నారు. అయితే చరిత్ర మూలనిధి అయిన పాళీ ప్రాకృత సాహిత్యాన్ని వదిలేసి నాస్తిక హేతువాదులు, మార్క్సిస్టులు, భౌతిక వాదులు, సంస్కృత సాహిత్యాన్ని తమ ఆధారాల కోసం పట్టుకు వేలాడుతున్నారు. తద్వారా సంస్కృత బ్రాహ్మణీయ సాహిత్యాన్ని తమకు తెలియకుండానే వాస్తవ చరిత్రగా ముద్ర వేస్తున్నారు.

బౌద్ధం క్షీణదశలో, ఇస్లాం ప్రవేశంతో భక్తి ఉద్యమాలు ఆవిర్భవించాయి. ఈ రెండూ సాహిత్యం, కళల్ని, సంపదని, ఉత్పత్తిని ఎంతో ప్రభావితం చేశాయి. ఎంత ప్రభావితం చేశాయంటే 1810 దాకా – పారిశ్రామిక విప్లవం ప్రపంచంలో వచ్చినప్పటికీ ప్రపంచం వ్యాప్తంగా ఇక్కడి వస్తువులు ఎగుమతి అవుతూ ఉండేవి. అసలు యూరపు దేశాల వాళ్లు ఇక్కడి సరుకుల్ని అక్కడికి తీసికెళ్ళి వ్యాపారం చేసేవారు. 1810 తర్వాత ఈ స్థితి మారింది. ఈ చేతివృత్తుల మీద, కుటీర పరిశ్రమల మీద ఆధారపడిన, కులాలు కుటుంబాలు విచ్ఛిన్నమయ్యాయి. ఆ కులాల, ఆ కళల ప్రాభవం పారిశ్రామిక సరుకుల వరదలో కొట్టుకుపోయింది. అయితే ఇలా విచ్ఛిన్నమైన చరిత్ర అంతా కలిసి రెండు వందల ఏళ్ళు కూడా కాలేదు. కాని వేల ఏళ్ళుగా అణచివేయబడ్డారని, శూద్రులకు ఏ కళలు రావని చరిత్రను వక్రీకరిస్తున్నారు. ప్రతీ వస్తువును సరుకును ఉత్పత్తి చేసింది శూద్రులే. పాటలు పాడింది శూద్రులే. డప్పు, పిల్లనగ్రోవి, వీణ మొదలుకొని ఎన్ని సంగీత వాయిద్యాలు తయారు చేశారో...! ఒక్కొక్క కులం వద్ద ఒక్కో వాయిద్యం ఉంది. ఒకరి వద్ద డప్పు, ఒకరి వద్ద డమరుకం, ఒకరి దగ్గర డోలు, ఒకరి వద్ద మృదంగం, ఒకరి వద్ద తుడుం, ఒక్కోకులం వద్ద ఒక్కో వాయిద్యం అభివృద్ధి అయింది. అంతేకాకుండా ఆయా కులాల కున్న ఉత్పత్తి పరికరాలలో కూడా ఒక గొప్ప సంగీతం ఉన్నది. శూద్రుల మాటలో విశేషం దాగి ఉన్నది. శూద్రులు వాడే గొడ్డలిలో ఒక సంగీతం ఉన్నది. బట్టలు ఉతకడంలో ఒక లయ ఉన్నది. ధాన్యం దంచడంలో, విసుర్రాయి విసరడంలో ఒక సంగీతం ఉన్నది. దున్నడంలో, మోటలో, నాట్లలో సంగీతం ఉన్నది. వాటినే పంటపాటలని, పండుగ పాటలని పిలుచుకుంటున్నారు.

ఇలా ఉత్పత్తితో సంబంధంలో ఉంటూ నాణ్యమైన సరుకుల్ని ఉత్పత్తి చేస్తూ నైపుణ్యమైన కళల్ని అభివృద్ధి పరిచారు శూద్రులు. ఇలా అభివృద్ధి పరిచిన కళల్నించి ఆయా ఉపకులాలు ఏర్పడి వాళ్ళు వాటినివెంట తీసికొని శూద్రుల చరిత్రను పురాణాల్లా ఇతిహాసాలుగా చెప్పే రూపం తీసుకున్నాయి. తర్వాత రాజులు ఈ ప్రక్రియల్లో తమ వీరగాథల్ని చెప్పించే ప్రయత్నాలు చేశారు. ఇపుడు రాస్తున్న చరిత్ర పద్ధతి పశ్చిమ దేశాల నుండి దిగుమతి చేసికొన్నది. యూరోసెంట్రిక్ భావజాలంతో నిండి ఉంది. గతం వర్తమానానికి స్ఫూర్తి నిచ్చే ఒక సాహిత్యంగా శూద్ర చరిత్ర శ్రవ్య సాహిత్యంగా



కొనసాగుతూ వచ్చింది. దీన్నించి కొంత తీసుకొని లిపిబద్ధం చేశారు. ముస్లింలు వచ్చాక తారీకులు దస్తావేజులు పరిపాలనా సంబంధమైన చరిత్ర రాయడం జరుగుతున్నది. బహుజనులు తారీఖులు, పరిపాలనా సంబంధమైన చరిత్రను చరిత్రగా ఇప్పటికీ భావించడం లేదు. ఆర్థిక సాంఘిక సాంస్కృతిక జీవితమే వారు చరిత్రగా భావిస్తున్నారు.

ఒకరిద్దరు లేదా ఒక బృందం దోపిడి చేస్తే దొంగతనం. అదే పని పెద్ద బృందం చేస్తే దాడి. ఇంకా పెద్ద బృందం చేస్తే దాడి – దండయాత్ర. ఇంకా ఇంకా పెద్ద ఎత్తున చేస్తే దాడి – దండయాత్ర – యుద్ధం. అదే మరింత పెద్ద ఎత్తున చేస్తే రాజ్యం, రాజ్యాధికారం. మతాలు, ధర్మాలు దాడిని, దండయాత్రల్ని, యుద్ధాల్ని, రాజ్యాల్ని ఆపలేవు. వాళ్ళు వీరి మాట వినరు. మతాలు, ధర్మాలు వీరికి మద్దతు ఇచ్చాయి. మతాలు, ధర్మాలు ప్రధానంగా దొంగతనం, దాడి, అబద్ధం ఈ రెంటినే నీచంగా ప్రకటించాయి. వ్యాపారదోపిడిని, గుళ్ళ దోపిడిని, అగ్రహారాల పేరిట, దానాల పేరిట, ధర్మాల పేరిట దోపిడీని, రాజుల దోపిడీని వ్యతిరేకించక పోగా వాటిని సమర్థిస్తూ సిద్ధాంతీకరించాయి. మద్దతు ఇచ్చాయి. ఇవీ మతాలు చరిత్రలో నిర్వహించిన పాత్ర. భారతం శూద్రుల కథే. అది తొలుత ఆదివాసుల కథ. తరువాత శూద్రుల కథగా విస్తరింపబడింది. తరువాత క్షత్రియుల కథగా మార్చబడింది.

బౌద్ధం వ్యక్తిని చేరింది. వ్యక్తి స్వేచ్ఛను సంబోధించింది. గణ, తెగ, జాతి, కుల స్థానంలో వ్యక్తిని సంబోధించింది. అందువల్ల భక్తి ఉద్యమం తిరిగి వ్యక్తిని సంబోధించింది. సమూహం నుండి, తెగ, కుల, జాతి నుండి భక్తి వ్యక్తులను చేరింది. వ్యక్తిగా సరండర్ కమ్మని కోరింది. బ్రాహ్మణిజం గుంపులను, కులాలను సంబోధించింది. భక్తి ఉద్యమాలకు, వైదిక బ్రాహ్మణిజానికి వర్ణ కుల సిద్ధాంతాలకు మధ్య ప్రధానమైన మార్పు ఇది. అనగా గణ, తెగలను, కులాలను సంబోధించే బ్రాహ్మణిజం భక్తి కాలం నాటికి వ్యక్తులను సంబోధించే క్రమం తీసుకుంది.

భక్తి ఉద్యమాలు దేవుళ్ళను కీర్తించి వర్ణవాదాలకే సహకరించాయి అనే ప్రచారాన్ని కొందరు చేస్తున్నారు. భక్తి ఉద్యమాల వల్ల ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందాయి. బౌద్ధ ఉద్యమాల ద్వారా అభివృద్ధి చెందిన ప్రాంతీయ భాషల అభివృద్ధి బౌద్ధం కుంటుపడడంతో భక్తి ఉద్యమాల ద్వారా ముందుకు సాగింది. పాళి భాషలో నేటి ప్రాంతీయ భాషల వెయ్యేళ్ళ నాటి పదాలను అర్థాలను, అవి మారుతూ వచ్చిన తీరును చూడవచ్చు. సంస్కృత భాష వర్ణవాదులకు, పండితులకు ఒక మీడియంగా ఉందేగానీ ప్రజల భాషగా వ్యాప్తిలో లేదు. అందువల్ల అది ప్రాంతీయ భాషలను అభివృద్ధి పరిచిందనడం సత్యదూరం. గట్క (సంకటి) అనే తెలుగు పదం పంజాబ్, ఉత్తర ప్రదేశ్, బీహార్లలోనూ గట్కగానే ఇప్పటికీ వ్యవహారంలో ఉందంటే, బతకమ్మ పండుగ కొద్దిమార్పులతో బీహార్‌లోనూ ఇప్పటికీ జరుపుతారంటే (దాన్ని ఛట్టి అని

పిలుస్తారు) బహుజనుల భాష సంస్కృతి కూడా నిరంతరం ప్రవాహ సదృశంగా దేశ వ్యాప్తంగా పరస్పర సంబంధాలు కొనసాగుతున్నాయి.

బౌద్ధ, భక్తి ఉద్యమాల ద్వారా ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందడానికి కారణం శ్రామిక కులాలే. నిరంతరం ప్రయాణాలు అంతటా దొరకని ఉప్పు తదితర సరుకుల నిత్య రవాణా, అమ్మకం, కొనుగోలు శ్రామిక కులాల జీవనంలో భాగమయ్యాయి. బౌద్ధంలో భక్తి ఉద్యమాల్లో చేరిన లక్షలాది శ్రామిక కులాల ప్రజలు తమ భావాలను ప్రచారం చేస్తూ పర్యటించారు. ఉత్పత్తితో సంబంధం గల వీరి పర్యటనలు ఉత్పత్తిలో గల ఇతరులతో భాషా మాధ్యమం ఆవశ్యకతను పెంచింది. అందువల్ల స్థానిక జనపద, గణతెగల భాషలు కలగలిసిపోయి ఒక సంయుక్త భాషగా ప్రాంతీయ భాషలు రూపొందడం అవసరం అయింది. "అంగళ్ళు, జాతరులు", ప్రాంతీయ భాషలు రూపుదిద్దుకునే కేంద్రాలయ్యాయి. బౌద్ధ, భక్తి ఉద్యమాలు, వాటికి నగిషీలు చెక్కి మరింత విస్తృత పరిచాయి. నిత్యం పర్యటించే బౌద్ధ భిక్షువులు, భక్తి ఉద్యమకారులు, ఎడ్ల, పై గాడిదలపై ఉప్పుతో సహా సరుకుల్ని రవాణా చేసిన సంచార గిరిజనులు, శ్రామిక కులాలు గ్రామానికి గ్రామానికి లింకుగా పని చేయడంలో భాషల అనుసంధానం ఎంతో సులభమైంది.

బౌద్ధం, భక్తి ఉద్యమాలు ఉత్పత్తిని, దాని నాణ్యతను పెంచాయి. ధ్యానం (మెడిటేషన్) అనే ప్రక్రియ బౌద్ధం ద్వారా, భక్తి ఉద్యమాల ద్వారా కొనసాగి ఉత్పత్తి ప్రావీణ్యతకు దోహదం చేసింది. బ్రాహ్మణవాద భక్తి ఉద్యమాలు దేవుడిని, దేవుని గుళ్ళ ప్రశస్తిని, వారి మహత్యాలను ప్రచారం చేసి తమ కడుపు నింపుకునే ప్రయత్నాలు చేశాయి. శ్రామిక కులాల భక్తి ఉద్యమాలు ఇందుకు భిన్నంగా మనిషిలో దైవత్వాన్ని చూడాలని, అందరూ దేవుని బిడ్డలే, అందరూ సమానమే గుళ్లు గోపురాల్లో ఏమీ లేదని మనిషి హృదయంలో, మానవతలోనే దైవంఉందని చెప్పారు. బ్రాహ్మణవాద భక్తి ఉద్యమాలు వర్ణవ్యవస్థను ఆచరిస్తే శ్రామిక కులాల భక్తి ఉద్యమాలు వర్ణ కులవ్యవస్థల్ని నిర్మూలించే ప్రయత్నం చేశాయి. శ్రామిక కులాలకు దైవ భావన మనుషులంతా సమానం అని చెప్పడానికి ఒక సాధనమే తప్ప దైవమే వారి లక్ష్యం కాదు. ఆచార్య చండాలుడి సాదా ప్రశ్నలతో శంకరాచార్యుని మాయ, అద్వైతం కుప్పకూలిపోయిందంటే శూద్రులు ఎంత గొప్పతత్వజ్ఞుల్లో స్పష్టం అవుతుంది. కాగా శూద్రులకి చరిత్రలేదని శూద్రులకేమీ రాదని బ్రాహ్మణవాదులు, మరికొందరు భౌతికవాదులు చెప్తూ శూద్రుల్లో, అతి శూద్రుల్లో ఇన్ఫీరియారిటీ కాంప్లెక్సును అభద్రతను నెలకొల్పడానికి ప్రయత్నాలు చేస్తుంటారు.

విశ్వబ్రాహ్మణులు నగలు, కత్తులు, కర్రులు, పారలు, గడ్డపారలు చేయకుండా కిరీటాలు, యుద్ధాలు లేవు. నేతకులాలు బట్టలు నేయకుండా నాగరికత లేదు. శూద్రులు



పట్టుబట్టలు నేస్తే, తోలు చెప్పులు చేస్తే, వారి నుంచి తీసుకొని వారినే చిన్నచూపు చూసినట్టుగా శూద్రుల ఉత్పత్తుల్ని అవమానించి, వారి కళల్ని తస్కరించి వారినే చిన్నచూపు చూసే వారు వర్ణవాదులు.

మంత్ర తంత్రాలు అని పేరు పెట్టి దళితులను గ్రామాల్లో చిత్రహింసలు పెడుతున్నారు. తంత్రవాదం మాతృస్వామికం నుండి కొనసాగుతున్న ఒక శాఖ. బౌద్ధంలో తంత్రవాదం ఒక శాఖ. స్త్రీని తల్లిని గౌరవించే వ్యవస్థ నుండి ఉద్భవించింది. అది ఎన్ని వికృతులో పోయింది. అయితే సృష్టికి స్త్రీ మూలం అనే భావన అందులో యిమిడి ఉంది. వర్ణవాదుల బెదిరింపులకు ప్రతిగా ఒరేయ్ నీకు వేదమంత్రాలుంటే నిన్ను చంపే మంత్రాలు మా వద్ద ఉన్నాయి అని సవాలు చేశారు. మంత్రం చేసి నేను కప్పకాలు విరిచేస్తే నీకాలు విరిగిపోతుందని బెదిరించారు. పదోశతాబ్దంలో శైవ వుద్యమం, పదకొండవ శతాబ్దంలో వైష్ణవ ఉద్యమం ప్రారంభమయ్యాక దక్కనులో ఎన్నో మార్పులు జరిగాయి. యూరపులో జరిగిన రినైజాన్సు మన దేశంలో భక్తి ఉద్యమాల రూపం తీసుకున్నాయి. ఎంత ఉత్పత్తి పెరిగితే యిన్ని యుద్ధాలు, యిన్ని కోటలు, గుళ్ళు నిర్మాణం రాజుల గానాబజానాలు సాధ్యపడతాయో అంచనా వేయడం అవసరం.

పారిశ్రామిక విప్లవంను వర్ణ వ్యవస్థ పదాల్లో చెప్పాలంటే అది శూద్ర విప్లవం. శూద్రులు చేతుల ద్వారా చేసే పనులు యంత్రాల సాయంతో చేయడం. ఈ దేశంలో పారిశ్రామిక వేత్తలుగా, కార్మికులుగా ఇంజినీర్లుగా, సైంటిస్టులుగా ఎవరు మారాల్సి ఉండేదంటే వాళ్ళు స్పష్టంగా బహుజనులు శూద్రులు గిరిజనులు – శ్రామిక కులాలు. కాని జరిగిందేమిటి? అగ్రవర్ణాలవాళ్ళు దీన్ని కైవసం చేసుకొన్నారు. ఈ రోజు ఒక ఇంజినీర్‌ని తీసుకోండి. ఒక పారిశ్రామికవేత్తను తీసుకోండి అగ్రవర్ణాల వారే కనపడతారు. అంతకన్నా ముందు వ్యవస్థలో వారు ఉత్పత్తులు చేశారా? కాని ఈ రోజు పారిశ్రామిక యజమానులుగా ఎదిగి ఉత్పత్తిని సొంతం చేసికొన్నారు. దాంతో పాటు అగ్రకులాల నుండే కార్మికుల నాయకత్వం దిగుమతి కావడం మొదలైంది. ఈ తలకిందుల స్థితి యింతకు ముందు లేదు. ఇలా చరిత్ర వక్రమార్గం పట్టడం అనేది యూరపు నుండి పారిశ్రామిక విప్లవం దిగుమతి కావడం నుంచే మొదలైంది.

ఇవ్వాళ కుల విద్యకు పరిమితం కావాలని చెప్పితే ఆశ్చర్యపోతారు. ఎందుకంటే కుల విద్యలు ఇవ్వాళ పారిశ్రామిక వేత్తలకు, బ్రాహ్మణీయ శక్తులకు లాభసాటి అయిపోయాయి. అందువల్ల వాళ్ళు చక్కగా గుళ్ళల్లో పూజలు చేసుకుంటూ మంత్రాలు చదువుకుంటూ ఉండమంటే ఉండకుండా రాజ్యాలు ఏలడానికి, పరిశ్రమలకు, విద్య, వైద్య, ఇంజనీరింగ్ రంగాలకు, విశ్వవిద్యాలయాలకు ఎగబాకుతున్నారు. బట్టల దుకాణాలు, కూరగాయల దుకాణాలు, చెప్పుల దుకాణాలు, ఇంజనీరింగ్, కంప్యూటర్